శ్రీరామ నృసింహ గ్రంథరత్నమాల 7

శ్రీ వేమన యోగీంద్రాయ నమః

# వేమగీత

(ప్రథమ సహస్రము)

సమూలము (తెలుఁగు వివరణము)

రచయితలు

తెలుఁగుమూలము:— శ్రీ వేమనయోగి

సంస్కృతానువాదకులు :—

శ్రీరామ నృసింహ మూర్తికవులు

గంధం శ్రీరామమూర్తి, ఇట్రింకి నరసింహామూర్తి

(శతావధానులు, ఉభయభాషాప్రవీణులు, శ్రీగద్వాల సంస్థానాస్థాన కవులు

భాగవత భగవద్గీతాద్యాంధ్ర పవిత్రోద్గ్రంథ ప్రణేతలు)

ప్రకాశకులు :

శ్రీ రామ నృసింహ గ్రంథరత్న మా

శ్రీరామ నృసింహ గ్రంథరత్నమాల 7

శ్రీ వేమన యోగీంద్రాయ నమః

# వేమగీత

(ప్రథమసహస్రము)

సమూలము, తెలుగు వివరణము

రచయితలు

తెలుగుమూలము:— శ్రీ వేమనయోగి

సంస్కృతానువాదకులు :—

శ్రీరామ నృసింహ సంస్కృతకవులు

గంధం శ్రీరామమూర్తి, ఇట్టింకి నరసింహమూర్తి

(శతావధానులు, ఉభయభాషాప్రవీణులు, శ్రీగద్వాల సంస్థానాస్థాన కవులు
భాగవత భగవద్గీతాద్యాంధ్ర పవిత్రోద్గ్రంథ ప్రణేతలు)

ప్రకాశకులు :

శ్రీ రామ నృసింహ గ్రంథరత్నమాల
తోలేరు



మూల్యము రు. 4/-



శ్రీ వేమన యోగి



శ్రీరామనృసింహ మూర్తులు

శ్రీమ ద్దృప్తప్రపన్నా ర్తిసంహరణకృ ద్యోగో యయో ర్నిత్యంతే
లోకారాధనతత్పరౌ ఖలజనవ్యాపాదనవ్యాపృతౌ



శ్రీరామ నృసింహమూర్తి కవులు.

లోకేఽస్మిన్నవతేరతు స్సుమహితౌ శాంతౌ ప్రియాపౌ చ యౌ
తౌ శ్రీరామ నృసింహ మూర్తి విలసత్ప్రజ్ఞౌ జయేతేతరామ్॥




I have the pleasure to enrol Sri. Gandham ramamurty and Sri.Irrinki Narasimhamurty who are larly known as " Sreerama Narasimha Murty Kavulu " ur Court Poets. Hereafter they are entitled to privileges of our Court.

al,

1945.

Youvaraja Saheb of Gadwal.

( For Maharani Saheba of Gadwal

# విజ్ఞప్తిః

# వేమన జీవిత సంగ్రహః

పురాకిల వేమనాఖ్యో మహాయోగీ సుబోధాంధ్రభాషాయాం
పద్యరూపేణ ఐహికాముష్మికవిషయాన్ సర్వాన్ మానవలోకాయ
సమ్యక్ వ్యబోధయత్. తాన్యేవపద్యాని 'వేమగీతా' ఇత్యాఖ్యయా గైర్వా
ణ్యాం వాణ్యాం అనుష్టుప్ ఛందసా ఆవాభ్యా మనూదితాని. ఆంధ్రభాషా
యాం "అన్న" ఇతిపద మాదృతి సూచకమ్. తతో వేమః "వేమన్న"
ఇతి ప్రథితో బభూవ. "వేమన" ఇతి చ తద్రూపాంతర మస్తి. వేమనకవి
రాంధ్రదేశే కొండవీడునామ్ని పట్టణే క్రీ॥ శ॥ చతుర్దశ శతాబ్దే నందన
కార్తికశుక్ల పౌర్ణమాస్యాం షడశీత్యుత్తర త్రయోదశశతతమవత్సరా
దారభ్య షణ్ణవత్యుత్తరత్రయోదశ శతతమవత్సర పర్యంతం కొండవీడు
రాజ్యం పాలయతః కొమరగిరి వేమభూపాలాత్ మల్లమాంబారాజ్ఞ్యాం
తృతీయపుత్రో ఽ జని. అయమేవ షణ్ణవత్యుత్తరత్రయోదశ శతతమవత్స
రాదారభ్య చతుర్వింశత్యుత్తర చతుర్దశ శతతమ వత్సరపర్యంతం రాజ్యం
పరిపాలయతః అనవేమ మహీపాలస్య కనిష్ఠసోదరో భూత్వా బమ్మెర
పోతనామాత్యస్య సహాధ్యాయీసన్ సహజ ప్రతిభయా విభ్రాజమానః
సోమశేఖరాఖ్యగురుశుశ్రూషయా సంస్కృతాంధ్ర భాషాసాహిత్య
మనర్గళాం సంపాద్య వివిధరాజభోగా ననుభూయ స్వసమతుమేవ వింశతి
హాయనేషు సంవృత్తం రాజ్యపతన ముద్వీక్ష్య మనఃపరిపాకేన పురాకృత
సుకృత విశేషేణ చ సంభూతసమగ్రవైరాగ్యః కాలవశాత్ ఘటనా
వశాచ్చ హృదయ కుహరోత్థితం భావోద్రేకమేవ పద్యరూపేణ వ్యక్తం
కుర్వన్ సహస్రశః పద్యా న్యుపగీయ అంతే కటారుపల్లీనామ్ని గ్రామే
శార్వరీ చైత్రశుక్ల నవమ్యా మష్టషష్టివర్షీయః భౌతికశరీర ముత్సృజ్య
పరంపదం ప్రాపేతి ప్రతీతిః"

# సాహితీ - తద్వ్యాప్తిశ్చ

సంస్కృతీయా రాట్ పాలకశబ్దా వాంధ్రభాషాయాం "రెడ్డి, కాపు" ఇతి వ్యవహృతౌస్తః. తతఏవ ప్రిథుకుటుంబగతాః "భూపాల్" ఇతి బిరుదనామ్నా వ్యవహ్రియంతే. కొండవీడు సంస్థానే ఏతద్వేమనవంశీయానాం భూపాలకనామవ్యవహృతిః వేమభూపాల్, కృష్ణరామ భూపాల్ ఇత్యాదినామభిః వ్యక్తీక్రియతే. వేమన కుటుంబస్థః పెదకోమటి వేమనాఖ్యః శృంగారదీపికా సమాఖ్యాం అమరుకకావ్యస్య సంస్కృత వ్యాఖ్యాం సప్తశతీ సారనామకం గాథాసప్తశత్యనువాదం చ వ్యరరచత్. అస్య పెదకోమటి వేమనాఖ్యస్య జీవిత చరిత్రం వేమభూపాలీయ నామాంతరేణ ప్రథితం పార్వతీ పరిణయాఖ్య సంస్కృతనాటకకర్త్రా వామనభట్టనామధేయేన విరచితమ్. తథా కుమారగిరి భూపాలః వసంత రాజ్యాభిధేయం సంస్కృతకావ్యం విరచయామాస. కుమారగిరే ర్జామాతా కాటయవేమనాభిఖ్యః కాళిదాస రూపకానాం వ్యాఖ్యాం విలిలేఖ. తతః ఏతత్ కొండవీడు రెడ్డి సంస్థానాధీశాః సంస్కృతాంధ్రయోః కృతికర్తారః కృతిభర్తారశ్చ బభూవురితి వ్యక్తమేవ. తస్మాత్ వేమన యోగీచ సంస్కృతాంధ్ర భాషాద్వితయే ఽపి విద్వానిత్యుక్తిః నిర్వి వాదైవ. అతఏవ ఎఱ్ఱాప్రగ్గడ (శ్రీనాథాద్యాంధ్ర) కవివదేభ్యః ఉత్తమం స్థాన మాశ్రయ మదాత్. వేమనకవి రాంధ్రవాఙ్మయచ్ఛందసి సంస్కృత వాఙ్మయగతానుష్టుబ్ ఛందస్సులితేషు లలితేషు విశాలభావకలితేషు ఆట వెలది నామకపద్యేషు అనుపమవేదవాక్యాని ప్రకటీకృత్య స్వకీయాం ప్రతిభా మాంధ్రలోకే ప్రాచీకటత్. కేవలపారిభాషికపదగూఢం సర్వో పనిషత్సారం వేదాంతశాస్త్రం సర్వసాధారణ వ్యవహారభాషాయాం వ్యక్తీకృత్య మహాజనాదృతిం ప్రాప. వేమనకవేః రచనాయాం తత్ర తత్ర "మానినీ మనోజమందిరాంతరైక లోలుడు, ఊర్ధ్వలోకసుఖము, అభిజాత్యమదము, విశ్వదాభిరామ" ఇత్యాదయ స్సంస్కృతపదప్రయోగా

స్సంతి. తథాపి ప్రాయశః సంస్కృతభగవద్గీతేవ ఆంధ్రభాషాయాం సర్వ సుబోధఫణిత్యా వేమనకవితా రాజతే. అపి చ తత్ర తత్ర జ్ఞ-ంక, అ-ప్రాణ, ఋగ్యజు-యోగ్య, ఇత్యాది లాక్షణికాః యతివిశేషా స్సంతి. ప్రకృతిరూపయోః గృహగేహశబ్దయోః వికృతౌ "గీము" ఇతి వ్యవహృతిరేవాస్తి. కింతు వేమనకవిః "గురము" ఇతిచ వ్యాజహార. ఏవమాది విషయాః పాఠకానాం సర్వత్ర విశదా భవంతి.

వేమనాఖ్యో మహాయోగీ "కుత్రాజని? కస్యాం భాషాయాం గీతాలాప మకరోత్?" ఇత్యేవం రూపేణ వివాదేనాలమ్. తద్గీతాసారమేవాస్మాభిః ఆస్వాద్యః. వేమనకవినాశుధారయా తాంతాం పరిస్థితి మనుసృత్య సద్యఏవ గుంఫితాని పద్యాని లేఖనసౌకర్యరహితే తస్మిన్ కాలే కేవలభావకుసుమసౌరభాఘ్రాణలోలుపశిష్యాశయః కియన్మాత్రం నిర్దుష్టం ధారయితుం శక్నువంతి? విచింతయంతు. కేచన ఏతన్నగ్నసత్యమనాలోచయంతః 'వేమస్య భావభాషాదయః న సమీచీనాః' ఇతి వృథా తన్నిందయా తృప్తిమంతో దృశ్యంతే. సర్వ మేత దహం మమే త్యనుసంధానసహితమేవ. "తత్ర మమేత్యనుబంధ మసజ్జడదుఃఖాత్మకం శవరూపంచ,అహమిత్యేతత్ వస్తు సత్యజ్ఞానానందాత్మకం శివరూపం చ"ఇత్యేవ వేమన యోగీ ముహుర్ముహుః స్వప్రోక్తపద్యేషు ప్రతిపాదయామాస. మంగళపదపర్యాయశివశబ్దవ్యాహృత్యా జాతిమతాతిగం వేమన యోగినం శైవమతస్థం మత్వా కేచన నిందంతి. వినాఫలాపేక్షయా పరసంతుష్టిమనుద్దిశ్య పరాభిప్రాయదాస్య మనవలంబ్య అస్థిర బాహ్యసౌఖ్య మతీత్య శాశ్వతాంతరసౌఖ్యమేవ వాంఛతః అధ్యాత్మగీతికాం గాయతః కవికోకిలస్య లోకకృతదూషణ భూషణాదిభిః కావాహానిః? కోవాలాభః?

ఆంధ్రప్రదేశే సమ్యగాంధ్రసంస్కృతభాషానుభూతి మర్జిత్వా భక్తిజ్ఞానఘనౌ ప్రశస్తపదపద్యకవీభూత్వా 'స్వయంతీర్ణః పరాం స్తారయే,' దితి న్యాయానుసారేణ స్వయంతీర్ణౌ లోకే సూక్తిబీజవిక్షేపం కృత

వంతౌ త్యాగయ్యవేమననామధేయౌ సర్వేషామపి చిరస్మరణీయౌ. "త్యాగయ్యః నారదాంశసంభూతః వేమనః సనత్కుమారాంశసంభూతః" ఇతి ప్రతీతిరప్యస్తి. త్యాగయమహాత్మనః పదసాహిత్యే కేవల గానకళారిరంసుభ్యో గాయకజనేభ్యో ఽ పభ్రంశరూపం ప్రాపితే ఆధునికాః సంస్కృతాంధ్రభాషావేత్తారః తన్నిర్దుష్టం కృత్వా సర్వోపనిషత్సారమితి జుఘుషుః. పదసంఖ్యాపి షోడశసహస్రపరిమితా లబ్ధా. వేమనయోగిన స్సాహిత్యమపి తథైవ విభ్రంశిత మభూత్. క్రీ॥ శ॥ పంచవింశత్యుత్తరాష్టాదశశతతమవత్సరాదారభ్యైవ మహతాం యత్నేన "వేమనాఖ్యో మహాయోగీ కవిః పండితశ్చ" ఇతి లోకే పరిచితో ఽ భూత్. వేమనకవేః పద్యాని ద్రావిడకర్ణాటాంగ్లఫ్రెంచ్యాది భాషాసు పరివర్తితా న్యభూవన్. శ్రీమతాం సి. పి. బ్రౌన్, క్యాంబెల్, మూక్లిన్, త్యాగరాయశెట్టి కంపెనీ, వావిళ్లకంపెనీ, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, వెంకట పార్వతీశ్వరకవులు, శేషాద్రిరమణకవులు, వరదాచార్యులు, వంగూరి సుబ్బారావు, కట్టమంచి రామలింగారెడ్డి, కూర్మా వెంకటరెడ్డినాయుడు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ ప్రభృతీనాం ఆంధ్రభాషాభిమానినాం మహాత్మనాం మహోద్యమేన వేమనకవిసాహితీమహిమా అస్మద్దృష్టిపథం ఆజగామ. వేమనపద్యాని పంచసహస్రాణి లబ్ధాని. వ్యావహారిక్యా మభివ్యక్తాని మహాత్మనాం వాక్యాని సంస్కృతభాషాయాం పరివర్తితాని గణ్యతాం యాంతి. తతః తేషు ప్రతిసహస్రం సంస్కృత్య సంస్కృత భాషాయా మనుష్టుప్ఛందసా లోకే ప్రకటయితు మావయో స్సంకల్పోఽజని.తదనుసారేణ వేమగీతాయాం ప్రథమసహస్రం ప్రకటయ్య మహాజనేభ్య స్సమ్యగర్పితమ్. ఏతత్ ప్రథమసహస్రస్య శ్రీవావిళ్ళ ముద్రణాలయోదిత గ్రంథపవ మాతృకాత్వేన గృహీతః. కృపయాయది సహృదయాః అత్రత్యాన్ గుణదోషాన్ సూచయేయుః తర్హి ద్వితీయ ముద్రణే ద్వితీయసహస్రే చ తత్సూక్త్యనుసారేణ సంస్కర్తుం యతిష్యావహే.

పంచదశ శతాబ్దానంతరం మల్హణచరిత్రకర్తా ఎడపాటి ఎఱ్ఱా ప్రగ్గడః ఏకామ్రలింగశతకకవిర్లక్ష్మణః తోభ్యచరిత్రకర్తా పింగళి ఎఱ్ఱనార్యః అన్యవాదకోలాహలగ్రంథకర్తా శివయోగీంద్రః నాగరఖండ రచయితా తురగారామకవిః ఇత్యాదయః కేచన ఆధ్యాత్మిక కవయఏవ స్వస్వగ్రంథాదౌ వేమనకవిం తుష్టువుః. శృంగారప్రబంధకవయస్తు న తథా.

శృంగారకవిస్తు పామరజనగ్రాహ్యాం శృంగారరసమేవాభివర్ణ్య తద్రసపిపాసూన్ ప్రభూన్ ప్రజాశ్చ సమాకృష్య ధనం హృత్వా భోగలంపటోభవేత్. ఆధ్యాత్మికకవిస్తు యద్యద్వస్త్వస్తి తత్ర "నిత్యం కి మనిత్యం కిమితి,సత్యం కి మసత్యం కి"మితి చ సవిమర్శం విదిత్వా ఆత్మరతోభూత్వా లోకే సద్రూపం నిత్యరూపం వస్తు ప్రకటయతి. కింతు ప్రభుభిర్వా ప్రజాభిర్వా ధనభోగరూపసంబంధం నేచ్ఛతి. తతః ఆధ్యాత్మికకవిం విజ్ఞాయ ఆదృతవంతః ప్రాజ్ఞా అతివిరళా స్సంతి. తత్రేదం నిదర్శనం పశ్యత. ఆధ్యాత్మికకవిః "యోషిచ్ఛరీరే చక్షుః శ్రోత్రం ఘ్రాణం ఉరః పాణిపాదం ఇత్యాదయః అవయవాః సర్వే మాంసవసాదివికారాః రక్తపూరితాః మజ్జామేదోఽస్థిశ్లేష్మాదికాసహ్యావస్తుసమవాయసంభరితాః తస్మాత్ త్వం స్త్రీలోలుపో మాభూః" ఇతి విరక్తిమార్గంబోధయతి. శృంగారకవిస్తావత్ "స్త్రియశ్చక్షుషీ పద్మపత్రే, కంఠః శంఖసన్నిభః, యానం హంసయానసమానం,వచాంస్యమృతమయాని, అధరోష్ఠలాలాజల మమృతమేవ సైవ తవ ఆరాధ్యప్రేమదేవతా" ఇతి వర్ణయన్ ప్రాగేవ మోహాబ్ధావతోనిమగ్నం పురుషం పౌనఃపున్యేన మోహే నిమజ్జయతి. సోఽపి అజ్ఞానాద్ధేతోః తదుక్తి మభినంద్య తస్మైబహుళం విత్తం దత్వా స్వయ మధోగతిం ప్రాప్నుయాత్. అంధః. అంధాశ్రయేణ గర్తే న పతతి కిమ్? విషదిగ్ధస్య నరస్య తిక్తరసః మధురఇవ వర్తతే. తథైవ మోహగ్రస్తస్య లాలాజలం అమృతం కిం న స్యాత్?. స్త్రీణామవయవేషు పద్మపత్ర

శంఖాది ఉపమానవస్తూ న్యారోప్య స్త్రీమోహే సంసక్తో భవతి. న పున స్తేషు రమ్యోపమానవస్తుషు తావన్మాత్ర మానందం ప్రాప్నోతి. అపి చ ఆత్మనో వ్యామోహేన కేవల స్త్రీపురుషవ్యవస్థయా నాతిసంతృప్తః సముద్రపర్వత మేఘచంద్ర గురుబుధాదిష్వపి పుంస్త్వం నదీభూమితారా దిషు స్త్రీత్వం చ ఆరోప్య కథాః నిర్మాయ స్వయం భ్రాంతో భూత్వా లోకం భ్రామయతి. ప్రేమ్ణి సుఖమస్తీతి వదతి. కింతు తత్ప్రేమ స్త్రీపురుష శృంగారక్రీడాసు పరిమితం కరోతి. మాతృప్రేమ విశ్వ ప్రేమాది సహజనిష్కళంక ప్రేమ తస్య దృష్టిపథం నాయాతి. వస్తుతః ప్రభవః పండితాశ్చైవ లోకోద్ధరణసమర్థాః యద్యేతే పతితాః భవేయుః తదా లోకస్య అధోగతిం వినా కిమస్తి? బుద్ధాశోకాదీన్ ద్విత్రాన్ వర్జయిత్వా బహవః ప్రభవః దుర్వ్యసనలోలుపా ఏవేత్యుక్తిః సత్యేతరా న భవతి. యథా పాశ్చాత్యాః భౌతికశాస్త్రజ్ఞానకుశలాః తథా తత్త్వశాస్త్రే భారతీయాః కోవిదాఇతి వచనం వినాధ్యాత్మికకవీన్ కేవలశృంగార కవిభిః వృథారోపిత ప్రభావకవిభిర్వా కథం రూఢం భవేత్?

ఆధ్యాత్మికకవిః లోకే రాజాశ్రయ మనాదృత్య దైవమేవ శరణ్య మితి చింతయన్ దైవబలేన విరుద్ధప్రవృత్తి ముపశమయన్ ఆత్మనైవ ఆత్మని రమతే. సామాన్యలౌకికజ్ఞానయుతః ప్రభుర్వా జనోవా లోకా తిగం తం కథం ఆద్రియతే? ప్రభూణాం మనస్తత్త్వమేవ ఉపలక్ష్య రచనాం కుర్వతే కవయే ౭నేకాగ్రహారాదిదానైః ప్రభుసత్కార స్సిద్ధ్యతి. లోకపరిపాటి రేతాదృశీ.

వేమనకవిః స్వకవితాయాం సహజోపమాలంకారాది చమత్కృతిం దర్శయామాస. తథాపి సి. పి. బ్రౌన్ ప్రభృతిభిః లోకజ్ఞైః రచితాభి రాంగ్లా దివ్యాఖ్యాభిరేవ వేమనకవిః స్వసాహిత్యేనసహ విద్యార్థికానాం దృక్పథ మాజగామ. నోచేత్ వేమనసాహిత్యస్య కావాగతిస్స్యా దితి నవిద్మః.

వేమనయోగీ స్వయమేవవక్తా స్వయమేవశ్రోతా చ భూత్వా "సర్వంఖల్విదంబ్రహ్మేతి"సూత్రానుసారేణ జ్ఞానం లోకే సర్వత్ర ప్రకాశ యామాస. తతఏవ వేమనపద్యాని ఆత్మబోధామృతరూపాణి సర్వోపని షత్సారభూతాని సద్యోమోక్షప్రదానీతి చ వ్యవహ్రియంతే.

అపి చ ప్రకృతిపరిశీలనశక్తిః, సృష్టితత్త్వవిజ్ఞానం, శబ్దశాస్త్రపరి జ్ఞానం, భావసంశుద్ధిః, కల్పనాపటిమా, వర్ణనాచాతురీ, ఉపమానసంధాన పాటవం, ప్రభుమిత్రకాంతాసమ్మితబోధనం, వాస్తవికస్థితిగ్రహణం, వచ స్సౌలభ్యం, సహజధారా, లోకకల్యాణాశయః ఇత్యాదయః అన్యే చ గుణాః కవిజనాశ్రయాః వేమనకవిపుంగవే ద్యోతంతే.

ఏకదా విశ్వమానవహృదయకుహరేషు యో వేదః ఆనంద చంద్రికాః ప్రసారయామాస, తస్య ప్రభావః, యశ్చ తదా ప్రతిష్ఠితార్య పవిత్రధర్మవిజయధ్వజః తస్య ప్రభావశ్చ క్రమేణ కాలగర్భే ఽస్తమితోఽ భూత్. కేవలపామరజనగ్రాహ్యపౌరాణికాచారాః సర్వత్ర వ్యాప్తా బభూవుః. తత ఆర్యాణాం ఆధ్యాత్మికశక్తిః పురుషార్థప్రవణతా చ వినష్టా ఽత్. తత్త్వజ్ఞానం వినష్టం మిథ్యాజ్ఞానం వవృధే. అన్యోఽన్యసహకారా భావేన ప్రకల్పితగురులాఘవప్రధానేనాచారాణాం లోకే ప్రవృద్ధా. ఆత్మతంత్రా యా భారతీయార్యజాతిః పురైకదా యావత్ప్రపంచస్య స్వాతంత్ర్యసందేశమదాత్, సైవ భావదాస్యవశాభూత్వా నిర్వీర్యా ఽభవత్. అనుష్ఠితాచారవశాత్ స్ప్రవృత్తితుల్యా సేవావృత్తిః ఆర్యజాతిం కృపణాం కృత్వా అపయశఃపంకే న్యపాతయత్. భూయః వాస్తవిక దివ్యతత్త్వజ్ఞానదీధితయః యదా దిక్షు భాసంతే తదైవ ఆర్యజాతేః దాస్యవిముక్తిః భవతి. తత్త్వజ్ఞానమేవ పారతంత్ర్యావ్యాధితరణే నౌకాయతే. తస్య విశేషతః ప్రజారంజేణ ఆలంబనేన భవితవ్యమ్.

అస్య వేమనయోగినః తత్త్వశాస్త్రే మనశ్శుద్ధివిరహితమూర్తి పూజా తీర్థయాత్రా శ్రాద్ధాద్యాచారాణాం చ స్థానం న దృశ్యతే.

వినాదైవోపాస్తిం వినాసత్కర్మాచరణం సాక్షాద్దేవఏవావతీర్య ప్రజానాం కష్టనష్టాని వ్యుదస్యతీతి అలసానాం మిథ్యావాదస్య ప్రసక్తిర్నాస్తి. సత్యశాంత్యహింసాదయాశౌచ దైవచింతాది సద్గుణానాం నిత్యాచరణే యదా స్థానం కల్పయితుం శక్నోతి, తదైవ తేషాం సార్థకతా భవతీతి ఏతస్య పరమలక్ష్యమ్. నిఖిలప్రాణికోటిషు మానవఏవ సత్యాసత్యే వస్తుతత్త్వం చ విమ్రష్టుం సమర్థో బుద్ధిమాంశ్చ ఖలు? ఆత్మనః కష్టకాలే కరావలంబం దత్త్వా ఆనంద భోగానుభూత్యర్థం సర్వవస్తుజాతం కల్పయిత్వా సాహాయ్యం కుర్వతఃవిశ్వస్య విశ్వసాక్షిణః విశ్వేశ్వరస్య కృతజ్ఞతా ప్రదర్శనమేవ మానవస్య నిత్యవ్రతంహి. ఆత్మసాక్షిగురుబోధేన నివృత్తాజ్ఞానతమసః సంతః జ్ఞానభానూదయేన తత్త్వం గృహీత్వా బంధైః దుఃఖైశ్చ విముక్తాః శాశ్వతానంద పరిపూర్ణాశ్చ భవితుం స్వస్వరూపానుసంధానసాధన మేవైతద్గ్రంథలక్ష్యమ్.

అమలినేన చిత్తేన ఏతద్గ్రంథస్థవిషయాన్ స్వీకృత్య ప్రాజ్ఞాః ఇతోఽధికపవిత్రోద్గ్రంథ రచనాయై ఆవయోః ధృత్యుత్సాహౌ చికీర్షవః ఆశీర్భిః అనుగృహ్ణంతు భవంత ఇతి బుధాన్ ప్రార్థయావః.

శ్రీరామ నృసింహమూర్తి కవి.

# విజ్ఞప్తి

# వేమన జీవిత సంగ్రహము

"వేమన, యను యోగిపుంగవుఁడు వ్యావహారిక ఆంధ్రభాషా పద్యముల సమస్త ఐహికాముష్మిక విషయములను మానవలోకమునకు బాగుగ ప్రబోధముఁగావించెను. ఆపద్యములే 'వేమగీతా' అను పేర సంస్కృతభాషను అనుష్టుప్ ఛందమున మాచే ననువదింపఁబడెను. ఆంధ్ర భాషయందు "అన్న" అను పదము ఆదృతిసూచకము. అందువలన వేమన్న అని పిలువబడినవాఁడాయెను. 'వేమన' అనియు రూపాంతరము కలదు. వేమనకవి ఆంధ్రదేశమందు "కొండవీడు' అను పట్టణమున క్రీ॥శ॥ 14వ శతాబ్దమందు నందన సం॥ కార్త్తికశుద్ధ పూర్ణిమనాఁడు 1386 సం॥ మొదలు 1396 సం॥ వరకు కొండవీడు రాజ్యమును పరిపాలించిన కొమరగిరి వేమభూపాలునివలన మల్లమాంబారాణి యందు తృతీయ పుత్రుఁడుగ జన్మించెను. ఈవేమనయే 1396 సం॥ మొదలుకొని 1424 సం॥ వరకు రాజ్యమును పరిపాలించిన అనవేమభూపాలునకు కనిష్ఠసోదరుఁడుగ బమ్మెర పోతనామాత్యునకు సహాధ్యాయిగనునై సహజమగు ప్రతిభకలిగి సోమశేఖరగురు శుశ్రూషచే అనర్గళముగ సంస్కృతాంధ్రభాషాసాహితి నార్జించి వివిధరాజభోగముల ననుభవించి తన యెదుటనే సుమారిరువది సంవత్సరములలో కలిగిన రెడ్డిరాజ్య పతనము నుద్దేశించి మనఃపరిపాకముచేతను పురాకృత సుకృత విశేషముచేతను పుట్టిన సమగ్రవైరాగ్యము కలవాఁడై కాలవశమునను, ఘటనావశమునను హృదయకుహరమున రేకెత్తిన భావోద్రేకమే పద్యముల రూపమున బయల్వెడల వేలకొలది పద్యములపాడి తుదకు "కటారుపల్లె" అను గ్రామమున శార్వరి సం॥ర చైత్రశుద్ధ నవమినాఁడు 68 సంవత్సరముల వాఁడై భౌతికశరీరమును విడిచి పరమపదమును పొందెనని ప్రతీతి.

వేమ ! త్వత్స్థానవిస్మర్త్యో. మార్గం నో ఝ్షతి సర్వశః ।
అచంచలపదో నూనం స్థానం తవ విశే న్నరః ॥

తా॥ నీతావుఁదెలిసిన జ్ఞాని సన్మార్గము వీడఁజాలఁడు. కాలు కదపకుండ నిశ్చలమనస్కుఁడై నిలిచినచోటుననే నిన్నుఁ జేరఁగలఁడు. (వి)ప్రియోహి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమప్రియః॥ (గీత)

673 నీవునిల్చియుండ నిఖిలంబు నిలుకదు, నిల్చియుండు నెండనీరువలెను
నీవు నిశ్చయంబు నిఖిలంబు మాయయే, విశ్వదాభిరామ వినురవేమ॥

త్వయి స్థితేఽఖిలం నాస్తి మృగతృష్ణోపమం స్థితా ।
త్వమేవ నిశ్చయం వేమ ! నిఖిలం మాయయావృతమ్ ॥

తా॥ నీవు గోచరించిన మిగిలిన దేదియు నుండదు. ఒకవేళనున్నట్లు కనఁబడిన నెండమావులవలె భ్రాంతియే. నీవే నిజము. మిగిలినది మాయ.

673 పికము వనములోన విలసిల్లఁబలికిన, భంగి ప్రాజ్ఞజనులపలుకు గులుకు
కాకికూతఁబోలు కలుషాత్మువచనంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

పరపుష్టో వనే సమ్యక్ సంకూజతి యథా తథా ।
వక్త్యార్యో వేమ ! ధూర్తస్య వాక్యం కాకరుతోపమమ్ ॥

తా॥ తెలిసినవారిమాటలు ఉద్యానవనములోని కోకిలకూతవలె శ్రావ్యముగనుండుమ.. అజ్ఞానులమాటలు కాకుల యఱపునకు సరిపోవును.

674 జ్ఞానులమనిరొంచి చపలాత్ములగువారు, తెలివిలేక తమ్ముఁదెలియలేరు
కష్టగహనమందు భ్రష్టులైయుందురు, విశ్వదాభిరామ వినురవేమ॥

జ్ఞానినో వయ మిత్యేవం మత్వా వేమ ! కుబుద్ధయః ।
అనాత్మజ్ఞా భవం త్యజ్ఞాః కష్టే తిష్ఠంతి కాననే ॥

తా॥ చపలులు జ్ఞానశూన్యులై జ్ఞానముకలవారలుగఁదమ్ము భావించి యజ్ఞానకర్మల నొనరించి కష్టము లను ఘోరాటవిలో భ్రష్టులై పడుదురు.

675 పాపపుణ్యములను పశులకాపెఱుఁగునా?, ధరను బరమయోగి యెఱుఁగుఁగాని
లోనిపొందికఁగని లోహముల్ గూర్పుము, విశ్వదాభిరామ వినురవేమ॥

వేత్తి యోగీ పాపపుణ్యం కిం వేత్తి పశుపాలకః? ।
అంతర్యోగం ప్రాప్య వేమ ! లోహసంగ్రథనం కురు ॥

తా॥ పరమయోగిపుంగవునకుఁ బాపపుణ్యములవిషయము బోధ పడును. కాని యజ్ఞానియగు పశువులకాపరి కెట్లావిషయము బోధపడఁ గలదు ? పరిశుద్ధాంతఃకరణమున వినఁబడు నంతర్వాణీచోదక సంజ్ఞల గ్రహించినయైన సామగ్రి సమకూర్చుకొనుము. (వి) సతాం హి సందేహ పదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః॥ (కాళిదాసు)

676 పెద్దలవచనములు పేర్మితోఁ దావిని, అటులనడువబోవ ననువుపడదు
పులినిఁజూచి నక్క పూతపూసినయట్లె, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ ! శ్రుత్వా మహద్వాక్యం తథా కర్తుం న శక్యతే।
కుర్యాచ్చే ద్వ్యాఘ్ర మన్వీక్ష్య లిప్తజంబుకవ ద్భవేత్ ॥

తా॥ పెద్దలవచనములు విని యట్లు తాము నడువఁబూనుకొనుట సాధ్యముకానిపని. పులినిఁ జూచి నక్క వాతలు పెట్టుకొన్నట్లే.

677 బుద్ధియుతునకేల పాపునిసఖ్యంబు?, కార్యవాదికేల కడుఁజలంబు
కుత్సితునకునేల గురుదేవతాభక్తి?, విశ్వదాభిరామ వినురవేమ॥

కి మసంబద్ధసఖ్యేన పుంసో వేమేహ ధీమతః।
కార్యార్థినః కిం హఠేన? దైవభక్త్యా ఖలస్య కిమ్? ॥

తా॥ బుద్ధివంతునకు దుష్టునితో సరిపడనిస్నేహమెందులకు? కార్య సాధకునకుఁ బట్టుదలతోఁ బ్రయోజనమేమి? కుత్సితునకు గురుభక్తితోను దైవభక్తితోను సంబంధ ముండునా? (వి) నస్థాతవ్యం నగంతవ్యం దుర్జనేన సమం క్వచిత్॥ (పంచతంత్రం)

678 ఎల్లి నేఁడు మఱియు నెల్లుండియైనను, మననునిల్పువాఁడు మంచివాఁడు
శివుఁడుభర్త కర్త చింతింపఁ దానయా, విశ్వదాభిరామ వినురవేమ॥

అద్య వా శ్వః పరశ్వో వా శివార్పితమనా స్సుధీః।
శివోభర్తా భవే ద్వేమ ! స్వయం కర్తా హి మానవః ॥

తా॥ ఈనాఁడు రేపు ఎల్లుండి ఎప్పుడైనను మనస్సు నిలుపువాఁడు మంచివాఁడు. కర్మకుఁ దానుకర్త. పోషించుటకు భగవంతుఁడుభర్త.

679 ఏమిగొంచువచ్చె నేమిదాఁగొనిపోవు, పుట్టువేళ నరుఁడు గిట్టువేళ
ధనము లెచటికేగుఁ దానేగు నెచటికి?, విశ్వదాభిరామ వినురవేమ॥

అజగామ కి మానీయ? కిం గృహ్ణన్ వేమ! గచ్ఛతి? ।
జననే మరణే గచ్ఛేత్ కుతో విత్తం? కుత స్స్వయమ్? ॥

తా॥ మానవుఁడు పుట్టినపుడు తెచ్చినదేమి? చచ్చునపుడు గొనిపోవున దేమి? ధన మెచటికిఁబోవునో! తానెచటికిఁ బోవునో!

680 కడుపులోనిరోత కడునోటియెంగిలిఁ, గడుగఁజాలమె బ్రహ్మకొడుకుకైన?
సత్యమున్నఁ గొంత జగతిపై సిద్ధించు, విశ్వదాభిరామ వినురవేమ॥

వక్త్రోచ్ఛిష్టం కుక్షిమలం న శుద్ధ్యే ద్బ్రహ్మజేన వా ।
యద్యస్తి సూనృతం కించిత్ వేమ! సిద్ధ్యతి తద్భువి ॥

తా॥ కడుపులోని కశ్మలము నోటియందలి యెంగిలి శుభ్రపరచు కొనుటకు నాబ్రహ్మకొడుకునకైన శక్యమా? సత్యవాక్కు కలిగిన నోరు, కోరికలు మంచివైనఁ గడుపు, శుభ్రపరచుకొన్న ట్లగును.

681 ఆశఁ గోసివేసి యనలంబుఁజల్లార్చి, గోచి బిగియఁగట్టి కోప మణఁచి
ఆశవిడిచెనేని నతఁడు దా యోగిరా, విశ్వదాభిరామ వినురవేమ॥

ఛిన్నాశో వేమ! శాంతాగ్ని ర్బద్ధకౌపీన ఏవ చ ।
నిరాశీ రుజ్ఝితక్రోధః పుమాన్ యోగీతి కథ్యతే ॥

తా॥ ఆశాపాశములఁద్రెంచి ఆవేశమడచుకొని కామమునకుఁ జిక్కక కోపమురానీక కోరికల నంతరింపఁజేసిన నతఁడే నిజమగుయోగి. (వి) పాశోహికో? యో మమతాభిమానః 2 సంసారమూలం చ కి మస్తి? చింతా॥ (శం॥మణి) శక్నోతీ హైవ యస్సోఢుం ప్రాక్ఛరీరవిమోక్షణాత్, కామక్రోధోద్భవం వేగం స యుక్త స్ససుఖీ నరః॥

682 గుణవిహీనజనుని గుణమెంచఁగానేల?, బుద్ధిలేనివాని పూజయేమి?
మనములేనివాని మంత్రింబులేమయా, విశ్వదాభిరామ వినురవేమ॥

జనస్య గుణహీనస్య గుణానాం గణనేన కిమ్? ।
నిర్బుద్ధేః పూజయా కిం వా మంత్రైః కిం వేమ! దుర్మతేః ॥

తా॥ గుణవిహీనునిపనుల నెంచుటయెందులకు? బుద్ధిలేనివాని పూజ లేల? విశ్చలమనస్కుఁడుకానివాని మంత్రముల పటుత్వమేమి?

# సాహితి - తద్వ్యాప్తి

సంస్కృతమందలి "రాట్, పాలక" శబ్దములు ఆంధ్రభాషను "రెడ్డి, కాపు" అని వ్యవహారమునఁగలవు. అందువలన కొండవీడు సంస్థానమందలి ఈవేమన వంశీయులకు "భూపాల్" అను పేరు వ్యవహారమున కలుగుట "వేమభూపాల్, కృష్ణరామభూపాల్" అనునామములచే వెల్లడియగుచున్నది. వేమన కుటుంబమందలి పెదకోమటి వేమన శృంగారదీపికయను పేర అమరుక కావ్యమునకు సంస్కృతవ్యాఖ్యయు, సప్తశతీసారమను పేర గాథాసప్తశతి కనువాదమును రచించెను. 'వేమభూపాలీయ'మను నామాంతరమున ప్రఖ్యాతిచెందిన యీ పెదకోమటివేమన జీవితచరిత్ర పార్వతీ పరిణయమను సంస్కృతనాటకము రచించిన వామనభట్టు రచించెను. అటులనే కుమారగిరి భూపాలుఁడు వసంతరాజీయ మను సంస్కృతకావ్యము రచించెను. కుమారగిరిఅల్లుడు కాటయవేమన కాళిదాసనాటకములకు వ్యాఖ్య రచించెను. అందువలన నీ కొండవీడురెడ్డి సంస్థానాధీశులు సంస్కృతాంధ్రముల కృతికర్తలు, కృతిభర్తలు అగుట విశదము. అందువలన వేమనయోగియు సంస్కృతాంధ్రములను నీ యుభయభాషల ప్రవీణుఁడనుట నిర్వివాదమే. అందువలననే ఎఱ్ఱాప్రగ్గడ శ్రీనాథాది ఆంధ్రకవివరుల కీసంస్థాన మాశ్రయమొసగెను. వేమనకవి ఆంధ్రవాఙ్మయచ్ఛందస్సున సంస్కృతవాఙ్మయమున అనుష్టుప్ఛందము వలె లలితములు విశాలభావకలితములునగు "ఆటవెలది" అనుపద్యముల సాటలేని మేటివేదవాక్యములఁ బ్రకటించి తనప్రతిభను ఆంధ్రలోకమున వెల్లడించెను. కేవల పాకభాషికపదములచే నిగూఢము, సర్వోపనిషత్సారసమన్వితమునగు వేదాంతశాస్త్రము సర్వసాధారణ వ్యావహారిక భాషను వెల్లడించి బుధుల ఆదరమునొందెను. వేమనకవి రచనయందు అక్కడక్కడ "మానినీమనోజ మందిరానందైకలోలుఁడు, ఊర్ధ్వలోకసుఖము, ఆభిజాత్యమదము, విశ్వదాభిరామ". మొదలగు సంస్కృతపద ప్రయోగ

683 ధర్మసత్యములను దప్పక చేయని, కర్మజీవి మేలుఁగానలేఁడు
నిర్మలహృదయుండు నీరూపమున నుండు, విశ్వదాభిరామ వినురవేమ॥

ధర్మసత్యపథాలంబీ యో నరో న ప్రవర్తతే।
నాప్నోతి స శుభం వేమ! సాధుచిత్తో భవత్సమః॥

తా॥ ధర్మముగా నడువక సత్యము పలుకక సంచరించు కర్మజీవి మేలును గాంచలేఁడు. హృదయనైర్మల్యము కలవాఁడుమాత్రమే నీ రూపమున సాక్షాత్కరించును.

684 చచ్చువారలెవరో చావనివారేరో, చచ్చిబ్రతికియుండు జనములెవరో
విచ్చలవిడిగాను వివరించి చూడరా, విశ్వదాభిరామ వినురవేమ॥

గతాసవో వేమ! యే స్యుః యే స్యు ర్మృతామృతాజనాః।
మృతజీవా జనా యే స్యుః తాం స్తాన్ సమ్య గ్విమర్శయ॥

తా॥ మృతులెవరో అమరులెవరో మృతజీవులెవరో జీవన్మృతులెవరో స్వేచ్ఛగా విమర్శించి యాలోచించుము. నీకేబోధపడును. (వి)జాతోఽపి కో? యస్య పున ర్న జన్మ, కో వాఽమృతో? యస్య పున ర్న మృత్యుః॥

685 చిత్తముగలయోగి శివునివలెనెయుండు, మిథ్యయోగియుండు మిడుతవలెను
నిత్యుఁడైనయోగి నీవలెనుండురా, విశ్వదాభిరామ వినురవేమ॥

శివోపమః స్సాధుచిత్తః కపట స్సలభోపమః।
నిశ్చయాత్మా మహాయోగీ వేమ! నూనం భవత్సమః॥

తా॥ నిశ్చలచిత్తుఁడు సాక్షాత్తు పరమేశ్వరుఁడే. టక్కరియోగి మాత్రము తుట్టెపురుగు. (మిడుత) శాశ్వతుఁడగుయోగి పరమాత్మ స్వరూపుఁడే. (వి)ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున!, సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః॥ గీత॥

686 ఓగుబాగెఱుఁగని యుత్తమూఢజనంబు, లిల సుధీజనముల నెంచుటెల్ల
కుక్కసింగముఁ గనుఁగొని మొఱిగిన రీతి, విశ్వదాభిరామ వినురవేమ॥

యుక్తాయుక్తానభిజ్ఞో హి వేమ! మూఢజన స్తథా।

తా॥ మంచియుఁజెడ్డయు నెఱుఁగని పరమమూర్ఖులు పెద్దలనిందించుట సింహామునుజూచి కుక్కలు మొఱిగినట్లే.

687 నేరనిజనులకును నేర్పి నేరములెల్లఁ, జక్కఁజేతు రరయ సాధుజనులు
ఒప్పె దుర్జనములు తప్పుగ నెంతురు, విశ్వదాభిరామ వినురవేమ॥
కుశలా న్కుర్వతే వేమ ! సాధవోఽకుశలాన్ జనాన్।
న తథా దుర్జనా దోషా నారోపంతి గుణేష్వపి ॥

తా॥ సత్పురుషులు తెలియనివారితప్పులఁ దెలియఁజెప్పి సరిజేసి సరిపుచ్చుకొందురు. దుష్టులు ఒప్పులనే తప్పులుగనెంచి హేళనఁజేయుదురు.

688 పలుగువానికేల పరసమృద్ధిదలంప?, పలుగువానికేల భక్తిపథము?
పలుగువానికేల పరమార్థతత్త్వంబు?, విశ్వదాభిరామ వినురవేమ॥
కిం ? ధూర్తస్య పరర్ద్యా స్యా ద్భక్తిమార్గేణ వా పి కిమ్?
వేమ ! కిం పరమార్థస్య తత్త్వేనేహ మనాగపి ॥

తా॥ దుర్మార్గునకుఁ బరసమృద్ధితోను భక్తిమార్గముతోను పరమార్థతత్త్వముతోను సంబంధముండునా? (వి) పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్. (భర్తృ)

689 ఉచితవంతుఁడైన నుద్యోగపరుఁడౌచు, సాగిపాటియున్న సమయమునను
పరుల కుపకరించి పరఁగరక్షించును, విశ్వదాభిరామ వినురవేమ॥
ఔచిత్యవా న్నరో నిత్య ముద్యోగీసన్ సమర్థతః ।
వేమాన్యేభ్య శ్శక్తికాలే చోపకృత్యేహ రక్షతి ॥

తా॥ యుక్తాయుక్తవివేచనకల మహనీయుఁడు తగినపద్ధతి కలవాఁడై సాగిపాటియున్న సమయమున దీనుల రక్షించుచుఁ బరోపకారియగును.

690 బంగరుఁబోడఁగన్న భామలఁబోడఁగన్నఁ, జిత్తమునను జింతఁ జేయఁడేని
వాఁడె పరమయోగి వర్ణింప జగమందు, విశ్వదాభిరామ వినురవేమ॥
కాంతాం చ కనకం వేమ ! సంవీక్ష్య హృది యో నరః ।
మోహం నాప్నోతి లోకేఽస్మిన్ స యోగీ పరమో మతః॥

తా॥ బంగారముఁజూచిన భామలనుజూచిన మనస్సున నెవఁడు భ్రాంతిఁజెందఁడో వాఁడే నిజమగు పరమయోగిపుంగవుఁడు.(వి) విశ్వాసపాత్రం న

కిమస్తి? నారీ॥ నారీ స్తనభర నాభీదేశం దృష్ట్వా మాగా మోహావేశమ్,
అర్థ మనర్థం భావయ నిత్యం నాస్తి తత స్సుఖలేశ స్సత్యమ్॥(భజగోవిందమ్)

691 కండకావరమునఁ గానఁడుమరణంబుఁ, దనుమదమునఁ గనఁడు తత్త్వమిట్లు
భోగవాంఛచేతఁ బుణ్యంబుఁ గానఁడు, విశ్వదాభిరామ వినురవేమ॥

ఉద్ధత్యా నేక్షతే మృత్యుం తత్త్వం తనుమదేన చ ।
భోగవాంఛాసమాక్షిప్తః పుణ్యం వేమ! న పశ్యతి ॥

తా॥ కండకావరమున మరణమును, శారీరకమదమునఁ బరమార్థతత్త్వ మును,భోగవాంఛలచేఁ బుణ్యమును, మానవుఁడు గాంచలేకున్నాఁడు.

692 పెట్టినంతఫలము పెక్కుంద్ర కపకృతిఁ, జేయకున్నఁ దాను జెఱుపకున్నఁ
బెండ్లిఁజేయునట్టి పెద్దఫలంబురా, విశ్వదాభిరామ వినురవేమ॥

న బాధతే యది బహూం స్తస్య దానఫలం భవేత్ ।
న భవేద్యది తన్నాశీ వేమైత్యుద్వాహకృత్ఫలమ్ ॥

తా॥ ఇతరుల కపకారముచేయకున్నఁ బెక్కుంద్రకుఁబెట్టినంతఫలము. తానెవరినిఁబాడుచేయకున్నఁ బేదవానికిఁ బెండ్లిచేసినంత పెద్దఫలము.

693 మేఁకఁజంకఁబెట్టి మెలఁగుచుమందలో, బ్రమసి వెదకు గొల్లపగిది హృదిని
దైవమెఱుఁగక పరదైవతములఁదల్చు, విశ్వదాభిరామ వినురవేమ॥

మేషం స్వకక్షే నిక్షిప్య గోపోఽన్విష్యాత్ యథా వ్రజే।
తథా హృత్స్థం వేమ! దైవం త్యక్త్వాన్యత్ర భజే జ్జడః ॥

తా॥ హృదయమందున్న పరమాత్మ నెఱుఁగక కల్పితేతరదైవముల కొఱకు గాలించువాఁడు మేఁకను జంకఁబెట్టుకొని మందయంతయు నా మేక కొఱకే మతిపోయి వెదకిన గొల్లమాదిరి సుమా.

694 వెఱ్ఱిపట్టువాని వినయంబు లధికముల్, చెడ్డముండ ముసుఁగుచెలఁగిపెట్టు
చెడిపెకొడుకు మిగులఁజేయు నాచారంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

ఉన్మత్త స్యాతివినయాః సావలుంఠా చ పుంశ్చలీ ।
కౌలటేయో వేమ । సమ్యగాచారం కురుతే సదా ॥

తా॥ వెఱ్ఱివాఁడుఁ ద్రాగినవాఁడును నధికమగువినయముఁ జూపింతురు. (అతివినయం ధూర్తలక్షణమ్) చెడిపోయిన రండ ఘోషా (ముసుగు)

ధరించును. చెడిపోయినదాని కొడుకు (పాతకంబు బయల్పడకుండ) ఎక్కువయాచారములఁ గనబరచును.

695 నొసలుబత్తుఁడౌచు నోరు తోఁడేలౌచు, మనసు భూతమువలె మలయఁగాను
శివునిఁగంటినన్న సిగ్గెట్లుకాదొకో!, విశ్వదాభిరామ వినురవేమ॥

భక్తః ఫాలే వృకో వక్త్రే భూతం చిత్తే చ యో భవేత్।
దృష్టం బ్రహ్మేతి తస్యోక్తిః వేమ! లజ్జాకరా న కిమ్?॥

తా॥ నొసలు భక్తుఁడా? నోరు తోఁడేలా? మనస్సు లొంగుబాటులేని పెనుభూతమా? ఇట్టివాఁడు నేను భగవంతునిఁ జూచితినని చెప్పుటకేల సిగ్గుపడఁడో! చెప్పినను వినువార లెట్లు నమ్ముదురో తెలియకున్నది.

696 భూతిదేహమందుఁ బూసిననాయెనా?, నిష్ఠ శివునియందు నిలుపవలయుఁ
గాక భస్మమందు గాడిద దొర్లదా, విశ్వదాభిరామ వినురవేమ॥

కిం దేహలిప్తయా భూత్యా? కుర్యాన్నిష్ఠాం సదాశివే।
అనారతం ఖరో వేమ! కిం భస్మని న లుంఠతి?॥

తా॥ శివభక్తునిలక్షణము శరీరమున బూడిదఁ బులుముకొనుట కాదు. శివునియందు నిష్ఠఁగలిగి యుండవలెను. శివభక్తిలేని బూడిదపూతవలనఁ బ్రయోజనమేమి? గాడిద బూడిదలో దొర్లదా?

697 ఆకులెల్లఁదిన్న మేఁకపోతులకెల్లఁ, గాకపోయెనయ్య కాయసిద్ధి
లోకులెల్ల వెట్టిపోకిళ్లఁ బోదురు, విశ్వదాభిరామ వినురవేమ॥

మేషాః పర్ణాశిన స్తేషాం కాయసిద్ధి ర్న సిద్ధ్యతి।
లోకా స్సర్వే తథా వేమ! కుర్వం త్యున్మత్తచేష్టితమ్॥

తా॥ లోకులు పెక్కు వెఱ్ఱిపోకిళ్లఁ బోవుదురు. కాయసిద్ధికి నాకు లలములఁ దిందురు. అంతమాత్రముచేఁ గాయసిద్ధికలుగునా? ఆకులు నలములు తిను మేకపోతులకుఁ గాయసిద్ధి కలుగుచున్నదా?

698 బోడితలల జడల బూడిదపూతల, భాషణాసనముల వేషములను
యోగికాఁడు లోన బాగుఁగాకుండిన, విశ్వదాభిరామ వినురవేమ॥

జటాభి ర్వేమ! ముండైశ్చ భస్మలేపైశ్చ సర్వశః।
భాషణాసనవేషైశ్చ స యోగీ హ్యజితేంద్రియః॥

తా॥ లోన నంతఃకరణశుద్ధిలేకున్న బోడితలలు జడలు బూడిదపూతలు వేదాంతపారిభాషికపదములు ఆసనములు ఇట్టివేషముల యోగి కానేరఁడు. లోనబాగుపడిననే యోగి. (వి) స్థైర్యం యోగమహోత్సవేऽపిచ యది త్రైలోక్యరాజ్యేన కిమ్? (భర్తృ)

699 వేషభాషలెఱిఁగి కాషాయవస్త్రముల్, బోడినెత్తికలిగి పొలుపుమీఱు
తలలు బోడులైనఁ దలఁపులు బోడులా?, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమేహ ముండితం శీర్షం వేషభాషా దధ త్యహో! ।
యది ముండాని శీర్షాణి సంకల్పాశ్చాపి కిం తథా ? ॥

తా॥ వేషము భాష కాషాయవస్త్రములు బోడినెత్తి కలిగియున్నంత మాత్రమునఁ గోరికలు చావవు. తలలు బోడులైనంత మాత్రమునఁ దలఁపులు బోడులుకావు.

700 కాలు సేయివంచి గాలినిండుగఁ జేర్చి, నేలవ్రాలి మఱియు నిలిచిచేయు
నాసనముఖవిద్య లభ్యాసవిద్యలు, విశ్వదాభిరామ వినురవేమ॥

నమయిత్వా పాణిపాదం వాయుపూర్ణః పతస్ స్థితః ।
వేమాసనాద్యా స్స్యు ర్విద్యా అభ్యాసేన కృతా భువి ॥

తా॥ కాళ్లువంచి చేతులువంచి గాలిపూరించి నేలమీదపండుకొని కొన్ని, నిలిచికొన్ని, చేయు ఆసనములు వేయుట మొదలగు పనులభ్యాసవిద్యలుకాని యంతమాత్రమున హృదయపారిశుద్ధ్య మేర్పడదు.

701 కావిపంచెఁగట్టి కడుయోగివలెనుండి, వెలికిఁగోర్కులెల్ల విడిచిపెట్టి
తోడరి తిరుగువాఁడు దొంగసన్యాసయా, విశ్వదాభిరామ వినురవేమ॥

కాషాయధారీ యోగీవ స్థితః కామాన్ ముహు ర్బహిః।
విక్షిప్య వర్తతే వేమ ! య స్స మాయీ ముని ర్ధ్రువమ్ ॥

తా॥ మహాయోగివలె కాషాయవస్త్రములు ధరించి బాహ్యప్రపంచముపైకిఁ గోరికల విజృంభింపఁజేసి యాడంబరముగ సంచరించువాఁడు దొంగ సన్యాసికాని మంచి సన్యాసికాఁడు.

702 కలియుగమునఁబుట్టి కడతేరఁగాలేక, ఒడలు బడలఁజేసి యుగ్రతపముఁ
దామఁజేసి యేమి తత్త్వంబుఁ గందురో!, విశ్వదాభిరామ వినురవేమ॥

జాతాః కలౌ వనుత్తీర్ణా భ్రాంతదేహాః ఘనం తపః ।
కుర్వంతి కిం ఫలం తేన? కిం తత్త్వం వేమ ! వేద్యతే? ॥

తా॥ "కలౌ సంకీర్తనాన్ముక్తిః ,, అన్నట్లు కలియుగమున జనించి సూక్ష్మముగ మోక్షమును బొందలేక శరీరమును శుష్కింపఁజేసి సృష్టి తత్త్వముఁ దెలియలేక ఘోరతపస్సుఁజేయుటయు నిష్ఫలమే.

703 ఇల్లు నాలు విడిచి యినుపకచ్చలుఁగట్టి, వంటకంబు నీరు వాంఛ లుడిగి
ఒంటినున్నయంత నొరుగునా తత్త్వంబు?, విశ్వదాభిరామ వినుర వేమ॥

గృహాన్ దారాన్ పరిత్యజ్య విహాయాన్నాదికే స్పృహామ్।
ఏకాకీ బద్ధకౌపీనస్తత్త్వం వేమ ! లభేత కిమ్? ॥

తా॥ ఇల్లును ఇల్లాలిని విడిచి లోపలికామమును జంపలేక పైకి మాత్రము ఇనుప లంగోటీలు బిగించి యేకాంతమున నున్నంత మాత్రమునఁ బరమార్థతత్త్వము బోధపడదు (వి) నకర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే,స చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి।

704 జీవలింగపూజఁ జేసినవారికి, శిలలరూపమందుఁ జింతయున్నె?
చెలఁగి మధువుఁగ్రోలఁ జేదు రుచించునా?, విశ్వదాభిరామ వినుర వేమ॥

కుర్వాణస్య ప్రాణిపూజాం చింతా స్యాత్కిం శిలాదిషు? ।
ఆస్వాదితే మధురసే తిక్తః కిం వేమ ! రోచతే? ॥

తా॥ తీయనితేనెత్రాగిననోటికి చేదురుచించునా? అట్లే జీవలింగపూజ (మహనీయులపూజ) చేసెడివారికి శిలారూపముల బుద్ధి పుట్టునా ?

705 రాతిప్రతిమఁదెచ్చి రాజసంబుననుంచి, పూజఁజేయు నరుఁడు బుద్ధిమాలి
భావమందుఁ బరము భావింప నేరఁడు, విశ్వదాభిరామ వినుర వేమ॥

బుద్ధిహీనో రజో వృత్త్యా చానీయోపలవిగ్రహమ్ ।
పూజతే వేమ ! భావే స్వే పరం జ్ఞాతుం న పారయేత్ ॥

తా॥అజ్ఞాని తెలివితక్కువచే రాతిబొమ్మను దెచ్చి రాజసముతో దానిఁ బూజించును. అంతియకాని హృదయముననున్న పరమాత్మను దెలియఁడు.

706 వేదవిద్యలెల్ల వేశ్యలవంటివి, భ్రమలఁ బెట్టి తేటపడఁగనీవు
గుప్తవిద్యయొకటె కులకాంతవంటిది, విశ్వదాభిరామ వినుర వేమ॥

వేశ్యాతుల్యా వేదవిద్యాః కుర్వంతి భ్రాంతి మస్ఫుటాః ।
ఏకైవ గుప్తవిద్యా స్యాత్ వేమ! తుల్యా కులస్త్రియా ॥

తా॥ వేదవిద్యలు భ్రమలఁబెట్టి వేశ్యలవలె యదార్థము బోధపడనీయవు. రహస్యమగు బ్రహ్మవిద్యయే కులకాంతవలెఁ దన్నుఁదరింపజేయును.

707 వ్రతములెన్నియైన పట్టిచిక్కులె కాని, ఆత్మచిక్కుఁ గాన నలవికావు
ఆత్మచిక్కుఁ బాపు నతఁడెపో ఘనయోగి, విశ్వదాభిరామ వినుర వేమ॥

సర్వవ్రతాని వేమేహ కాయక్లేశకరాణ్యహో! ।
న దర్శయం త్యాత్మతత్త్వం మహాన్యోగ్యాత్మతత్త్వవిత్ ॥

తా॥ ఎన్నివ్రతములైనను జీవికి మఱింత చిక్కులు కల్పించునవే కాని పరమాత్మను దెలిసికొననీయని చిక్కును దొలఁగింపనేరవు. అట్టి యాత్మచిక్కు తొలఁగినవాఁడే పరమయోగి.

708 నల్లబోడితలలుఁ దెల్లనిగొంగళ్ళు, ఒడలబూదిపూఁత లొంటినున్న
ఇట్టివేషములిలఁ బొట్టకోసమెసుమీ, విశ్వదాభిరామ వినుర వేమ॥

సమ్యఙ్ముండితశీర్షాణి కంబళాని సితాని చ ।
భస్మలేపా స్తనౌ వేమ ! తాదృగ్వేషాశ్చ కుక్షయే ॥

తా॥ నున్ననిబోడితలలు తెల్లనిగొంగళ్లు శరీరమున బూడిదపూఁతలు ఇట్టి శరీరవేషధారణ పొట్టకోసమేకాని తత్త్వజ్ఞానమునకుఁగాదు.

709 పుస్తకములు జడలుఁ బులితోలు బెత్తంబుఁ గక్షపాలలుఁ బదిలక్షలైన
మోతచేటె కాని మోక్షంబులేదయా, విశ్వదాభిరామ వినుర వేమ॥

గ్రంథా జటాః కక్షపాలా వేత్రం చ వ్యాఘ్రచర్మ చ ।
భారాయ కేవలం వేమ ! మోక్షో నాస్తి తతః ఖలు ॥

తా॥ పుస్తకములు జడలు పులితోళ్లు బెత్తములు కక్షపాలలు ఇట్టివి పదిలక్షలు ధరించినను మోతచేటుకాని మోక్షము కలుగనేరదు.

710 ఆసనములఁబన్ని యంగంబు బిగియించి, ఒడలువిఱుచుకొనెడు యోగమెల్ల
- జెట్టిసాముకన్నఁ జింతాకు తక్కువ, విశ్వదాభిరామ వినుర వేమ॥

కృతాసనః పీడితాంగః యోగాభ్యాసీ సమత్తనుః ।
కించిద్వ్యాయామకృన్మల్లాత్ వేమ! న్యూనత్వ మాప్నుయాత్॥

తా॥ ఆసనములువేయుట ప్రాణముబిగించుకొనుట యీ మొదలగు అభ్యాసములు చేసినవారలు చేయుపనులకంటెఁ దక్కువైనవే.

711 కడుపు బిగించి కన్నులు మూసుకొంచి, బిట్టబిగిసియున్న బీదయోగి
యమునిబారికిఁ గొఱ్ఱె యతఁడేమిచేయును?, విశ్వదాభిరామ వినురవేమ॥

నిమీల్య నయనే కుక్షిం నిష్పీడ్య కృపణో యతిః ।
కిం కుర్యాత్ రుద్ధకాయస్సన్ వేమ! మేషో యమాంతికే॥

తా॥ కడుపు లోపలకునంటుకొనులాగునఁ జేసి కన్నులుమూసికొని బిఱ్ఱబిగిసియుండు బీదయోగి యందఱివలె యమునిపాలిటికి గొఱ్ఱెయే.

712 ఇహమువిడిచి ఫలము లింపుగఁగలవని, మహినిఁబల్కువారి మతముకల్ల
ఇహములోనఁబరము నెసఁగుటఁ గానరు, విశ్వదాభిరామ వినురవేమ॥

ఐహికం వేమ ! సంత్యజ్య ఫలమస్తీతి యే జనాః ।
బ్రువతే తన్మతం మిథ్యా పరమస్తీహ పశ్యత ॥

తా॥ ఇహము (వర్తమానము) విడిచి పరము (భవిష్యత్) బాగుచేసికొని ఫలితము పొందవలెననిచెప్పువారలమాటలు సరియైనవికావు. ఇహములోనే పరమును బెనవేసికొనియున్నదని భావింపుఁడు.

713 వ్రాఁతవెంటకాని వరమీఁడుదైవంబుఁ, జేఁతకొలఁదికాని వ్రాఁతకాదు
వ్రాఁతకజుఁడుకర్త చేఁతకుఁదాఁగర్త, విశ్వదాభిరామ వినురవేమ॥

వినైవలిఖితం వేమ ! న దత్తే వర మీశ్వరః ।
వినా కర్మ న లేఖా స్యాత్ కర్తాత్మా లేఖకో విధిః ॥

తా॥ చేతకొలఁది వ్రాత, వ్రాతకొలఁది వరము. చేతకు మనముకర్తలము. ఆకర్మఫలితమే వ్రాయుటకు బ్రహ్మ కర్త.

714 కంటిఁగంటి, ననుచుఁ గర్మాధికారంబు, వెంటఁబట్టిచెడును వెఱ్ఱిజనుఁడు
బట్టబయలుముక్తిఁ బాటించిచూడఁడు, విశ్వదాభిరామ వినురవేమ॥

అపశ్యమితి దుర్మేధా వేమ ! కర్మాధికారతః ।
అనుసృత్య వినష్టస్స్యాత్ చిత్తే ముక్తిం న పశ్యతి ॥

తా॥ హృదయకుహరమను బ్రహ్మాండమునఁ జిదాకాశమను బట్టబయట ముక్తిగోచరించుచుండఁ బాడుకర్మలఁ జేయుచు వెఱ్ఱిమనుష్యుఁడు మఱెక్కడనో మోక్షముఁగాంచితినని పలికి చెడిపోవును.

715 తాను విమలుఁడైనఁ దనగుణమంతయు, శివునికీనిగురువు చెడ్డగురువు
గుడ్డిగుఱ్ఱమెక్కి గుడితిరిగినటులౌ, విశ్వదాభిరామ వినురవేమ॥

నిర్మలోఽప్యాత్మనో వేమ! గుణం దేవాయ యో గురుః।
న దదాతి స దుర్మేధా అంధాశ్వారూఢవ ద్భ్రమేత్ ॥

తా॥ విమలుఁడగు సద్గురువు తనసద్గుణము భగవదర్పిత మొనరించును. అసద్గురువట్లు గావింపనేరఁడు. అట్టివాఁడు గ్రుడ్డిగుఱ్ఱమునెక్కి గానుగెద్దువలె నక్కడనే గుడి తిరిగి సల్లెౌను. గమ్యస్థానముఁ జేరలేఁడు.

716 జారపురుషుమీఁద సద్భక్తి సలుపుచుఁ, బతికి నిచ్చకంబుఁ బలుపుభంగి
పరముకొఱకు యోగి పాటించు దేహంబు, విశ్వదాభిరాము వినుర వేమ॥

పుంశ్చలీ వేమ! కుర్వంతీ జారే రక్తిం స్వభర్తరి।
ముఖప్రీతిం యథా కుర్యాత్ ముక్త్యై దేహే తథా యతిః॥

తా॥ జారిణి జారపురుషునిపై లక్ష్యముంచి భర్తను దాత్కాలికపు టిచ్చకములఁ బ్రవర్తిల్లఁజేయును. అట్లె యోగి [illegible] పరమాత్మపై లక్ష్యముంచి తాత్కాలికమైనదిగా దేహమును [illegible] చుచుండును.

717 తనువులోని జీవతత్త్వ [illegible], [illegible] కలదటంచు [illegible] నేల?
భానుఁడుండ [illegible] బట్టి [illegible], విశ్వ[illegible]భిరామ విను[illegible] వేమ॥

[illegible] పృథక్।
[illegible] స్థితే రవౌ॥

తా॥ సూర్యుఁడుండ దీపముచే [illegible] యవివేకమో శరీరమందలి జీవతత్త్వమును దెలిసికొనఁ జాల[illegible] యవివేకమే.

718 చచ్చువారినిఁగని చావు నిశ్చ[illegible], [illegible] నాత్మఁదలఁచి తెలివి
నదురుబెదురులేక యడరిన భక్తుండు, విశ్వదాభిరామ వినురవేమ॥

మ్రియమాణాన్ నరాన్ దృష్ట్వా ధ్రువో మృత్యు రితి స్మరన్।
జ్ఞాత్వా వేమాత్మనస్తత్త్వం భక్తస్స్యా దకుతోభయః॥

తా॥ చచ్చువారినిఁజూచి తనకుఁగూడ చావు నిశ్చయమని తనయందే తత్త్వము (యథార్థస్థితి) తెలిసికొని యట్టి యాత్మజ్ఞానముచే నదురుబెదురు లేక ధీరుఁడై సంచరించెడివాఁడే భక్తుఁడనఁబడు.

719 బొమ్మలాటవాఁడు బొమ్మలనాడించు, భువిని జనులుచూడఁ బొలుపుమీఱ
తానుమొఱఁగియుండి దైవమాడించురా, విశ్వదాభిరామ వినురవేమ॥
వేమ ! పాంచాలికాజీవీ క్రీడాం పాంచాలికాగతై ః।
కారయిష్యతి దైవం చ కుర్యాత్ప్రచ్ఛన్నత స్తథా॥
తా॥ బొమ్మలాటవాఁడు తాను బొమ్మవెనుకనుండి బొమ్మను దెరపై నాడించునట్లు మనవెనుక భగవంతుఁ డుండి మనల నాడించును.

720 వాక్కుశుద్ధిలేనివాఁడు చండాలుండు, ప్రేమశుద్ధిలేక పెట్టుటెట్లు?
నొసలు భక్తుఁడైన నోరు తోడేలరా, విశ్వదాభిరామ వినురవేమ॥
యస్య నాస్తి వచశ్శుద్ధి శ్చండాలః ఖలు వేమ ! సః ।
దానేన కిం వినా ప్రేమ్ణా ? ఫాలే భక్తో ముఖ వృకః ॥
తా॥ నొసలు భక్తుఁడుగ నోరు తోడేలుగ నుండువాఁడు భక్తుఁడుకాఁడు పరిశుద్ధప్రేమలేనివాఁడు పెట్టువాఁడునుగాఁడు. అట్లే వాక్కుశుద్ధిలేని వాఁడు జ్ఞానియునుగాఁడు. (చండాలుఁడు)

721 తోలుకడుపులోన దొడ్డవాఁడుండఁగ, రాతిగుళ్లలోన రాశిఁబోయ
రాయిదేవుఁడైన రాసులు మ్రింగఁడా?, విశ్వదాభిరామ వినురవేమ॥
పరమే చర్మకుక్షిస్థే రాశిం ద్రుషది కుర్వతే ।
యది దేవ శిలాభవ స్యాత్తే రాశిం నాశ్నాతి వేమ! కిమ్? ॥
తా॥ తోలుకడుపులోని దొడ్డవాఁడగు పరమేశ్వరుఁడుండ రాతిగుడిలో నన్నపురాశిఁ బోయుదురు. అట్టి శిల దానిని మ్రింగునా?

722 నేరనన్నవాఁడు నెరజాణ మహిలోన, నేర్తునన్నవాఁడు నీరఁజెడును
యూరకున్నవాఁడె యుత్తమోత్తముఁ డెందు, విశ్వదాభిరామ వినురవేమ॥
యో వేమాశక్త మాత్మానం బ్రూతే సోపిద ఏవ సః ।
న తథాన్య ఉదాసీనో భవేత్సర్వోత్తమోత్తమః ॥
తా॥ తెలిసియుఁ దెలియ దనువాఁడే నేర్పరి. కాని యన్నియు నాకే తెలియుననువాఁడుమాత్రము తెలిసినవాఁడు కానేరఁడు. తెలిసియు నూరకుండువాఁడే యుత్తమోత్తముఁడు.

ములునుకలవు. అయినను తఱచుగ సంస్కృతభాషయందలి భగవద్గీతవలె ఆంధ్రభాషయందు అందఱకుఁ దెలియఁదగుపద్ధతినే వేమనకవితశోభిల్లెను. అక్కడక్కడ క్ష - ంక, అ - ప్రాణ, ఋగ్యజు - యోగ్య, మొదలగు లాక్షణికములగు యతివిశేషములును కలవు. ప్రకృతి రూపము లగు గృహ గేహశబ్దములు వికృతినిగీము, అని వ్యవహరింపఁబడుచుండెను. వేమనకవి మాత్రము "గురము" అనియువాడెను. ఈ మొదలగు విష యములు పాఠకులకు సంతట విశదముకాగలవు.

వేమనయోగి ఎక్కడపుట్టెను? ఏభాషను పద్యములుపాడెను? ఇట్టి వివాదముచే మనకుఁ బ్రయోజనములేదు. వానిగీతాసారమే మన కాస్వాదింపందగినది. వేమనకవి ఆశుధారగ నాయాపరిస్థితుల ననుసరించి అప్పటికప్పుడు పాడమినపద్యములు లేఖన సాధనములు లేని యాకాలమున కేవల భావకుసుమ సౌరభము మాత్ర మాఘ్రాణింపఁ జేరిన శిష్యభ్రమరములు నిర్దుష్టముగ నెట్లు నిలిపియుంచగల సమర్థత వహించునో యోచింపుడు. కొందఱీ నగ్నసత్యము నూహింపనేరక "వేమనకవి భావభాషాదులు బాగుగలేవు." అని వృథాగా వేమన్నను నిందించుటతోత్ తృప్తిఁజెందువారును కనబడుచున్నారు. సర్వము అహం, మమ (నేను, నాది) అను వానితో కూడినదియే. అందు మమ (నాది) అనునది అసజ్జడాత్మకశవరూపము, అహం అనునది సత్యజ్ఞానానందాత్మక శివరూపము. అని వేమనయోగి మాటిమాటికి తనపద్యములయం దుదహరించెను. మంగళపదపర్యాయశివశబ్దవ్యాప్తిచే జాతిమతములకు నతీతుడగు వేమనయోగిని శైవమతస్థుఁడని తదితరులు కొందఱు నిందించుటయుఁగలదు. ఫలాపేక్షలేక పరసంతుష్టి నుద్దేశింపక పరాభిప్రాయదాస్యమవలంబింపక అస్థిరమగు బాహ్యసౌఖ్యముల నధిగమించి శాశ్వతాంతర సౌఖ్యమేవాంఛించి ఆధ్యాత్మికగీతికల నాలపించు కవికోకిలకు లోకకృత దూషణ భూషణాదుల ప్రసక్తియేమి ?

723 మానినీమనోజమందిరానందైక, లోలుఁ డొల్లఁ డూర్ధ్వలోకసుఖము
మాలవాడకుక్క మఱి యన్న మెఱుఁగునా?, విశ్వదాభిరామ వినురవేమ॥
నేచ్ఛే ద్వేమాంగనానంగగేహానందైకలంపటః ।
ఊర్ధ్వలోకం కథం శ్వాఽన్నం వేత్తి? చండాలవాటగః ॥

తా॥ మాలపల్లెలో మాంసము మరిగినకుక్క యన్న మెఱుఁగనట్లు స్త్రీమర్మావయవసుఖము మరిగిన పామరుఁడు బ్రహ్మలోకసుఖ మెఱుంగఁజాలఁడు. (వి) కామార్తాహి ప్రకృతికృపణా శ్చేతనాచేతనేషు॥

724 ఎంతభూమిఁదిరిగి యేపాటుఁబడుచున్న, నంటనీక ప్రాప్తివెంటఁదిరుగు
భూమిఁ క్రొత్తదైన భుక్తులుఁ క్రొత్తలా?, విశ్వదాభిరామ వినురవేమ॥
వేమాటిత్వా సర్వభూమిం యతతోఽపి నరస్య చ ।
ఫలం ప్రాప్త్యనుసారం భూః నవాప్యేవం న భుక్తయః ॥

తా॥ ఎక్కడెక్కడతిరిగి యే పాట్లుపడినను దన కెంతప్రాప్తియో యంత యే లభించును. ప్రదేశము పని వేఱయినమాత్రమునఁ బ్రాప్తికి మార్పురాదు (వి) కూపే పశ్య పయోనిధావపి ఘటో గృహ్ణాతి తుల్యం జలమ్॥ (భర్తృ)అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్, జ్ఞానోదయాత్ పురారబ్ధం కర్మ జ్ఞానా న్న నశ్యతి. అదత్త్వా స్వఫలం లక్ష్యముద్దిశ్యోత్సృష్టబాణవత్. వ్యాఘ్రబుద్ధ్యా వినిర్ముక్తో బాణః పశ్చాత్తు గోమతౌ, న తిష్ఠతి ఛినత్త్యేవ లక్ష్యం వేగేన నిర్భరమ్.

725 మనసు నిల్పలేని మాయవిరక్తులు, మనసుపడుదు రొక్కమగువమీఁద
ఇట్టివ్యర్థజన్మ మీబ్రతుకేటికి?, విశ్వదాభిరామ వినురవేమ॥
ధృత్వా కపటవైరాగ్య మసంయతమనా నరః ।
వేమ! కాంక్షతి తన్వంగీం వృథేదృగ్జన్మ జీవితమ్ ॥

తా॥ మనసు నిల్పలేని మాయవిరాగులు మగువనుజూచినంతన మక్కువఁగనపరతురు. అట్టి వ్యర్థజన్ముల బ్రతుకులేటికి? (వి) కోవా మహాంధో? మదనాతురో యః. 2 శూరాన్మహాశూరతమోఽస్తి కో వా? మనోజబాణైః వ్యథితో న యస్తు. 3 ప్రాజ్ఞోఽథ ధీరశ్చ సమస్తు కో వా? ప్రాప్తో న మోహం లలనాకటాక్షైః॥

726 కాశినీళ్ళుమోసి కాళ్ళుమొగముదాచి, యెందుసుఖములేక యెండియెండి
చచ్చివెనుక ముక్తి సాధింపఁగలరా!, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమాతిక్లాన్తదేహేన ధృత్వా కాశీజలం నర ।
అసుఖ శ్శుష్కసర్వాంగో మృతో ముక్తిం లభేత కిమ్?॥

తా॥ కాశీగంగ మోసిమోసి కాళ్లుమొగము వాచివాచి యెందునను సుఖముఁగాంచక యెండియెండి చచ్చినపిమ్మట మోక్షముసాధించునా?

727 చదువుఁజదువనేల? సన్యాసికానేల?, షణ్మతములఁజిక్కి చావనేల?
హరుని భజనఁజేసి యాత్మలోఁదెలియుఁడీ, విశ్వదాభిరామ వినురవేమ॥

కిం వేదాధ్యయనేన స్యాత్ ? కిం పరివ్రజనేన చ ? ।
కిం వేమ । షణ్మతగ్లాన్యా ? జానీ తాత్మని తం శివమ్ ॥

తా॥ చదువుఁజదువుట సన్న్యాసియగుట షణ్మతములఁజిక్కి చచ్చుట యెందులకు? ఆత్మయందలి పరమేశ్వరుఁదెలిసికొని భజించి తరింపుఁడు.
(వి) కోలాభ? ఆత్మావగమోహి యో వై ॥ (శం।మణి)

728 మనసులోనఁబుట్టు మతికోర్కులన్నియుఁ, గోర్కులందు ముక్తి కుదుటఁబడదు
మనము బ్రహ్మమనుచు మది నెఱుంగఁగలేరు, విశ్వదాభిరామ వినురవేమ॥

వాంఛా మనసి జాయంతే న ముక్తి స్తాసు విద్యతే ।
మనో బ్రహ్మేత్యజానంతో వేమ! ముహ్యంతి మానవాః ॥

తా॥ అపరిశుద్ధమనస్సునందే కోరికలు పుట్టును. కోరికల ముక్తిరాదు. పరిశుద్ధమనస్సే బ్రహ్మస్వరూపమని తెలియఁజాలకున్నారు.

729 చదువులన్ని చదివి చాలవివేకింపఁ, గపటికెన్న నేల కలుగు ముక్తి?
దాలిగుంటకుక్క తలఁచినచందంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

అధీతాఖిలశాస్త్రోఽపి ముక్తిం న లభతే ఖలః ।
యథా హసంత్యాం శయితః స్మరే చ్ఛ్వా వేమ! తత్తథా॥

తా॥ దాయిలగుంటఁ గుక్కయాలోచనవలెఁ గపటాత్ముఁ డెంతచదివి వివేకియైనను ముక్తిఁగాంచలేఁడు.

730 తల్లికడుపునుండి తాఁబుట్టినప్పుడు, మొదటబట్టలేదు తుదినిలేదు
నడుమ బట్టఁగట్ట నగుబాటుకాదొకో!, విశ్వదాభిరామ వినురవేమ॥

మాతృగర్భచ్యుతస్యాస్తి నాదావంతేపి చాంబరమ్।
మధ్యకాలే ధృతే వస్త్రే వేమ! హాస్యాస్పదం హి తత్॥

తా॥ తల్లికడుపునుండి పుట్టునపుడుకాని చచ్చునపుడుకాని బట్ట యుండదు. మొదటఁ జివర లేనిబట్ట మధ్యను నగుబాటుకాదా?

731 సొమ్ముఁ గనెడిదనక జ్యోతి కావలెఁగాని, సొమ్ముఁగన్న వెనక జ్యోతియేల?
దేవుఁడైన వెనక దేహంబుచిక్కేల?, విశ్వదాభిరామ వినురవేమ॥

యావత్స్వం వేమ! నేక్షేత తావజ్జ్యోతిః ప్రయోజనమ్।
దృష్టే ద్రవ్యే జ్యోతిషా కిం? వపుషా కి మధీశ్వరే?॥

తా॥ వెదకుసొమ్ము కనఁబడువరకే దీపపుటవసరముకాని పిమ్మట దాని యవసరమేమి? అట్లే తానె దైవస్వరూపమని తెలిసినపిమ్మట దేహపు తగులాటముతోను బనియుండదు.(వి)ఉల్కాహస్తో యథా కశ్చిద్ద్రవ్యమాలోక్య తాం త్యజేత్,జ్ఞానేన జ్ఞేయమాలోక్య జ్ఞానం పశ్చాత్పరిత్యజేత్॥

732 బయలు బ్రహ్మమనుచు భాషించుచుందురు, బయలదేల తాను బ్రహ్మమగును?
బ్రహ్మమైనబయలు భావమందుండఁగా, విశ్వదాభిరామ వినురవేమ॥

ఖం బ్రహ్మేతి వదం త్యేకే కథం బ్రహ్మ భవేన్నభః?
నిత్యశో వేమ! భావే తు ఖాకారే బ్రహ్మణి స్థితే॥

తా॥ హృదయకుహరమందలి శబ్దగుణకముకాని చిదాకాశమగు బట్టబయలు బ్రహ్మస్వరూపముకాని కొంద ఱజ్ఞానులు పలికిన ట్లీశబ్దగుణకమగు బట్టబయ లెట్లు పరబ్రహ్మము కాఁగలదు?

733 ఎండ నీడ చంద మెఱుఁగనేర్చినవాఁడు, ఉండు నెల్లకాల మొక్కచోట
తిండిపోతుయోగి తిరుగుచునుండురా, విశ్వదాభిరామ వినురవేమ॥

ఆతపచ్ఛాయయో రీతిం జ్ఞాతుం శక్నోతి యో భువి।
తిష్ఠే దేకత్ర వేమేహ భ్రమే త్కుక్షింభరి ర్యతిః॥

తా॥ ఎండకు నీడకుఁ గష్టసుఖములకుఁ దట్టుకొను ద్వంద్వసహిష్ణుఁడగు యోగి యెప్పుడు నొకే చోట నుండును. తిండిపోతుయోగియే సుఖము కొఱఁది తిరుగుచుండును.

734 కర్మగుణములన్ని కడఁబెట్టినదువమిఁ, దత్త్వవేత్త తన్నుఁ దగులుకొనును
నూనెలేక దివ్వె నూవులవెల్గునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

యది కర్మగుణాతీతో న చరే త్తత్త్వవి త్కథమ్?।
భవే త్తైలం వినా వేమ! దీపో జ్వలతి కిం తిలైః?॥

తా॥ నూనెవలన దీపము వెలుఁగును. కాని నువ్వులవలన వెలుఁగదు. అట్లే కర్మ గుణము వీని కతీతుఁడై చరించినఁగాని తత్త్వవేత్తకాఁజాలఁడు, (వి) కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః॥

735 గ్రుడ్డువచ్చి పిల్లఁ గోరడాలాడిన, విధముగా నెఱుఁగక వెఱ్ఱిజనులు
జ్ఞానులైనవారి గర్హింతు రూరక, విశ్వదాభిరామ వినురవేమ॥

శాబాపహాసకార్యండ మివ మూర్ఖజనా స్సదా।
అజానంత స్సతాం శక్తిం వేమ! గర్హంతి కేవలమ్॥

తా॥ గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినట్లు మూర్ఖులు జ్ఞానుల నిందింతురు.

736 ఒడల బూదిఁబూసి జడలు ధరించిన, నొడయుఁడగును ముక్తిఁ బడయుఁడేఁడు
తడకబిఱ్ఱువెటఁ దలుపుతో సరియౌనె?, విశ్వదాభిరామ వినురవేమ॥

భూతిం లిప్త్వా జటా ధృత్వా వేమ! వేషధరో భవేత్।
నాప్నోతి ముక్తిం సంబద్ధః కటో నైతి కవాటతామ్॥

తా॥ తడక కెంత బిఱ్ఱుఁబెట్టినను దలుపుతో సరికానట్లు శరీరమునకు బూడిదఁబూసి జడలు ధరించినమాత్రమున యోగిగాఁ జెల్లుబడి యగును. కాని ముక్తినిఁబొందలేఁడు. (వి) కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్.ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే॥

737 రమ్యమైనమనసు రాజనియెంచుచు గమ్యముగను దానిగట్టుటెఱిఁగి
మఱిగి పూర్ణపదవి మహిలోనఁగానరా, విశ్వదాభిరామ వినురవేమ॥

నిగృహీతం మనో వేమ! ప్రధానమితి భావయన్।
తన్నిగ్రహవిధిజ్ఞ స్త్వం పూర్ణం పద మవాప్నుహి॥

తా॥ మనస్సే ముక్తికి మంచి సాధనమని దానిని లోఁబరచుకొను విధాన మెఱిఁగి యుండే బ్రహ్మపదవినిఁ బొంది యానందించుము.

738 ఆత్మలోనిసొమ్ము నంజనమునఁజూచి, యంటితిరుగునట్టి యతఁడు యోగి
పుంజు గూటనుండి ప్రొద్దతెంగియుఁ గూయు, విశ్వదాభిరామ వినురవేమ॥

అంజనే నాత్మని ద్రవ్యం దృష్ట్వా యో వేమ! వర్తతే।
స యోగీ కాలవి న్నిడే కుక్కుటః ఖలు కూజతి ॥

తా॥ కోడిపుంజు గూటియందుండే కాలమునుగుర్తించి కూయునట్లు తనయందలి బ్రహ్మపదార్థమును జ్ఞాననేత్రమునఁగాంచి యందైక్య భావము యోగి పొందుచున్నాఁడు.

739 ఋషు లెఱుంగనట్టి విషయంబు భువిలేదు, వారుచెప్పినంత వరుసనగును
తెలియ కనెడివారు దేబెలు నిజమయా, విశ్వదాభిరామ వినురవేమ॥

ఋషిభి శ్చానభిజ్ఞాతో విశేషో నాస్తి భూతలే।
అర్థోఽనువర్తతే తేషాం వాచం వేమేతరే జడాః॥

తా॥ ఆధ్యాత్మికదృష్టిగల మహర్షులకుఁ దెలియని దేదియు నుండదు. వారుచెప్పిన దంతయుఁ గ్రమమున నగును. అజ్ఞానులమాటలేమియు జరుగునవి కావు. (వి) ఋషీణాం పునరాద్యానాం వాచ మర్థోనువర్తతే, లౌకికానాం హి సాధూనాం అర్థం వాగనువర్తతే॥

740 టిప్పణములఁజేసి చప్పనిమాటలఁ జెప్పుచుందు రన్నిస్మృతుల శ్రుతుల
విప్పిచెప్పరేల వేదాంతసారంబు?, విశ్వదాభిరామ వినురవేమ॥

శ్రుతిస్మృతీతిహాసానాం టీకాం కుర్వంతి నీరసామ్।
వేదాంతసారం విస్మృత్య వేమేహ న వదంతి కిమ్?॥

తా॥ శ్రుతిస్మృతీతిహాసముల విమర్శించి యందలి చప్పనిమాటల మాత్రము చెప్పుదురు. కాని యందలి వేదాంతసార మేల విప్పిచెప్పరో!

741 కుండ కుంభమన్నఁ గొండ పర్వతమన్న, ఉప్పు లవణమన్న నొకటికాదె?
భాష లిట్లె వేఱు పరతత్త్వమొక్కటే, విశ్వదాభిరామ వినురవేమ॥

కుంభః కుండేతి వేమాద్రిః కొండేతి లవణం తథా।
ఉప్పిత్యుక్తి స్సమా తత్త్వ మేకం భాషా స్తు భిన్నధా॥

తా॥ కుండను కుంభమన్నను, కొండను పర్వతమన్నను, ఉప్పును లవణమన్నను నొకటే. ఇట్లే భాషలు వేఱు కాని పదార్థమొక్కటియే.

742 చెఱకుతోటలోనఁ జెత్తకుప్పుండినఁ, గొంచెమైన దాని గుణముచెడదు
ఎఱుక కలుగుచోట నెవ్వాఁడున్నట్లు, విశ్వదాభిరామ వినురవేమ॥

యద్వ త్స్వపకరస్యేషు వసే న్నిక్త స్న తద్రసః।
అస్తు వేమ! స్థితే ప్రాంతే యథా జ్ఞానం వివేకినః॥

తా॥ చెత్తకుప్పవలనఁ జెఱకు తీపికి భంగము కలుగనట్లు జడుని సామీప్యమున జ్ఞాని జ్ఞానమున కేమియు భంగము వాటిల్లనేరదు.

743 చదువరిమతికన్న సాధకునిమతి మేలు, వేదములను లేదు వాదములను
ఒడలు శుద్ధిఁజేసి యొడయనిఁజూడనౌ, విశ్వదాభిరామ వినురవేమ॥

పాఠకస్య మతే ర్వేమ! సాధకస్య మతి ర్వరమ్।
వేదై ర్వాదై శ్చ కిం? దేహశుద్ధ్యా పశ్యేత్పరం ప్రభుమ్॥

తా॥ వేదములను జదివినఁ దర్కవాదముల ఘనుఁడైన నట్టి చదువరి మతికన్న సాధకుని మతి మేలు. అనుభవజ్ఞానము దొడ్డది. కాన ఉపాధి పరిశుద్ధపఱచి యందలి ప్రభువును గాంచుము.

744 జీవభేదమెఱిఁగి చెడిపోనివారలు, బ్రహ్మభావమొంది పరగుచుంద్రు
నీరు ముత్యమైన నీరుగా మాఱునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ! జ్ఞాత్వా జీవభేద మనష్టా బ్రహ్మతాం గతాః।
రాజంతే స్వాత్కి మంబ్వాద్యా మౌక్తికీభూతవాః పునః॥

తా॥ నీరు ముత్యముగా మారును. కాని ముత్యము నీరుగామారదు. అట్లే బ్రహ్మభావముఁబొందిన జీవి మఱల జీవభావము నొందదు.

745 ఆఱుదూలములకు నాధారమైనట్టి, యొంటికంబమింటి నొనరనిల్పి
యింటికొకఁడు కర్త యేపారుచుండును, విశ్వదాభిరామ వినురవేమ॥

షట్స్థూణసుదృఢాధారం స్థాప్యైకస్తంభ మందిరమ్।
మందిరస్య స్వయంకర్తా వేమైకో భువి రాజతే॥

తా॥ పరమాత్మ ఆధారాది షట్చక్రములనెడు నాఱు దూలములకు నాధారమైన వెన్నెముకయను నొంటిస్తంభముకల ప్రతి యింటిలోను నింటికొక యజమానిగా వ్యవహరింపఁ బడుచుండెను.

746 ఆదిఁజూచుచుండ నన్నిటఁదానుండు, నాదిఁజూడ నెవరికలవికాదు
ఆదిముక్తి తెరు వదాత్మ నేయుండును, విశ్వదాభిరామ వినురవేమ॥

ఆదౌ దృష్టే స్వయం వేమ! సర్వత్రాస్తే తదాది చ।
ద్రష్టుం కోఽపి న శక్నోతి స్యాన్ముక్తిపథ ఆత్మని ॥

తా॥ ఆదిఁజూడ సన్నిటఁ దానె యుండును. కాని యా యాదిఁజూడ నెవరికిని నలవి కాకున్నది. అట్టి యాదిముక్తిమార్గ మాత్మయందే కలదు.

747 ఇహమున సుఖియింప హేమకారకవిద్య, పరమున సుఖియింప బ్రహ్మవిద్య
కడమ విద్యలెల్లఁ గన నిష్ఫలంబులే, విశ్వదాభిరామ వినురవేమ॥

స్వర్ణవిద్యేహ సుఖదం బ్రహ్మవిద్యా పరత్రచ।
తదన్యవిద్యా స్సకలా నిష్ఫలా వేమ! చింతయ ॥

తా॥ ఇహమున సుఖించుటకు ధనసంపాదనవిద్య. పరమున సుఖించుటకు బ్రహ్మవిద్య. మిగిలిన విద్యలన్నియు నిష్ఫలములైనవే.

748 పిల్లి యెలుకఁబట్టి ప్రియమున నుండక, యదియె కోడిఁబట్ట ననుగమించు
మమత విడువకున్న మతి మోక్ష మబ్బునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమాఖుగ్రాహ మార్జారో న హి తృప్యతి ।
కుక్కుటగ్రహణాపేక్షీ కుతో ముక్తి స్స్పృహావతః? ॥

తా॥ పిల్లి యెలుకను బట్టుకొని తృప్తినొందక కోడిపైకి దుముకును. ఇట్లే యొకదానివెంబడి మఱియొక దానిపై నాశపడుచుండు నిఁక మోక్ష మెట్లబ్బును?

749 తరుణి సుతులు ధనము ధాన్యముల్ సంపద, లెంతచుట్టుకొనిన నంతచేటు
పసిరికాయపురుగుపద్ధతి కానంగ, విశ్వదాభిరామ వినురవేమ॥

దారాపత్యార్థధాన్యాది సంపద్వ్యాప్నోతి యావతీ।
కార్పాసకీటకస్యేవ వ్యథా వేమాస్య తావతీ॥

తా॥ భార్య, పిల్లలు, ధనము, ధాన్యము ఇట్టి సంపద లెంతచుట్టుకొనిన నజ్ఞాని పసిరికాయ పురుగువలె నంత కష్ట మనుభవించును.

750 తెవులుపడ్డవాఁడు దేవతాభక్తుండు, ఈటెలేనివాఁడు పోటుబంటు
కానులేనివాఁడు కడుబ్రహ్మచారియా, విశ్వదాభిరామ వినురవేమ॥

రోగార్తో దేవతాభక్తో నిరాయుధ శ్శూరవ్రతః ।
బ్రహ్మచారీ భవే ద్వేమ ! విత్తహీనో జనో భువి ॥

తా॥ చేత నాయుధము లేనప్పుడు యుద్ధభటుఁడుగ, రోగములోఁ దీఁ కొనునప్పుడు దేవతాభక్తుఁడుగ, దరిద్రముచే నెవరును పిల్లనీయనపుడు బ్రహ్మచారిగ మాట్లాడవచ్చును.

751 ఆదికారణమును నల్పుఁ డెట్టు లెఱుంగుఁ?, జెప్పలేఁడు కాని తప్పుఁబట్టు
తోయ నేర్చుకుక్క దొంతులఁ బేర్చునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

కథం నిదానం వేత్త్యల్పో వక్తుం నార్హతి దోషదృక్ ।
శ్వా పాతయతి కుంభౌఘం వేమ ! నాలం తథా కృతౌ ॥

తా॥ ఆదికారణమును నల్పుఁ డెట్లెఱుంగఁగలఁడు ? తాను జెప్పలేక పోయినను దప్పులమాత్రము పట్టుకొనుటకుఁ బ్రయత్నించును. కుక్క కుండలదొంతరలను బడఁగొట్టఁగలదు. కాని పేర్చఁగలదా? (వి) విద్యా వివాదాయ ధనం మదాయ శక్తిః పరేషాం పరిపీడనాయ, ఖలస్య సాధో ర్విపరీతమేతత్ జ్ఞానాయ దానాయ చ రక్షణాయ॥

752 అంతరంగమందు నపరాధములఁ జేసి, మంచివానివలెనె మనుజుఁడుండు
ఇతరు లెఱుఁగకున్న నీశ్వరుఁ డెఱుఁగఁడా?, విశ్వదాభిరామ వినురవేమ॥

పరోఽపరాధం పాపిష్ఠః ప్రచ్ఛన్నే సాధువచ్చరేత్ ।
యద్యన్యే న హి జానంతి వేమ ! కిం వేత్తి నేశ్వరః? ॥

తా॥ చాటున నపరాధములఁ జేసి మంచివానివలె దుష్టుఁడు పైకిఁ గన బడును. వాని దోషములు నిరు లెఱుంగకున్న నారాయణుఁ డెఱుఁగఁడా?

753 నిజమువరుస నెఱిఁగి నిర్గుణత్వంబంది, పలుకులోని యర్థ మలరఁ దెలిసి
పలుకకుండువాఁడె పరమాత్మయగునురా, విశ్వదాభిరామ వినురవేమ॥

క్రమం తత్త్వస్య విజ్ఞాయ వేమ ! నైర్గుణ్యా మాస్థితః ।
శబ్దార్థజ్ఞోఽపి యో మౌనీ పరాత్మేతి స కథ్యతే ॥

తా॥ నిత్యానిత్యము లెఱింగి సత్యాసత్యములఁ దెలిసికొని సుగుణ దుర్గుణ పద్ధతుల గమనించి భాషాభావముల గుర్తించి ఋజుత్వమున నూరకుండువాఁడె పరమాత్మ స్వరూపుఁడగును.

754 నిజముదెలిసియున్న సుజనుఁడానిజమునె, పలుకవలయుఁగాని పరులకొఱకు
దాపఁగూడ దింక నోప దన్యముఁబల్క, విశ్వదాభిరామ వినురవేమ॥

సత్యజ్ఞ స్సుజనో వేమ ! పరేభ్యస్తద్వృతం వదేత్ ।
న గోపయే త్కించిదపి నాపరం చ వదే ద్వచః ॥

తా॥ సత్పురుషుఁడు తనకుఁదెలిసిన నిజమును బలుకవలయును. కాని పరులకొఱకు దాపఁగూడదు. మఱియొక విధమునఁ బలుకఁగూడదు.

755 తల్లి పార్వతియగుఁ దండ్రియే శంభుండు, ప్రమథగణము లఖిలబంధువితతి
తనకుఁబుట్టినిల్లు తనరఁ గైలాసంబె, విశ్వదాభిరామ వినురవేమ॥

జననీ పార్వతీదేవీ జనకః పరమేశ్వరః ।
బాంధవా స్తద్గణా వేమ ! కైలాసో జన్మభూ ర్ధ్రువమ్ ॥

తా॥ ప్రకృతి, పురుషు లగు పార్వతీ పరమేశ్వరులే తల్లిదండ్రులు. ప్రమథగణములే బంధువులు. తన జన్మస్థలమే కైలాసము. (విశ్వము) (వి) ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి। వికారాం శ్చ గుణాం శ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్ (గీత).

756 తనువు నస్థిరమని ధనము నస్థిరమని, తెలుపనేర్చి తాను దెలియనేర్చి
పాత్రుఁడైనయోగి పరమాత్మయేసుమీ, విశ్వదాభిరామ వినురవేమ॥

అస్థిరం తనువిత్తాదిసర్వం చేతి స్వయం విదన్ ।
పరాన్ బోధతి యో వేమ! పరమాత్మా స సంయమీ ॥

తా॥ తనువు ధనము అస్థిరములని తాను దెలిసికొని యితరులకుఁ దెలుపనేర్చిన పాత్రుఁడగు యోగియే పరమాత్మస్వరూపుఁడు. (వి)జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ, అద్యావాఽబ్దశతాంతే వా మృత్యురేవ ప్రాణినాం ధ్రువః ॥

157 బ్రహ్మనుదలగొట్టి పాఱవైచినయప్పు, డడ్డుపడఁగ నోపరైరి సురలు
శివునికరుణలేమిఁ జెడిపోక పోదురా, విశ్వదాభిరామ వినురవేమ॥

మూర్ధని బ్రహ్మణ శ్ఛిత్వా విక్షిప్తే వేమ ! దేవతాః ।
రోద్ధుం న శేకు ర్నాశం హి యాంతీశస్య కృపాం వినా ॥

తా॥ శివుఁడు బ్రహ్మకపాలముఁగొట్టి పాఱవైచునప్పుడు దేవతలెవరును గాపాడలేకపోయిరి. శివుని దయలేనప్పుడెవరైననేమి ? చెడిపోకపోదురా?

758 బిడియ మింతలేక పెద్దనుసేనంచుఁ, బొంకములను బలుక్క సంకరునకు
హెచ్చు కలుగ దిచట చచ్చినరాదట, విశ్వదాభిరామ వినురవేమ॥

ఆఢ్యోహమితి యో వక్తి నిర్లజ్జం దుర్వికత్థనమ్ ।
తం యాతి నేహాభ్యుదయః పరత్ర చ మృతిం గతమ్ ॥

తా॥ సిగ్గులేక చెడుపనులఁ జేయుచు సలుప్పరిలోఁ బొంకముగా మాట్లాడు సంకరునకు నిచ్చటనేమియు గౌరవము హెచ్చుకలుగదు. చచ్చిన నచ్చటనేమియు సుఖమురాదు.

759 నీవు పలుకుచున్న నిత్యపూజితుఁడౌను, నీవు పలుకకున్న నిద్రపోవు
నీవు పలుకుపలుకు నిర్మలుండెఱుఁగురా, విశ్వదాభిరామ వినురవేమ॥

త్వయి బ్రువతి వేమేహ మానవో నిత్యపూజితః ।
త్వ య్యబ్రువతి నిద్రాళుః త్వదుక్తిం వేత్తి నిర్మలః ॥

తా॥ నీవు లోనఁబలుకుచున్న వ్యక్తి నిత్యపూజితుఁడగును. లేకున్న నొకచో నిద్రఁబోవుచుండును. నీవు పలుకుఁ బలుకు నిర్మలునకుఁగాని తెలియఁబడదు. (వి) ఓమ్ తత్సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్, (గాయత్రి) యః నః ధియః ప్రచో దయాత్ తత్సవితుః దేవస్య వరేణ్యం భర్గః ధీమహి (భాష్యం)

760 కొంపలోనమఱుఁగు కోకలోనమఱుఁగు, కన్నతల్లిమఱుఁగు కడుపుమఱుఁగు
ఇన్నిమఱుఁగులందు నీకుండు మఱుఁగయా, విశ్వదాభిరామ వినురవేమ॥

యథా మర్మ గృహే వేమ! వస్త్రే కుక్షౌ చ మాతరి ।
వేత్తుం శక్య స్తథా మర్త్యో న స్యా దీశ్వరమర్మవిత్ ॥

తా॥ కొంప (దేహము) లోని మఱుఁగు, కోకలోని మఱుఁగు, కన్న తల్లి మఱుఁగులందు భగవంతుని మఱుఁగుఁ దెలిసికొనుట కష్టతరమైనది.

761 కావిబట్టఁ గట్టి ఘనయోగివలెనుండి, కలయ రాత్రిగాఁగ విడిచిపెట్టి
తొడరి తిరుగువాఁడు దొంగసన్న్యాసయా, విశ్వదాభిరామ వినురవేమ॥

ఆంధ్ర ప్రదేశమున సంస్కృతాంధ్రభాషల పాండిత్యము నార్జించి భక్తిజ్ఞానముల ఘనులై ప్రశస్తపదపద్యకవిత్వములఁ దాము తరించి లోకమును తరింపఁజేయ సూక్తిబీజముల వెదజల్లిన మహనీయులు త్యాగయవేమననామధేయులేయని యందఱకుఁదెలిసినదే. త్యాగయనారదాంశసంభూతుఁడనియు వేమన సనత్కుమారాంశసంభూతుఁడనియుఁ బ్రతీతియుఁగలదు. మహాత్ముఁడగుత్యాగయ్య పదసాహిత్యము కేవలగానరసపిపాసువులగు గాయకజనులచే నపభ్రంశముగాగ నేటి సంస్కృతాంధ్ర భాషావేత్తలు దానిని నిర్దుష్టపరుప సర్వోపనిషత్సారమని వెల్లడియైనది. పదసంఖ్యయు 16 వేలకుమించి లభ్యమైనది. వేమనయోగిపద్యసాహిత్యమును ఆ విధముననే అపభ్రంశముచెందిన దాయెను. క్రీ॥ శ॥ 1825 సం॥ మొదలుకొని మహనీయుల మహత్తరకృషిచే వేమనయోగియుఁ గవిగా పండితుఁడుగా లోకమునకుఁ బరిచితుఁడాయెను. వేమనకవిపద్యములును ద్రావిడ, కర్ణాటక, ఆంగ్ల, ప్రష్యాదిభాషల ననువదింపఁబడెను. శ్రీయుతులు సి. పి. బ్రౌణ్, క్యాంబిల్, మాక్లిన్ త్యాగరాయశెట్టికంపెనీ, వావిళ్ళకంపెనీ, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, వెంకటపార్వతీశ్వరకవులు, వరదాచార్యులు, వంగూరి సుబ్బారావు, కట్టమంచి రామలింగారెడ్డి, కూర్మా వెంకటరెడ్డినాయుడు, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ మొదలగు ఆంధ్ర భాషాభిమానుల మహత్తరకృషిచే వేమనకవి సాహితీమహిమ మన దృష్టిపథమును పొందెను. వేమనపద్యములును 5 వేలకు మించి లభ్యమైనవి. వ్యావహారికమున వెల్లడించిన మహాత్ములవాక్యములు సంస్కృతభాష ననువదింపఁబడి గౌరవముఁ గాంచుచున్నవి. అందువలన వేమనపద్యములయందలి యొక్కొక్కవేయియు సంస్కరించి సంస్కృతభాషలో ననుష్టుప్ఛందస్సునఁ బ్రకటించుటకు మాకు సంకల్పము కలిగినది. దానిననుసరించి "వేమగీతా" ప్రథమసహస్రము ప్రకటించి బుధవరేణ్యుల కర్పించుచున్నారము. ఈ ప్రథమసహస్ర పద్యములకు శ్రీ వావిళ్ళ ముద్రణాలయ ప్రచురితగ్రంథమే మాతృకగా గ్రహింపఁ

ధృత్వా కాషాయవసనం స్థిత్వా యోగీవ యః పుమాన్।
రాత్రౌ త్యక్త్వా చరే ద్వేమ! ఛద్మయోగీ స కథ్యతే॥

తా॥ పగలు కాషాయవస్త్రములు రాత్రులు తుంటరివేషములు వేసి తిరుగువాఁడు దొంగసన్యాసి.

762 విద్యకలిగియుండి వినయంబులేకున్న, సైదువలకు మేలిమైన మణులు
సొమ్ములుండి కంఠసూత్రము లేనట్లె, విశ్వదాభిరామ వినురవేమ॥

రత్నభూషాన్వితా వేమ! కంఠసూత్రం వినా సతీ।
నాభాతి హి తథా దుష్టో విద్యాఢ్యోఽపి న శోభతే॥

తా॥ పుణ్యస్త్రీలకు నన్నియాభరణములుండియు మంగళసూత్రము లేకున్న నెట్లో యట్లే యెన్నిచదువులు చదివినను వినయములేకున్న నిష్ప్రయోజనము.

763 దానములను నన్నదానమే దొడ్డది, గానములను సామగాన మెచ్చు
ధ్యానములను శివునిధ్యానమే శ్రేష్ఠంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ! దానేషు సర్వేషు చాన్నదానం మహాధికమ్।
గానేషు సామగానం చ ధ్యానం ధ్యానేషు శూలినః॥

తా॥ దానములలో నన్నదానము, గానములలో సామగానము, ధ్యానములలోఁ బరమేశ్వరధ్యానము ముఖ్యమైనవి.

764 ఊకయందుఁ బుట్టియున్నది యన్నంబు, మ్రాఁకునందు ఫలము మానితమగు
సోకుగాలిఁబట్టి శోధింప మతి ముక్తి, విశ్వదాభిరామ వినురవేమ॥

తుషాయా మస్తి వేమాన్నం ద్రుమే చ మధురం ఫలమ్।
శోధితే మారుతే సమ్యక్ ముక్తిశ్చ పరిలభ్యతే॥

తా॥ ఊకలో నన్నమును ద్రమానులో ఫలమును శ్వాసవాయు సాధకములో ముక్తియుఁ గలదు. (వి) ప్రాణాంతే వసతి ర్మనః॥

665 పరులవిత్తమందు భ్రాంతిమానినయట్టి, పురుషుఁ డవనిలోనఁ బుణ్యమూర్తి
పరులవిత్త మరయఁ బాపసంచితమగు, విశ్వదాభిరామ వినురవేమ॥

పరద్రవ్యేషు యస్తృష్ణాం జహాతి స హి పుణ్యవాన్।
విత్తం పరేషాం వేమోర్వ్యాం బహుధా పాపసంచితమ్॥

తా॥ ఇతరుల సొత్తునందు భ్రాంతిలేనివాఁడే పుణ్యాత్ముఁడు. పరుల సొత్తు నపహరించుట పాపసంచితమే.

766 పత్తనంబులఁగల ప్రౌఢాంగనలుమతి, పల్లెలందు నిల్చి బ్రతుకఁగలరె?
సుఖులు పరముదారి శోభింపఁజాలరు, విశ్వదాభిరామ వినురవేమ॥

ప్రౌఢాంగనా నాగరికాః పల్ల్యాం శక్తా న జీవితుమ్।
తథా వేమాత్మమార్గే చ న శోభంతే హి భోగినః॥

తా॥ పట్టణవాసస్త్రీలు పల్లెల నిల్వలేరు. అట్లే సుఖులు పరమాత్మ మార్గముఁ బట్టలేరు.

767 తల్లిదండ్రులందు దారిద్ర్యయుతులందు, నమ్మిన నిరుపేదనరులయందుఁ
బ్రభులయందుఁ జాల భయభక్తు లుంచుము, విశ్వదాభిరామ వినురవేమ॥

మాతాపిత్రో ర్దరిద్రేషు విస్రబ్ధేషు తథా నృషు।
వేమ! ప్రభుషు చాత్యంతం భయభక్తియుతో భవ॥

తా॥ తల్లిదండ్రులందు దీనులయందు నిన్నే నమ్ముకొనియున్న నిరుపేదలయందుఁ బ్రభువులయందు భయభక్తులు కలిగి మెలఁగుము.

768 యంత్రమంత్రమహిమ జాతవేదుఁడెఱుఁగు, మంత్రవాదియెఱుఁగుఁదంత్రమహిమ
తింత్రిణీకమహిమఁ దినువాఁడెఱుంగును, విశ్వదాభిరామ వినురవేమ॥

యంత్రమంత్రప్రథాం వేత్తి వహ్ని స్తంత్రప్రథాం తథా।
మంత్రవాదీ చ వేమైవం భోక్తా తింత్రిణికాప్రథామ్॥

తా॥ యంత్రముల మంత్రముల మహిమ యగ్నిహోత్రునకును తంత్రములమహిమ మంత్రవాదికిని, చింతపండుపులుపు తినువానికిఁ దెలియునట్లు బ్రహ్మానంద మనుభవించువానికే తెలియును.

769 అయినవారలంచు నాప్తులటంచును, బందుగులను నమ్మఁ బాడిగాదు
తనకునైనవాఁడు తానొకఁడేయగు, విశ్వదాభిరామ వినురవేమ॥

నాప్త స్సన్నిహిత శ్చేతి బంధుర్విస్రంభభాజనమ్।
బంధు రాత్మాత్మనశ్చైవ వేమాత్యంతం సమాహితః॥

తా॥ "నాకుఁ గావలసినవారు, ముఖ్యులు" అని బంధువుల నమ్మకు. మనకుఁగావలసినవాఁ డాభగవంతుఁ డొక్కఁడే.

770 సిగ్గు విడువకున్న శివసౌఖ్యమే లేదు, తగ్గిమొగ్గకున్న సిగ్గువిడదు
సిగ్గువిడచువాఁడె చిరకాలజీవిరా, విశ్వదాభిరామ వినురవేమ॥

నిర్వ్రీడో న శివానందీ దుర్వ్రీనీతో న నిస్త్రపః ।
లజ్జాం త్యజతి యో వేమ! చిరకాలం స జీవతి ॥

తా॥ అభిమానము చావకున్న దైవభక్తిసుఖములేదు, అణఁకువలేకున్న నభిమానము చావదు, అట్టి దురభిమానము పోయినవాఁడే చిరంజీవి.

771 సిగ్గుదాగు నెచటఁ జీఁకటి యెటదాగు, నాకలేడదాగు నాత్మలోన
దాగియున్న నిద్ర దాగుటఁదెలియుఁడీ, విశ్వదాభిరామ వినురవేమ॥

లజ్జా తమశ్ఛటా క్షుచ్చ గుప్తనిద్రాపి చాత్మని ।
వేమ! కుత్ర విలీయంతే సమ్యగ్జానీత తద్రహః ॥

తా॥ సిగ్గు (అభిమానము) చీకటి (అజ్ఞానము) ఆకలి నిద్ర యెక్కడ దాగి బహిర్గతమగుచున్నవో కనిపెట్టుఁడు.

772 వెతలఁదీర్చువాఁడు వేదాంతవేద్యుండు, రతులనేలువాఁడు రమణుఁడగును
సతినిఁబెనఁగువాఁడు సంసారయోగిరా, విశ్వదాభిరామ వినురవేమ॥

వేదాంతవేద్య స్స్యాద్వేమ! బహుధా నాశితవ్యథః ।
రతిఙ్ఞో రమణః కాంతాసక్త స్సంసారవాన్ యతిః ॥

తా॥ కామబంధనముల నారితేరినవాఁడు రసికుఁడు. స్త్రీతోఁగూడి యుండువాఁడు సంసారి. బాధలఁ బోఁద్రోలువాఁడు వేదాంతి.

773 భార్య తనదుపాలి భారపుసంకెల, చిన్నచిన్న శిశువు లెన్నచీల
లరయఁగఁ జెఱసాల యగును సంసారంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

సుదృఢా శృంఖలా భార్యా శిశవో వేమ! కీలకాః ।
కారాగారం చ సంసార మేవ మాత్మని చింతయ ॥

తా॥ భార్యయే బరువగుసంకెల. చిన్నచిన్నశిశువులే సంకెలకుఁదగిలించు చీలలు. సంసారమే చెఱసాల.

774 నాతిపైనప్రేమ నానాటికినిరోత, జ్యోతిపైనఁబ్రేమఁ జూడగాను
మాతృప్రేమయొకటె మర్యాదఁదాల్చును, విశ్వదాభిరామ వినురవేమ॥

ంగుప్స్రకారి కామిన్యాం ప్రేమ వేమ! దినేదినే ।
మాతరి జ్యోతిషి ప్రేమ సమం గౌరవదాయకమ్ ॥

తా॥ ఆత్మజ్యోతిపై ప్రేమకుదిరిన నానాటికి స్త్రీపై ప్రేమ రోత యనిపించును. ఎల్లప్పుడు గౌరవముఁ గల్గియుండునది మాతృప్రేమయే.

775 జ్ఞాతయైనవాని నేతగా భావించి, నీతు లెఱుఁగవలయు నియతిగలిగి
జ్ఞానులున్న లాభ మాను నే? తెలియుమి, విశ్వదాభిరామ వినురవేమ॥

జ్ఞాతారం వేమ! నేతారం మత్వా వినియతో నరః ।
నీతిం విద్యాత్ జ్ఞానిలాభే కిం ఫలం త్వ స్త్యవేదినః ॥

తా॥ తెలిసినవానివలన నియమముతో నీతుల గ్రహింపవలెను. అట్లు కాకున్న జ్ఞానులవలని లాభముఁ బోగొట్టుకున్నవారల మగుదుము. (వి)అపూజ్యా యత్ర పూజ్యంతే పూజ్యా శ్చై వావమానితాః, అయశో మహ దాప్నోతి ధనాద్ధర్మాచ్చ హీయతే॥

776 సిద్ధులైనవారి చిత్తంబు రంజిల్లు, నొడలిమెఱుఁగు లెక్కకిడరు గాన
పనసపండుఘనత పైనేమికలదయా, విశ్వదాభిరామ వినురవేమ॥

దేహద్యుతౌ న గణనా సిద్ధానాం మానసం తతః ।
రాజతే వేమోపరిష్టాత్ పనసస్యాస్తి కా ప్రథా ?॥

తా॥ పనసపండు గొప్పతనమంతయు లోపలనే యుండునట్లు సిద్ధులు శరీరము పై మెఱుగులు లెక్కసేయరు కాన వారి యంతఃకరణము పరిశుద్ధమై లోలోన శోభిల్లుచుండును.

777 సాధుజనులచెలిమి చాలింపఁగారాదు, ప్రకృతివిడకయున్న ఫలములేదు
పిండెఁగోసిచూడ బీజంబుఁ గల్గునా? విశ్వదాభిరామ వినురవేమ॥

న త్యాజ్యం సాధుసాంగత్యం వినా ప్రకృతివర్జనాత్ ।
న ఫలం వేమ! కిం బీజం ? స్యా చ్ఛలాటునికృంతనాత్॥

తా॥ పండనీక పిందెను గోసిచూచిన బీజము కనఁబడనట్లు సద్గోష్ఠివిడిచి ప్రాకృతులఁ (పామరుల) గూడియుండిన ఫలితమును గనఁబడదు. (వి) యద్య దాచరతే శ్రేష్ఠ స్తత్తదే వేతరోజనః, సయత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే॥ గీత। భాగ।

778 వెన్నఁ జేతఁబట్టి వివరంబుఁ దెలియక, ఘృతముఁ గోరునట్టి యతనిభంగిఁ,
దాను దైవమయ్యు దైవముఁ దలఁచును, విశ్వదాభిరామ వినురవేమ॥

నవనీతం కరే ధృత్వా ఘృతకాంక్షీ పుమానివ।
అన్యత్ర దైవం స్మరతి వేమ! దైవమపి స్వయమ్॥

తా॥ వెన్నఁ జేతఁ బెట్టుకొని దానివివరముఁ దెలియక నేతికై వెదకు వానివలె నజ్ఞాని తానే దైవమయ్యు దైవమును వెదకఁ దలఁచును.

779 విశ్వసింపఁదగిన వేషంబు మఱిలేదు, కుడువఁగూడుఁ గట్టఁ గోఁకలేదు.
విశ్వమయుఁడునైనవిభు నేలఁ దెలియఁడో। విశ్వదాభిరామ వినురవేమ॥

నచాస్తి వేషో విస్రభ్యో నాత్తుమన్నం న చాంబరమ్।
తథాపి కిం నవేత్త్యజ్ఞో వేమ! విశ్వమయం విభుమ్॥

తా॥ తనకొకనమ్మకమైన వేషము లేదు. తినుటకుఁ దిండి, కట్టుటకు బట్టయు లేదు. ఇట్టి పరిపూర్ణుఁ డంతటను నిండి కాపాడు ప్రభువగు భగవంతు నేల దలంపఁడో తెలియకున్నది.

780 విన్నవానికన్నఁ గన్నవాఁ డధికుండు, కన్నవానికన్నఁ గలియువాఁడు
నున్నతోన్నతుఁడయి యుర్విఁ జెలఁగుచుండు. విశ్వదాభిరామ వినురవేమ॥

శ్రోతుర్ద్రష్టాఽధికో వేమ! ద్రష్టుశ్చాపి సుసంగతః।
ఉన్నతాదున్నతో భూమౌ వేదం మిత్త్వః ప్రవర్తతే॥

తా॥ విన్నవానికన్నఁ జూచినవాఁడు, వానికన్నఁ గలిసినవాఁడు శ్రేష్ఠుఁడు.

781 రూపువంక పేరు రూఢిగా నిల్చును, పేరువంకఁ గ్రియలు పెరుగుచుండు
నాశమౌను తుదకు నామరూపక్రియల్, విశ్వదాభిరామ వినురవేమ॥

రూపపక్షే నామ వర్తం నామపక్షాశ్రితాః క్రియాః।
నామరూపక్రియాణాం తు నాశోఽంతే వేమ! సంభవేత్॥

తా॥ రూపమువలన నామము నామమువలనఁ గ్రియలును నేర్పడును. తుదకు నామరూపక్రియలు నశించి మూలపదార్థమే మిగులును.

782 రాజసంబుఁ గోరి రాజ్యభోగమునందు, నోర్పులేని యాతఁ డుభయుఁడౌను
నీటిపైన గుండు నిలుచునా? మునుఁగక, విశ్వదాభిరామ వినురవేమ॥

రజోవృతో రాజ్యభారే సక్త్యే దుభయతోఽఘమీ ।
జలస్యోపరి తిష్ఠే త్కిం? వేమాఽయోగోళకో మనాక్॥

తా॥ నీటిపై గుండు మునుఁగునట్లు రాజ్యపాలనమున రాజసముచే నోర్పులేనివాఁడు ప్రజగాఁ బ్రభువుగాఁ గూడఁ జెడును.

783 భవము సాగరంబు భార్యయా మకరంబు, చేప జలగలగుచు శిశువులెల్ల
భవహరుం దలంచి పారమందఁగలేఁడు, విశ్వదాభిరామ వినుర వేమ॥

భవోఽబ్ధి ర్మకరీ భార్యా స్యుర్ఝలూకాదయోఽర్భకాః ।
అస్మరంతో భవహరం వేమ ! కేఽపి నపారగాః ॥

తా॥ సంసారము సముద్రము. భార్య మొసలి. శిశువులు చేపలు, జలగలు. ఇట్టిసముద్రముఁ దరించుటకు సాధనము భవహరుఁడగు శివుని ధ్యానమే. (వి)అపారసంసార సముద్రమధ్యే సంమజ్జతో మే శరణంకిమస్తి? గురో! కృపాళో! కృపయా వదైతత్ విశ్వేశపాదాంబుజదీర్ఘనౌకా॥

784 పాశబంధములను బంధువర్గంబెల్లఁ, జిక్కఁజూతు రరయ జీవముచన
నొక్కఁడైన నేఁగఁ దునురుమాత్రమెకాని, విశ్వదాభిరామ వినుర వేమ॥

జీవే గతే పాశబంధై స్తనుం బధ్నంతి బాంధవాః ।
దర్శయంతో వేమ! దుఃఖం తేన నైకోఽపి గచ్ఛతి ॥

తా॥ ప్రాణముపోయినదన్న తత్క్షణము బంధువులు కట్టువులపైఁ గట్టుటకే చూతురు కాని యొక్కఁడైనఁగూడ చనఁడు.

785 పత్తనంబులందుఁ బతులకు సతులకు, మోహమెచ్చు దాన నూహలెచ్చు
ముక్తిమార్గమునకు యుక్తియే తెలియదు, విశ్వదాభిరామ వినుర వేమ॥

సతీపతీనాం నగరే మోహోహాః క్రమశోఽధికాః ।
ముక్తే ర్మార్గం వేమ! లబ్ధుం న యుక్తిం చ విదంతి తే॥

తా॥ పట్టణమందలి స్త్రీ పురుషులకు మోహమెక్కువ. దానివలన నూహలును నెక్కువే. ముక్తిమార్గ మనుమాటయే వారి చెవికెక్కదు.

786 పంచమనిగమంబు భారతంబగునని, పొగడిరేలజనులు బుద్ధిమాలి ?
హింస నెంచిచూడ నిష్టమెట్లయ్యెనో, విశ్వదాభిరామ వినుర వేమ॥

భారతః పంచమో వేదఇతి నిర్బుద్ధయో జనాః ।
స్తువంతి కిం? వేమ! హింసాం ద్రష్టు మిష్ట మభూ త్కథమ్?॥

తా॥ హింసతోఁగూడిన భారతమును నేల పంచమవేదమనిరో!. బుద్ధి తక్కువపెద్దమనుష్యులకు హింస యిష్టమైనదికాబోలు ! (వి) అహింసా పరమో ధర్మః.

787 నీరుపైనఁబడిన నిప్పులుబొగ్గులౌ, నిప్పుమీద కుండనీరుఁ జెట్టఁ
గళపెళనుచుఁ గ్రాగుఁ గడుచోద్య మిదికదా ?, విశ్వదాభిరామ వినురవేమ॥

జలస్పృష్టాగ్ని రంగారో ఘటస్థజల మగ్నినా ।
సంతప్యతే పశ్య వేమ ! మహచ్చిత్ర మిదం ఖలు ॥

తా నీరుపడిన నిప్పులుబొగ్గులగును. నీరుకుండలోఁబోసికాచినఁ గళ పెళమని కాగును. ఉపాధి యెంత చోద్యమైనదియోతెలియుఁడు.

788 దేహమనెడియిల్లు దినదినంబును, నూడ్చి యలికిపూసిమెత్తి యనువుఁబరచి
కాపువిడిచిపోవుఁ గడపట నీజీవి, విశ్వదాభిరామ వినురవేమ॥

సమ్మార్జయిత్వాZలంకృత్య గేహం దేహాఖ్య మన్వహమ్ ।
సిద్ధం కృత్వా విసృజ్యాంZతే వేమ ! జీవో వ్రజే త్తతః ॥

తా॥ దేహమనునిల్లు ప్రతిదినము తుడిచి యలికి పూసి మెత్తి అనుకూలమైనదిగఁ జేసికొని యెవరికిని నప్పగింతయైనఁ బెట్టకుండఁ దుదకు జీవి విడిచిపెట్టిపోవును.

789 విశ్వనాథునందు విప్రులయందును, విభునియందు వేదవిధులయందు
భక్తిలేనివాఁడు పాపాత్ముఁ డిలలోన, విశ్వదాభిరామ వినురవేమ॥

విశ్వనాథే చ విప్రేషు వేదోక్తేషు విభావపి ।
యస్య నాస్తి ధ్రువాభక్తిః పాపాత్మా ఖలు వేమ! సః ॥

తా॥ విశ్వేశ్వరునియందు, భక్తులందుఁ, బ్రభువునందు,జ్ఞానమార్గములందు భక్తిలేనివాఁడు పాపాత్ముఁడు.

790 ఖగములందముఁ గనఁగాముచ్చటగనుండుఁ, దెగలఁ గాంచినంతఁ జేటుపడదె?
దేవుఁడీనిసొగసు దెబ్బ ! నీకేలరా, విశ్వదాభిరామ వినురవేమ॥

రమ్యం హి ఖగసౌందర్యం స్ఫుటమ్ దృష్టాసు పంక్తిషు।
కిం వేమ! దైవాదత్తేన సౌందర్యేణ? విమూఢ! తే॥

తా॥ పక్షులయందము చూచుటకు ముచ్చటగనుండును. పక్షులగుంపులఁ జూచిన నది విశదమగును. వెఱ్ఱివానవుఁడా! అందముకొఱకుఁ బాకు లాడెదవు. దేవుఁడీయనియందము నీ కెట్లురాఁగలదు?

791 కడుపులోన మలము కడమని యెముకలు. కలదు మాంస మింతకప్పుతోలు
మలపుఁదిత్తిమీద మనసెట్లుబారురా?, విశ్వదాభిరామ వినురవేమ॥

కుక్షౌ మల మథాస్థిని మాంసం చర్మపరిచ్ఛదమ్।
మలభస్త్రాం కథం వేమ! మానసం పరిషజ్జతే?॥

తా॥ కడుపులోపల మలము, ఎముకలగూడు, మాంసము, పైనఁ గప్పినది తోలు. ఇట్టి మలపుతిత్తిమీఁద మన స్సెట్లుపడుచున్నదిరా!.

792 ఆసలనెడిలతలఁ గోసివేయఁగలేక, మోహజలధిలోన మునుఁగువారు
కాశివాసులైనఁ గనఁబోరు మోక్షంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

అచ్ఛిత్వాశాలతా వేమ! మగ్నా మోహార్ణవే జడాః।
వారాణస్యాం వసంతోఽపి తే ముక్తిం నాప్నువంతి హి॥

తా॥ ఆశలనుతీగెలఁ గోయలేక మోహజలధిలో మునుఁగువారు కాశీవాసులైననేమి? మోక్ష మెట్లు పొందఁగలరు?

793 ఈఁకెలంటఁజేసి తోఁకలంటఁగఁజేసి, కోకలంటఁజేసి లోకమునకు
మానరక్షణంబె మర్యాదయని తెల్పె. విశ్వదాభిరామ వినురవేమ॥

పత్రైః పుచ్ఛైశ్చ వస్త్రైశ్చ లోకస్యాచ్ఛాదనం విధిః।
కృత్వై తాం వేమ! మర్యాదాం మానగుప్త్యై న్యవేదయత్॥

తా॥ పక్షుల కీఁకెలు, పశువులకుఁ దోఁకలు మానవులకుఁ గోకలు భగవంతుఁడు కల్పించినది మానభంగముకాకుండ మర్యాదఁ గాపాడుకొనుఁడని దెల్పుటకే కదా.

794 వక్షమందుగురుని పక్షించిచూడరా, రక్షకత్వమునకు రాచబాట
అక్షమాలజపమె యవనిదొంగలరీతి, విశ్వదాభిరామ వినురవేమ॥

హృ్రది పశ్య శివం సమ్యక్ గుప్త్యై ఘంటాపథం హి తత్,
అక్షమాలాజపో వేమ! భువి పాటచ్చరీగతిః ॥

తా॥ హృదయమందున్న పరమగురువును జూడు. రక్షణఁబొందుట కదియే రాజమార్గము. దొంగల జపమాలపద్ధతులఁ గాంక్షింపకు.

795 లజ్జలజ్జయనుచు లలనలమీఁదికి, లజ్జవిడిచి తిరుగు లావరియయి
లజ్జఁదెలిసెనేని లలనలఁ దాకునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

లజ్జా లజ్జేతి యోషిద్భిః నిర్లజ్జ స్సజ్జతే బలీ।
యదిలజ్జాం విజానాతి వేమ! స్పృశతి కిం స్త్రియమ్? ॥

తా॥ సిగ్గు, సిగ్గు, అనుచు సిగ్గువిడిచి పొగరెక్కి స్త్రీలపైకి దుముకును. సిగ్గున్న స్త్రీలను దాకునా?

796 రాజసంబుఁజెంది రమణులపొం దాస, పడెడువాఁడు గురునిఁ బ్రాపెఱుఁగునె?
విటులమఱగుయువతి విభుభక్తియెఱుఁగునా, విశ్వదాభిరామ వినురవేమ॥

రాజసస్ స్త్రీపరో భూత్వా కథం విద్యా ద్గురోః ప్రథామ్?।
విటలగ్నాంగనా వేమ! విద్యాత్కిం పతిగౌరవమ్? ॥

తా॥ విటులమఱగిన జవ్వనికిఁ బతిభక్తి తెలియనట్లు రజోగుణమునఁ గాంతాసక్తుఁడైన వానికి సద్గురుసూక్తులును దెలియవు.

797 మదికలిగినపూజ మదనారిమెచ్చును. మనసునిల్పినంత మహితుఁడగును
మనసులేనిపూజ మట్టిసమానమా, విశ్వదాభిరామ వినురవేమ॥

స్తౌతీశో హార్దికాం పూజాం యతచిత్తో మహాన్ భువి।
మనోవిరహితా పూజా మృత్సమా వేమ! సంశృణు ॥

తా॥ నిశ్చలమనమునఁ జేసినపూజను బరమేశ్వరుఁడు మెచ్చుకొనును. మనస్సునిల్పిన మహిమాన్వితుఁ డగును. మనస్సులేని పూజ మట్టివంటిది.

798 భక్తియున్నచోటఁ బరమేశ్వరుఁడునుండు, భక్తిలేనిచోటఁ బాపముండు
భక్తికలుగువాఁడు పరమాత్ముఁ డగునయా, విశ్వదాభిరామ వినురవేమ॥

యత్ర భక్తి శ్శివ స్తత్ర భక్తిహీనస్థలే త్వఘమ్।
భక్తియుక్తో నరో వేమ। పరమాత్మేతి కథ్యతే ॥

తా॥ భక్తికలిగినచోటఁ బరమేశ్వరుఁడును భక్తిలేనిచోటఁ బాపమును నుండును. భక్తికలవాఁడే పరమాత్మస్వరూపుఁడు. (వి) మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే, శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః। గీత।

799 మన్నుపారబెట్ట మనకేమిలాభంబు, ధాన్యమట్లుచేయఁ దగుచుకాని
ఘనులలోప మెన్నఁగారాదు విదువుము, విశ్వదాభిరామ వినురవేమ॥
కిం మృత్తికోత్క్షేపణేన ? ధాన్యోత్క్షేపణతః ఫలమ్।
సతాం కిం వేమ ! లోపైస్స్యాత్? పరిగ్రాహ్యో హి తద్గుణాః॥

తా॥ ధాన్యమెగురఁబోసిన లాభముకాని మట్టినెగురఁబోయ మనకేమిలాభము? అట్లే పెద్దలమాటల వినవలెనుగాని వారిలోపముల నెన్నుచుండిన మన కేమిలాభించును ?

800 కల్యమారగించి కన్నులుముకుళించి, బిఱ్ఱబిగిసియుండు బీదయోగి
మేఁకపోతువలెను మెరమెచ్చులకెయగు, విశ్వదాభిరామ వినురవేమ॥
కల్యం భుక్త్వా మీలితాక్షో రుద్ధకాయోఽల్పసంయమీ।
ఆశ్రిత్య మేషగాంభీర్యం ప్రశంసాం వేమ ! వాంఛతి॥

తా॥ సన్నబియ్యపు టన్నముమేసి కన్నులు మూసి బీదపొట్టతో బిఱ్ఱబిగిసి మేకపోతుగాంభీర్యమునునుండు యోగి మెఱమెచ్చులకే యగును.

801 కలిగినట్టులుండుఁ గలుగకయుండును, మఱియులేకయుండు మఱియుఁగల్గు
వాకొలఁదిని శివుఁడందించుచుండును, విశ్వదాభిరామ వినురవేమ॥
వేమ! ప్రాప్తమివాభాతి న లభ్యేత యథాతథమ్।
పునర్లబ్ధిః పునర్నాశః యథాప్రాప్తం దిశే చ్ఛివః॥

తా॥ వచ్చినట్లే యుండును, రాదు. రానియట్లేయుండును. వచ్చును. పరమేశ్వరుఁడు మనకర్మఫలప్రాప్తికొలఁది నందించుచుండును.

802 తనదుకర్మచేతఁ దానులోకములోనఁ, దనదుతల్లిగర్భమునను బుట్టి
తన్నుమఱచి తాను దనుదనిచెడునయా, విశ్వదాభిరామ వినురవేమ॥
స్వకర్మణా స్వయం లోకే మాతృగర్భోదితో నరః।
ఆత్మానం వేమ ! విస్మృత్య దేహాత్మత్వేన నశ్యతి॥

బడినది. బుధులు దయతో నిందలిమంచిచెడ్డలఁదెలిపిన ద్వితీయముద్రణ మున వారివారి సూక్త్యనుసారముగసంస్కరించుటకుఁ బ్రయత్నింతుము. 15వ శతాబ్దానంతరము మల్హణచరిత్రకర్త ఎడపాటి ఎఱ్ఱాప్రగ్గడ,ప్రకాశ్రము లింగశతకకర్త లక్ష్మణకవి, తోభ్యచరిత్రకర్త పింగళి ఎఱ్ఱనార్యుఁడు, అన్య వాదకోలాహల గ్రంథకర్త శివయోగీంద్రుఁడు, నాగరఖండరచయిత తురగారామకవి మొదలగు ఆధ్యాత్మిక కవులుమాత్రము తమ తమ గ్రంథములమొదట వేమనకవిని స్తుతించిరి. కాని శృంగార ప్రబంధకవులు మాత్రమెవ్వరును నట్లు చేయలేదు.

సాధారణముగ శృంగారకవి పామరజనగ్రాహ్యమగు శృంగార రసమును మాత్రము వర్ణించి శృంగారరసపిపాసువులగు ప్రభువులఁ బ్రజల నాకర్షించి ధనముగుంజి భోగలంపటుఁడగును. ఆధ్యాత్మిక కవిమాత్ర మట్లుగాక నిత్యానిత్యములను సత్యాసత్యములను సవిమర్శముగఁ దెలిసికొని తానానందించి లోకమునకు సద్రూపము నిత్యరూపమునగు వస్తువును బ్రకటించును. కాని ప్రభువులచేత ప్రజలచేత ధనభోగరూప సంబంధమును మాత్ర మిచ్చగింపఁడు. అందువలన నాధ్యాత్మిక కవిని గుర్తించి ఆదరించు ప్రాజ్ఞులు తక్కువగనుందురు. ఆ విషయమున నీ నిదర్శనముఁగాంచుఁడు.

ఆధ్యాత్మికకవి "స్త్రీ శరీరమందలి నేత్రములు, శ్రోత్రములు, ఘ్రాణము, ఉరము, పాణిపాదములు మొదలగు సమస్తావయవములు మాంసవసాదివికారములు, రక్తపూరితములు, మజ్జామేదోస్థిశ్లేష్మాది కాసహ్యావస్తు సముదాయసంభరితములు. అందువలన నీవుస్త్రీలోలుఁడవు కాకుము." ఇట్లు విరక్తిమార్గమును ప్రబోధించును. శృంగారకవి అట్లు కాక "స్త్రీ నేత్రములు పద్మపత్రములు, కంఠము శంఖసన్నిభము. నడక హంసనడక, మాటలుఅమృతమయములు, అధరోష్ఠలాలాజలమమృతమే. అందువలన ఆ నీ ప్రేయసియే నీకారాధ్య ప్రేమదేవత" ఇట్లువర్ణించి అంతకుపూర్వమే మోహసముద్రమునఁ దనంతఁదాను మునిగియున్న

తా॥ తనకర్మచే నీలోకమునఁ దల్లిగర్భమునఁబుట్టి తన్నుమఱచి తనువే తాననుకొని నరుఁడు చెడుచున్నాఁడు.

803 జన్మవదలి వేఱుజన్మంబులెత్తఁగ, గర్మధర్మములకు గణనకలదె?
కర్మధర్మములను గడతేరవచ్చునా ?, విశ్వదాభిరామ వినురవేమ॥

త్యక్త్వా జన్మాఽన్యజన్మాని దదతోః కర్మధర్మయోః।
కిం స్యాద్గణనయా? వేమ! తాభ్యాం ముక్తిః కథం భవేత్॥

తా॥ ఈజన్మకాక మఱొకజన్మ. ఇట్లే కలిగిన ధర్మకర్మములకు లెక్క కలదా? కర్మల ధర్మముల జన్మముల ముక్తిమార్గము లభించునా? (వి) పునరపి జననం పునరపి మరణం పునరపి జననీ జఠరే శయనమ్, ఇహ సంసారే బహుదుస్తారే కృపయాఽపారే పాహి మురారే!॥

804 నిజములాడునతఁడు నిర్మలుఁడైయుండు, నిజములాడువాఁడు నీతిపరుఁడు
నిజముఁబల్కకున్న నీచచండాలుండు, విశ్వదాభిరామ వినురవేమ॥

సత్యవాదీ నిర్మలస్స్యాత్ సత్యవాదీ హి నీతిమాన్ ।
అసత్యవాదీ యో వేమ! నీచచండాలఏవ సః॥

తా॥ నిజముఁబల్కునతడుఁ నిర్మలుఁడు నీతిపరుఁడు. నిజముఁబలుకని వాఁడు నీచుఁడు చండాలుఁడు.

805 పాలఁగలియునీరు పాలెయైరాజిల్లు, గొప్పగురునివలనఁ గోవిదుఁడగు
సాధుసజ్జనముల సంగతు లిట్లుండు, విశ్వదాభిరామ వినురవేమ॥

సమ్మిశ్రమంబు క్షీరేణ క్షీరరూపేణ రాజతే ।
సద్గురోశ్చ తథా విద్వాన్ వేమైవం సాధుసంగతిః॥

తా॥ పాలఁగలిసిననీరు పాలేయగునట్లు సద్గురునివలన శిష్యుఁడును దెలిసినవాఁడగును. సాధుసజ్జనగోష్ఠు లిట్లుండును. (వి)సతాం సద్భి స్సంగః కథమపి హి పుణ్యేన భవతి.

806 పరఁగ నింతదనుకఁ బడినపాటెఱుఁగఁడో, ఘనతనొప్ప మనుజుఁడనఁగఁబుట్టి
కీడుమేలెఱుఁగక క్రిందగుఁజితస్సంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

ఉత్కృష్టం మానుషం జన్మ ప్రాప్తః పూర్వజనుర్వ్యథాః।
అజానన్ వేమ! పతతి హానిం వృద్ధిం న పశ్యతి॥

తా॥ దుర్లభమగు మానవజన్మఁబొంది యింతవరకుఁబడినపాట్లు చాలక కీడుమేలుల గుర్తింపక యధోగతిపాలగుచున్నాఁడు. ఇదేమిచిత్రిమో!
(వి) దుర్లభం మానవం జన్మ। 2 మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే, యతతామపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః ॥గీత॥

**807 పడుచుమాటలాడి పరితపింపఁగనేల ?, వెఱఁగుచర్య లణఁచి వేడి గురుని**
**అడుగులంటి మ్రొక్కి యాసను విడద్రొక్కు, విశ్వదాభిరామ వినురవేమ॥**

యువోక్తిభిః కిం తపసి? విసృజ్య ఖలచేష్టితమ్। •
గురుం ప్రణమ్య పదయోః వేమాశా మాశు సంత్యజ ॥

తా॥ పడచుదనప్పు పె.కములఁబల్కి బాధలనొందక చెడుపనులనుమాని సద్గురుపదములకుమ్రొక్కి విషయమెఱిఁగి యాశలవీడి ముక్తిఁగాంచుము.

**808 దేహ మాత్మరూపుఁ దేటతెల్లముఁజేసి, అవనిఁ జూపుఁజూపు నతఁడె గురువు**
**భ్రిమరము తనరూపుఁ గ్రిములకిచ్చెడిరీతి, విశ్వదాభిరామ వినురవేమ॥**

ఆత్మానాత్మగతిం వేమ! బోధయిత్వా తతో గురుః।
స్వస్వరూపం దర్శయతే భ్రమర స్తు కృమే రివ ॥

తా॥ తుమ్మెద పురుగునకుఁదనరూపమునిచ్చునట్లు దేహముపద్ధతి ఆత్మపద్ధతి విశదముఁజేసి యట్టిచూపునుజూపి తనంతవానినిగ శిష్యునిఁజేసికొనువాఁడే సద్గురువు.

**809 తల్లిదండ్రి లెన్నఁదగుతొలిగురువులు, పార్వతీభవులిలఁ బరమగురులు**
**కూలివాండ్రి జగతి గురులనద్రోహంబు, విశ్వదాభిరామ వినురవేమ॥**

ఆద్యౌ గురూస్తః పితరౌ సద్గురూ పార్వతీభవౌ।
ద్రోహో భృత్యర్థిసం వేమ! గురురి త్యభిభాషణమ్ ॥

తా॥ తల్లిదండ్రులు తొలిగురువులు. పార్వతీపరమేశ్వరులు పరమగురువులు (గురువులకుగురువులు) అంతియకాని ధనముగుంజు కూలివాండ్రి గురువులనుట ద్రోహము.

**810 తనదురక్తియనెడి దాసిచేతనుజిక్కి, మిగిలి వెడలలేక మిణుకుచున్న**
**వరుని కేడ ముక్తి వరలెదుఁజెప్పఁడీ ?, విశ్వదాభిరామ వినురవేమ॥**

తా॥ జ్ఞాననిష్ఠచే శరీరమును మఱచువాఁడు మోక్షకామియగును. కామి కాఁడు. నియమనిష్ఠలకుఁగూడ నతీతుఁడవై నిర్గుణబ్రహ్మావగుము.

838 జగమునందు లేదు జలములందును లేదు, నిగమవేద్యమైన నిజపదంబు
సగుణనిర్గుణముల సాధించిచూడుము, విశ్వదాభిరామ వినురవేమ॥

లోకే నాస్తి జలేనాస్తి వేదవేద్య మృతం పదమ్ ।
సగుణం నిర్గుణం వేమ ! సాధయిత్వా విలోకయ ॥

తా॥ వేదములవలనఁ దెలియఁబడు పరమపదము జగమునందు జలములందు లేదు. కాన సగుణ నిర్గుణముల సాధించిచూడుము.

839 చదువులన్ని చదివి చాలవివేకియై, మగిడి తన్నెఱుఁగక మందజనుఁడు
విసుగుచదువటంచు వెఱ్ఱియై చెడిపోవు, విశ్వదాభిరామ వినురవేమ॥

అధీత్య సర్వవిద్యాశ్చ స్వానభిజ్ఞో వివేక్యపి ।
మూఢో విద్యాసు నిర్విణ్ణో వేమోన్మత్తో వినశ్యతి ॥

తా॥ జడుఁడు చదివిచదివి వివేకవంతుఁడునై తనసంగతి తెలిసికొనలేక చదువునకు విసివి వెఱ్ఱియై చెడిపోవుచున్నాఁడు.

840 కాంతపైన ప్రేమ స్వాంతము రంజించుఁ, జింతతీరఁ దరుణి చిక్కనపుడె
శివునియందుభక్తి చింతయుమరఁబోదు, విశ్వదాభిరామ వినురవేమ॥

స్త్రియాం ప్రేష్ఠా మనో హృష్యేత్ తత్ప్రాప్తౌ నిస్సరేత్ వ్యథా।
చింతాం సదాశివే భక్తిః న కుర్యా ద్వేమ! జాత్వపి ॥

తా॥ స్త్రీప్రేమ స్త్రీ చేఁజిక్కునప్పుడె మనస్సును రంజింపఁజేయును. వియోగమునఁ జాలబాధఁ గల్గించును. పరమేశ్వరునిపై ప్రేమ(భక్తి) సర్వదా నిశ్చింతగ సంతసముఁ గల్గించును.

841 పూజఁ జేయఁజేయఁ బూజారితానౌను, పూజ్యవస్తువెన్న భువిని తానె
ఏడఁబూజఁజేయు నెల్లదిక్కులుఁదానె, విశ్వదాభిరామ వినురవేమ॥

కృత్వా కృత్వా సదా పూజాం భవే ద్వేమార్చక స్స్వయమ్।
పూజ్యవస్తు స్వయం సర్వం స్వయం క్వ కురుతేఽర్చనామ్॥

తా॥ పూజ జేయఁజేయఁ బూజ్యవస్తువుఁ బూజారియుఁగూడ తానే యగును. ఎల్లదిక్కులఁ దానెయైయుండఁ బూజఁజేయుట యెక్కడ?

తా॥ భార్య భ_ర్త కొడుకు. ఇట్టి వేర్వేఱు రూపములు కాని యందరిలో నుండు నాత్మపదార్థమును నొక్కటియే సుమా.

884 కనులఁజూడఁబడని కలుష విదూరుని, మనమునందుఁ జేర్చి మరలుఁగొనక
తనకుముక్తిలేదు తలఁపులు మెండైన, విశ్వదాభిరామ వినురవేమ॥

అగోచరం దృశాం పాప దూరం తం వేమ! చేతసి ।
న్యస్య యో న భజే న్ముక్తి శ్చింతాళోస్త్యస్య నాస్తి హి॥

తా॥ ఈకన్నులఁజూడఁబడని నిష్కల్మషు మనమునఁ జేర్చి భ్రమలఁ జెందక నిశ్చింతగనుండినఁ గాని ము_క్తికలుగదు. (వి) విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః, రసవర్జం రసోప్యస్య పరం దృష్ట్వా నివర్తతే. గీత.

835 పాశములనుగూడఁ బరగ దేహమునకు, హానివచ్చుఁ గాన నదియుఁదెలిసి
జ్ఞానదీపకళికఁ గడకొ_త్త వలెనయా, విశ్వదాభిరామ వినురవేమ॥

దేహినః పాశయోగేన హాని స్సంజాయతే ఖలు ।
జ్ఞానదీపోత్కళికయా తం జ్ఞాత్వా వేమ! వారయేత్॥

తా॥ బంధనముల దేహికి హానికలుగును. కాన జ్ఞానదీపమునఁ బాశములు చుట్టుకొను నజ్ఞానతమస్సుఁ దొలగించుకొనవలెను.

836 దూరయోచనలకు దూరమా దైవముక్, దనువుదూరమైనఁ దగులునపుడె
జీవి దవ్వుఁజేయ దేవుఁడైనిలుచును, విశ్వదాభిరామ వినురవేమ॥

దూరే స్యాత్ దూరచింతానాం తనౌ దూరే విషజ్జతే।
దైవం దూరీకృతే జీవే వేమ! దేవో విరాజతే॥

తా॥ దూరాలోచనలకు దైవమును దూరస్థుఁ డగును. కాన యట్టి యాలోచనలకుఁ దావగు దేహభ్రాంతిఁ దొలఁగించిన దగ్గరగును. జీవత్వము దూరముఁజేసిన దైవమే యగును.

837 జ్ఞాననిష్ఠఁబూని మేను మఱచువాఁడు, కామి కాఁడు మోక్షకామికాని
నియమనిష్ఠలుడిగి నిర్గుణమందును, విశ్వదాభిరామ వినురవేమ॥

జ్ఞాననిష్ఠాపరో వేమ! తనుం విస్మరతీహ యః ।
న కామీ స తు మోక్షార్థీ భజాఽనిష్ఠశ్చ నిర్గుణమ్ ॥

తా॥ బాల్యమందు భక్తిలేక యౌవనమున భగవద్విచారణలేక సంచరించిన వార్ధకమున నాప్రమేయమే మనస్సునకుఁ దట్టదు. (వి) బాలస్తావ త్క్రీడాసక్తః తరుణస్తావ త్తరుణీసక్తః, వృద్ధస్తావ చ్చింతాసక్తః పరమే బ్రహ్మణి కోఽపి నసక్తః॥ (భజగోవిందం)

830 బ్రహ్మవేత్తలమని ప్రగల్భముచునుందురు, బ్రహ్మ మేమొ దాని భావ మేమొ
తెలుపో! నలుపో! యెఱుపో! తెలిసినఁబల్కుఁడీ, విశ్వదాభిరామ వినురవేమ॥

బ్రహ్మజ్ఞా వయ మిత్యాహుః వేమ! ప్రజ్ఞాశ్చ భూరిశః।
కిం బ్రహ్మ? క శ్చ తద్భావః కో వర్ణో బ్రూహి వేత్సిచేత్॥

తా॥ మేముబ్రహ్మవేత్తలమని ప్రగల్భములు పలుకుదురు. మీరుబ్రహ్మవేత్తలేయైన బ్రహ్మభావమెట్టిదో తెలుపో! నలుపో! ఎఱుపో! చెప్పుఁడు.

831 బ్రహ్మపదవుఁజెడును బ్రాహ్మణుఁడొడ్డ, బ్రహ్మకలనఁబుట్టి పరగిరనఁగ
బ్రహ్మవేత్తయగును బ్రాహ్మణుఁడేమైన, విశ్వదాభిరామ వినురవేమ॥

బ్రాహ్మణా బ్రహ్మసంజాతా ఇతి వేమాభిభాషణాత్।
ప్రతిష్ఠా బ్రహ్మణోనష్టా బ్రహ్మవిద్బ్రాహ్మణః ఖలు॥

తా॥ బ్రహ్మవేత్తకాని బ్రాహ్మణుఁడు బ్రహ్మవలనఁ బుట్టితి నన నా బ్రహ్మగౌరవముకూడఁ జెడును.

832 ఆకసంబు శూన్య మందుశబ్దము పుట్టె, శబ్దమధ్యమునను పరగఁజూడ
శబ్దరహితమగుచుఁ జెలగును, బ్రహ్మంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

వ్యోమ శూన్యం వేమ! తస్మి న్ఛబ్దోఽజని తదంతరే।
తద్బ్రహ్మ శబ్దరహితం రాజతే సమ్యగీక్షితమ్॥

తా॥ "ఆకాశం గగనం శూన్యం" అన్నట్లు శూన్యమగు నాకాశము నుండియే శబ్దము పుట్టును. ఆశబ్దమధ్యమునుండియే శబ్దరహితమగు పరబ్రహ్మము శోభిల్లును.

833 ఆలుమగఁడుసుతుఁడు నందఱిలో నాత్మ, మేలుగా నెయుండి మెఱయుచుండు
వేఱువేఱుగాను వెలయురూపంబులై, విశ్వదాభిరామ వినురవేమ॥

దారేషు పత్యౌ పుత్రే చ సర్వేష్వాత్మా విరాజతే।
సమ్యగ్వేమ! ప్రవర్తేత నానారూపైః పృథక్ పృథక్॥

826 జననమరణవేళ స్వాతంత్ర్యమున్నదే ? లేనులేదు మున్ను పోనులేదు
నడుమఁగర్తననుట నగుబాటుకాదొకో!, విశ్వదాభిరామ వినురవేమ॥

జననే మరణే వేమ ! న స్వాతంత్ర్యం పురా నృణా ।
నానీతం న తతో నీతం మధ్యే హాస్యాయ కర్తృతా ॥

తా॥ జననమరణముల స్వాతంత్ర్యము తెచ్చుటయుఁ గొనిపోవుటయు లేదు. నడుమ స్వతంత్రుఁడ ననుకొనుట పొరపాటు నగుబాటు కాదా?(వి) ప్రకృత్యైవ హి కర్మాణి క్రియమాణాని సర్వశః, యః పశ్యతి తథాత్మాన మకర్తారం స పశ్యతి॥ ।గీత।

827 బాట తెలియకున్న బహుదూరమైతోఁచుఁ, జోటు తెలియకున్నఁజూపానరదు
కోటకొమ్ముమీఁదఁ గుదురుగాఁజూడుము, విశ్వదాభిరామ వినురవేమ॥

అజానతో మహద్దూరం మార్గం స్యాద్ది తథా స్థలమ్ ।
న దృశ్యతే వేమ ! దుర్గశిఖరే నిక్షిపే ద్దృశమ్ ॥

తా॥ దారి తెలియనప్పుడు గమ్యస్థానము చాలదూరముగఁదోచును. చోటుఁ దెలియనప్పుడు చూపునిలుపుటకును వీలుపడదు. కాన దారి తెలిసి చూడవలసిన చోటుఁదెలిసికొని యున్నతస్థాన మధిష్ఠించి చూచినఁ బరమాత్మస్వరూపము గోచరింపఁ గలదు.

828 బాలప్రాయమందె భ్రమలనడంపక, మేలుపొందరెపుడు మేదినందుఁ
గీలుఁదెలిసి మదిని గీడ్వడకుండుము, విశ్వదాభిరామ వినురవేమ॥

బాల్యేఏవ భ్రమాన్ సర్వాన్ యది వేమ ! న ముంచతి ।
శుభం నాప్నోతి మర్మజ్ఞో మా వ్యధిష్మా భృశం హృది ॥

తా॥ చిన్నప్పటినుండియు భ్రమలువీడి సత్ప్రవర్తనముననున్నఁగాని మేలు చేకూరనేరదు. జీవితరహస్య మెఱిఁగి నిర్విచారమున నుండుము.

829 బాల్యమందు స్వామిభక్తిలేకుండును, యౌవనమున హరునిసేవఁగనరు
వార్ధకంబునందు వర్ణింపలేకుండు, విశ్వదాభిరామ వినురవేమ॥

బాల్యేనాస్తి ప్రభోర్భక్తిః శివదృష్టి ర్న యౌవనే ।
వార్ధకేఽపి నలా వేమ ! న తం వర్ణయితుం క్షమాః ॥

822 భార్యమీఁదనాశ పరఁగుఁ బురుషునకు, మగనిమీఁద నాశ మగువకుండు
శివునిమీఁదనాశ సిద్ధునకుండురా, విశ్వదాభిరామ వినుర వేమ॥

పత్న్యామాశా భవేత్పుంసః పత్యౌ పత్న్యాశ్చ సా తథా।
సదాశివే భవే దాశా వేమ! సిద్ధస్య సర్వథా ॥

తా॥ భార్యమీఁదనాస భర్తకు భర్తమీఁద నాస భార్యకుండునట్లు పరమేశ్వరుపై నాస సిద్ధపురుషున కుండును.

823 నేయి వెన్నఁగాచి నీడనేయుంచిన, పేరి గట్టిపడును పెరుగురీతి
పోరిపోరి మదిని బోనీక పట్టుము, విశ్వదాభిరామ వినురవేమ॥

నవనీతం ఘృతం తప్త్వా యది న్యస్య త్యనాతపే।
దధీవ ఘనతా మేతి వేమైవం స్థాపయే న్మనః ॥

తా॥ వెన్నను నేయిగాఁగాచి నీడనుబెట్టినఁ బెరుగువలె మఱల గట్టిపడిపోవును. అట్లే మనస్సును సదోష్ఠినుండి మఱల్చిన లోకవాసనలచేఁ జలించిన దగుచుండును.

824 ధాత్రిజనులకెల్లఁ దగ నెఱిఁగించెద, నొనర హరుని నెఱుఁగు నుపమయొకటి
మనసుఁజెదరనీక మహిమతోఁజూచుటే, విశ్వదాభిరామ వినురవేమ॥

ఏకోపాయం శివం వేత్తుం భూజనానాం వదా మ్యహమ్।
అచంచలం మనః కృత్వా మహిమ్నా వేమ! పశ్యత ॥

తా॥ ఆపరమాత్మను దెలిసికొను సూక్ష్మమార్గమొకమనస్సును జెదరనీక నిలుపుపద్ధతియే. (వి) అసంయతాత్మనో యోగో దుష్ప్రాపఇతి మే మతిః, వశ్యాత్మనా తు యతతా,శక్యోఽవాప్తు ముపాయతః। గీత।

825 త్రాడుఁబాముటంచుఁ దాఁజూచిభయపడుఁ దెలిసిత్రాడటన్నఁ దీరుభయము
భయముఁదీరునపుడె బ్రహ్మంబుఁదానగు, విశ్వదాభిరామ వినురవేమ॥

రజ్జౌ సర్పమతిం కృత్వా భయమేతి తతో నరః।
రజ్జుం జ్ఞాత్వా త్యజేద్భీతిం వేమాత్మా బ్రహ్మ నిర్భయః॥

తా॥ త్రాడునుజూచి పామనుకొనిన భయముకల్గును. నిజముతెలిసిన భయముతీరును. యథార్థముఁదెలిసి భయముతీరినఁదానే బ్రహ్మపదార్థము.

818 **గురునిశిక్షలేక గుఱుతెట్లుకలుగునో, యజునికైన వానిజబ్బకైన**
**తాళపుచెవిలేక తలుపెట్టులూడును, విశ్వదాభిరామ వినురవేమ॥**

గురుం వినా కథం మర్మ వేత్త్యజ స్త్రిత్రాపి వా।
వినా కుంచికయా వేమ ! కవాటవివృతిః కథమ్ ? ॥

**తా॥** తాళపుచెవిలేక తలుపూడనట్లు గురునిశిక్షలేక బ్రహ్మకైనను వానిబాబుకైనను బరమాత్మకీలకము తెలియనేరదు.

819 **వేదముల్ పదివియు విఱ్ఱవీగుటెకాని, యధమగతిని బడిరి యయ్యలెల్ల**
**బ్రహ్మమహిమఁదెలిసి బ్రతికిన బ్రతుకదా, విశ్వదాభిరామ వినురవేమ॥**

ఆర్యా వేదా నధీత్యాపి దర్పితా అధమాం గతిమ్ ।
ప్రాపుర్వేమ ! మహద్బ్రహ్మ వేత్తు ర్జీవన ముత్తమమ్॥

**తా॥** చాలమందిపెద్దలు వేదములఁజదివి విఱ్ఱవీగిరి. కాని యధోగతినే పొందిరి. బ్రహ్మవిద్యవలనఁ బరమాత్మనెఱిఁగి యూర్ధ్వగతినిఁబొంది బ్రతికినబ్రతుకే సరియైనబ్రతుకు.

820 **విమలదృష్టిఁబూని విజ్ఞానమందమిఁ దమముఁబాయనగునె ? తథ్యముగను**
**దమముమీఱినంతఁ దత్త్వజ్ఞుఁడగునయా, విశ్వదాభిరామ వినురవేమ॥**

విమలాం దృష్టి మాలంబ్య యది న జ్ఞాన మాప్నుయాత్।
తమో నా పైతి తత్త్వజ్ఞో వేమాపాస్తతమా భువి ॥

**తా॥** విమలదృష్టిచే విజ్ఞానతేజస్సుఁబడసినఁ గాని యజ్ఞానాంధకారము తొలఁగదు. అట్టి యజ్ఞానాంధకారము తొలఁగిననే తత్త్వజ్ఞానియగును.

821 **ముగురిలోన వెన్క ముందుఁ గానఁగలేక, నరకమునకుఁబోవు నరులుకలరు**
**ముగురు కందనట్టి మూలమూర్తియొకండె, విశ్వదాభిరామ వినురవేమ॥**

త్రిషు పూర్వోత్తరగతిం చానభిజ్ఞా నరా స్తతః ।
నరకం యాంతి వేమైభ్యః త్రిభ్యస్త్వేకః పరః పుమాన్ ॥

**తా॥** బ్రహ్మ విష్ణు మహేశ్వరులను మువ్మూర్తుల కందనట్టి మూలమూర్తి యొకటున్నదని తెలియక నరులు ముమ్మూర్తులలోనే ముందు వెన్కల నరయుచు నరకము పాలగుచున్నారు.

814 జననమరణములును స్వప్నసుషుప్తులు, జగములుండు నెండజలములవలె
నరుఁడు జగమునంట నగుబాటుకాదొకో!, విశ్వదాభిరామ వినురవేమ॥

జనిర్మృతి స్స్వప్నసుప్తీ జగంతి చ భవంతి హి ।
మృగతృష్ణేవ తత్సంగః వేమ! హాస్యాయ నుర్భవేత్

తా॥ జననమరణములు స్వప్నసుషుప్తులు జగములు నెండమావు వంటివి. అట్టివాని నంటియుండుట నగుబాటు. (ని) అంతవంత ఇమే దేహ నిత్య స్యోక్తా శ్శరీరిణః, అనాశినోఽప్రమేయస్య। గీత।

815 ఛాయనొసఁగుచెట్టు సాధువుబోధట్టు, లవఁగి దరినిజేరి పడయవచ్చు
నట్టునిట్టుదాట నదిపోవు నిదిరాదు, విశ్వదాభిరామ వినురవేమ॥

ఛాయామివ తరు ర్బోధం సాధు ర్దత్తే తదంతికమ్ ।
గత్వా లభ్యో వేమ! నోచేత్ తద్గతం నాగతం త్విదమ్

తా॥ చెట్టునీడనువలె సాధువుబోధ దరిజేర పొందవచ్చును. కాని యట నిటుపోయినఁ జెట్టునీడపోవునట్లే సాధుబోధయుఁ బట్టువడదు.

816 ఛాత్రధర్మమెఱిఁగి చక్కనిభక్తితో, గురునిసేవఁజేయఁ గుదిరినపుడె
సర్వమర్మములును చక్కఁగా విడిపోవు, విశ్వదాభిరామ వినురవేమ॥

జ్ఞాత్వా భక్త్యా ఛాత్రధర్మం గురుసేవారతో యదా
తదైవ సర్వమర్మాణి జ్ఞాయంతే వేమ! నిత్యశః ॥

తా॥ శిష్యుఁడు తనధర్మమెఱిఁగి భక్తితో సద్గురువును సేవించుట కుదిరినప్పుడే సర్వపరమాత్మరహస్యములును విడిపోవును. (వి) శ్రావ్యం సదాకిమ్ ? గురువేదవాక్యమ్। (శం। మణి)

817 చెడుగుణంబులెల్లఁ జేపట్టి శిక్షించి, పరమపదవి సిద్ధపడఁగఁ జూపు
నట్టిగురునివేడి యపరోక్షమందుము, విశ్వదాభిరామ వినురవేమ॥

నియమ్య దుర్గుణాన్ సర్వాన్ యో వేమ! పరమంపదమ్।
సమ్యగ్దర్శయతే ప్రాప్య తం గురుం ముక్తి మాప్నుహి ॥

తా॥ చెడుగుణముల నశింపఁజేసి తగిన శిక్షణగఱపి పరమపదవిని ప్రత్యక్షముఁజేయుసద్గురువు నాశ్రయించి యపరోక్షానుభూతి నొందుము.

దాస్యా రక్త్యాఖ్యయా బద్ధ స్తతో నిష్క్రమణాక్షమః ।
నరః ప్రవర్తతే వేమ! తస్య ముక్తిః కుతో వద ? ॥

తా॥ అనురక్తియను తొత్తుపొందునకు లొంగి విడువలేక యందే మునిగి తేలుచున్న జడునకు నెట్లు విరక్తి పొడచూపఁగలదు? (వి) అనేక చిత్తవిభ్రాంతా మోహజాలసమావృతాః, ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ॥ గీత॥

811 **తనదుమనసుచేతఁ దర్కించి జ్యోతిష, మెంతచేసె ననుచు నెంచిచూచుఁ**
**దనయదృష్టమెంతొ దైవమెఱుంగఁడా, విశ్వదాభిరామ వినురవేమ॥**

వితర్క్య మనసా మర్త్య స్సర్వం జ్యోతిషకల్పితమ్ ।
ఇతి మన్యేత భాగ్యం స్వం కిము దైవం న వేత్తి కిమ్॥

తా॥ తనయదృష్ట మెట్టిదో దైవమునకుఁ దెలియకపోదు. ఇఁక దాను 'జ్యోతిష మెంతపని చేసెద' నని శాస్త్రములు నిందించుట తెలివితక్కువ కాదా? (వి) పడుపు వృద్ధ్యా ... లిఖ్యతే జన్మపత్రికా॥

812 **జ్ఞానియైనవాఁడు ఘనతేజసంయుతుఁ, డూనిసుఖముఁ జెందుఁ బుట్టఁబోఁడు**
**తానె తానటయ్యుఁ దనలోనె వెల్గును, విశ్వదాభిరామ వినురవేమ॥**

మహో యాతి ఘనం జ్ఞాని సుఖమేతి న జాయతే ।
ఆత్మైవాత్మా తథా వ్యాపహో! వేమాత్మని విరాజతే॥

తా॥ జ్ఞాని తేజశ్శాలి. సుఖి. జన్మరహితుఁడు. తానె పరమాత్మయై తనలోఁ బ్రకాశించును. (వి) బహూనాం జన్మనా మంతే, జ్ఞానవా న్మాం ప్రపద్యతే, వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః। గీత।

813 **జ్ఞానవంతునిఁ గడు కర్మసంబద్ధులు, వెఱ్ఱియందు రప్రకృతి విడువలేక**
**వెఱ్ఱికనిప్రకృతి వెదకినఁ గల్గునా, విశ్వదాభిరామ వినురవేమ॥**

జ్ఞానినం కర్మఠా వేమ ! ప్రకృతిం త్యక్తు మక్షమాః ।
ప్రాహు రున్మాదినం తేన సదృష్టా ప్రకృతిః కుతః? ॥

తా॥ కర్మిష్ఠులు జ్ఞానిని పామరుఁడె వెఱ్ఱివాఁ డందురు. అట్టి జ్ఞానికి దెలియని ప్రకృతి యుండదు. ప్రకృతికి సంబంధించినవారు ప్రాకృతులు. (సామాన్యులు) ప్రకృతి కతీతుఁడు జ్ఞాని.

వానిని తిరిగి తిరిగి ముంచును. వాఁడుకూడ అజ్ఞానకారణమున శృంగార కవిమాటల మన్నించి పుష్కలముగ ధనమొసంగి తానుమాత్రము స్వయముగ నధోగతిని బొందుచున్నాఁడు. గ్రుడ్డివాఁడు గ్రుడ్డివాని నాశ్రయించిన గోతిలోపడకుండునా? పాముకాటుతిన్న నరునకు చేదు తీయగానుండునుగదా! అటులనే మోహగ్రస్తునకు లాలాజల మమృతము కాక మరేమికాగలదు? స్త్రీ యవయవంబులఁ బద్మపత్రశంఖాది ఉపమాన వస్తువుల నారోపించి స్త్రీ వ్యామోహమున సంసక్తుఁడగును. కాని పద్మాదులగు రమ్యోపమాన వస్తువులయందు మాత్రము అట్టి యానంద మును గాంచఁడు. ఇంకను తనవ్యామోహమునకుఁ గేవల స్త్రీ పురుష వ్యవస్థచే సంతృప్తిఁగాంచక సముద్రపర్వత మేఘచంద్ర గురుబుధాదుల యందు పుంస్త్వము, నదీభూమితారాదులయందు స్త్రీ త్వ ము నారోపించి కథలు నిర్మించి స్వయముగ భ్రాంతుఁడై లోకమును భ్రమిం పఁజేయుచున్నాఁడు. "ప్రేమయందు సుఖముకలదు." అని పలుకునుకాని ఆప్రేమ స్త్రీపురుష శృంగారక్రీడలకే పరిమితముఁజేయును. మాతృ ప్రేమ, పితృప్రేమ మొదలగు సహజనిష్కళంకప్రేమలు వానిదృష్టిపథమును బొందవు. సర్వసాధారణముగ ప్రభువులు, పండితులుమాత్రమే లోకము నుద్ధరింప సమర్థులు. అట్టి వీరిరువురు పతితులుకాగ నిఁకలోకమున కధో గతికాక మఱేమికాగలదు? బుద్ధుఁడు, అశోకుఁడు మొదలగు నేయల్ప సంఖ్యాకప్రభువులో తప్ప మిగిలినవారందఱు దుర్వ్యసన లోలురనుమాట అసత్యముకాఁజాలదు. పాశ్చాత్యులు భౌతికశాస్త్రమున నెట్లునేర్పరులో అటులనే భారతీయులుఁ దత్త్వశాస్త్రమున పండితు లనుమాట ఆధ్యాత్మిక కవులను తప్పించిన వృథారోపిత ప్రభావకల్పితులగు కేవల శృంగారకవులవలన నెట్లు రూఢికాగలదు? ఆధ్యాత్మికకవి లోకమున రాజాశ్రయము నాదరింపక దైవమే శరణ్యమని భావించి దైవబలముచే విరుద్ధప్రవృత్తినుపమింపఁజేసి తనంతఁదానానందించుచుండును. సామాన్య లౌకికజ్ఞానముకల ప్రభువులు కాని ప్రజలుకాని లోకాతీతుఁడగు నట్టి

దేనికి? (వి) బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్,
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా॥ (గీత).

842　పురహరునకు నేతఁ బురువు తా నేసిన, స్థిరముఁగల్గు జ్ఞానజీవమయ్యె
నేతకేమివచ్చె నిజభక్తి హేతువు, విశ్వదాభిరామ వినుర వేమ॥

పురారే ర్వయనా త్సుక్తి రూర్ణనాభే ర్బభూవ హి ।
వయనేన కియాం శ్లాఘ స్వభక్తి ర్వేమ ! కారణమ్ ॥

తా॥ సాలెపురుగు కాళహస్తీశ్వరునకు నేతనేసి యీశ్వరకృపకు పాత్రమయ్యె నంటరు. అప్పట [illegible] దానిభక్తికా? నేతబట్టకా?

843　పంచభూతములను బరఁగ నింద్రియములు, సంచరించినపుడె జగముఁగలుగు
సంచరింపకున్న జగమెట్లుకలుగును?, విశ్వదాభిరామ వినుర వేమ॥

యదా [illegible] సర్వథా।
తదా [illegible] ! కుతో జ్యోతి [illegible] ॥

తా॥ పంచేంద్రియములు [illegible] ప్రాపంచిక సృష్టి కలుగుచున్నది. [illegible] (వి) [illegible] రసనం ఘ్రాణమేవ చ, మనశ్చా [illegible] విషయా నుప సేవతే। గీత।

844　నియతవృత్తిమీఱి నిటలదుర్గముఁ జేర, భయములేకయుండు బ్రహ్మవేత్త
జయముఁగలుగ ముక్తిఁ జవిఁజూచుచుండును, విశ్వదాభిరామ వినుర వేమ॥

అతీత్య నియమం వేమ ! ఫాలదుర్గం ప్రవిశ్య చ ।
నిర్భయో బ్రహ్మవి త్ప్రాప్త జయో ముక్తి మవాప్నుయాత్ ।

తా॥ బ్రహ్మవేత్త నియతిమీఱి నిటలదుర్గము జేరి నిర్భీకుఁడై జయముఁగాంచి ముక్తినొంది బ్రహ్మానందమాధుర్యము జవిఁజూచు చుండును. (వి) భ్రువోర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్ స తం పరం పురుష ముపైతి దివ్యమ్॥ గీత॥

845　దాన మమరఁజేయు దరిఁజేర్చు రత్యాశ, మనము వమ్మొనేరి మాయమునుంచు
జ్ఞానకళికఁ దమ్మఁ జంపును వైరుల, విశ్వదాభిరామ వినుర వేమ॥

తార యేద్ధి కృతం దానం విస్రబ్ధం పంచ యే స్మనః ।
విస్రబ్ధా జ్ఞానకళికా వేమ ! హంతి విరోధినః ॥

తా॥ మనస్సును నమ్మి యేమఱుపాటువహించిన మాయలోముంచును. -్యాగబుద్ధినిఁ గాపాడుకొనుచుండిన నొడ్డునకుఁజేర్చును. జ్ఞానజ్యోతిని వ్యాపింపఁజేసినఁ గామక్రోధాదిశాత్రవుల రూపుమాపును. (వి) ఏతై ర్విముక్తః కౌంతేయ! తమోద్వారై స్త్రిభి ర్నరః,ఆచర త్యాత్మనశ్శ్రేయ స్తతో యాతి పరాం గతిమ్। గీత।

846 తథ్యమైన పూర్ణతత్త్వము నీలోన, మిథ్య నరయఁగాను మిత్రమగును
సత్యనిత్యకర్మసాక్షిబ్రహ్మంబయా, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ ! తథ్యం పూర్ణతత్త్వం మిత్రం మిథ్యావిమర్శినః ।
సత్యం నిత్యం చ యత్కర్మ తత్సాక్షి బ్రహ్మ కేవలమ్ ॥

తా॥ నీలోనఁగలుగు మిథ్యను (మాయను) గుర్తించినఁ దథ్యమగు పూర్ణతత్త్వము మిత్రునివలెఁ దోడ్పడును. సత్యనిత్యకర్మలకు సాక్షి స్వరూపుఁడే పరమాత్మ. (వి) కో దీర్ఘరోగః? భవఏవ సాధో ! 2 కి మౌషధం తస్య?విచార ఏవ॥ శం। ము। యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి, తస్యాహం న ప్రణశ్యామి స చమే న ప్రణశ్యతి। గీత।

847 జెక్కమెత్తిచెప్పు మొక్కఁడే దేవుఁడు, నిక్కముగను లోన నిల్చియుండుఁ
జక్కఁజూచునతని సంతోషమున ముంచు, విశ్వదాభిరామ వినురవేమ॥

ప్రతిష్ఠాప్య ధ్వజం బ్రూహి వేమైకో దేవ ఏవ సః ।
తత్త్వతోంతర్గత స్తిష్ఠేత్ పశ్యంతం తోషయే త్సదా ॥

తా॥ జెండాయెత్తి "దేవుఁ డొక్కఁడే ఆతఁడంతటను నీలోపలను నున్నాఁడు. స్థిరుఁడు. వానిఁగాంచువాని శాశ్వతానందజలధి నోల లాడించును". అని నిస్సందేహముగ నెలుగెత్తిచాటుము. (వి) కౌంతేయ! ప్రతి జానీహి న మే భక్తః ప్రణశ్యతి। గీత।

848 జీవుఁడనఁగమీరు చిక్కులుపడనేల?, వాయు వాకసంబు వహ్నిఁగూడి
దేహియనఁగనొప్పె దేహంబులఁదొప్పి, విశ్వదాభిరామ వినురవేమ॥

జీవః కో వేతి? కిం వేమ ! విమృశంతి నభోఽనిలమ్ ।
వహ్నిం సంగత్య దేహీతి కథ్యతే దేహభాగిహ ॥

తా॥ జీవుఁడనఁ జిక్కుకొనఁ బడుచున్నారు. ఆకాశము గాలి అగ్ని కలిసి దేహమున దేహి యగును. వాని దుమారము అజ్ఞానముఁ దొలఁగిన జీవుఁడే దేవుఁడగును. (వి) మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః, మన షష్ఠా నీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి। గీత।

849 జీవగుణముఁగల్గు జీవంబు బ్రహ్మంబు, సాటివచ్చు టెట్లు సరవిఁజెలియ
నూరికుక్క సింగమొక్కటి యగునొక్కొ!, విశ్వదాభిరామ వినురవేమ॥

జీవో జీవగుణోపేతో బ్రహ్మసామ్యం లభేత కిమ్? ।
గ్రామసింహశ్చ సింహ శ్చ కథం వేమ ! సమౌ భువి ॥

తా॥ జీవలక్షణములుకల జీవుఁడు దేవుఁడు కాఁడు. గ్రామసింహము (కుక్క) సింహము నొకటి యగునా? (వి) పరమః పురుషః పార్థ! భక్త్యా లభ్య స్త్వనన్యయా। గీత।

850 పరముఁగోరవట్టి పామరజనులకు, స్థిరము కాదు బుద్ధి చిక్కఁబోదు
తరముఁగాని పరముఁ దలపోఁతయగు రోఁత, విశ్వదాభిరామ వినురవేమ॥

న వాంఛంతి పరం మూఢా యే తేషాం న స్థిరా మతిః ।
తదశక్యపరాపేక్షా జుగుప్సా వేమ ! కేవలమ్ ॥

తా॥ పరముఁగోరని పామరులకు బుద్ధి స్థిరముగనుండదు. స్థిరబుద్ధికిఁగాని పరము గోచరింపదు. అస్థిరబుద్ధులు పరముఁగోరుటయే రోఁత(వి) కో వా జ్వరః? ప్రాణభృతాం హి చింతా। (శం। మణి)

851 పదునుగలుగ మ్రాను పచ్చనైయుండును, తావిగలుగ లంజె యింటనుండు
తలఁపుఁగలుగ హరియుఁ దనచెంద్దనేయుండు, విశ్వదాభిరామ వినురవేమ॥

యద్వార్ద్రితా వేమ! మూలే హరిత స్స్యా త్సదా తరుః ।
దానా ద్గృహే వసే జ్జారా స్మృతౌ స్యా ద్ధరి రంతికే ॥

తా॥ పదునుకలిగియున్నఁ జెట్టు పచ్చగ నుండును. ఇచ్చుచుండిన నుంచుకొన్నది యింటఁబడియుండును. భక్తికలిగియున్న భగవంతుఁడును బ్రక్కనేయుండును.

852 జీవులెల్ల మంచు జీవాత్మపరమాత్మ, లకనెఱుంగఁబాపజలధిఁబడరు
నావ నడుపువాఁడు నట్టేటముసఁగునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

అ... ...వా...ని ... ...జీవాత్మపరమాత్మనోః ।
వేమా... ... ... ...న్నాని...కో...బుధా ॥

తా॥ జీవాత్మపరమాత్మలసంబంధ... ...జాతిసముద్రమున మును(
గడు. నావను ...డు... నేర్చినా... ...టు మునుగునా? (వి) యథా
జలం జలే క్షిప్తం ...ం ... ... ...మ్, అవిశేషో భవేత్తద్వ
జ్జీవాత్మ పరమాత్మనోః। ఉ। గీత।

853 కాలధర్మమెఱిఁగి కపటవృత్తులుమాని, ...లుపిల్లలందు నాశవదలి
మేలుగాను శివుని మేల్కొని చూడుము, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ! జ్ఞాత్వా కాలధర్మ ముత్సృజన్ కూటచేష్టితమ్।
త్యక్త్వా దారసుతాద్యాశాః పశ్య జాగృత్య తం శివమ్॥

తా॥ కాలపరిస్థితిఁదెలిసి కపటవృత్తులు విడి సతీసుతాదిమమకారములఁ
ద్యజించి అజ్ఞానతమస్సునుండి నిద్రమేల్కొని పరమేశ్వరుఁగాంచిన మేలు
చేకూరఁగలదు.(వి)అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్,
విముచ్య నిర్మమ శ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే॥ గీత॥

854 ఆకువక్క సున్న మవిమూఁడువన్నెలు, నేకమైనచోటఁ దాకు నెఱుపు
సోకి త్రిగుణ మట్లు శోభించుఁ బరమాత్మ, విశ్వదాభిరామ వినురవేమ॥

పత్రపూగసుధాద్రవ్య త్రివర్ణైక్యేన రక్తిమా ।
భవే ద్వేమ! తథైవాత్మా శోభేత త్రిగుణైర్యుతః ॥

తా॥ తెల్లనిసున్నము ఎఱ్ఱనివక్క పచ్చనియాకుఁ గలిసి యెఱ్ఱని
తాంబూల మగును. అట్లే సత్త్వరజస్తమో గుణముల సంపుటియే
పరమాత్మ. (వి) ఉదాసీనవ దాసీనో గుణై ర్యో న విచాల్యతే, గుణా
వర్తంత ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే॥ గీత॥

855 బ్రహ్మఘటము మేను ప్రాణంబు దగ గాలి, మిత్రచంద్రశిఖులు నేత్రచయము
మఱియు బ్రహ్మమనఁగ మహిమీఁదలేదయా?, విశ్వదాభిరామ వినురవేమ॥

బ్రహ్మాండం స్యా ద్వేమ! దేహం ప్రాణస్తు పవన స్తథా।
అక్షీ ణ్యర్కేందుశిఖినో బ్రహ్మైత దితరం కుతః?॥

తా॥ శరీరము బ్రహ్మాండము, ప్రాణము గాలి, నేత్రములు సూర్య చంద్రాగ్నులు.జీవుఁడు పరమాత్మ. ఇదంతయు నిచటనే యున్నది. (వి) త త్త్వం కిమేకం? శివ మద్వితీయం 2 ఇదం శరీరం కౌంతేయ! క్షేత్రమి త్యభిధీయతే, ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః। గీత।

856 పుడమి యుప్పరంబుఁ బురికొని జగముల, రక్షసేయఁగల్గు రాజు లెవరు?
మహీపతియనుపేరు మనుజున కెట్లగు?, విశ్వదాభిరామ వినురవేమ॥

పృథివ్యా నభసా వేమ! జగద్వ్యాప్తం సమంతతః।
అవితుం కే తు రాజానః మహీపాఖ్యా నరస్య కా॥

తా॥ భూమ్యాకాశముల మధ్యప్రదేశమంతయుఁ బాలించుప్రభువునకు భూపతియనుపేరు సార్థకముకాని మానవమాత్రున కదెట్లు సార్థకము?

857 పతనమొందునట్టి పక్వఫలంబును, బట్టితినఁగలాఁడు పచ్చికాయ
కాస పడనిరీతి నైహికముందును, విశ్వదాభిరామ వినురవేమ॥

సుపక్వఫలభోక్తా య శ్శలాటో ర్వేమ! ఖాదనే।
నేహాం స కురుతే తద్వత్ నైహికే వర్తతే యతిః॥

తా॥ పరిపక్వఫలము భుజింపఁదలంచునతఁడు పచ్చికాయ కాశపడనట్లు పరిపూర్ణబ్రహ్మానంద మనుభవింపఁజూచు నతఁ డైహికముల కిచ్చగింపఁడు.

858 పతగ మితరజంతు వితతికంతకుమేటి, యగునె? రెక్కలుండి మెగురకున్న
పట్టియోగి యిట్టివైఖరివాఁడయా, విశ్వదాభిరామ వినురవేమ॥

అంతరిక్షే న గచ్ఛే చ్చేత్ ఘనతా కాస్తి పక్షిణః?।
యో వ్యర్థాడంబరో యోగీ స వేమైతాదృశః ఖలు॥

తా॥ రెక్కలుండి యెగురలేనిపక్షిని జంతువులకన్న మిన్నగ భావించనియట్లు ప్రభావసంపన్నుఁడు కాని యోగిని మానవులకన్న మిన్న యనము. (వి) యోగినామపి సర్వేషాం మద్గతే నాంతరాత్మనా, శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః॥ గీత॥

859 నివురుగప్పినట్లు నిశ్చలభక్తితోఁ, దగిలియుండ ముక్తి తానెవచ్చు
జగతినొప్పఁజెప్ప జాణయుమతిలేఁడు, విశ్వదాభిరామ వినురవేమ॥

భస్మచ్ఛన్నాగ్నిసంకాశో వేమ! య స్స్థిరభక్తిమాన్ ।
తస్యాయాతి స్వయం ముక్తిః న లోకా మోదకృ జ్జనః॥

తా॥ నివురుగప్పు నిప్పువలె నిశ్చలభక్తితో నుండ ముక్తి తనంతటదే పొందును. ఈపాడులోకమునకు నచ్చఁజెప్పవలెనను నభిలాషఁ బెట్టుకొనకుము. దీనికి నచ్చఁజెప్పు నెఱజాణ యెవ్వఁడును లేఁడు. (వి) తుల్యనిందా స్తుతి ర్మౌనీ. సంతుష్టో యేన కేనచిత్, అనికేతస్స్థిరమతి ర్భక్తిమాన్ మే ప్రియో నరః। గీత।

880 నరుఁడయైన లేక నారాయణుండైనఁ, దత్త్వబద్ధుఁడైన ధరణివరయ
మరణమున్న దనుచు మదిని నమ్మఁగవలె, విశ్వదాభిరామ వినురవేమ॥

నరో నారాయణోవాపి తత్త్వబద్ధోపి వా భువి ।
వేమాస్తి మరణం నూన మితి చేతసి విశ్వసేత్ ॥

తా॥ నరుఁడుకాని నారాయణుఁడుకాని జ్ఞానికాని యజ్ఞానికాని పుట్టిన దేహికి మరణము నిశ్చయము. (వి) జాతస్య మరణం ధ్రువమ్.

881 తరుణియంగమెల్లఁ బురుషుఁడెఱుంగును, బురుషునంగమెల్లఁ బొలఁతి యెఱుఁగుఁ
జీరకట్టుకున్న సిగ్గేనొ యెగ్గేనొ, విశ్వదాభిరామ వినురవేమ॥

తరుణ్యంగం పుమాన్వేత్తి పురుషాంగం తథాంగనా ।
వస్త్రధారణమాత్రేణ కా లజ్జా? వేమ ! కా వ్యథా?॥

తా॥ మానరక్షణకే వస్త్రధారణకాని పురుషమర్మము స్త్రీకి స్త్రీమర్మము పురుషునకుఁ దెలియనిది కాదు. మానావమానముల కతీతుఁడగు యోగికి దానిసంబంధము కనఁబడదు. (వి) సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః, శీతోష్ణసుఖదుఃఖేషు సమ స్సంగవివర్జితః।

882 డాగుపడినపండు బాగులేదందురు, అట్టిడాగు తమది యరయలేరు
తమ్ము మెంచువారు తమడాగుకానరు, విశ్వదాభిరామ వినురవేమ॥

ఫలం కలుషితం వేమ ! న సాధ్వితి వదంతి హి ।
స్వకల్మషం న మన్యంతే నాత్మశ్లాఘీ స్వదోషవిత్ ॥

తా॥ తమ్ము గొప్పగఁదలంచువారు తమయపకీర్తియను మచ్చను గుర్తింపలేరు. డాగుపడిన పండును వాడుదుమా?

863 టక్కరియోగియెంత టాటోటుఁజేసిన, వివర మఱసినంత వెగటుగల్గు
పరముకున్న నరకబాధయు సిద్ధంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

యది కుర్యాద్వృథాట్యాటం హేయం స్యాత్కూటయోగినః।
పరం శూన్యం తస్య వేమ! భవేచ్చ నరకవ్యథా ॥

తా॥ టక్కరి యోగి యెంత తమాషాచేసినను వానిపద్ధతి తెలిసినమీదట వెగటుఁ గల్గించును. వానికి నిహపరసుఖములుండవు. నరకబాధ తప్పదు.

864 చనఁగఁజనఁగఁదాకుఁ జనుతోత్రివలోఁగాశి, వినఁగవినఁగఁ బ్రణవవిధశరవశి
కనఁగఁగనఁగఁ బుట్టుకారణ మగపడు, విశ్వదాభిరామ వినురవేమ॥

యాతేయాతే వ్రజేత్కాశీం ప్రణవం చ శ్రుతేశ్రుతే ।
దృష్టేదృష్టే వేమ! సృష్టేః కారణం దృశ్యతే స్వయమ్ ॥

తా॥ పోఁగా పోఁగాఁ గాశీ (భ్రూమధ్యస్థానము) త్రోవలోఁదగులును. వినఁగా వినఁగాఁ బ్రణవనాదము వినఁబడును. చూడఁగాచూడఁగా సృష్టికి నాదికారణమును గోచరించును. (వి) యథా ప్రకాశయ త్యేకః కృత్స్నం లోక మిమం రవిః, క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత!

865 ఘటముజలములందు గగనంబుఁగాన్పించు, ఘటపుజలములేమి గగనమేది?
ఘటములోనిజ్యోతి క్రమమునఁజూడుము, విశ్వదాభిరామ వినురవేమ॥

ప్రతిబింబో ఘటజలే బింబోనాస్తి జలాస్థితా
జ్యోతి ర్వేమ! ఘటాంతస్థం క్రమశః పశ్య నిశ్చలమ్ ॥

తా॥ నీటికుండయున్న నాకాశము ప్రతిబింబించును. కాని లేకున్నఁ బ్రతిబింబించదు.అట్లే యీఘటము(శరీరము)నందలిజ్యోతిస్స్వరూపమును గ్రమమునఁ గాంచుము. (వి) యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే, శరీరస్థోఽపి కౌంతేయ! తథాత్మా నోపలిప్యతే। గీత।

866 గొఱ్ఱెలుపదివేలు కూడఁయుండినచోటఁ, దల్లినెఱఁగివచ్చు దానికొదమ
పరమయోగినెఱఁగి భక్తుఁడున్వచ్చును, విశ్వదాభిరామ వినురవేమ॥

సహస్రమేషీసంఘాతే వేమైకత్రస్థితేఽపి చ ।
జ్ఞాత్వాంబామేతి వచ్ఛాబో భక్త స్సద్యోగినం తథా ॥

తా॥ పదివేలగొఱ్ఱెల మందయందును గొఱ్ఱెపిల్ల తల్లిని గుర్తించి చేరునట్లు భక్తుఁడును బరమయోగిని గుర్తించి చేరఁగలఁడు.

867 గుహలలోనఁజొచ్చి గురువును వెదకంగఁ, గ్రూరమృగము కంటఁ దారసిలిన
ముక్తిదారి యదియె ముందుగాఁజూపును, విశ్వదాభిరామ వినురవేమ॥

గుహాః ప్రవిశ్య వేమేనా గుర్వన్వేషణకాంక్షిణః ।
యది క్రూరమృగాప్తిస్స్యాత్ మార్గం ముక్తేస్స దర్శయేత్ ॥

తా॥ గుహలఁజేరి గురువును వెదకు నజ్ఞానికి నక్కడ క్రూరమృగమేదైనఁ దారసిల్లిన నది ముక్తిమార్గము మొదటనే చూపును.

868 కస్తురివలపేల గజరాజమునకన్నఁ? దనదుమదపుధార తావికాక
యోగికేల రంభ యోగహర్షంబుండ? విశ్వదాభిరామ వినురవేమ॥

కిం కస్తూరీసుగంధేన? వినా స్వమదసౌరభమ్ ।
గజస్య యోగహృష్టస్య రంభయా వేమ! కిం మునేః? ॥

తా॥ మదపుటేనుగునకుఁ దన మదధారాపరిమళంబుండ వేఱె కస్తూరీమమకారముతో దానికిఁ బనిలేనట్లు యోగికి సమాధివలనఁగలుగు బ్రహ్మానందంబుండ వేఱె రంభాసంభోగసుఖకాంక్ష యెందుల కుండును?

869 కలుపుఁదీసి నరులు కాపాడి పైరులఁ, బెంచు పేర్మి మనలెను బెనిచి మదిని
దృశ్యములనుదుంచి తెంపుగానుండుము, విశ్వదాభిరామ వినురవేమ॥

సస్యం రక్షే న్నరో వేమ! యథోద్ధృత్య తృణాదికమ్ ।
తథా ఛిత్త్వా దృశ్యజాలం మనో వర్ధయ నిస్పృహః ॥

తా॥ రైతులు కలుపుఁదీసి చక్కఁగాఁ బైరులఁబెంచి ఫలిత మనుభవించునట్లు బాహ్యదృశ్యములఁ ద్రుంచి నిస్పృహుఁడవై బ్రహ్మానంద సుఖ మనుభవింపుము.

870 కలుగుసుఖములెల్లఁ గల్లగాఁ దలఁచుచు, మెలగుచుండవలయు మిహిరుపగిదిఁ
దిరుగుచేర్పుఁజూడ ధీరుఁడె యగునయా, విశ్వదాభిరామ వినురవేమ॥

ప్రాప్తాని సర్వసౌఖ్యాని మిథ్యారూపాణి భావయన్ ।
చరే ద్భాస్కరవ ద్వేమ ! ధీర స్సంచారకోవిదః ॥

తా॥ కలుగుసుఖములన్నియుఁ గల్లలుగా భావించు విడుచుచు, ధీరుఁడై సూర్యునివలె విధ్యుక్తకర్మమున సంచరించుచునే యుండవలెను.

871 ఈనినట్టిపులినిఁ బూనిచంపఁగవచ్చు, మనసుమర్మ మరసి కనఁగవచ్చు
తారకంబుమఱగి తగులుటసాధ్యమా?, విశ్వదాభిరామ వినురవేమ॥
వేమ ! వ్యాఘ్రీ ప్రసూతాపి హంతుం శక్యా ప్రయత్నతః।
వేత్తుం శక్యం మనోమర్మ న తారకగతి స్తథా ॥

తా॥ ఈనినపులినిఁ జంపవచ్చు. అసాధ్యమగు మనస్సు మర్మముఁ దెలిసికొనవచ్చు. కాని తరించుమార్గము విడువక యాసక్తితో బ్రహ్మ పదార్థమును గాంచి సుఖించుట సులభసాధ్యముకాదు.

872 తోలుఘటములోనఁ దొలఁగకయున్నప్పు, డాలుమగలు ప్రీతి నలరుచుండ్రు
జీవి ఘటమువిడువఁ జిక్కు-డిపోవురా, విశ్వదాభిరామ వినురవేమ॥
యావచ్చర్మఘటస్థా స్తః తావత్సక్తౌ సతీపతీ।
విముంచతి ఘటం జీవే సంబంధో వేమ ! నశ్యతి॥

తా॥తోలుకుండ (శరీరము) లోనుండి తొలఁగకయున్నప్పుడే యాలు మగలసంబంధము.జీవి ఘటమువిడిచిన నాసంబంధము తనంతఁదానేపోవును

873 చమురురాచుకొన్నఁ జర్మంబుమెఱుగెక్కు, సామువేయ మేను సత్తువెక్కు
జ్ఞానమార్గ మెఱుఁగఁ గడతేరు జన్మంబు, విశ్వదాభిరామ వినురవేమ॥
త్వగ్భాతి స్నేహసంలిప్తా వ్యాయామేన బలం తనోః।
జ్ఞానమార్గే పరిజ్ఞాతే స్యా ద్వేమ ! సఫలం జనుః ॥

తా॥ చమురురాచుకొన్నఁ జర్మము నునుపెక్కుమ. సాముఁజేసిన శరీరమునకు సత్తువెక్కును. అట్లే జ్ఞానమార్గ మెఱిఁగిన జన్మము కడతేరును.
(వి) సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి। గీత।

874 ఖచరవరులు భువినిఁగనపడరందురు, కానవచ్చినంత గౌరవింతొ్రా?
తల్లిదండ్రిగురులుఁ దత్సముల్ గారొకో! విశ్వదాభిరామ వినురవేమ॥
ఖేచరాస్తు న దృశ్యంత ఇతి వేమ ! బ్రువంతి హి।
కి మాద్రియంతే? తాన్ దృష్ట్వా పిత్రాద్యాః కిం న తత్సమాః?॥

తా॥ దేవతలు మానవులకీలోకమునఁ గనఁబడరందురు. కనఁబడిన గౌర వింతురు కాఁబోలు. తల్లి దండ్రి గురువు దేవతలతో సమానులుకారా?

875 కాయ మున్నయపుడె కామాదులను ద్రోసి, జ్ఞానమార్గమునకుఁ గడఁగవలయు
జాగుఁ జేయఁ గాయ మేగిన నేమగు? విశ్వదాభిరామ వినురవేమ॥

దేహే స్థితే హి కామాదీన్ ఛిత్వా జ్ఞానపథాయ చ ।
యతేత వేమాలస్యేన కాయాపాయే తు కిం ఫలమ్? ॥

తా॥ శరీరమున్నపుడే కామక్రోధాదుల రోసి జ్ఞానమార్గమునకుఁ బ్రయత్నింపవలెను. జాగుఁజేసిన శరీరమూడిన మఱల నిట్టి సదవకాశము లభ్యమగునా? (వి) శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్।

876 ఎట్టియోగియైన నిల మన్మథావస్థ, తెలియవచ్చెనేనిఁ దేటగాను
యోగమెల్లమండి జోగియై పోదగు, విశ్వదాభిరామ వినురవేమ॥

యోగినోఽపి స్మరావస్థా విస్పష్టా దృశ్యతే యది ।
నష్టయోగో భవే ద్వేమ ! భ్రష్టత్వం ప్రాప్నుయా త్తదా॥

తా॥ ఎట్టియోగియైన మన్మథావస్థకలిగిన యోగము మండి పనికి మాలిన జోగియై చెడును. (వి) జ్ఞాతుం న శక్యం చ కిమస్తి సర్వైః? యోషిన్మనో యచ్చరితం తదీయమ్. 2 విజ్ఞాత మహావిజ్ఞతమోస్తి కో వా? నార్యా పిశాచ్యా న చ వంచితో యః। (శం। మణి)

877 ఈషణత్రయంబు విడపంగ నేరక, మోహరాశిలోన మునిఁగియుండు
జనుల కెట్లు మోక్షసౌఖ్యంబు గల్గును?, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమేషణత్రయం త్యక్తుమశక్తానాం సమంతతః ।
నృణాం మోహాబ్ధిమగ్నానాం కథం మోక్షసుఖం భవేత్? ॥

తా॥ దారేషణ ధనేషణ పుత్రేషణములనెడు నీషణత్రయమునఁ జిక్కి మోహసముద్రమున మునిఁగియున్న జనుల కెట్లు మోక్షసౌఖ్య మబ్బును?

878 ఈశుమీఁద భక్తి యిసుమంతలేకను, పాశములను జిక్కి ఫలముఁ గనక
కాశియాత్రఁ బోవఁ గాలుఁ డెఱుంగఁడా?, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమాత్యల్పాం శివేభక్తి మకుర్వన్ మోహపాశగః ।
ఫల మప్రాప్య యః కాశీం యాతి వేత్తి న కిం యమః? ॥

ఆధ్యాత్మికకవిని నెట్లాదరించఁగలరు? ప్రభువుల మనస్తత్త్వము గుర్తించి రచనలు సాగించిన కవు లనేకాగ్రహారాదిదానములఁ బ్రభుసత్కారములఁ బడసిరి. లోకపరిపాటి యీవిధముగనే కనబడుచున్నది.

వేమన తన కవిత్వమున సహజోపమాలంకారాది చమత్కృతులఁ గనబరచెను. అయినను శ్రీ సి. పి. బ్రౌన్ మొదలగు లోకజ్ఞులచే రచింపఁ బడిన ఆంగ్లాదివ్యాఖ్యలచే వేమనకవి తనసాహిత్యముతో విద్యాధికుల దృక్పథమునుపొందెను. కాదేని వేమన సాహిత్యమునకు నేగతి పట్టి యుండెడిదో! వేమనయోగి తానేపలుకువాడుగఁ దానేవినువాఁడుగను "సర్వంఖల్విదం బ్రహ్మేతి" సూత్రము ననుసరించి జ్ఞానము లోకమంతట ప్రకాశింపఁజేసెను. అందువలననే వేమనపద్యములు ఆత్మబోధామృత రూపములు, సర్వోపనిషత్సారభూతములు, సద్యోమోక్షప్రదములు అని వ్యవహరింపఁబడెను.

ప్రకృతిపరిశీలనశక్తి, సృష్టితత్త్వవిజ్ఞానము, శబ్దశాస్త్రపరిజ్ఞానము భావసంశుద్ధి, కల్పనాపటిమ, వర్ణనాచాతురి, ఉపమానసంధానపాటవము, ప్రభుమిత్రకాంతాసమ్మితబోధనము, వాస్తవికస్థితిగ్రహణము, వచస్సౌల భ్యము, సహజధార, లోకకల్యాణాశయము మొదలగు కవిజనాశ్రయ ములగు ననేక గుణములు వేమనకవిపుంగవునియందుఁ గనబడుచున్నవి.

ఒకానొకప్పుడు విశ్వమానవహృదయకుహరముల నేవేద మానంద చంద్రికలవెదజల్లినదాయెనో దాని ప్రభావము, అప్పుడు ప్రతిష్ఠింపఁ బడిన యేయార్యపవిత్రధర్మవిజయధ్వజముకలదో దాని ప్రభావమును, క్రమముగఁగాలగర్భమున నస్తమించినదాయెను. కేవల పామరజన గ్రాహ్యపౌరాణికాచారము లంతటవ్యాపించెను. అందువలన నార్యుల ఆధ్యాత్మికశక్తి, పురుషార్థప్రవణతయు నష్టమైనవి. తత్త్వజ్ఞానమునశించి మిథ్యాజ్ఞాన మభివృద్ధిజెందెను. అన్యోన్యసహకార మంతరించి గురులఘు భావముచే నసూయయు లోకమందభివృద్ధిఁజెందెను. ఏభారతీయార్యజాతి పూర్వమొకప్పుడు అనుభవపూర్వకముగ యావత్ప్రపంచమునకు స్వాతంత్ర్య సందేశమొసంగెనో అట్టి భారతీయార్యజాతి భావదాస్య వశమున నిర్వీర్యమైన దాయెను, అనుస్యూతాచారవశమున శ్వవృత్తి

తా॥ పరమేశ్వరభక్తిలేక మోహపాశములఁజిక్కి యిచ్చట ఫలితముఁ గాంచక కాశియాత్రికుఁబోయినమాత్రమునఁ గాలస్వరూపియగు భగవంతుఁ డతని నెఱుంగకుండునా?

879 ఈఁతరాని మనుజుఁ డెగరోజి దిగరోజి, యేఱుదాటఁగలఁడె? యీదఁబోయి
ప్రజ్ఞలేనివాఁడు పరలోకమందునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

అలబ్ధతరణోపాయో వ్యర్థాయాసో నదీజలమ్ ।
కథం తరతి ? వేమైవ మజ్ఞాన్యాప్నోతి కిం పరమ్?॥

తా॥ ఈఁతరానివాఁడు ఎగరోజి దిగరోజి యేటిలో మునుఁగును. కాని దాటలేఁడు. అట్లే ప్రజ్ఞలేని పామరుఁడును బరలోకసౌఖ్యముఁ బొందఁజాలఁడు. (వి) శల్యం పరం కిం? నిజమూర్ఖతైవ। (శం॥మణి)

880 ఇహమునందు సుఖము లీడేరఁగాలేదు, పరము నమ్మికేని బ్రతుకఁగలదె!
మొదటలేనిసుఖము తుది నెట్లు కలుగును?, విశ్వదాభిరామ వినురవేమ॥

సుఖం న ప్రాప వేమేహ విస్రీభ్య చ పరం తతః ।
కిం జీవనేన నాదౌ య త్సుఖ మంతే కథం భవేత్?॥

తా॥ ఇహమునం దేవిధమగు సుఖమును బొంద లేఁడు. అట్టివాఁడు పరము నమ్ముకొనిన నాసుఖమునుమాత్రముఁ బొందఁగలఁడా? మొదట లేని సుఖము తరువాత మాత్ర మెట్లు రాఁగలదు?

881 ఇంద్రలోకమనఁగ నింద్రజాలమనఁగ, నింద్రపదవియనఁగ నిన్నిరొక్కటె
కలియుగమున నరులు కానరు భ్రమచేత, విశ్వదాభిరామ వినురవేమ॥

ఇంద్రలోక శ్చేంద్రజాలం వేమేంద్రి పదవీ తథా ।
ఏతత్సర్వం సమం భ్రాంత్యా న పశ్యంతి నరాః కలౌ ॥

తా॥ ఇంద్రలోకమన్నను, ఇంద్రజాలమన్నను, ఇంద్రపదవియన్నను నొక్కటే. భ్రాంతిచేఁ గలిని మానవులు దీనిని గుర్తింపఁ జాలకున్నారు.

882 అస్థిరమగు మేని కదలుపాటులనొంది, పెక్కువిధుల నెంచి యెంచి
యస్థిరమ్ము లేక యుడివనక్కఱలేమ్ము, విశ్వదాభిరామ వినురవేమ॥

అస్థిరం దేహ మాలోక్య వేమ ! దర్పసమన్వితః ।
సమ్యగ్ కస్యం పర్స్య దత్తేఽంతే వహ్నౌ యే వా శివాశయే॥

తా॥ అస్థిరమగు నీశరీరమును నదరిపడుచు ననేకవిధములఁ బెంచి పెంచి తుదకు నగ్నికో యడవినక్కలకో సమర్పించును.

883 క్షమగలట్టియతఁడు సాధువై శోభిల్లు, నోర్పుఁబోలునట్టిదుర్విఁగలదె?
కన్నివచ్చు మేలు లెన్నైన నొనగూడు, విశ్వదాభిరామ వినురవేమ॥

క్షమావాన్ యాతి సాధుత్వం నాస్తి కాఽపి క్షమా సమా।
క్షమయా వేమ! కీర్తి స్స్యాత్ శ్రేయాంసి బహుళానిచ॥

తా॥ ఓర్పునుబోలు మంచిగుణము మఱొకటిలేదు. ఓర్పుగలవాఁడే సాధువనఁబరగును. తేజశ్శాలియగును. లాభములఁబొందును.

884 హేమనగము చేత నెప్పుడుఁగలవాఁడు, వెండికొండమీఁద వెలయువాఁడు
ఎత్తవలసె బిచ్చ మేమనవచ్చురా, విశ్వదాభిరామ వినురవేమ।

యస్య హస్తే కాంచనాద్రిః నివాసో రజతాచలే।
సోఽపి వేమావశో భూమౌ భిక్షార్థం వ్యచరత్ ఖలు॥

తా॥ బంగారపుకొండ(ధనుస్సుగా)చేతియందుఁగలవాఁడు. వెండికొండ మీఁదఁ గాపురముఁ జేయువాఁడు నగు శివుఁడు బిచ్చమెత్తవలసివచ్చెను. ఇఁకఁ జెప్పెడిదేమి!

885 సుఖములెల్లఁదెలిసి చూడంగ దుఃఖముల్, పుణ్యములును బాపపూర్వకములె
కొఱతమీఁదిదొంగ కోర్కెలవిధమయా, విశ్వదాభిరామ వినురవేమ॥

సుఖాని వేమ! సర్వాణి దుఃఖాంతాని తథైవ చ
పుణ్యాని పాపరూపాణి శూలే చోరమనోరథాః॥

తా॥ సుఖములును దుఃఖముఁ గల్గించునవే. పుణ్యకార్యములును బాపముఁ గల్గించునవే. సంసారికాంక్షలు కొఱతవేయఁబడిన దొంగ యొక్క కోరికలవంటివే సుమా.

886 సాహసమువలనైన సత్యముచేనైన, మోహబుద్ధివిడిచి ముక్తినెఱిఁగి
చిత్తమునను గురుని నిలకొలుపుచుండుము, విశ్వదాభిరామ వినురవేమ॥

సత్యేన సాహసేనాపి త్యక్త్వా మోహమతిం బుధ!।
జ్ఞాత్వా ముక్తిం వేమ! చిత్తే గురుం స్థాప్య ప్రవర్తయ॥

తా॥ సాహసముచేఁగాని ఋజుత్వముచేఁగాని మోహమును వీడి ముక్తి మార్గము నెఱిఁగి మనస్సును నిలిపి సద్గురువు నాశ్రయించి తరింపుము.

887 సవతితల్లిచూడ సాడుల నెఱపును, స్వంతతల్లివలెను సైపదెపుడు
వింత లణఁచి లోన విజ్ఞానమందుము, విశ్వదాభిరామ వినురవేమ॥

సపత్నీజననీ వేమ ! సదా రంధ్రగవేషిణీ।
న స్వమాతేవ సహతే హ్యాభ్యాంతో జ్ఞాన మాప్నుహి॥

తా॥ సొంతతల్లి సహనముఁజూపినట్లు సవతితల్లి చూపక చాడీలుచెప్పును. కన్నతల్లివంటి నీయంతఃకరణమును నమ్మి విజ్ఞానమందుము. సవతితల్లి వంటి వింతల (బాహ్యాదృశ్యముల) నమ్మకుము.

888 శక్తికలుగుపనులు చక్కఁగా నెఱవేరు, భక్తికలుగుపూజ ఫలమునిచ్చు
యుక్తికలుగుమాట యొప్పును భువిలోన, విశ్వదాభిరామ వినురవేమ॥

సక్త్యా సమ్యక్క్రియా లభ్యా భక్త్యా పూజా ఫలప్రదా।
యుక్త్యా చ సహితం వేమ ! వచనం రాజతే సదా॥

తా॥ సామర్థ్యముకల పనులు నెఱవేరును. యుక్తికలుగుమాట శోభిల్లును. భక్తికలుగుపూజ ఫలితమిచ్చును.

889 శ్వాస లాగి విడిచి సాధింప నేర్చిన, మోసపోక ముక్తి మూటఁగట్టు
దోసకారిగుణము గాసిఁబెట్టకపోదు, విశ్వదాభిరామ వినురవేమ॥

యో వేమ ! నిర్జితశ్వాసః సాధితుం శక్నుయాత్ ఫలమ్।
స ముక్తిం యాతి నిర్మోహో దుర్గుణః కిం న బాధతే ?॥

తా॥ దుర్గుణము బాధపెట్టకపోదు. వాయుసాధకమున మనస్సును లొంగఁదీసిన మోసపోక ముక్తి మూటఁగట్టవచ్చును. (వి) మనః కృతం కృతం మన్యే న శరీరకృతం కృతమ్, యేనై వాలింగితా కాంతా తేనై వాలింగితా సుతా।

890 వీరశైవధర్మవిధము లెఱింగియు, బ్రహ్మవిద్యమీఁదఁబరఁగఁగాని
తెలిఁగి పులికి బంటు సింగపుఁబిల్లయా, విశ్వదాభిరామ వినురవేమ॥

య స్తు ధర్మాన్ వీరశైవాన్ వేత్తి స బ్రహ్మవర్త్మని।
యది తిష్ఠే చ్చరే ద్వేమ ! సింహో ...

తా॥ త్యాగబుద్ధికల వీరశైవధర్మమెఱిఁగి యాపై బ్రహ్మవిద్యమీఁద నాసక్తి కలిగినఁ బులికి సింగపుఁబిల్ల బంటుగా నున్నట్లుండును.

891 రాయిరాయిఁజేర్చి రాయఁగారాయఁగా, నున్నయైనయట్టు లన్నిపనులుఁ
బాటుఁజేసినంత పరిపాటియగునయా, విశ్వదాభిరామ వినురవేమ॥

శిలాయాం శిలయా వేమ! ఘర్షితాయాం ముహుర్ముహుః।
స్నిగ్ధం యథా తథా కార్యకరణాత్ స్యాత్ప్రయోజనమ్॥

తా॥ రాయియు రాయియు జోడించి రాపాడించిన నున్నగా నగునట్లు సమస్తకార్యములు సాధించినకొలఁది నెఱవేరఁగలవు.

892 బంటుతనముఁగాదు బలముతోఁ గట్టగా, వెంటనుండి మనసు వెతలఁబరచు
నింటగెల్చి రచ్చ నిల గెల్వవలెనయా, విశ్వదాభిరామ వినురవేమ॥

న పౌరుషం బలా ద్వేమ? బహిశ్శత్రువిదారణమ్।
వ్యథతేఽంతర్మనో గేహే జిత్వా వీథ్యాం జయే త్ఖలు॥

తా॥ మనస్సు తనతోనుండి బాధల నొందించును, అది జ్ఞానముచేతనేకాని శరీరబలముతో లొంగదు. ఇంటగెల్చి రచ్చ గెలువవలెను.

893 అరుణు నుదయసంఖ్య యస్తమానపుసంఖ్య, జననమరణసంఖ్య జాతిసంఖ్య
దీని నెఱిఁగి యోగి ధీరుఁడైయుండును, విశ్వదాభిరామ వినురవేమ॥

సూర్యోదయాస్తంభావానాం జాతీనాం మృత్యుజన్మనామ్।
సంఖ్యాం జ్ఞాత్వా వేమ! యోగీ ధీరస్సన్ వర్తతే సదా॥

తా॥ ఎన్ని సూర్యోదయములు, ఎన్ని సూర్యాస్తమయములు, ఎన్ని జననములు, ఎన్ని యుపాధులు, వీని నెఱింగియే యోగి ధీరుఁడగును.

894 పతులఁజూచెఁజూడ సంసారి కాఁగోరు, సుతులు పుట్టఁ బుట్ట వెతలఁబడును
గతులఁజెడఁగఁజెడఁగఁ గర్మమం చేడ్చును, విశ్వదాభిరామ వినురవేమ॥

ముహుర్దృష్టాసు యోషిత్సు వేమ! సంసారితాం వ్రజేత్।
సుతోదయే వ్యథా మియాత్ భ్రష్టః 'కర్మేతి, రోదితి॥

తా॥ స్త్రీలఁ జూచినకొలఁది సంసారి కాఁగోరును. పిల్లలు పుట్టినకొలఁది కష్టములపాలగును. కలిసిరానప్పుడు 'నాకర్మ' అని యేడ్చును.

895 మానసమున మంచి మల్లెపూలచవికె, బావిఁదోటఁజేసి బాలఁగూడి
భోగినయ్యెదననఁ బోయెఁబో కాలంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

మల్లికామండపం వాపీం వనం నిర్మాయ కన్యయా ।
రమేఽహమితి వేమైవం చింతత స్సమయో గతః ॥

తా॥ మనస్సులో "మంచి మల్లిపూలతోటవేసి యందలి నూతియొద్దున నరపపై చక్కని కన్నెపిల్లతో హాయిగాఁ గాలము గడుపుదు" నని యనుకొనుచుండఁగనే కాలము తీరిపోవును.

896 మర్మమెఱుఁగలేక మతములు కల్పించి, యుర్విజనులు దుఃఖమొందుచుండ్రు
గాజుటింటఁ గుక్క కళవళపడురీతి, విశ్వదాభిరామ వినురవేమ॥

మర్మానభిజ్ఞా వేమోర్వ్యాం కల్పయిత్వా మతాని చ ।
శోచంతి హి జనాశ్శ్వేవ భ్రాంతః కాచకృతే గృహే ॥

తా॥ గాజుటింటఁ దన ప్రతిబింబములఁ జూచి కుక్క కలవరపడునట్లు రహస్య మెఱుఁగక మతములు కల్పించుకొని జనులు దుఃఖ మొందుచున్నారు. (వి) ఉద్ధరే దాత్మ నాఽఽత్మానం, నాత్మాన మవసాదయేత్, ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః॥ (గీత)

897 మంచిగంధముఁగన మనసురంజిల్లును, ఎంతొవాసనముచు నెన్నుచుండ్రు
తామెఱుంగలేరు తమపూర్వవాసనల్, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమాఽఽశు చందనే దృష్టే మనో హ్యాహృష్యతి గణ్యతే ।
తద్వాసనా న జానంతి స్వయం స్వాః పూర్వవాసనాః ॥

తా॥ మంచిగంధపు వాసన మనస్సును రంజింపఁజేయ 'నాహా! యెంత మంచివాసన, అని వర్ణింతురు. కాని తమ పూర్వవాసనల గమనింపరు.

898 పూతగడ్డికేల పుట్టించె వాసన?, కనకము తనకేమి కల్గఁజేసె?
బ్రహ్మచేఁతలెల్లఁ బాడైనచేతలు, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమోశీనరఘాసస్య కిం సుగంధః ప్రకల్పితః? ।
స్వస్మై హేమ్నాపరాద్ధం కిం? బ్రహ్మచేష్టా నిరర్థికాః ॥

తా॥ బ్రహ్మ అప్పరువట్టివేళ్ళకు సువాసనఁ గల్పించి బంగారము తన కేదియో యపకారముఁ జేసినట్టు దానికి లేకుండఁ జేసెను. ఇట్లే బ్రహ్మ చేఁతలన్నియు నిష్ప్రయోజనమైనవే సుమా !.

899 **నింగికెగయువాఁడు నేలలోకమున లేఁడు, బంగుఁ ద్రాగువాఁడు బలియఁబోఁడు**
**కొంగయోగములను గోర్కు లడంగునా?, విశ్వదాభిరామ వినురవేమ॥**

అభ్రగామీ న లోకేఽస్తి న బలీయాన్ కలంజభుక్ ।
బకయోగైః కిం తు వేమ ! వాంఛానాశో భవేత్ఖలు? ॥

తా॥ ఆకాశమున కెగురు యోగి లేఁడు. బంగుఁద్రాగువాఁడు బలియఁడు, బకధ్యానములఁ గోరికలు చావవు.

900 **కంటిమంటచేతఁ గాముని దహియించి, కామమునను గడకు గౌరిఁ గూడె**
**నట్టి శివునినైన నంటెను గర్మంబు, విశ్వదాభిరామ వినురవేమ॥**

నేత్రాగ్నినా స్మరం దగ్ధ్వా పశ్చాద్వేమాతికాముకః ।
గౌరీయుక్తోఽభవత్కర్మ తమీశమపి సజ్జతే ॥

తా॥ కంటిమంటచే మన్మథుని దహించి శివుఁడు తుదకుఁ గామమునకుఁ దట్టుకొనలేక గౌరినిఁగూడి యర్ధశరీర మిచ్చెను. అట్టి పరమశివునినైతము కామకర్మ లొంగఁదీసివేసెను.

901 **హరికిదొరకెనందు రాసిరియప్పుడే, దొరకెఁగాదె ? విషము హరునకరయ**
**నెవనికెట్టులగునో యెవ్వఁడెఱుంగును?, విశ్వదాభిరామ వినురవేమ॥**

ప్రాప్తా శ్రీర్హరిణా వేమ! విషః ప్రాప్తః పురారిణా।
కో విజానాతి లోకేఽస్మిన్ కస్య కా ప్రాప్తిరిత్యహో!॥

తా॥ ఒకేసమయమునఁ బాలసంద్రమున శివునకు విషమును, విష్ణుమూర్తికి మహాలక్ష్మియు దొరకెనందురు. ఎవనికర్మప్రాప్తి యెట్టిదో యెవరికిఁ దెలియును?

902 **పాటివాఁడు విన్న సాధింపఁగాలేరు, నైనమెప్పుడు నీకుఁ దప్పకున్న**
**భారతంబులోని పరమార్థ మిదెకదా ? విశ్వదాభిరామ వినురవేమ॥**

దైవాసుకూల్యయుక్తం త్వాం న శక్తాస్సాధితుం పరే ।
యదుక్తం భారతే వేమ ! పరమార్థ మిదం హి తత్ ॥

తా॥ దైవము నీకనుకూలముగనున్న నిన్నెవరును సాధింపఁజాలరు. భారతమందలి పరమార్థమిదియే.

903 విత్త మొకనికిచ్చి వితరణగుణమునఁ, జిత్త మొకనికిచ్చి చెఱచినాఁడు
బ్రహ్మచేఁతలన్ని పాడైనచేఁతలు, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమైకస్మై ధనం దత్త్వా పరస్మై దాతృతాగుణే।
చిత్తం దత్త్వా భ్రంశయతే బ్రహ్మచేష్టా నిరర్థికాః ॥

తా॥ బ్రహ్మ ధన మొకనికి దాతృత్వము మఱి యొకనికి నిచ్చి పాడు పనిఁజేసెను. వాని చేఁతలన్నియు నిట్టివే.

904 మ్రాను తెగినదైన మహితమౌవస్తువు, గా నొనర్త రట్లుఁగాక యున్నఁ
గాల్తు రట్లుఁగాదె కర్మ్ములకు నెల్ల, విశ్వదాభిరామ వినురవేమ॥

ఉచితం దారుఫలం పిస్తు కుర్వంతి సుందరమ్ ।
నోచేద్వేమ ! దహంతీహ కర్మిచేష్టా స్తథావిధాః ॥

తా॥ మ్రాను మంచిదైన మంచిసుంచి పనిముట్లు కుపయోగింతురు. లేకున్నఁ దగులఁబెట్టుదురు. అట్లె దుర్మార్గుల పాట్లుండును.

905 మఱియు దధిని ఘృతము, మ్రానులం దనలంబు, సౌమ్యసుమములందు సౌరభంబుఁ
దిలలఁదైలమట్లుఁ దేజరిల్లుఁ జిదాత్మ, విశ్వదాభిరామవినురవేమ॥

ఘృతం దధ్ని తరుష్వగ్నిః వేమ ! పుష్పేషు సౌరభమ్ ।
తైలం తిలేషు చ యథా చిదాత్మా రాజతే తథా ॥

తా॥ చిచ్ఛక్తి (పరమాత్మ) పెరుగున నెయ్యి, మ్రానులో నగ్ని పుష్పమునఁ బరిమళము, నూవుల నూనెయు నున్నట్లు సర్వత్రయుండును. (వి) తిలమధ్యే యథా తైలం, క్షీరమధ్యే యథా ఘృతమ్, పుష్పమధ్యే యథా గంధః ఫలమధ్యే యథా రసః। కాష్ఠాగ్ని వత్ప్రకాశేత ఆకాశే వాయువ చ్చరేత్, తథా సర్వగతో దేహీ దేహమధ్యే వ్యవస్థితః।ఉ। గీత।

906 దశరథుండు రామభరణీకుఁబట్టంబుఁ, గట్టఁజేయుఁదలఁపఁ గ్గవైె జడలు
తలఁపు మనదికాని దైవికమదివేఱె, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ ! రామస్యాభిషేకయత్నం దశరథోఽకరోత్ ।
జటా దధౌ తదా రామః పృథక్ చింతా పృథగ్విధిః ॥

తా॥ దశరథుఁడు రాముసకుఁ బట్టాభిషేకముఁ గట్టఁ బ్రియత్నింపఁ నతఁడు జడలు ధరించుస్థితి సంభవించెను. ఆలోచన మనదికాని దైవికము వేఱుగనే యుండును.

907 చిలుకగర్భమందు శ్రీశుకుఁ డుదయించి, మునివరేణ్యులందు ముఖ్యుఁడయ్యెఁ
బ్రత్తికాయఁ జిత్రపటములుఁ బుట్టవా, విశ్వదాభిరామ వినురవేమ॥

శుకో భూత్వా శుకీగర్భే ముఖ్యోఽభూ ద్వేమ ! మౌనిషు ।
చిత్రవస్త్రాణి జాయంతే న కార్పాసఫలేషు కిమ్ ? ॥

తా॥ ప్రత్తికాయవలనఁ జిత్రవిచిత్రవస్త్రములు తయారగునట్లు సామాన్యవ్యక్తులవలననే విశేషజ్ఞులును జన్మింతురు. చిలుకకడుపున శ్రీశుకుఁడు జన్మించి మునిశ్రేష్ఠులయందు ముఖ్యుఁడాయెను.

908 నీచగుణములెల్ల నిర్మూలమైపోవుఁ, గొదువలేదు సుజనగోష్ఠివలన
గంద మలఁద మేనికంపడంగినయట్లు, విశ్వదాభిరామ వినురవేమ॥

సాధుగోష్ఠ్యా వినశ్యంతి సర్వే నీచగుణా అపి ।
న లేపో గంధలేపేన దుర్గంధో హ్రియతే తనోః ॥

తా॥ గంద మలఁదికొనిన శరీరముకంపు పోవునట్లు సుజనగోష్ఠివలన నీచగుణములన్నియు నిర్మూల మగును.

909 టక్కరులనుగూడి యెక్కసక్కములాడ, నిక్కమైనఘనుని నీతిచెడును
ఉల్లితోటఁబెరుగు మల్లిమొక్కకరణి, విశ్వదాభిరామ వినురవేమ॥

కపటై ర్యది వర్తేత ఘనోఽపి విగుణో భవేత్ ।
పలాండుకవనే వేమ ! మల్లికేవ ప్రవర్ధితా ॥

తా॥ ఉల్లితోటలోఁ బెరుగు మల్లెమొక్కవలె పేచులతో నెక్కసక్కములాడు ఘనునకు గౌరవము చెడును.

910 సేగుఁబుచ్చను భువిఁ జేయెల్లఁద్రొక్కిన, మురగ కంతకంత పెరుగుచుండు
నొరులఁ బీఁచుటన్న నోగు స్వీగములఁగునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

బహుబీజా యథై ధేత నిశి పాదహతా వ్యహో ! ।
తథా వేమ ! పరై ర్ధూర్తః విద్యాత్కిం గర్హితస్త్రపామ్ ? ॥

తా॥ రేగుపుచ్చను (బహుబీజమును) రాత్రియంతయుఁ ద్రొక్కినను నాశనముకాక పెరుగుచునే యుండునట్లు నీచుఁ డెన్ని తిట్లుతిన్నను సిగ్గుపడక నీచకార్యములే తలచు చేయుచుండును.

911 ఓర్పులేనిభార్య యున్నఫలంబేమి?, బుద్ధిలేనిబిడ్డ పుట్టనేమి?
సద్గుణంబులేని చదువదియేలను?, విశ్వదాభిరామ వినురవేమ॥

క్షమావిహీనయా వేమ! భార్యయా కిం ఫలం భవేత్ ?
కిం జాతేన కుపుత్రేణ విద్యయా కిమవద్యయా ? ॥

తా॥ ఓర్పులేనిభార్య యుండిన, బుద్ధిలేనిబిడ్డ పుట్టిన, సద్గుణములేని చదువుఁ జదివిన నేమిలాభము?

912 ఖలులుం దిట్టిరనుచుఁ గలవరపడనేల?, వారితిట్లనేమి వాసిచెడును?
సజ్జనుండు దిట్ట శాపంబదౌనయా, విశ్వదాభిరామ వినురవేమ॥

ఖలా శ్శపంతీతి వృథా వేమ! ఖేదేన కిం ఫలమ్ ?।
తచ్ఛాపై ర్నప్రథాఽప్యేతి శాప శ్శపతి సజ్జనే ॥

తా॥ దుష్టులు తిట్టినదానఁ జెఱుపులేదు. కాన కలవరపాటు పడనక్కర లేదు. సజ్జనులుతిట్టిన నది శాపమగును.

913 దానధర్మములను దగ రేపురేపని, కాలవ్యయముఁ జేయుఁ గష్టజనుఁడు
తానునేమియగునొ తనబ్రతుకేమౌనొ, విశ్వదాభిరామ వినురవేమ॥

దానాదిషు నయేత్కాలం శ్వశ్శ్వ ఇత్యేవ కష్టధీః ।
కిం స్యా ద్వేహ స్వయం వేమ! కిం స్యాద్వా స్వీయజీవనమ్॥

తా॥ దానధర్మములను రేపు రేపు అని యజ్ఞాని కాలవ్యయముఁ జేయును. తా నేమగునో! బ్రతు కెట్టిదగునో! రేపటిసంగతి యేమో!

914 ఎల్లలోకములను నేకమైయున్నదో, తల్లిపిల్లసందుఁ దగులునదియు
నిస్తరంగవార్ధి నియతిని జూడుము, విశ్వదాభిరామ వినురవేమ॥

సర్వలోకేఽస్తి యద్వస్తు మాతాశిశుగతం హి తత్ ।
నిస్తరంగాబ్ధిసమయా నియత్యా వేమ ! పశ్య తత్ ॥

తా॥ తల్లి పిల్ల మధ్య యేప్రేమకలదో యాపరమాత్మసంబంధమే యెల్లలోకముల నిండియున్నది. గంభీరజలధివలె నిశ్చలమనస్సునఁ జూడుము.

915 కలయునన్న రాదు వద్దన్నఁబోదది, తొలిసలిపినకర్మ ఫలమటంచు
నుల్లమందు వగవకుండుటే ధర్మంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

యదీచ్ఛతి న వేమైతి నాపైతి యది నేచ్ఛతి ।
ప్రాక్కర్మఫలమిత్యేవ న శోచేద్ధి తతో హృది ॥

తా॥ పురాకృతకర్మఫలము రావలెనన్న వచ్చునదియు బోవలెనన్నఁ బోవునదియుఁ గాదు కాన హృదయమునందు వగవకుండుటయే ధర్మము.

916 తనకుఁ బ్రొద్దుపోని కరణంబునైన వో, వినకతీర దశికవిద్యమైన
గణిత వినదె ప్రియునికొఱకుఁ గాకధ్వని?, విశ్వదాభిరామ వినురవేమ॥

విద్యాధికాఽపి శ్రోతవ్యా యది కాలో న గచ్ఛతి ।
కాకధ్వనిం వల్లభాయ స్త్రీ వేమ ! న శృణోతి కిమ్?॥

తా॥ వినుట కిష్టములేకపోయినను గాలక్షేపమునకైనను మంచిచెడ్డలు వినుట మంచిది. ప్రియునిరాకకు నిరీక్షించుప్రియురాలు కర్ణకఠోరమైనదైననుఁ గాలక్షేపమునకుఁ గాకికూఁతలు వినుటలేదా?

917 అగ్నిశిఖలయందు నమరంగ మమకార, మభవుమీఁద ధ్యాన మమరనునిచి
ఆహుతియగువెన్క హాయని నర్చింపుము, విశ్వదాభిరామ వినురవేమ॥

అగ్నిజ్వాలాసు మమతా మభవే ధ్యానమేవ చ ।
నిధాయ మమతానాశే వేమార్చయ సదాశివమ్ ॥

తా॥ ఈశ్వరధ్యానమున మమకారమును, జ్ఞానాగ్నియందు భస్మముఁ గావించి పిమ్మటఁ బరమేశ్వరుఁ బూజింపుము. (వి) కింకర్మ? యత్ప్రీతికరం మురారేః। 2 కంఠంగతైరప్యసుభిర్న కార్యం కిం? కిం విధేయం? మలినమ్ శివార్చా॥ (శం॥ మణి)

918 ఆశలనెడిత్రాళ్ళ నఖిలజంతువులును, గట్టఁబడును గాన నిట్టలమున
జ్ఞానమనెడిచురియఁ బూని కోయఁగనౌను, విశ్వదాభిరామ వినురవేమ॥

ఆశాపాశైర్నిబధ్యంతే సకలా వేమ ! జంతవః ।
తతో జ్ఞానాసినా తే హి ఛేత్తవ్యాః ఖలు సర్వశః ॥

తా॥ ఆశలనుత్రాళ్లచే జీవి బంధింపఁబడుచున్నది. కాన జ్ఞానమను కత్తిచే నాత్రాళ్లఁగోసి బంధవిముక్తుఁడ వగుము.

తుల్యమగు సేవావృత్తి ఆర్యజాతిని దీనతఁ జెందించి అపయశఃపంకమునఁ బడఁద్రోసెను. తిరిగి వాస్తవికదివ్యతత్త్వజ్ఞానకాంతు లెప్పుడు దిక్కుల భాసిల్లునో అప్పుడే ఆర్యజాతికి నిజమగు దాస్యవిముక్తి యగును. తత్త్వ జ్ఞానమే పారతంత్ర్యసముద్రముఁ దరించుటకు నౌక కాఁగలదు. అట్టి తత్త్వజ్ఞానమునకును విశేషముగ ప్రజాదరణ మాలంబనము కావలసి యున్నది.

ఈవేమనయోగి తత్త్వశాస్త్రమున మనశ్శుద్ధిలేని విగ్రహారాధన, తీర్థయాత్ర, శ్రాద్ధాదికాచారములకుస్థానముకనఁబడదు. దైవోపాసనమాని సత్కర్మాచరణములేక సాక్షాత్ దేవుఁడేయవతరించి ప్రజల కష్టనష్టములఁ బోఁగొట్టఁగలఁడను జడుల మిథ్యావాదమున కిందు ప్రసక్తియేలేదు. సత్య శాంతి అహింసా దయా శౌచ దైవచింతాది సద్గుణములకు నిత్యాచరణమున నెప్పుడు స్థానముకల్పించుటకు సమర్థుఁడగునో అప్పుడే ఆ యా సద్గుణములకుఁదగినప్రయోజనమును బడయఁగలఁడని యీగ్రంథము యొక్క పరమలక్ష్యము. నిఖిలప్రాణికోటుల మానవుఁడే సత్యాసత్యవస్తు తత్త్వమును విమర్శించుటకు సమర్థుఁడు, బుద్ధిమంతుఁడునుకదా! తన కష్టకాలమునఁ జేయూత నొసగి ఆనందభోగాదు లనుభవించుటకు సమస్త వస్తుజాతమును కల్పించి సహాయపడు విశ్వమునకు విశ్వసాక్షికి విశ్వేశ్వరునకుఁ గృతజ్ఞత ప్రదర్శించుటయే మానవునకు నిత్యవ్రతముకాఁగలదు. ఆత్మసాక్షిగురుప్రబోధమునఁదొలగింపఁబడినఅజ్ఞానాంధకారముగల సత్పురుషులు జ్ఞానభానూదయమునఁ దత్త్వమెఱింగి బంధములనుండి దుఃఖములనుండి విముక్తులు శాశ్వతానంద పరిపూర్ణులునగుటకు స్వస్వరూపానుసంధాన సాధనమే యీ గ్రంథలక్ష్యము.

మాలిన్యరహితహృదయముల నీ గ్రంథవిషయముల స్వీకరించి ప్రాజ్ఞులు ఇతో౽ధికపవిత్రోద్గ్రంథ రచనకొఱకు మాకు ధృత్యుత్సాహములు కలుగుటకు ఆశీస్సుల ననుగ్రహించిన వారలగుదురుగాక యని ప్రార్థించుచున్నారము.

శ్రీరామ నృసింహమూర్తి కవులు.

( సంస్కృతమునకు ఆంధ్రానువాదము )

919 జల్లిమాటలనుచు జగమునఁదిరిగెడు, కల్లగురుఁడుకట్టుఁ గర్మచయము
పల్లు పురుగుచేరి పలవింపఁజేయుదా?, విశ్వదాభిరామ వినురవేమ॥

వదన్ ప్రగల్భవాక్యాని వేమాగురు రటన్ భువి ।
బధ్వా కర్మసు బాధేత దంతవిష్టః కృమి ర్యథా॥

తా॥ పంటిలోఁబురుగుచేరి బాధఁ గల్గించునట్లు కల్లబొల్లిమాటలఁ బలికి లేనిపోని కర్మల నంటఁగట్టి గురువను మోసగాఁడు లోకమునకు బాధఁ గల్గించుచున్నాఁడు.

920 అదిమి మనమునిల్పి యానందకేళిలో, బ్రహ్మమయుఁడు ముక్తిఁబడయఁగోరు
జిహ్వారుచులచేత జీవుండు చెడునయా, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ! బ్రహ్మమయ్య శ్చేతో నియమ్యానంద కేళిషు ।
నిధాయ ముక్తిం లభతే జీవో జిహ్వారసై ర్గతః ॥

తా॥ జిహ్వాది అల్పసుఖములకు మరిగి జీవుఁడు చెడును. ముక్తిని గోరి మనస్సునిల్పి బ్రహ్మానందమయుఁడు ఆనందకేళిలో నోలలాడును.

921 అనువుఁగానిచోటఁ బనిగొనిజూదము, నాడి కూడి యోడి యడవిఁజొచ్చు
ఘనునిజాడఁజూచి కడపుము మూర్ఖత, విశ్వదాభిరామ వినురవేమ॥

ద్యూతక్రీడానిర్జితస్య ప్రవిష్టస్య తతో వనమ్ ।
ఘనస్య పద్ధతిం దృష్ట్వా వేమ! వర్జయ మూర్ఖతామ్ ॥

తా॥ దుర్వ్యసనములయందలి మూర్ఖత ద్యూతాదుల నాడి యోడి వనవాసముఁజేసిన ఘనులజాడ తెలిసియైన విడువుము.

922 ఇహమునందుఁబుట్టి యింగితమెఱుఁగని, జనులనెంచి చూడ స్థావరములు
జంగమాదులనుట జగతిని పాపంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

ఇహోద్భూయ జనా వేమ! యే విజానంతి నేంగితమ్ ।
స్థావరాఇతి తే జ్ఞేయా న వాచ్యా జంగమా ఇతి

తా॥ ఇంగితజ్ఞానశూన్యులు (పరాభిప్రాయమును గుర్తెఱుంగని ఛాందసులు) తిరిగెడి జంగమసృష్టిలోనివారైనను వారిని స్థావరములలో (చలించని మొద్దులలో) జమకట్టుటయే మంచిది.

923 ఉత్తరిత్తి దీని యుపయోగములు లేవు, తిత్తికొఱకుఁ జెడును దేవులాడి
కత్తిమీఁదసాము కడతేరలేఁడయా, విశ్వదాభిరామ వినుర వేమ॥

అనయా నోపయోగాస్స్యుః వేమేయం రిక్తభస్త్రికా ।
నశ్యే ద్భ్రాన్త శ్చర్మభస్త్ర్యై దుస్సాధ్యం ఖల్వసివ్రతమ్॥

తా॥ ఉత్తరిత్తి దేహము. దీనిధారణోపయోగము జ్ఞానసాధనమే. మానవుఁడీతిత్తికొఱకే ప్రాకులాడి చెడుచున్నాఁడు, కాని కత్తివాయిపై సామైన నియమనిష్ఠల పాటింపఁజాలకున్నాఁడు.

924 ఒకనిఁజెఱుతుననుచు నుల్లమందెంతురు, తమకుఁగల్గుచేటుఁ దామెఱుఁగక
తమ్ముఁజెఱుచువాఁడు దైవంబులేఁడొకో!, విశ్వదాభిరామ వినుర వేమ॥

ఆత్మనాశ మజానంత ఈహంతే పరనాశనమ్ ।
స్వేషాం నాశకరం దైవం నాస్తి కిం? వేమ ! చింతయ ॥

తా॥ ఎదుటివానిని బాధఁజేయవలెనని దుష్టుఁడు తనమనమున నాలోచించుచుండును. కాని తన్నుఁ బాధఁజేయువాఁడు దైవమొకఁడున్నాఁడనిమాత్రము తలంపఁడు.

925 కఫముమీఁటి మఱియుఁ గన్నులుమూతలుపడి, బుద్ధితప్పి చాలఁబుడమిఁ బడుచు
వేళలందు నిన్ను వెదకుటసాధ్యమా?, విశ్వదాభిరామ వినుర వేమ॥

కఫరుద్ధో మీలితాక్షో నష్టబుద్ధి ర్గతస్మృతిః ।
యదీహా వర్తతే వేమ ! సాధ్యం కిం త్వద్గవేషణమ్ ? ॥

తా॥ ప్రభూ ! కఫము కంఠమునకుఁదాకఁ గన్నులు మూతలుపడ బుద్ధిలేక స్మృతి తప్పునప్పుడు నిన్నుఁ దలఁప సాధ్యపడఁగలదా ? కాన సదా నిన్ను స్మరించుట మంచిది.

926 చెఱకు తీపిలేమిఁ జెత్తవాఁబడునట్లు, పరగ గుణములేని పండితుండు
దూఱఁబడును గాదె? దోష మటుండఁగ, విశ్వదాభిరామ వినుర వేమ॥

ఇక్షు ర్మాధుర్యరహితో నిస్సారఇతి కథ్యతే ।
నిర్గుణో నింద్యతే సూరిః వేమ ! దోషోఽస్తు దూరతః ॥

తా॥ తీపిలేని చెఱకును జెత్తయనునట్లు సద్గుణములేని పండితునిఁ బామరుఁడనుటయే మంచిది,

927 శ్రవణపుటములున్న సార్థక్యమేమయా, వినఁగవలయుఁ బెద్దలానెడివన్ని
వినఁగవినఁగనీకె విశదంబు నౌఁజుమ్మ, విశ్వదాభిరామ వినురవేమ॥

కిం శ్రోత్రవత్తా సార్థక్యం? శ్రోతవ్యా విబుధోక్తయః।
శ్రుతేశ్రుతే వేమ! సర్వం తవైవ విశదం భవేత్ ॥

తా॥ పెద్దలవాక్యములు వినుచుండిననే చెవులున్న యుపయోగము. వినుచున్నకొలఁది యందలి విషయము నీకే బోధపడఁగలదు.

928 రాతిబొమ్మకేల రంగైనవలువలు, గుళ్ళుగోపురములుఁ గుంభములును,
కూడుగుడ్డ తాను గోరునా దేవుండు? విశ్వదాభిరామ వినురవేమ॥

కిం శిలాయా దుకూలైశ్చ గోపురై రాలయైస్తథా।
అపి కుంభై ర్వేమ! వాంఛేత్ కిమన్నాద్యఖిలం చ సా॥

తా॥ రాతిబొమ్మకు మంచిమంచిదుస్తులు గుళ్లు గోపురములు కుంభములు దేనికి? కూడు గుడ్డ దేవుఁడు కోరునా?

929 తఱువఁదఱువఁబుట్టుఁ దరువునం దనలంబు, తఱువఁదఱువఁబుట్టు దధి ఘృతంబు
తఱువఁదఱువఁబుట్టుఁ దనువునఁదత్త్వంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

మథితేమథితే వేమ! వృక్షే సంజాయతేఽనలః।
తథా దధ్ని ఘృతంచైవ తత్త్వం శుద్ధం తనావపి॥

తా॥ తఱచినకొలఁది మ్రానున నగ్ని. పెరుగున నెయ్యి, శరీరమునఁ బరమాత్మ తెలియఁబడును.

930 ముక్తిఁగానలేని మూర్ఖజనులకెల్ల, బట్టబయలుఁజేసి పరమపదము
దారిఁజూపు బుధుఁడు దైవంబుకాఁడొకో, విశ్వదాభిరామ వినురవేమ॥

అపశ్యతాం వేమ! ముక్తిం మూర్ఖాణాం పరమంపదమ్।
సువ్యక్తం యో దర్శయతే స బుధః కిం న దైవతమ్?॥

తా॥ ముక్తినిఁ దెలిసికొనలేని మూర్ఖులకుఁ బరమపదమార్గముఁ జూపు విబుధుఁడు దైవము కాఁడా?

931 కలియుగంబునందు ఘనతకు నైచ్యంబు, ఘనత నైచ్యమునకుఁ గల్గుచుండు
శుద్ధభక్తులుడిగి జనులుంద్రుకావున, విశ్వదాభిరామ వినురవేమ॥

జనా శ్శ్రద్ధాభక్తిహీనా యతో వేమ ! భవంత్యతః ।
ఘనతాయాః కలౌ నైచ్యం నైచ్యస్య ఘనతా భవేత్ ॥

తా॥ కలియుగమున జనులకు శ్రద్ధాభక్తులు లేకుండుటవలన ఘనతకు నైచ్యము నైచ్యమునకు ఘనత విపరీతపద్ధతిని గల్గుచుండును.

**932 పరులఁదిట్టినంత పాపకర్మంబబ్బు, విడువ దెన్నటికిని విశ్వమందు**
**పరుఁడు పరుఁడుఁగాఁడు పరమాత్మయౌనయా, విశ్వదాభిరామ వినురవేమ॥**

పాపకర్మ సమాప్నోతి వేమేహ పరదూషణాత్ ।
పరః పరో న భవతి పరమాత్మా హి కేవలమ్ ॥

తా॥ పరుఁడు పరమాత్మయే. పరుని (ఇతరుని) దిట్టినఁ బాపము సంభవించి విడువకుఁడును. (వి) తా నహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్, క్షిపా మ్యజస్ర మశుభా నాసురీ ష్వేవ యోనిషు॥ గీత॥

**933 అతిహితమగునట్టు లాడినమాటకు, సంతసింతు రెల్ల సత్పురుషులు**
**అధికభాషణంబు లాయాసదంబులు, విశ్వదాభిరామ వినురవేమ॥**

యథోచితేన వాక్యేన మోదంతే సర్వసజ్జనాః ।
వేమాధికాని వాక్యాని వృథాయాసఫలాని హి ॥

తా॥ మిక్కిలిహితవగునట్టు లాడిన మితమైన మాటలకు సజ్జను లానందింతురు. అధికసంభాషణ మాయాసముఁ గల్గించునదిమాత్ర మగును. (వి) పథ్యం మనోహారి చ దుర్లభం వచః॥

**934 కూర యుడుకుకు వెనుక కూడునా కసవేర, నెఱుక గల్గి మునుపె యేరవలయు**
**స్థలముఁదప్పవెనక ధర్మంబుపుట్టునా?, విశ్వదాభిరామ వినురవేమ॥**

ఘాసస్య శాకపాకాంతే న పృథక్కరణం మతమ్ ।
ప్రాగేవైమెవ పృథక్కుర్యాత్ కుతో ధర్మః స్థలే గతే ? ॥

తా॥ ఆకుకూరలలోని గడ్డి పురుగులు మొదలగువానిని గూర యుడుకుటకుముందే యేరవలయును. అట్లే తరుణము తప్పకుండ ధర్మమును జేయవలయును.

935 గుణముతీరులేక కులమెల్లఁ జెడిపోవు, స్త్రీలనడతవలన సిగ్గుఁబోవు
చవిటినేలవలన జలమెల్లఁ జెడిపోవు, విశ్వదాభిరామ వినురవేమ॥

గుణాభావే కులం నష్టం స్త్రీదుర్గత్యా త్రపా గతా ।
ఊషరక్షేత్రగం వేమ! జలం భ్రష్టత్వ మాప్నుయాత్ ॥

తా॥ చవిటినేల జలము, స్త్రీలనడతవలన సిగ్గు, గుణముతీరులేక కులముఁ జెడును.

936 జక్కనెక్కివీధిఁ జక్కఁగా వెలువడఁ, గుక్కలెన్నొ వెంటఁ గూయఁదొడఁగు
ఘనుని కోర్వలేని కాపురుషులయటు, విశ్వదాభిరామ వినురవేమ॥

అశ్వ మారుహ్య రథ్యాయాం గచ్ఛంతం వేమ! పూరుషమ్ ।
భషంతి ష్వానత శ్శ్వానా ఘనసం వీక్ష్య తథా ఖలాః ॥

తా॥ గుఱ్ఱమునెక్కి వీధినిఁ బోవు వానిని వెంటాడి కుక్కలు మొఱుగునట్లు గొప్పవానిఘనత కోర్వలేక దుష్టులు హేళనఁ జేయుచుందురు.

937 ఫక్కిఁదెలిసిపలుక నొక్కవాక్యమెచాలు, పెక్కులేల వట్టి పేలులరయ
దిక్కుగల్గుమొక్కొక్కటె చాలదా, విశ్వదాభిరామ వినురవేమ॥

విజ్ఞాయ ఫక్కిం ప్రోక్తేన వాక్యే నైకేన చాప్యలమ్ ।
బహుప్రలాపైః కిం వేమ! ? ఏకాలం గతియుజ్నతిః ॥

తా॥ పెక్కు పేలుడుమాటలకన్న సరియగుపద్ధతితోఁ గూడిన యొక్క మాటయే మేలు. అట్లే భక్తికల నమస్కారమొక్కటే యైనను మంచిదే.

938 అల్పుఁడైననేమి యధికుఁడైననునేమి, చెప్పవలయురీతిఁ జెప్పినాఁడ
హరుని యెఱుకలేక యాకు నల్లాడునా ?, విశ్వదాభిరామ వినురవేమ॥

భవే దల్పో వాధికోవా వక్తవ్యం కథితం మయా ।
వినాజ్ఞాం వేమ! దేవస్య పత్రం చలతి కిం భువి? ॥

తా॥ ఆభగవంతుని యాజ్ఞలేనిది యొక్కయాకైనఁ గదలదు. అల్పుఁడవగుదువుగాక. అధికుఁడవగుదువుగాక చెప్పవలసినమాటఁ జెప్పివేసితి (వి)
ఉపస్థితే ప్రాణహరే కృతాంతే కి మాశుకార్యం సుధియా ప్రయత్నాత్ ?
వాక్కాయచిత్తైః సుఖదం యమఘ్నం మురారిపాదాంబుజచింతనం చ॥

939 కంకుభట్టనంగఁ గాషాయములఁగట్టి, కొలిచె ధర్మరాజు కోరి విరటుఁ
గాలకర్మగతులఁ గనిపెట్టలేరయా, విశ్వదాభిరామ వినురవేమ॥

సిషేవే వేమ ! కాషాయైః కంకుభట్టాఖ్యయా పురా ।
విరాటం ధర్మజోఽజ్ఞేయా గతయః కాలకర్మయోః ॥

తా॥ ధర్మరాజంతటివాఁడు కాషాయవస్త్రములధరించి కంకుభట్టు అను పేర సామాన్యరాజగువిరటుని సేవఁజేసెను. ఏకాలమున కేకర్మ దాపురించఁగలదో యెవరు కనిపెట్టఁగలరు ?

940 కట్టెయందునిప్పుఁ గాననిచందమౌ, తనువునందు నాత్మ తగిలియుండు
మఱుఁగుఁదెలిసి పిదప మార్గానవలెనయా, విశ్వదాభిరామ వినురవేమ॥

నేంధనే దృశ్యతే వహ్ని ర్యథాత్మాపి తనౌ తథా ।
మర్మ జ్ఞాత్వా వేమ ! పశ్చాత్ కుర్యా త్తదవలంబనమ్ ॥

తా॥ కట్టెయందు నిప్పు కనఁబడకుండ నున్నట్లే శరీరమున బ్రహ్మ పదార్థము (ఆత్మ) తగిలియున్నది. దాని మర్మ మెఱిఁగియంఢైక్యమగుటకుఁ బ్రయత్నించవలెను.

941 ధరగ్రహములు రాశిఁ జరియించుచుండియు, మంచిచెడుగుఁ గానుపించుచుండఁ
బురుషయత్న మనుచుఁ బొంగుదు రేలయా ?, విశ్వదాభిరామ వినురవేమ॥

భూమౌ గ్రహేషు సర్వేషు వేమ ! రాశిచరిష్ణుషు ।
సదసత్ఫలాని దృశ్యంతే మన్యంతే కిం స్వపౌరుషమ్? ॥

తా॥ పుట్టినప్పుడే నవగ్రహములు ద్వాదశరాశుల సంచరించుపద్ధతి ననుసరించి జాతకచక్రము తయారగుచుండ నజ్ఞానులు తమపురుష ప్రయత్నమని యేల పొంగుదురో తెలియకున్నది.

942 ధర్మబుద్ధిచేత దైవంబుఁదెలిసినఁ, గాలుఁడేమిచేయఁగలఁడు ప్రజల
ధర్మమంటి వెంట దైవంబుగానుండు, విశ్వదాభిరామ వినురవేమ॥

దైవే జ్ఞాతే ధర్మబుద్ధ్యా కింకుర్యా దంతకః ప్రజాః ।
ధర్మః పృష్ఠగతో వేమ ! సదా దైవాయతే ఖలు ॥

తా॥ ధర్మబుద్ధిచే దైవమును దెలిసికొనిన మనల యముఁ డేమియుఁ జేయఁజాలఁడు. ధర్మమే వెంటనుండి దైవముగ గాపాడుచుండును.

(వి) పరోపకారార్థ మిదం శరీరమ్.

943 వెండికొండ పసిడికొండయుఁదనకుండ, దేవుఁడేలపోయి తిరిపెమెత్తె
దైవబలము గాని తనబల్మికాదయా, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ ! రాజతహైమాద్రీ యస్య స్త స్స విభుః కథమ్? ।
భిక్షార్థ మచర త్సర్వం బలం దైవస్య నాత్మనః ॥

తా॥ దైవబలమేకాని మనబలము పనిచేయదు. వెండికొండ(నివాసము) బంగారపుకొండ (ధనుస్సు) తనకున్న శివుఁడు బిచ్చమెత్తుకొనలేదా? (వి) ధిక్ ధిక్ వృథా పౌరుషమ్.

944 హంస మానసోద మంటకతిరిగిన, యట్లు కర్మచయము నంటకుండ
యోగి తిరుగు సకలభోగంబులోడను, విశ్వదాభిరామ వినురవేమ॥

మానసాం బ్వస్పృశన్ హంసో యథా వేమ! సదా చరేత్।
అసక్తః కర్మసు చరేత్ తథా భోగాన్వితో యతిః ॥

తా॥ హంస మానస సరస్సున నీరంటకుండ సంచరించినట్లు సకల భోగములు కల్గియు యోగి భోగలంపటుఁడుకాక సంచరించును. (వి) యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి, శుభాశుభపరిత్యాగీ భక్తిమా న్య స్స మే ప్రియః । గీత ।

945 తనువనఁదగునింటఁ దగశత్రుమిత్రులఁ, దెలియలేనివాని తెలివదేల?
తెలిసి చక్కఁబరుపఁ దివ్యామృతంబదే, విశ్వదాభిరామ వినురవేమ॥

దేహారూపే వేమ ! గేహే శత్రుమిత్రాణి తత్త్వతః ।
అజానతః కిం జ్ఞానేన? తద్ధి సమ్యక్కృతేఽమృతమ్ ॥

తా॥ ఈశరీరమనునింటిలోఁగల కామక్రోధాదిశత్రువుల, శమదమాది మిత్రుల పద్ధతిఁ దెలియనితెలివి యెందులకు? తెలిసి యాంతరంగికములగు గందరగోళములఁ జక్కఁజేసినఁగాని దివ్యానందామృతము లభింపదు.

946 ఆవుచన్నుఁబితికి యాపాలఁగాచినఁ, జేరిపెరుగు చల్ల పేర్లుఁగలుఁగు
దవిలి లోనఁగల్గు నవనీత మట్లురా, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ ! ధేనుస్తనా ద్దుగ్ధే తప్తే పయసి తత్క్రమాత్ ।
దధితక్రాహ్వయం చాంతః నవనీతం తథా పరమ్ ॥

తా॥ ఆవుపాలఁబితికి కాచి తోడుఁబెట్టినఁ బేరుకొని గట్టిదగు పెరుగగును. పెరుగుఁదఱచినఁ జల్లయు, వెన్నయు, లభించును. అట్లే యాంతరంగిక పరిశోధనవలనఁగాని యాత్మజ్ఞాన నవనీతము లభింపదు.

947 ప్రణవమెఱుఁగనతఁడు భక్తుండుకాఁడయా, జ్యోతిఁజూడనతఁడు జోగికాఁడు
నిత్యమెఱుఁగనతఁడు నిర్వాణికాఁడయా, విశ్వదాభిరామ వినురవేమ॥

నాజ్ఞాతప్రణవో భక్తో నాజ్యోతిర్దర్శనో మునిః।
న వేత్తి నిత్యం యో వేమ! నిర్వాణీ న భవేద్ధి సః॥

తా॥ ప్రణవనాద మెఱుఁగనివాఁడు భక్తుఁడును జ్యోతినిఁగాంచనివాఁడు జోగియు శాశ్వతపదార్థమును దెలియనివాఁడు మోక్షకామియుఁగానేరఁడు.(వి) తైలధారావ దచ్ఛిన్నం దీర్ఘఘంటానినాదవత్,అవాచ్యం ప్రణవస్యార్థం, య స్తం వేద సవేదవిత్,అనాహతస్య శబ్దస్య తస్య నాదస్య యో ధ్వనిః,ధ్వనే రంతర్గతం జ్యోతిః జ్యోతి రంతర్గతం మనః॥ ఉ। గీత।

948 గురువుశిష్యుఁడనఁగ నొనరెట్టు మొదలెట్టు, గురువుశిష్యుఁడనెడి గుఱుతులెట్లు
గురునకుండఁదగిన పరువులేకుండిన, విశ్వదాభిరామ వినురవేమ॥

అద్యంతౌ తత్త్వతో వేమ! కౌ స్యాతాం గురుశిష్యయోః।
యదినస్యాద్గురోశ్శక్తిః కో భేదో గురుశిష్యయోః? ॥

తా॥ గురున కుండఁదగిన పరువులేకుండిన గురుశిష్యులకుఁగల భేదమేమి?

949 త్రాడుమెడనువేసి తనకు శూద్రత్వంబు, పోయెననెడిదెల్ల బుద్ధిలేమి
మదినిలుపక త్రాడు మతివన్నెఁదెచ్చునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

సూత్రం ధృత్వా గళే వేమ! శూద్రతా నిర్గతాత్మనః।
ఇతిభావ స్తు మూఢత్వం తేజస్వీ స్యా జ్జితేంద్రియః॥

తా॥ త్రాడును మెడలోవేసికొని నాకజ్ఞానము నశించినదని పలుకుట పరిశుద్ధమైన బుద్ధిలేకపోవుటయే. మనస్సును నిల్పలేక జ్ఞానవిహీనత నున్నఁద్రాడు బ్రహ్మవర్చస్సు నీయఁగలదా?

950 లాల్చనములు భూతలబంతులఁబోల్తురు, ప్రాంబుహూలివట్టి భ్రాంతులకని
శూంఖఖండమందు మతియేమియున్నది?, విశ్వదాభిరామ వినురవేమ॥

వక్షోజౌ వేమ ! కన్యాయాః పుష్పగుచ్ఛసమావితి ।
వర్ణయం త్యలసా భ్రాంతాః కిం స్యాత్తన్మాంసఖండయోః ॥

తా॥ మాంసపుముద్దలగు కన్యల స్తనములఁ బనికిమాలిన భ్రాంతికల కాముకులు పూలబంతులనియు మఱేవేవోయనియు వర్ణింతురు. (వి) ఏతన్మాంసవసాదివికారం మనసి విచింతయ వారంవారమ్॥ భజగోవిందం॥

951 బాల్యమందు నీవు బహువిధంబులఁబట్టి, చప్పరించినట్టి స్తనములకును మోహమింతయేల ? మూఢాత్మ ! తెలియురా, విశ్వదాభిరామ వినురవేమ॥

బాల్యే త్వం బహుధా వేమ! యౌ స్తనా వపిబ స్స్వయమ్।
తద్గతేన వి మోహేన కిం? మూఢాత్మన్! విచింతయ ॥

తా॥ మూఢజీవా ! బాల్యమందు నీవు చప్పరించిన స్తనములకొఱకై మోహ మేలరా? ఆలోచించు. (వి) కో దుర్జయః సర్వజనైః? మనోజః।

952 విటునిఁజేరఁగోరి వీధినిమదినుంచు, పడఁతిరీతిఁబరముఁబ్రాపికనగుసు గుణములన్ని మఱచి గుర్తించి చూడుము, విశ్వదాభిరామ వినురవేమ॥

ప్రాప్తుకామా విటం వీధ్యాం దత్తచిత్తేవ కామినీ ।
అగుణస్సన్ పరం గంతుం వేమ ! విద్వాన్ యతేత వై ॥

తా॥ విటునిఁ గూడుటకు వానిరాకకై వీధినిమదినుంచు విటకత్తెవలె నన్నిగుణములు మఱచి పరమాత్మధ్యానముననే మునిఁగియుండవలెను. (వి) జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే। గీత।

953 జిహ్వరుచులఁగోరు జీవించునంతకు, సతియుఁబతియుఁగోరు సుతధనంబు హవ్యవహుఁడుఁజూడ నందఱఁగోరును, విశ్వదాభిరామ వినురవేమ॥

యావజ్జీవం రసం జిహ్వా వాంఛే ద్వేమేహ దంపతీ ।
వాంఛేతాం పుత్రకధనం వాంఛే త్సర్వాన్ హుతాశనః ॥

తా॥ జీవించియున్నంతవఱకు స్త్రీ పురుషులు జిహ్వకై రుచులనే కోరుచున్న, సంతానమునకై సంసారమునే కోరుచున్నఁ, దుద కగ్ని హోతుడు తనలోఁ గలుపుకొనుటకే కోరును.

954 దోఁపునిచ్చువాఁడు తులలేనిసెఱదాత, దోఁచుకొన్నవాఁడు దోపిహియగును పాపిఁబ్రజాపువాఁడె పరమపూజ్యుండగు, విశ్వదాభిరామ వినురవేమ॥

సర్వదో నిస్తులో దాతా ద్రోహీ సర్వాపహారకః।
గమ్యం గమయతే వేమ! య స్సపూజ్యో మహాన్ గురుః॥

తా॥ దోచుకొన్నవాఁడు ద్రోహి. దోపునిచ్చువాఁడు నెఱదాత. అన్నిటి కాధారుఁడగు పరమాత్మను జూపువాఁడే పరమపూజ్యుఁడు.

955 భవము పూర్వకర్మఫలము ననుభవింపఁ, గలిగెననుచు మదిని గట్టిపరచి
కష్టసుఖములేవి కలిగినఁ దలఁగకు, విశ్వదాభిరామ వినురవేమ॥

పురాకృతం కర్మఫలం భోక్తు మేష భవోఽభవత్।
ఇత్యాకృష్య మనో వేమ! సమదుఃఖసుఖో భవ॥

తా॥ పురాకృతకర్మఫలితముననే యీపుట్టుక, కష్టసుఖములుఁ గల్గుచున్నవని తలంచి మదిని గట్టిచేసి ద్వంద్వసహిష్ణుతఁ గలిగియుండుము.
(వి) పుణ్యై ర్వినా న హి భవంతి సమీహితార్థాః॥

956 సంద్రమునకుఁ జూడ సరియేదియును లేదు, అట్టిజలధినీర మనువుఁగాదు
అనువుఁగాని నీర మదియేమి చేయును, విశ్వదాభిరామ వినురవేమ॥

సాగరేణ సమం కించిత్ విద్యతే వేమ! నాపరమ్॥
నోపయోగాయ తన్నీరం తాదృఙ్నీరేణ కిం ఫలమ్?।

తా॥ సముద్రముగొప్పది చాలనీరుకలది. కాని యానీరు పనికివచ్చునది కాదు. పనికిమాలినవస్తు వెంతపెద్దదైనను దానితోఁ బ్రయోజనమేమి?

957 సాధనంబులేక సమకూరదేదియు, బోధలేనివిద్య పొందదెపుడు
సాదుగొల్పిమదిని భావించి చూడుము, విశ్వదాభిరామ వినురవేమ॥

సాధనేన వినా వేమ! న కించిదపి సిద్ధ్యతి।
విద్యావాప్తి ర్వినా బోధం విమృశ్య హృది చింతయ॥

తా॥ సాధనములేక పని జరుగదు. బోధలేక విద్యరాదు. కాన నిశ్చలమనమున సద్గురుబోధతోఁ దత్త్వముగ్రహించి తరించుము.

958 సాధుజనులఁబట్టి సంతాపమొందింప, కులవినాశమొందుఁ గ్రూరజనుఁడు
సాధుజనులపూజ సాయుజ్యమిచ్చును, విశ్వదాభిరామ వినురవేమ॥

సజ్జనాన్ యది బాధేత కులం నశ్యే ద్దురాత్మనః।
పూజా సాధుజనానాం స్యాత్ వేమ! సాయుజ్యదాయినీ॥

# ఆదరోక్తిః

ఇమౌ వేమగీతా రచయితారౌ శ్రీరామ నృసింహాభిధేయౌ శతావధానినౌ (సంస్కృతాంధ్రభాషయోరనర్గళనిరవద్యాశుకవితా ప్రబంధచాతురీధురీణౌ) ఉభయభాషాప్రవీణౌ (ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రాచ్యభాషాపట్టభద్రౌ) శ్రీ గద్వాల సంస్థానాస్థానకవివరేణ్యౌ (మహారాజ్ఞ్యాః ఆదిలక్ష్మీదేవ్యాః పరిపాలనకాలే యువరాజాసాహెబ్ కృష్ణరామభూపాలేన గౌరవసమర్పితాస్థానకవియోగ్యతాపత్రౌ) వ్యాసప్రోక్త సంస్కృతభాగవత సంహితాం సలక్షణయా శైల్యా యథాతథ మాంధ్ర భాషాయాం పద్యకావ్యరూపేణ అనూద్య చరితార్థతాం ప్రాప్తౌ వ్యాస ప్రణీత మహాభారతమధ్యభాగస్థితాం భగవద్గీతాం (పూర్వగీతాం. ఉత్తర గీతాంచ) యథావత్ ఆంధ్రభాషాయాం తేటగీతపద్యేషు అనూద్య చ స్వప్రతిభాం ఆధ్యాత్మికానుభూతిం చ ప్రకటయామాసతుః. అపి చ మహాత్మాగాంధీ (పరిష్కృత శ్రీకృష్ణావతారతత్త్వమ్) ఇత్యాఖ్యం ఖండకావ్యం స్వతంత్రభావైః సంస్కృతభాషాయాం విరచ్య స్వకీయం భావగాంభీర్యం సహృదయేభ్యోఽదర్శయతామ్. ఏవమేతౌ సహృదయ లోకస్య ఇతః పూర్వమేవ సుపరిచితౌ.

పంచదశశతాబ్ద్యాం ఆంధ్రయోగీ వేమనాఖ్యః స్వకీయయా అనుభూత్యా తత్కాలస్థసాంఘికదురాచారాన్ ఉద్ఘాట్య ఆర్థికవ్యావహారిక నైతిక ఆధ్యాత్మికాదివిషయాన్ సంస్కరణపూర్వకం యథేచ్ఛ మాంధ్రభాషాయాం ఆటవెలదిపద్యరూపేణ జగౌ. తేషు వేమనకవిగీతేషు ఆటవెలదిపద్యేషు ప్రథమసహస్రం సంస్కృతీకృత్య ప్రకటయ్య చ యావత్ప్రపంచేఽపి వేమనయోగివరస్య నిరుపమాం ప్రతిష్ఠాం సంపాదితవంతౌ ఇమౌ శ్రీరామ నృసింహమూర్తికవివరౌ అతీవ ప్రశంసనీయౌ.

అనయోరేవంభూతా వేమగీతా స్థాలీపులాకన్యాయేన మయా పర్యవలోకితా. సంస్కృతభాషాయామనువదితాయాః ఏతయోర్వేమగీతాయాః అనువాదసౌష్ఠవం (సమూలప్రచురణాత్) విజ్ఞానాం విశదమేవ భవతి. తతః తదుద్ఘాటనమప్రస్తుతమితి మన్యే. ఇయం వేమగీతా యాసు యాసు భాషాసు వ్యాఖ్యాతా భవతి తత్తద్భాషావేత్తృభిః తత్ప్రతిభా సువిదితా భవతి. అథ వేమనయోగినో జీవితం, సాహితీ, తద్వ్యాప్తిః ఇత్యేతే

తా॥ సాధులబాధించిన క్రూరునకు సమూలనాశనమును, బూజించిన పుణ్యాత్మునకు, సాయుజ్యమును గల్గును.

959 **సురలు మానుటెపుడు సరవి వర్తింతురు, ధర్మమార్గ మొంటి తారకముగ**
**అట్లుకానివార లసురులై చెడిరయా, విశ్వదాభిరామ వినురవేమ॥**

తారకో ధర్మమార్గస్స్యా దితి దేవా మహర్షయః ।
వర్తంతే వేమ ! నశ్యంతి తద్భిన్నా అసురాదయః ॥

తా॥ ధర్మమే తారకమార్గముగఁ దరించినవారు సురలు. అట్లు కానివా రసురులు.

960 **తల్లిదండ్రు లాత్మతనయు లన్నలు దమ్ము, లెలమి బంధుభృత్యు లెల్లజనులు**
**గలిగివర్ధిలంగ ఘనతతోనుండుము, విశ్వదాభిరామ వినురవేమ॥**

పితరా వాత్మతనయాః భ్రాతరో భృత్యబాంధవాః ।
యథా వేమ ! ప్రవర్ధంతే తథాభ్యుదయవాన్ భవ ॥

తా॥ బాబూ ! తల్లి తండ్రి పుత్రులు అన్నలు తమ్ములు బంధువులు సేవకులు సమస్తజీవులు సుఖులై యుండులాగున సగౌరవముగ మెలంగుము. (వి) సర్వేజనాస్సుఖినోభవంతు॥

961 **మఱతునేమొయనుచు మది సుజనుండెప్డు, నెవరొనర్చుమే లదెంతదైన**
**మాఱుమేలుఁజూచి మర్యాదఁగాంచును, విశ్వదాభిరామ వినురవేమ॥**

విస్మరామీతి వా వేమ ! భావయన్ సుజనో హృది ।
ఉచితాం ప్రత్యుపకృతిం కుర్వన్ ప్రాప్నోతి గౌరవమ్ ॥

తా॥ మంచివాఁ డెపుడును మఱతునేమోయని తన కితరు లొనర్చుమే లెంతటిదైనను మాఱుమేలు త్వరలోనే చేసి మర్యాదఁ గాంచును.

962 **చేయఁదగినవేళఁ జేసెడికార్యంబు, వేగపడియొనర్ప విఫమదౌను**
**బుడమకాయ చేదు ముదిసినఁదీపయా, విశ్వదాభిరామ వినురవేమ॥**

వేమార్హసమయే కార్యం సహసా యది కుర్వతే ।
విషమం స్యాద్ది గోతుంబ శలాటుగ్రహణం యథా ॥

తా॥ బుడమకాయ పచ్చిది చేదు. పండుతీపి. అట్లే తరుణమునకుముందే తొందరపడిచేసినకార్యము విఫలము,

963 అరయ నాస్తియనక యడ్డుమాటాడక, తిట్టవడక మదినిఁ గొట్టుకొనక
తనదికాదనుకొని తాఁబెట్టునది పెట్టు, విశ్వదాభిరామ వినురవేమ॥

నాస్తీ త్యకథయన్ వేమ! నిషేధమపి చాబ్రువన్।
అశోచన్ హృది నాత్మీయమితి దానం వదాన్యతా॥

తా॥ "ఇదినాదికాదు. అర్థిది" అని సంతోషమున సంతృప్తితోఁ బెట్టునది పెట్టుకాని యడ్డుమాటలఁజెప్పి లేదనియు కసరి మనస్సును జీకాకుఁ బరచుకొని తప్పనిసరియై పెట్టునది పెట్టుకాదు.

964 కామచింతఁజిక్కి కనుగానలేకవు, నియమనిష్ఠవిడిచి నియతిమీరి
తామసంబు నడఁచి తన్మయమొందురా, విశ్వదాభిరామ వినురవేమ॥

కామచింతావశో వేమ! మదాంధ స్త్వం న పశ్యసి।
నిష్ఠాం చ నియతిం త్యక్త్వా తమశ్ఛిత్వా పరం వ్రజ॥

తా॥ కామచింతఁజిక్కి కండ్లుమూసికొని నియమనిష్ఠలవిడిచి నీతిని మఱచి తామసమున నడచిన గమ్యస్థానము నొందఁజాలవు. కానమంచి మార్గమున సంచరించి తన్మయ మందుము.

965 ఫలములేనికార్యములు సేయ నొల్లరు, కలజనంబులెల్ల నిల జనంబు
ఫలముమంచిదైనఁ బరమందు ముదమొందు. విశ్వదాభిరామ వినురవేమ॥

ఫలాభిరహితం కార్యం కర్తుం నేచ్ఛంతి మానవాః।
యది సాధు ఫలం వేమ! పరే ముద మవాప్నుయాత్॥

తా॥ ఫలితములేనిది మంచిపనియైనను జనులు సేయనొల్లరు. సత్కార్యమునకు సత్ఫలితమే యుండును. ఇట్టి విశ్వాసముతోఁ బరమాత్మను బొంది సంతసింపుము.

966 ఇతరచింతలన్ని వెతలని మదినెంచి, జతుగమంటురీతి జగముమఱచి
పరత మాత్మయందె సఁత్యాటలాడుము, విశ్వదాభిరామ వినురవేమ॥

అన్యచింతా వృథా జ్ఞాత్వా జతుకస్పర్శవత్ జగత్।
విస్మృత్య వేమ! సమ్యక్త్వ మాత్మారామ స్సదా భవ॥

తా॥ మెత్తనిలక్కకే యితరములంటుకొనునట్లు మెతకమనమున కే యితరచింతలునుగల్గుఁ అట్టియితరాలోచనలన్నియు బాధనుగల్గించునవే.

కాన మనస్సును దృఢపరచి లోకవిషయముల నంటనీక జగత్తునే మఱచి యెల్లప్పు డాత్మానందముననే ప్రవర్తింపుము. (వి) యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా, యత్రచైవాత్మ నాత్మానం పశ్య న్నాత్మని తుష్యతి॥ గీత॥

967 గురువుఁగలుగ నాత్మగుఱుతెఱిఁగెదనని, కాలమెల్ల రిత్తగడుపుచుండ్రు
గురువుదొరకునపుడు కూలును దేహంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

గురౌ ప్రాప్తే త్వాత్మవిద్యాం జానామీతి వృథా జడః।
కాలం నయతి వేమైతదంతరే ప్రపతే త్తనుః॥

తా॥ సద్గురువు దొరకునప్పుడే యాత్మవిచారణకుఁ గృషిచేయుదునని కాలము వృథా చేయకు. ఈలోపల దేహముకూలిన నేమి సేయంగలవు? అంతస్సాక్షియే గురు వగును.

968 కాశి మధుర కంచి గయ ప్రయాగలు సేతు, వాసతోడ వీని నాత్మఁజూచి
వానవలనెఱుఁగమి వట్టి వెట్టివిధంబె, విశ్వదాభిరామ వినురవేమ॥

కాశీ గయా ప్రయాగాం శ్చ కాంచీం చ మధురాం తథా।
సేతుం వీక్ష్యాపి వేమేహ విష్టితుల్యా హ్యసంస్కృతిః॥

తా॥ నీలోపమును గుర్తించి సరిచేసికొనక కాశి మధుర కంచి గయ ప్రయాగ సేతువులు సేవించితిననుట వట్టి వెట్టిచాకిరి చేయుటవంటిదే యగును. (వి) సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని, ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥ గీత॥

969 భోగవాంఛచేతఁ బోలుపేదై యెఱుఁగక, ద్రోహబుద్ధినొరుల దూఱుటకును
సాహసించువాఁడు సర్వదా చెడునయా, విశ్వదాభిరామ వినురవేమ॥

అసమీచీనవి ద్వేమ! భోగవాంఛాపరో నరః।
ద్రోహాత్ పరాన్ దూషయితుం యతమానో వినశ్యతి॥

తా॥ భోగవాంఛచే యుక్తాయుక్త వివేచనజ్ఞానము శూన్యమై ద్రోహబుద్ధిచే నితరులదూఱుటకు సాహసించువాఁడు సర్వదాచెడును.

970 శివశివయటంచు జెండెంబులొసంచి, జ్ఞానియెఱుఁగలేని మానవుండు
డాంబికునకు లొంగి దయ్యాను గడపటు, విశ్వదాభిరామ వినురవేమ॥

అర్భటీ వేమ! నాస్తీతి చాజానన్ జ్ఞానినం నరః।
దాంభికస్య వశో భూత్వా తదంతే ప్రాప్నుయా ద్భ్రమమ్॥

తా॥ నిరాడంబరుఁడగు జ్ఞానిని గుర్తించనివాఁ డాడంబరపుగొడ్డు మాయజాలములఁజిక్కి తుద కేడ్వఁగలఁడు.

971 తనవిపత్తుఁదెలియఁ దప్పించుకొనఁజూచు, నెట్టిమనుజుఁడైన నెట్టులైన
నరకబాధవినుచు నరయఁడాధర్మంబు, విశ్వదాభిరామవినురవేమ॥

జ్ఞాతాయాం వేమ! చాపత్తౌ తాం వారయితు మిచ్ఛతి।
నరః కథంచిత్ సంశృణ్వన్ న వేత్తి నరకవ్యథామ్॥

తా॥ మనుజుఁ డేదైన నాపద వచ్చునన దానినిఁ దప్పించుకొనుటకుఁ బ్రయత్నించును. కాని నరకబాధ లెన్నిసార్లు విన్నను వానినుండి తప్పించుకొనుధర్మమార్గము మాత్ర మరయఁడు.

972 పచ్చదనముఁజూచి యిచ్చను గాముకుల్, చిచ్చులోఁబడుదురు క్షితితలమున
నిచ్చఁగలుగఁజేయు నెచ్చుగా మోహంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

స్త్రీరూపం కాముకా వీక్ష్య కామాగ్నౌ నిపతంతి హి
సంతతం వేమ! సమ్మోహః కరోతి బహుధా రతిమ్॥

తా॥ స్త్రీసౌందర్యమునుగాంచి కాముకులు కోరికతో మిడుతవలెఁ గామాగ్ని కింధన మగుచున్నారు. మోహమే యట్టి కోరికను బెంపొందించునదియని మాత్రము తెలియఁజాలకున్నారు. (వి) యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి, తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి। గీత।

973 ఔర! యాఁడుదాని నాబ్రహ్మ సృష్టించెఁ, బురుషు పాలిటి పెనుభూతమట్లు
దానివలను బడని వానినిఁ గాంచుమే?, విశ్వదాభిరామ వినురవేమ॥

ససర్జాహో! స్త్రియం బ్రహ్మ మహాభూతసమాం నృణామ్।
యో వేమ! నారీమాయాయాం న పతేత్స న దృశ్యతే॥

తా॥ పురుషులపాలిటికిఁ బెనుభూతమువలె బ్రహ్మ యాఁడుదానిని సృష్టించెను. దాని వలలోఁబడని పురుషుఁడే కనుపించఁడు. (వి) స్త్రీయంత్రం కేన సృష్టం విష మమృతమయం ప్రాణిలోకస్య పాశః। (భర్తృ)

974 వరునిబిందువువను నాతిగర్భముఁదాల్చు, రాతియుప్పుచేత రసముఁగట్టు
బుద్ధిఁదెలివియున్న భువనముల్ దాల్చదా, విశ్వదాభిరామ వినురవేమ॥

స్త్రీ పుంశుక్లాత్ గర్భిణీ స్యాత్ అశ్మేన రసం తథా।
యది వేమ ! జ్ఞానయుక్తా బుద్ధి ర్ధత్తే న కిం జగత్? ॥

తా॥ పురుషవీర్యమున స్త్రీ గర్భమును ధరించును. రాతియుప్పుచేఁ బాద రసము తోడుకొనును. అట్లే బుద్ధి జ్ఞానమును గల్గియున్న లోకములనే ధరించఁగలదు.

975 చదువుఁజదువకున్న సౌఖ్యంబులును లేవు, చదువుఁజదువు నేని సరసుఁడగును
చదువుమర్మమెఱిఁగి చదువంగఁజూడుమా, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమానధీతవిద్యానాం న సౌఖ్యాని భవంతి హి।
అధీతవిద్య స్సరసో విద్యావాన్ భవ మర్మవిత్ ॥

తా॥ చదివిన జ్ఞానియగును. చదువకున్న సుఖము కనఁబడదు. అట్టి సుఖమును గల్గించు జ్ఞానముతోఁ గూడిన చదువునే చదువుము. (వి) పశో॥ పశుః కో? న కరోతి ధర్మం, ప్రాధీతశాస్త్రోఽపి న చాత్మబోధః ।శం। మణి।

976 తావుఁదెలిసినతఁడు తా వీలువెంబడి, నేవిధముననైన నిరవుఁజేరు
భావమెఱుఁగకున్నఁ బరమెఱుంగుట యెట్లు?, విశ్వదాభిరామ వినురవేమ॥

స్థానవేత్తానుకూల్యేన కథం చిత్ప్రాప్నుయాత్ పదమ్?।
వేమ ! భావానభిజ్ఞో హి కథం వేత్తి పరం జనః? ॥

తా॥ గమ్యస్థానముఁదెలిసిన వీలువెంబడి యెప్పుడో యొకప్పుడు చేరఁ గలఁడు. కాని దానిపద్ధతియే తెలియకున్న నెట్లు చేరఁగలఁడు?

977 మత్తచిత్తులు తమమర్మంబుఁదెలియక, చిత్తచలనమంది చెడిరి భువిని
భక్తిలేనివాఁడు పరమాత్మ నెఱుఁగునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

అజానంతో వేమ ! మర్మ మత్తచిత్తా నిరంతరమ్।
నశ్యంతి చిత్తచాపల్యా దభక్తో వేత్తి కిం పరమ్? ॥

తా॥ మత్తులు యథార్థముఁ దెలియఁజాలక చపలచిత్తులై చెడుచున్నారు. భక్తిలేనివాఁడు పరమాత్మ నెట్లు తెలిసికొనఁగల్గును? (వి)

978 పతులఁగవయుటకును, సుతులఁబడయుటకు, వెతలఁబడుట యెంతొ వెఱ్ఱితనము
నేలనున్నరాయి నెత్తికెత్తినయట్లె, విశ్వదాభిరామ వినురవేమ||

స్త్రీసంగాయ సుతోత్పత్త్యై వ్యథతే వేమ! మానవః।
ఉన్మాదస్తు మహాంస్తస్య ధత్తే శిరసి భూశిలామ్॥

తా॥ నేలమీఁదరాతిని నెత్తికి నెత్తుకొనునట్లు స్త్రీలను బొందుటకుఁ బిల్లలఁగనుటకు వెతలఁబడుట యెంతయో వెఱ్ఱితనము. (వి) క్వాస్థా న కార్యా ? సతతం భవాబ్ధౌ।। శం। మణి।

979 హానికలుగఁబోదు హరు మదినెంచిన, వానికబ్బు పరము వసుధయందుఁ
బూని నిష్ఠమీఱి పొదలకయుండుము, విశ్వదాభిరామ వినురవేమ||

యది ధ్యాయే ద్ధృది శివం న హాని స్తస్య విద్యతే।
పరం సిద్ధ్యతి వేమేహ ధృతనిష్ఠ స్సుఖీ భవ॥

తా॥ పరమేశ్వరు మదిని ధ్యానించువారి కెన్నటికిని హాని కలుగదు. భవిష్యత్తు (పరము) కూడ బాగుపడఁగలదు. తత్తరపడక నిశ్చల మనస్కుఁడవు కమ్ము.

980 పరులమేలుఁజూచి పలుగాకివలెనెప్డు, కట్టిమాటలాడువాఁ డధముఁడు
అట్టివానిబ్రతుకు నదిరోలమట్టికా ?, విశ్వదాభిరామ వినురవేమ||

పరాభ్యుదయ ముద్వీక్ష్య సర్వదా వేమ! కాకవత్।
అధమో నిష్ఠురోక్తి స్స్యాత్ మృత్తుల్యం తస్య జీవనమ్॥

తా॥ ఇతరుల మేలుఁజూచి యసహనమున వ్యర్థాలాపములఁ బలుకు దుష్టుని బ్రతుకు మట్టియగుటకే పనికివచ్చును. (వి) విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని, శునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః।। గీత।।

981 చిన్ననాటినుండి చేసినకర్మంబు, పిన్నపెద్దలకును బెఱిగివచ్చు
మంట మింట నడుమ మతినిల్పిచూడుము, విశ్వదాభిరామ వినురవేమ||

బాల్యాత్ప్రభృతి యత్కర్మ కృతం తత్ బాలవృద్ధయోః।
ప్రయాతి వృద్ధిం వేమేదం రోదస్యాం పశ్య ధీరధీః॥

తా॥ భూమ్యాకాశముల మధ్యప్రదేశమంతయు గాలించిచూచినఁ జిన్ననాటినుండియుఁ జేసిన మంచిచెడుకర్మల ఫలితమే వయస్సుతోఁ బాటు పెరుగుచు వచ్చుచుండుటఁ గానఁనగును.

982 పునుగుపిల్లి కేలపుట్టించె వాసనల్? దానిమహిమ లేమి ధరణిలోన
బ్రహ్మచేతలన్ని పాడైనచేతలు, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ ! గంధబిడాలస్య చక్రే కిం గంధసౌరభమ్? ।
కిం తన్మహాత్త్వం మేదిన్యాం బ్రహ్మచేష్టా నిరర్థికాః ॥

తా॥ పునుగుపిల్లి యేమంతగొప్పదని దానిపృష్ఠమునకు బ్రహ్మ సువాసనఁ గల్పించెను? బ్రహ్మచేతలన్నియు నిట్లే నిష్ప్రయోజనములు విచిత్రములు నైనవి.

983 నేననువచనంబు నీవనఁగావచ్చు, నీవు నేననఁబడు నిష్ఠఁదెలియ
నేను నీవె నీవె నేనన వచ్చురా, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమాహమితి యద్వాక్యం తద్ధి త్వమితి చోచ్యతే ।
అహం త్వం చేతి నిష్ఠాతః అహం త్వం త్వమహం ధ్రువమ్ ॥

తా॥ పరికించిన నేను, నీవు, అను పదము లొకనికే చెల్లును.

984 చిత్రదీపమువలెఁ జింతను దిగఁద్రొక్కి, మిత్రముగను మనసు మెలఁగఁజేసి
శత్రుగుణములెల్ల సాధించుటయె ముక్తి, విశ్వదాభిరామ వినురవేమ॥

చిత్రదీపసమాం చింతాం వ్యుదస్య విమలం మనః ।
మిత్రం కృత్వా దుర్గుణానాం ముక్తి ర్వేమ ! నివారణమ్ ॥

తా॥ చింత, దీపపుబొమ్మవంటిది. నిశ్చలమనమున దానిని దిగఁద్రొక్కి మనస్సుతో మైత్రిఁ జేసికొని శత్రుగుణముల జయించుటయే ముక్తి.

985 అచలతత్త్వమనఁగ ననుభవగమ్యంబు, చూచిచెప్పరాదు సూక్ష్మమదియు
మదికిఁదోఁచుఁగాని మర్మమెన్నఁగరాదు, విశ్వదాభిరామ వినురవేమ॥

సూక్ష్మం వేమాచలం తత్త్వ మనుభూత్యేక వేదితమ్ ।
వక్తుం దర్శయితుం చాపి న శక్యం ద్యోతతే హృది ॥

తా॥ అచలతత్త్వ మనుభవయోగ్యమైనది. సూక్ష్మమైనది. మనస్సునకు మాత్రము తట్టునది. కానఁ జూపుటకుఁను జెప్పుటకుఁను సాధ్యముకాదు.

986 ప్రాణులందు శివుని భావింపనేరక, యోగమందు రేల? జోగులార!
యోగమందుఁగలదె? భోగమందున్నట్లు, విశ్వదాభిరామ వినురవేమ॥

అదృష్ట్వా ప్రాణిషు శివం యోగ ఇత్యేవ యోగినః ।
కథయధ్వే యథా భోగే కిం యోగేఽస్తి తథా శివః ॥

తా॥ అంతటఁ బ్రాణులందున్న పరమేశ్వరుఁ గాంచుచుండిన భోగము లున్నను నాటంకములుకావు. యోగమునకు సన్న్యాసులే కానక్కరలేదు. భోగమునకు యోగము సరిపోదు. (వి) సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రే యసకరా వుభౌ, తయోస్తు కర్మసన్న్యాసాత్ కర్మయోగో విశిష్యతే॥

987 నాసికాగ్రమందు నయముగా గుఱినిల్పి, వాసిగాను జూడ వశ్యమగును
కాశికంచులఁగనఁ గడగండ్లుపడనేల, విశ్వదాభిరామ వినురవేమ॥

లక్ష్యం కృత్వా నాసికాగ్రే సమ్యగ్దృష్టే వశం భవేత్ ।
కాశీం కాంచీం చ సంద్రష్టుం వేమ ! కిం నిష్ఫలశ్రమైః?॥

తా॥ కాశి, కంచి, చూచుట కవస్థలుపడితి మన ముక్తిరాదు. నాసికాగ్రమున గుఱి నిలిపినఁ గొంతవఱకు వశ్యము కాఁగలదు. (వి)సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్ ,......యుక్త ఆసీత మత్పరః॥

988 దొమ్మరాటవాని దొర్బలమెల్లను, బొట్టకూటికొఱకె పట్టినదగు
అదియె యోగికమర నానందమందఁడా ?, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ ! కుటుంభరిత్వాయ దౌర్బలం వంశనర్తినః ।
తదేవ యోగినో లభ్యాం చే ద్దివ్యానందదాయకమ్ ॥

తా॥ దొమ్మరాటవాఁడు పొట్టకూటికి శరీరసాధకమున కెంతయో శ్రమపడుచున్నాఁడు.అంతశ్రమ యోగిపడిన నానందముఁగాంచునుకదా?

989 కీవి మిగులఁగట్టి టెక్కెమ్ములెత్తించి, యూళ్ళనేల ముక్తి యూర్ధ్వదియగు
మంచిత్రోవకొఱకు మహినియత్నింపుము, విశ్వదాభిరామ వినురవేమ॥

ప్రతిష్ఠాప్య ధ్వజాన్ వేమ ! విక్రమాఢ్యో మహీతలమ్ ।
శాసేతచే న్నాస్తి ముక్తిః యతస్వ విమలాధ్వనే॥

తా॥ కీవితో జెండాల స్తూపముల నెత్తించి యూళ్లేలుచుంటినన్నంత మాత్రమున ముక్తిరాదు. మంచిత్రోవకొఱకు యత్నింపుము.

990 టక్కుటూటలాడి చిక్కులఁబెట్టిన, నిక్కమెఱుఁగఁబడదు నిర్వహింప
చక్కనైన జ్ఞానసారంబుఁదెలియుమీ, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ ! కూటవచాం స్యుక్త్వా యది భేదం కరిష్యసి ।
తత్త్వం న జ్ఞాయతే సమ్యక్ జ్ఞానసారం విహాఽవ్యయమ్ ॥

తా॥ మోసపుమాటలఁబలికి చిక్కులఁ గల్పించుకొన్న నిక్క మెఱుఁగఁబడదు. కాన చక్కనైన జ్ఞానసార మెఱుఁగుటకే ప్రయత్నింపుము. (వి) న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే, అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః॥ (గీత)

991 చలముఁబట్టి మదిని జనియించుగుణముల, తఱిని దుంచి తేఁగ దమకమడిగి
సతము గాను బుద్ధిసవరింప నదె ముక్తి, విశ్వదాభిరామ వినురవేమ॥

హృజ్జాతం గుణసంజాతం ఛిత్వా యత్నేన నిస్పృహః ।
బుద్ధిం విశుద్ధాం కుర్యాచ్చేత్ వేమ ! సా ముక్తి రేవ హి॥

తా॥ పట్టుదలతో మనమునఁబుట్టు గుణముల నంతరింపఁజేసి బుద్ధిని సరిచేసికొన్న నదియే ముక్తి. (వి) హిరణ్మయే పరే కోశే విరజం బ్రహ్మ నిష్కళమ్, తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతి స్తద్వ దాత్మవిదో విదుః॥

992 చెవులలోనఁబుట్టు రవమె యాకాశంబు, కన్నులఁగనునదియె కళలజ్వాల
ముక్కులోని గాలి ముక్తికిఁదోవయా, విశ్వదాభిరామ వినురవేమ॥

నాదమేవ శ్రవోజాత మాకాశో వేమ ! కథ్యతే ।
నేత్రదృష్టా కళాజ్వాలా నాసావాయుశ్చ ముక్తిదః ॥

తా॥ చెవి మూసినఁ దెలచిన వినఁబడు ప్రణవశబ్దము పుట్టుచోటే యాకాశము. కన్నుమూసినఁ దెలచిన కనఁబడు కళయే తేజస్సు. ముక్కు మూసినఁ దెలచిన నుండు ప్రాణవాయువే గాలి. అట్టిస్థితియే ముక్తి.

993 ఆదిసోమభౌమ మాదిగా బుధుఁగూడి, గురువు శుక్రుఁడు శని గురుతులెన్నొ
ఎన్నిదినములైన నిల నొక్కరూపమే, విశ్వదాభిరామ వినురవేమ॥

భాను స్సోమ కుజ స్సౌమ్యో గురుః శ్శుక్ర శ్శనిః క్రమాత్ ।
దినసంజ్ఞాకరా వేమ ! దివసం త్వేకరూపకమ్ ॥

తా॥ ఆది, సోమ, మంగళ, మొదలగు వారముల గుర్తులెన్ని యున్నను దినస్వరూప మొకటే. అట్లే పరమాత్మయు నొకటే.

994 గుళ్ళమునకుఁదగిన గుఱుతైనరోతున్న, గుళ్ళ మిలను నడుచు గూఁకుఁగల్గి
గుళ్ళము తనదొంటిగఁజూలమేల తెలియుదో, విశ్వదాభిరామ వినురవేమ॥

దక్షః వేమాశ్వికే ప్రాప్తే గుణీ సన్ వర్తతే హాయః ।
స్వకీయదేహస్య గుణం న జానాతి కుతో హాయః? ॥

తా॥ రౌతుకొలందిగుఱ్ఱము నడచును. కాని తన యొంటిగుణముఁ దెలియఁజాలదు.(సమర్థుఁడగు గురువువలన ముక్తి శీఘ్రముగలభింపఁగలదు)

995 మ్రానిలోన నగ్నిమఱియుండఁగావచ్చు, నగ్నిలోన మ్రాని కలవియగునె?
మ్రానిలోనియగ్ని మర్యాద సంసారి, విశ్వదాభిరామ వినురవేమ॥

స్థాతుం శక్య స్తరా వహ్నె రగ్నౌ తు న తథా తరుః ।
ధృతవృక్షాగ్నిమర్యాద స్సంసారీ వేమ! సంచరేత్ ॥

తా॥ మ్రానిలో నగ్నియుండును. కాని యగ్నిలో మ్రానుండనేరదు. మ్రానులోని యగ్నివలె దేహములోని సంసారి మర్యాద వహించును.

996 మేఘమడ్డమైన మిహిరునిఁజెఱచును, జిత్తమడ్డమైన స్థిరముఁజెఱచు
మఱపులడ్డమైన మహిమంబుఁజెఱచురా, విశ్వదాభిరామ వినురవేమ॥

ఆచ్ఛాదయతి వేమార్కం మేఘరోధ స్తథా స్థిరమ్ ।
చిత్తావరోధ స్సంరోధో మహిమానం చ విస్మృతేః ॥

తా॥ మేఘ మడ్డమైన సూర్యకాంతిని, జిత్త మడ్డమైన స్థిరత్వమును అజ్ఞాన మడ్డమైన ప్రభావమును, బాడుఁజేయును.

997 బిగియ దృష్టినెపుడు బింబమందుంచిన, మననమందు నెఱుక మగ్నమగును
లగ్నచిత్తమమర రక్షించుచుండురా, విశ్వదాభిరామ వినురవేమ॥

బింబస్థాచేత్ స్థిరా దృష్టిః మగ్నా స్యా న్మననే స్మృతిః ।
లగ్నం చిత్తం పరే లక్ష్యే వేమ! రక్షతి సర్వదా॥

తా॥ పరమాత్మయందే నిశ్చలదృష్టియుంచిన నెఱుక మనమున లీనము కాఁగలదు. అ న్లెఱుకతోఁ గూడిన మనస్సే సర్వదా రక్షించును

998 వేయివిధము లరయ వేమనపద్యముల్, అర్థమిచ్చు నానిచరవిచూడ
చూడఁజూడఁగల్గుఁ జోద్యమౌ జ్ఞానంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమప్రోక్తాని పద్యాని దదత్యర్థం సహస్రధా ।
దర్శం దర్శం లభేతాత్ర వేమ! జ్ఞానం మహాద్భుతమ్ ॥

అన్యే చ అంశాః గ్రంథకర్తృభ్యాం కథితపూర్వా ఏవ. తతః పునరుల్లేఖనం చర్వితచర్వణమేవ స్యాత్. ఏతత్ ప్రథమం శ్లోకసహస్రం ప్రసంగశుద్ధి విరాజమానం సమ్యక్ మనః ప్రవిశ్య మానవం అజ్ఞానాంధతమసాత్ నివర్త్య హృదయపరివర్తనేన సత్పథానుగామినం కర్తుం సర్వదా శక్నోతి ఇత్యుక్తిః నిర్వివాదైవ.

ప్రభావప్రకటనార్థం ప్రగల్భవచాంస్యుక్త్వా వృథా కల్పితబిరుదాని ధృత్వా పామరజనపఠనీయాని యానికానిచిత్ శృంగారకావ్యాని విరచ్య లోలాత్మనః ప్రభూన్ ప్రజాశ్చ వశీకృత్య ధనం హృత్వా దురభ్యాసవశంగతానాం శృంగారకవీనాం మధ్యే ఏతాదృశా మాధ్యాత్మికసత్కవీనాం స్థానం నలభేతేతి నగ్నసత్యమేవ. తథాపి పదపద్యకవితయోః భక్తిజ్ఞాననిజానుభూతికలితాధ్యాత్మికతత్త్వ ప్రోత్థితభావతరంగైః ఆత్మానందాయైవ స్వయంగానం కృత్వా ముక్తిపథం గతౌ ఆంధ్రదేశీయౌ త్యాగయవేమనాఖ్యౌ పుణ్యపురుషౌ భాసేతే. తథైవ ప్రకృతకవీ స్వసుఖాయైవ స్వరచనా ఇతి ప్రకటయంతౌ అచిరాదేవ సంస్కృతాంధ్రయోః అనేకాన్ ఉద్గ్రంథాన్ రచయిత్వా సర్వేషామపి అభినంద్యౌ భవతః. జాతిమతబాహ్యాన్యాయధర్మసత్య ప్రతిపాదనాయైవ ఉద్దిష్టః అయంగ్రంథః జనానాంమౌఢ్యతమో నివారయతి. నాత్రసంశయః.

ఆంధ్ర్యాం తత్రాపి వ్యావహారికభాషాయాం పామరజనసుబోధార్థం పండితజనానామపి దురవగాహాని తత్త్వరహస్యాని నిక్షిప్య స్వప్రతిభాం వేమనయోగీ విశదయామాస. వ్యావహారికభాషాతః సంస్కృతానువాదః అతిక్లేశజనక ఇతి తద్విదాం విదితమేవ. తమిమం క్లేశకర మనువాదం శ్రీరామ నృసింహమూర్తికవీ సహృదయహృద్యం యథాతథా సాధయామాసతుః ఇతి వక్తవ్యమ్.

తథా చ అనయోః సకలభాగ్యసంధానాయ భగవంతం ప్రార్థయన్ సాంజలిబంధ మేతౌ అభినందంశ్చ.

*I. Narayanaswamy*, M.A.,
MAHARAJA'S COLLEGE. VIJAYANAGARAM.

వా॥ ఈ వేమనపద్యము లనేకవిధముల నర్థ మీయఁగలవు. ఎంత విమర్శించిన నంతచోద్యమగు జ్ఞానము లభింపఁగలదు.

999 ముక్తిమార్గమునకు మూలమైతగునటి గ్రంథమంత జనులు గడఁగిచదువ
విన్నవారికెల్ల విభవముల్ కల్గును, విశ్వదాభిరామ వినురవేమ॥

యన్మూలం ముక్తిమార్గస్య తద్గ్రంథే పఠితే జనైః ।
శృణ్వతాం వేమ ! సర్వేషాం భవంతి విభవా శ్శుభాః ॥

తా॥ ముక్తిమార్గమునకు మూలాధారమగు నీ గ్రంథమంతయుఁ జదివిన వినిన సమస్తవై భవములు చేకూరఁగలవు.

1000 ఇహపరంబులకును నిది సాధనంబని వ్రాసిచదువ విన్నవారికెల్ల
మంగళంబు లొనరు మహిలోన నిజమిది, విశ్వదాభిరామ వినురవేమ॥

ఐహికాముష్మికసుఖధామేదమితి నిత్యశః ।
లిఖతాం పఠతాం వేమ ! శృణ్వతాం చ శుభం భవేత్ ।

తా॥ ఇహపరజ్ఞాన సంపాదనమున కిదే మంచి సాధనంబని వ్రాసినఁ, జదివిన, వినిన సమస్త మంగళములుఁ జేకూరఁ గలవు.

(వి) సమస్త సన్మంగళానిభవంతు॥

## గ ద్య మ్

ఇతి శ్రీ శతావధానిభ్యాం ఉభయభాషాప్రవీణాభ్యాం గద్వాల
సంస్థానాస్థానకవిభ్యాం భాగవత భగవద్గీతా ద్యాంధ్ర పవిత్రో
ద్గ్రంథ రచయితృభ్యాం "మహాత్మాగాంధీ" ఇత్యాది
సంస్కృత గ్రంథ కర్తృభ్యాం చ "శ్రీరామ నృసింహ
మూర్తిక"వీతి ప్రతీతి యుతాభ్యాం గంధం శ్రీరామ
మూర్తి, ఇట్టింకి నరసింహమూర్తిభ్యాం ప్రణీతాయాం
వేమగీతాయాం ప్రథమ సహస్రమ్

స మా ప్త మ్.

# శ్రీ మహాంధ్ర భాగవతము



రచయితలు :— శ్రీరామ నృసింహమూర్తి కవులు

గంధం శ్రీరామమూర్తి, ఇట్టింకి నరసింహమూర్తి,

(శతావధానులు, ఉభయభాషాప్రవీణులు, శ్రీగద్వాల సంస్థానాస్థాన కవులు)

ప్రాప్తిస్థానము :

## శ్రీరామనృసింహ గ్రంథ రత్నమాల, తోలేరు.

(వయా) వీరవాసరం, ప. గో. జిల్లా (ఆంధ్ర)

మూల్యము :- 5 సంపుటముల పూర్తి సెట్టు (క్యాలికో) రూ. 25-00

విడి సంపుటము (కట్ బైండింగు) రూ. 5-00

ఇది వ్యాసకృత సంస్కృతభాగవతమునకు సరియైన ఆంధ్రానువాదము. పద్యకావ్యము. రాయల్ 1/8 సైజున సుమారు 1500 పుటలు 10 వేల పద్యములతో 12 స్కంధములు. 5 సంపుటములుగ ప్రచురింపఁబడినది. ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖా డైరక్టరువారిచే గ్రంథాలయములకుఁగాను **R. C. No. 64 M 4/57 D. 8—4—57** గా అప్రూవు కాఁబడినది. ఆంధ్రప్రభుత్వాస్థానకవి శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, ఆలిండియా రేడియో, విజయవాడ లిటరరీ ఎడ్వైజర్ శ్రీ పింగళి లక్ష్మీకాంతం ఎమ్.ఎ., జయపుర సంస్థానాస్థానకవి శ్రీ పెనుమెచ్చ సత్యనారాయణరాజు, నవయుగ కవిచక్రవర్తి శ్రీ గుఱ్ఱం జాషువా, ఆంధ్ర బెర్నార్డుషా శ్రీ వేదాంతకవి, ప్రఖ్యాత సినీకళాకారులు శ్రీ చిత్తూరి వి. నాగయ్య, పి. ఇ. యస్. మెంబరు శ్రీ అద్దేపల్లి నాగగోపాలరావు బి. ఎ., బి. ఓ. యల్., ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసంఘ మాజీకార్యదర్శి శ్రీ శరణు రామస్వామి చౌదరి, మహామహోపాధ్యాయ శ్రీమాన్ ముడుంబై కృష్ణాచార్యులు, ప్రభృతులగు సుప్రసిద్ధ సాహిత్యవేత్తల యొక్కయు, వెన్నెల, వి. ఆంజనేయశర్మ, సి. నారాయణరెడ్డి ఎం. ఎ., గార్ల సంపాదకత్వమున హైదరాబాదునుండి వెలువడు స్రవంతి, మొదలగు సాహిత్య పత్రికల యొక్కయు ప్రశంసల నందుకొన్నది. మచ్చునకు రెండభిప్రాయములు గమనింపుడు :-

## శ్రీ గుఱ్ఱం జాషువా కవిగారు,

(నవయుగ కవిచక్రవర్తి, కవికోకిల, కవితావిశారద)

నమస్తే!

శ్రీరామ నృసింహమూర్తి కవులకు -

తమచే రచింపఁబడిన శ్రీ మదాంధ్రభాగవతము శాఖాచంక్రమణముగాఁ జూచితి. మీ కవిత సలక్షణమై మూలమునకు సరియైన తెలుఁగు సేఁతయై విరాజిల్లుచున్నది. ఇంతటి యుద్గ్రంథమును దొలినుండి తుది వరకు బిగువు సడలనీక, రసము జారనీక, ధార కుంటువడనీక ఒకే బిగువున నడపిన మీ ప్రజ్ఞాపాటవమునకుఁ బఠితల హృదయమాశ్చర్యచకితమౌచున్నది. పోతనామాత్యుఁడే జంటకవులై మీరూపమున నావిర్భవించెనా యన్న భ్రాంతియుఁ గలుగుచున్నది. మీ కావ్యము మీకు వలసినంత కీర్తిని జేకూర్చఁగలదు. సద్యఃఫలము సిద్ధించలేదని వంత వలదు. "కాలోహ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ" అన్న భవభూతి సూక్తి మఱువకుఁడు.

గుంటూరు,
గోపాలకృష్ణయ్య తోట,
22—8—60

భవదీయుఁడు,
(సం.) జాషువ.

"వెన్నెల" పత్రిక.

15 ఆగష్టు 1960. అమలాపురం,
(తూ. గో. జిల్లా)

## శ్రీ మదాంధ్ర భాగవతము

(ప్రథమ సంపుటము)

రచయితలు - శ్రీరామ నృసింహమూర్తి కవులు

గంధం శ్రీరామమూర్తి, ఇట్టింకి నరసింహమూర్తి,

(శ్రీ గద్వాల సంస్థానాస్థానకవులు, శతావధానులు, ఉభయభాషా ప్రవీణులు)

ఆంధ్రరాష్ట్ర పశ్చిమగోదావరిమండల స్థానికోన్నత పాఠశాలలఁ బ్రథమశ్రేణి ప్రధానాంధ్రోపాధ్యాయులుగఁ బనిఁజేసిన శ్రీరామ నృసింహమూర్తి కవులు పూర్వజన్మసుకృతవిశేషమున సాహసముతో నీ భాగవత రచనకుఁ బూనుకొనిరి.

బెర్నార్డుషా, వేదాంతకవిగారి కవిద్వయము నెట్లు ప్రశంసించిరో గాంచుఁడు.

మ॥ అవధానమ్ముల్ సల్పినా రఖిలవిద్యాప్రౌఢు 'లోహో' యటం
చు వినోదించు సదస్సులందుఁ గవితాస్రోతస్సులం జెన్ని యో
నవమాణిక్య మరాళరాజమురళీ నాట్యోత్సవ శ్రీకళా
వ్యవసాయమ్మున నాంధ్రభాగవతముం బండించి రీసత్కవుల్॥

ఉ॥ కోమలవాగ్విలాసములఁ గోటివరా లెగఁబోయుచున్న శ్రీ
రామనృసింహమూర్తులు చిరస్మరణీయులు విశ్వకావ్య గీ
తామృతసారసంస్కృతిసమన్విత భాగవతంబు వ్యాసవా
ణీమణి మొక్కవోని కరణిన్ రచియించిరి తెన్గుబాసలోన్॥

రచనయంతయు నూతనశక్తిని పరువులెత్తినది. భీష్మస్తుతి, కృష్ణనిర్యాణము, కపిలోపాఖ్యానము, హిరణ్యాక్షవధ మున్నగు ఘట్టము లత్యంతాద్భుతములుగ వెలుఁగొందుచున్న క్రింది పద్యముఁ జూడుఁడు.

మ॥ బహుళామర్ష సముద్ధతీర్ణ్మ తర ని  ... పంబులం బుచ్చు చం
త హిరణ్యాక్షుఁడు క్రోధసంచలితబుద్ధ్యాదీంద్రియవ్రాతుఁడై
ముహురాసాదితమైన భూరిగదచే మోదెన్ వెసన్ దానవా
రి హరిన్ భద్మకిరిన్ గృపాలహరి ...రిన్ శౌర్యభాస్వద్గిరిన్॥

తృతీయస్కంధమున 9వ అధ్యాయమునఁగల బ్రహ్మస్తుతి దండకము చాల మనోహరముగనున్నది. గమనింపుఁడు.

శ్రీ దేవదేవా! యమేయప్రభావా! లసద్భావ! శుభ్రత్యంత సీమంతముక్తామణీ! దైవచూడామణీ! భక్తరత్నామణీ! తాపసగ్రామణి వ్రాతసంపూజితాంఘ్రిద్వయా! యద్వయా ......

తెలుఁగుసేతయన్నది యెంత కష్టతమమైనదియో విజ్ఞులకుఁ దెలియనిది కాదు. పాండితీసౌరభ మీ గ్రంథరాజ మంతట గుబాళించుచున్నది. మల్లెలు విరిసినట్లు భావములసొంపు, పెంపు నింపులఁ దలిర్చుచున్నది. అటనట వీరి కవితఁ జదువునప్పుడు ముచ్చా వెంకటరాయకవిగారి యద్భుతశైలి తోచుచున్నది.

"బాలశ్రీ"

## శ్రీమదాంధ్ర భాగవతము

వ్యాసకృత సంస్కృత మూలమునకు సరియైన ఆంధ్రానువాదము, పద్యకావ్యము, రాయల్ సైజు, సుమారు 1500 పుటలు 10 వేల పద్యములతో 12 స్కంధములు 5 సంపుటములుగ ప్రచురింపబడినది. ప్రభుత్వానుమతిబొందినది.

5 సంపుటముల పూర్తి సెట్టు 1కి (క్యాలికో బైండు) రు **25-00**

(కట్ బైండింగ్) రు **5-00**

## వ: ద్ధము

వజాస్వామికము, సామ్యం, ప్రగతి, పలా
ప్రమాజ్యం, వాదములు, శాంతి యుద్ధ
ఆధ్యాత్మికాది పద్ధతులతో ఆధునిక రాచకీయ పరిస్థితుల
దెలుపు పౌరాణిక గద్య నాటకము రు **2-00**

## యథార్థ రామాయణము (పద్యకావ్యము) రు **0-50**

## తేటగీత-భగవద్గీత (సమూలము, పూర్వగీత, ఉత్తరగీత) రు **2-00**

## మహాత్మా గాంధీ (పరిష్కృత శ్రీకృష్ణావతారతత్త్వము)

100 శ్లోకములు (తెలుగు అర్థముతో) రు **0-50**

" నాగరలిపి (హిందీవ్యాఖ్యతో) రు **1-00**

## వేమ గీత (ప్రథమ సహస్రము) 1000 ఆటవెలది

వేమనపద్యములు, వానికి సంస్కృత శ్లోకములు రు **2-00**

## వేమ గీత (ప్రథమ సహస్రము) విషయవిభాగముతో శ్రుతి,

స్మృతి, పురాణేతిహాసాది పూర్వగ్రంథోదాహరణములు కల్గినది. తెలుగు వివరణము. రు **4-00**

,, నాగరలిపి - హిందీవ్యాఖ్య రు **5-00**

## వేమ గీత (ప్రథమ సహస్రము) నాగరలిపి శ్లోకము

సి. పి. బ్రౌన్ ఆంగ్లవ్యాఖ్య (పూర్వార్థము) రు **3-00**

---

శ్రీరామనృసింహ గ్రంథ రత్నమాల, తోలేరు.

(వయా) వీరవాసరం, ప. గో. జిల్లా. (ఆంధ్ర)

ఓమ్

శ్రీ వేమనయోగీన్ద్రాయ నమః

# వేమగీత (ప్రథమసహస్రము)

సమూలము (తెలుఁగువివరణము)

శ్రీ రా మ నృ సిం హ మూ ర్తి క వు లు:

శ్రీ వేమనయోగీన్ద్రస్తుతి

శ్రీ వేమాహ్వాయ యోగివర్య! పతితా నుద్ధర్తుకామో జనాన్
తత్త్వార్థం ప్రతిపాదయ న్ప్రవచనైః హృద్యాన్ధ్రపద్యాత్మకైః
సందేశం భువి యం త్వ మద్భుత మదాః ప్రాక్ ప్రాక్త మేవాధునా
గైర్వాణ్యాం గిరి భాషితుం ప్రదిశ నౌ ధార్ష్ట్యం నమస్తే! నమః.

తా॥ వేమనయోగీంద్రా! పతితులనుద్ధరించుటకొఱకుఁ దత్త్వార్థముఁ బ్రతిపాదించుటకునై మనోహరములగు నాంధ్రపద్యముల లోకమునకునీవే యద్భుత సందేశమింతకుపూర్వమిచ్చితివో దానినే యిప్పుడు సంస్కృత భాషలోఁబలుకుటకు (శ్రీరామనృసింహమూర్తికవులమైన) మాకుఁ దగిన దిట్టతనమును బ్రసాదింపుము. నీకిదే నమస్కారము.

శ్రీ మత్సనత్కుమారాంశం వేదవేదాంగవేదినమ్ ।
దిగంబరం కుమారాభం స్తువో వేమాఖ్య యోగినమ్॥

తా॥ సనత్కుమారాంశసంభూతుఁడును, వేదవేదాంగవేదియు, దిగంబరుఁడును, బాలకునివంటివాఁడునునగు వేమనయోగిని స్తుతించెదము.

## నైతిక విభాగము

1 ఆత్మశుద్ధిలేని యాచారమదియేల?, భాండశుద్ధిలేని పాకమేల?
చిత్తశుద్ధిలేని శివపూజయేలరా?, విశ్వదాభిరామ వినురవేమ॥

ఆత్మశుద్ధ్యా వినాచారః పాకో భాండే శుచిం వినా ।
చిత్తశుద్ధ్యా వినా వేమ! శివపూజా నిరర్థికా ॥

తా॥ పరిశుభ్రపరచని పాత్రతోవండిన వంటకములు, హృదయపారిశుద్ధ్యములేనివాని యాచారములు, మనశ్శుద్ధిలేనివాని భగవత్పూజయు

నిష్ప్రయోజనమే సుమా॥ వి॥ అనాచారాత్ భవేద్భ్రష్టః, అత్యాచారేణ మూర్ఖతా, ఆచారవ్యవహారేషు, సముచిత్తో భవేత్సుధీః॥

2 **నిక్కమైనమంచి నీలమొక్కటిచాలు, తళుకు బెళుకురాళ్లు తట్టెడేల?**
**చదువఁ బద్య మరయఁ జాలదా యొక్కటి, విశ్వదాభిరామ వినురవేమ॥**

ఏకే నాలం జాతినీలమణినా కిం బహూపలైః?।
రసయుక్తం పద్య మేకం పఠితుం వేమ! యుజ్యతే॥

తా॥ విలువలేని తట్టెడు కంకరరాళ్ళకంటె అమూల్యమగు నొక్కయింద్రనీలమాణిక్యమే చాలు, అట్లే పనికిమాలిన యనేకపద్యములు చదువుటకంటె సరసమగు నొక్కపద్యము చదువుటకుసరిపోదా? (దీనినిబట్టి వేమనయోగికి పద్యములసంఖ్య పెంచుటకంటె ప్రతి పద్యము ప్రయోజనకరముగా నుండుటయే హితవని తెలియుచున్నది. అందువలన వేలకొలది వేమనపద్యముల యందునను బ్రతిపద్యమునకు విశిష్టతకలదు.)

3 **గాజుకుప్పెలోనఁ గడగుచు దీపంబ, దెట్లులుండు జ్ఞానమట్లులుండుఁ**
**దెలిసినట్టివారి దేహంబులందున, విశ్వదాభిరామ వినురవేమ॥**

కాచగోళగతో వేమ! యథా దీపో విభాసతే।
తథైవ విదుషాం చాపి జ్ఞానం దేహేఽవతిష్ఠతే॥

తా॥ గాజుచిమినీలోని దీపపుకాంతి వెలుపల కెట్లుప్రకాశించునో అట్లే జ్ఞానుల దేహములోని ప్రశాంతమగు బ్రహ్మతేజస్సును బయటకు గోచరించుచుండును. వి॥ (భర్తృ) నమశ్శాంతాయ తేజసే(గీత-శం॥భా) తేజః :- త్వగింద్రియవ్యతిరేకేణ ప్రకాశవిశిష్టా యా త్వక్॥

4 **పెట్టిపోయలేని వట్టినరులు భూమిఁ, బుట్టనేమి వారు గిట్టనేమి?**
**పుట్టలోనఁజెదలు పుట్టవా? గిట్టవా?, విశ్వదాభిరామ వినురవేమ॥**

దానధర్మక్రియాహీనైః పుంభి ర్వేమ! నిరర్థకైః।
జాతైః కింవా? మృతైః కింవా? వల్మీకేషు ఘుణై ర్యథా॥

తా॥ పుట్టలోఁజెదపురుగులుపుట్టుచుఁజచ్చుచునున్నట్లులోకోపకారులు కాని నరులు లోకమున పుట్టినను చచ్చినను నొకటే॥ వి॥ (శం॥ మణి)

జీవన్మృతః కస్తు? నిరుద్యమోయః 2 ధన్యోఽస్తికో? యస్తు పరోపకారీ॥

5 తాముగన్నవారుఁ దముఁగన్నవారును, జచ్చుటెల్లఁ దమకు సాక్షి కాదె?
బ్రతుకులెల్లఁ దమకు బ్రహ్మకల్పంబులా?, విశ్వదాభిరామ వినురవేమ॥
మృతి స్స్వపితృపుత్రాణాం సాక్ష్యం భవతి చాత్మనః।
వేమ! నృణాం జీవితాని బ్రహ్మకల్పావధీని కిమ్?॥

తా॥ తాముకన్న కొడుకులు కూతుళ్ళు, తమ్ముఁగన్న తల్లియుఁ దండ్రియుఁ జచ్చుట తమకు సాక్ష్యములగుచుండ నిఁక తమ బ్రతుక నేక బ్రహ్మకల్పములుండునని భావించుట యెంతయవివేకము! వి॥ జాతస్య మరణం ధ్రువమ్ 2 అనిత్యాని శరీరాణి విభవో నైవ శాశ్వతః, నిత్యం సన్నిహితో మృత్యుః, కర్తవ్యోధర్మసంగ్రహః॥

6 ఎఱుకమాలుమనుజుఁ డేమేమిచదివినఁ, జదివినంత సేపె సద్గుణియగుఁ।
గదిసి తామరందుఁ గప్ప కూర్చున్నట్లు, విశ్వదాభిరామ వినురవేమ॥
ధీతిసమయే ద్యోతతే గుణవానివ
ఇ
వేమ! పద్మస్యోపరిష్టాత్ నిషణ్ణో దర్దురో యథా॥

తా॥ అజ్ఞాని చదువుచున్నంతవరకుమాత్రము చెరువులోని తామర యందు కప్పకూర్చున్నప్పుడువలె సద్భావముతో మెలంగును.

7 వేరుపురుగుచేరి వృక్షంబుఁ జెఱచును, చీడపురుగుజేరి చెట్టుఁ జెఱచు,
కుత్సితుండు చేరి గుణవంతుఁ జెఱచురా, విశ్వదాభిరామ వినురవేమ॥
కృమికీటా వధశ్చోర్ధ్వం ధ్వంసేతే వృక్ష మాశ్రితా।
తథా నాశయతేఽభ్యేత్య గుణినం వేమ! కుత్సితః॥

తా॥ క్రింద వేరుపురుగుచేరి మొదలంట వృక్షమును పైనచీడపురుగు చేరి యాకులు మొదలగువానిని నాశనముచేయునట్లు దుర్మార్గుఁడు సన్మార్గునిదరిఁజేరి సమూలముగ నాశనముఁజేయును. వి॥(శం॥ మణి) కిం వా విధేయం విదుషాప్రియత్నాత్?, పఠనం చ ధర్మం 2 వాసో న సంగ స్సహ కై ర్విధేయః? మూర్ఖైశ్చ, నీచైశ్చ,ఖలైశ్చ, పాపైః॥

8 ఉప్పుకప్పురంబు నొక్కపోలికనుండు, జూడఁజూడ రుచుల జాడవేఱు
పురుషులందుఁ బుణ్యపురుషులు వేఱయా, విశ్వదాభిరామ వినురవేమ॥

కర్పూరం లవణం చైకరూపం భిన్నా రుచిస్తయోః।
వేమైవం పుణ్యపురుషాః పురుషేషు విలక్షణాః॥

తా॥ ఉప్పు, కర్పూరము, ఒకేవిధమగు రూపముఁగలిగియున్నను, వాని వాని రుచులు వేరువేరుగా నుండునట్లు మానవులలో పాపాత్ములు, పుణ్యాత్ములు ఆకారమున నొకేవిధముగానున్నను, వారివారి గుణములచే ప్రవర్తనచే వేరువేరుగనుందురు. వి॥ కాకః కృష్ణః పికః కృష్ణః కో భేదః పికకాకయోః, వసంతకాలే సంప్రాప్తే, కాకః కాకః పికః పికః॥

9 అనువుగానిచోట నధికులమనరాదు, కొంచెముండు టెల్లఁ గొదువకాదు
కొండ యద్దమందుఁ గొంచమై యుండదా?, విశ్వదాభిరామ వినురవేమ॥

అనానుకూల్యే స్వాధిక్యం నవాచ్యం వేమ! నమ్రతా।
న లోపాయ మహాద్రిః కిం? నయాతి ముకురేఽల్పతామ్॥

తా॥ కొండ యద్దమందు గొంచెముగఁగన్పించినను దాని గొప్పదనమునకేమియు భంగపాటు కలుగనట్లు మన కనుకూలము కానిచోటఁ దగ్గియున్నను మనగొప్పదనమునకును భంగపాటు కలుగనేరదు.

10 చంపఁదగినయట్టి శత్రువుతనచేతఁ, జిక్కెనేనిఁ గీడు సేయరాదు
పొసఁగ మేలుఁజేసి పొమ్మనుటేచావు, విశ్వదాభిరామ వినురవేమ॥

యదృచ్ఛయా రిపుర్వధ్య ఆత్మహస్తగతోఽపిచేత్।
న హింస్యో వేమ! సత్కృత్య గచ్ఛేత్యుక్తిశ్చ తద్వధః॥

తా॥ చంపుటకుఁదగిన శత్రువుచేతికిచిక్కినను చంపక వేఱేమియుఁగీడుఁజేయక తిరిగి మేలునేచేసి వానికి హృదయపరివర్తనముకల్గించి శత్రుభావముతొలగించి విడిచిన వానికదియే చంపనదానికంటె నెక్కువశాస్తి.

11 తాలుసించి చేయఁదగ దెట్టికార్యంబు, వేగిరింప నదియు విషమమగును
పచ్చికాయఁదెచ్చి పడవేయ ఫలమౌనె?, విశ్వదాభిరామ వినురవేమ॥

అవిమృశ్య కృతం కార్యం మౌఢ్యాద్యద్విషమం భవేత్।
లూనశ్శలాటుర్విన్యస్తః ఫలం భవతి వేమ! కిమ్?॥

తా॥ ఏపనియైనను అవివేకముచే తొందరపడి చేయక విమర్శించి చేయవలెను. లేనియెడల పచ్చికాయనుకోసిన ఫలమునకుఁజెడినట్లు ఫలితమున కోల్పోవును. వి॥ (భారవి) సహసా విదధీత న క్రియా,మవివేకః పరమాపదాం పదమ్, వృణతేహి విమృశ్యకారిణం, గుణలుబ్ధాః స్వయమేవ సంపదః॥

12 నీళ్ళలోన నోడ నిగిడి తిన్నఁగఁబాఱు, బైట మూరెడైనఁ బాఱలేదు
నెలవుదప్పుచోట నేర్పరికొఱగాఁడు, విశ్వదాభిరామ వినురవేమ॥

జలే ధావతి వేమ! ద్రాక్ నౌ స్థలే నమనాగపి।
అస్థానే తు ప్రవీణోఽపి న కించి దుపయుజ్యతే॥

తా॥ జలమున ఓడ ఎంతదూరమైన ప్రయాణముచేయును. కాని నీరులేని స్థలమున నొక మూరెడైన వెళ్ళలేదు. అట్లే ఎంత నేర్పరియైనను తనకు అనుకూలముగాని ప్రదేశమున నేమియు చేయఁజాలడు. కాన అందుకు చింతించవలసిన పనియుండదు.

13 నీళ్లలోన మొసలి నిగిడి యేనుఁగుఁబట్టు, బైటఁ గుక్కచేత భంగపడును.
స్థానబలముకాని తనబల్మి కాదయా, విశ్వదాభిరామ వినురవేమ॥

జలే గ్రాహో గజం కర్షేత్ స్థలే త్వాకృష్యతే శునా।
తత్ స్థానబలమేవ స్యాత్ వేమ! న స్వీయ మణ్వపి॥

తా॥ జలమున మొసలి ఏనుగును సైతము లాగివేయఁగలదు. కాని నీటికి వెలుపల కుక్కచేఁ జిక్కుపడిపోవును. తనబలిమి స్థానబలముచేతనే శోభించును.

14 కులములో నొకండు గుణవంతుఁడుండెనా, కులము వెలయు వానిగుణముచేత
వెలయువనములోన మలయజంబున్నట్లు, విశ్వదాభిరామ వినురవేమ॥

కులే యద్యస్తి గుణవాన్ తద్గుణై శ్శోభతే కులమ్।
వేమ! చందనవృక్షేణ భాసితం కాననం యథా॥

తా॥ అడవిలోనొక్క మంచిగంధపుచెట్టున్న అడవికంతకు పరిమళముచే గౌరవము వచ్చునట్లు వంశమునకేయొక్కఁడు గుణవంతుఁడు

బయలు వేరినను వాని మంచిగుణముచే నా వంశమునకంతకు శాశ్వతమగు గౌరవము కల్గును. వి॥ శీలంపరంభూషణమ్ (భర్తృ).

15 **పంది పిల్లలీనుఁ బదియు నైదింటిని, కుంజరంబు పెట్టుఁ గొదమునొకటి**
**ఉత్తముఁడగు పురుషుఁడొక్కఁడు చాలఁడా?, విశ్వదాభిరామ వినురవేమ॥**

క్రోడీ వేమ! సకృత్సూతే దశ పంచ చ శాబకాన్ ।
కరిణ్యేకం తు కలభం పుంసైకేనాప్యలం సతా ॥

తా॥ పంది ఒకేసారి ఐదు,పది ఇట్లు ఎక్కువపిల్లలనీనును. ఏనుగుపెంట్రెండు సంవత్సరములకో ఒకేయొక్క పిల్లనుగనును. ఏనుగుపిల్లకున్న గౌరవము పందిపిల్లలకు రాజాలదు. అట్లే వంశమునకు పేరుతేగల ఉత్తముఁడగు పుత్రుఁడొక్కఁడే పుట్టినను సంతోషించవతగినదే. కాని అప్రియోజకులగు పెక్కుమంది సంతానములో ప్రయోజనమేమిటి ?

16 **ఎఱుఁగువానిఁ దెల్ప నెవ్వఁడైననుజాలు, నొరులవశమె భువిని నోగుఁదెల్ప?**
**ఏటికంకఁ దీన్ప నెవ్వరితరమయా, విశ్వదాభిరామ వినురవేమ॥**

జ్ఞానీ సుబోధ్య స్సర్వేషాం నారాధ్యస్తు జడ స్తథా ।
కస్సమర్థో వేమ! నః ప్రక్రగత్యపనోదనే ॥

తా॥ నదీప్రవాహము ఒకదరినికోసి మఱియొకదరిని మెట్టవేయును. మఱల ఆ దరినికోసి యీ దరిని మెట్టవేయును. ఆ మెట్టువంకర ఆయేటినే కూడదీసికొనవలెను, కాని మఱెవరికి శక్యమగును ? అట్లే తెలిసినవానికి నెవ్వరైనఁదెలియఁజెప్పవచ్చును. కాని మూర్ఖునెవరు తెలియఁజెప్పఁగలరు? వాని మూర్ఖత సరిచేసికొనుట వాఁడే ప్రయత్నించవలెను. వి॥ (భర్తృ) అజ్ఞస్సుఖమారాధ్యః, సుఖతర మారాధ్యతేవిశేషజ్ఞః, జ్ఞానలవదుర్విదగ్ధం, బ్రహ్మాపి నరం న రంజయతి.

17 **అల్పుఁ డెపుడుఁబల్కు నాడంబరముగాను, సజ్జనుండుఁ బల్కుఁ జల్లగాను**
**కంచుమ్రోగునట్లు కనకంబు మ్రోగునా?, విశ్వదాభిరామ వినురవేమ॥**

అల్ప స్సాడంబరం బ్రూతే సజ్జనస్తు ప్రశాంతతః
యథా కాంస్యం నిస్వనతే తథా వేమ! న కాంచనమ్

తా॥ కంచు మ్రోగునట్లు బంగారము మ్రోగదు. అట్లే అల్పుఁడాడం బరముగఁ బ్రేలును. కాని మంచివాఁడు ప్రశాంతముగ సమాధానమిచ్చును.

18 **ఓగునోగు మెచ్చు నొనరంగ నజ్ఞాని, భావమిచ్చి మెచ్చుఁ బరమలుబ్ధు**
**పంది బురద మెచ్చుఁ బన్నీరు మెచ్చునా?, విశ్వదాభిరామ వినురవేమ॥**

అసాధుం శ్లాఘతే ఽ సాధుః అజ్ఞానీ లుబ్ధమేవ చ ।
ప్రస్తౌతి సూకరః పంకం పన్నీరం వేమ నైకదా ॥

తా॥ పంది బురద మెచ్చుకొనును. కాని పన్నీరును మెచ్చుకొనదు. అట్లే చెడ్డవాఁడు చెడ్డవానినే మెచ్చును. కాని మంచివానిని మెచ్చడు.

19 **గంగపాఱుచుండుఁ గదలనిగతితోడ, ముఱికివాగు పాఱు మ్రోతతోడ**
**దాతయోర్చిన ట్లధముఁ డోర్వఁగాలేడు, విశ్వదాభిరామ వినురవేమ॥**

మంద్రగత్యా వహే ద్గంగా మలకుల్యా రవేణ చ ।
యథా దాతా క్షమావాంత్స్యాత్ తథా వేమ! న చాధమః

తా॥ మురుగుకాలువ హోరుగా మ్రోతతో ప్రవహించును. గంగానది లోతుకలిగి ప్రశాంతముగ ప్రవహించును. అట్లే దాతృత్వము లేనివాఁడు కేకలు బొబ్బలువేయును, కాని దాత గాంభీర్యముకలిగి ప్రశాంతముగ నష్టమునకు తట్టుకొని చక్కని సమాధాన మిచ్చును.

20 **కానివాని చేతఁ గాసువీసముఁ బెట్టి, వెంటఁదిరుగు టెల్ల వెఱ్ఱితనము**
**పిల్లిపట్ట కోడిఁ బిలిచినఁ బల్కునా?, విశ్వదాభిరామ వినురవేమ॥**

విత్తం దత్త్వా ఽ సతే పుంసే మౌఢ్యం తత్పృష్ఠగామితా ।
వేమాహూతో ఽ పి కిం బ్రూయాత్? మార్జాలో ధృతకుక్కుటః ॥

తా॥ కోడినిపట్టుకొన్నపిల్లి మనమెంతపిలిచినను మనపిలుపు వినునట్లు మనము చెడ్డవానికి కొంతడబ్బునిచ్చి అది రాబట్టుకొనుటకు వాని వెనువెంట నెన్నిసార్లు తిరిగినను మఱి ప్రయోజనము కనబడదు.

21 **పిసినివానియింటఁ బీనుఁగు వెడలినఁ, గట్టువుకోలలకును గానులిచ్చి**
**వెచ్చమాయెననుచు వెక్కి వెక్కి యేడ్చురా, విశ్వదాభిరామ వినురవేమ॥**

శవే ఘూతే లోభిగేహే ధనం దత్త్వేంధనాదయే ।
'అహో! మమధనం నష్టమితి' వేమ! ప్రరోదితి ॥

తా॥ లోభివానియింట నెవరైన చనిపోయినప్పుడు ఆ పీనుగును తీసికొనిపోవుటకు దహనసంస్కారాదులు చేయుటకు కట్టెలు మొదలగు వానికి ధనమీయవలసివచ్చిన, ఆ లోభి చనిపోయిన వ్యక్తినిగుఱించికంటె ధనమయిపోయి నందులకు వెక్కి వెక్కి యెంతకాలమో యేడ్చుచుండును. వి॥ త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః, కామః క్రోధః తథాలోభః తస్మాదేత త్త్రయంత్యజేత్. (గీత)

22 కష్టలోభివాని కలిమికి నాసించి, బడుగువాఁడు తిరుగుఁ బరిణమించు
తగరు వెంట నక్క తగిలినచందంబు, విశ్వదాభిరామ వినుర వేమ॥

దరిద్రోఽనుసరేత్ కాంక్షన్ సంపదం కష్టలోభినః।
వేమానుస్మృత్య గోమాయుః మేషపృష్ఠం గతో యథా॥

తా॥ గొఱ్ఱెపోతువెంటనక్క, వ్రేలాడుఅవయవమెప్పుడైన క్రిందపడిన పట్టుకొనిపోయి తినవచ్చునని తిరుగుచుండును. అట్లే పేదవాఁడు లోభి ధనమునాసించి వానివెంటవెంట వెట్టిపనులు చేయుచుఁ దిరుగుచుండును.

23 లోభివానిఁ జంప లోకంబులోపల, మందుపలదు వేఱె మతముగలదు
పైకమడుగ వేగ భగ్గనఁ బడుఁ జచ్చు, విశ్వదాభిరామ వినుర వేమ॥

విషాద్యైర్లోభినః హంతుం మల మస్తి పృథఙ్మతమ్।
స యదాఽర్థ్యతే విత్తం వేమాశు మ్రియతే తదా॥

తా॥ పిసినిగొట్టువానిఁ జంపుటకు వేఱే విషముమొదలైనవి అవసరము లేదు. వానిని జంపుటకు చక్కనిపద్ధతికలదు. చందా అడిగిన, ఈయవలసి వచ్చిన అప్పటికప్పుడు హఠాత్తుగా గుండె ఆగి చనిపోఁగలఁడు. మోహ, మద, మాత్సర్యములకు, కామ, క్రోధ, లోభములే పునాదులు. ఈ ఆఱుగుణములు శత్రువులవలె వ్యక్తులకు బాధఁగల్గించునవి.

24 కనియుఁ గానలేడు కదలింపఁ డానోరు, వినియు వినఁగ లేడు విస్మయముగ
సంపదగలవాని సన్నిపాతక మది, విశ్వదాభిరామ వినుర వేమ॥

శృణ్వ న్నశృణుతే వేమ! పశ్యన్నపి నపశ్యతి
స్తబ్ధస్త్రీ ధనీ తిష్ఠేత్ సన్నిపాతజ్వరీ యథా

తా॥ సంపదకల లోభి సన్నిపాతజ్వరరోగివలె చూచుచుండియు చూడ లేడు. వినుచున్నట్లుండియు వినలేడు. నోరు మెదపడు.

25 తానుగుడువలేక తగవేది యాప్తులఁ, జేరనీయఁ డట్టిచెనటిపశువు
చేనిలోన బొమ్మఁ జేసి కట్టినయట్లు, విశ్వదాభిరామ వినురవేమ॥

స్వయం నభుఙ్క్తే చాప్తేభ్యో నదదాతీహ యః ఖలః।
స పశు ర్వేమ! సస్యేషు న్యస్తపాంచాలికోపమః॥

తా॥ చేలో దృష్టి దోషము తగులకుండ దిట్టిబొమ్మను భీకర రూపముతో నుంచెదరు. ఆ దిట్టిబొమ్మకు ఆ చేనుతో ప్రయోజనములేదు. మఱియొకరిని చేరకుండ భయపెట్టును. అట్లే కొంతమంది పశువులవంటి ...... లు తమసంపద తాము ను అనుభవింపరు. ఆప్తులను చేరనీయరు.

26 పూర్వజన్మమందుఁ బుణ్యంబు సేయని, పాపి ధనము కొఱకు పడుటయెల్ల
విత్తమఱచి కోయ వెదకినచందంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

పూర్వజన్మని యః పుణ్యం నాకరోదిహ వేమ! సః।
నాప్నోతి ధన మన్యుప్తబీజః ఫలమివ ధ్రువమ్॥

తా॥ చేను ఊడ్చక సస్యమును పెంచక ధాన్యమందలి ఆశచే కోతకు కొడవలివేసికొని వెళ్లు పిచ్చిరైతువలె పాపి పూర్వమేమియు పుణ్యకార్యములు చేయక అదృష్టములేక ధనముకొఱకై పలువిధంబుల సంపాదించుటకు ప్రయత్నించును. వి॥ వనేజనే శత్రుజలాగ్నిమధ్యే, మహార్ణవే పర్వత సంకటేచ, సుప్తంప్రమత్తంవిషమస్థితంవా, రక్షంతిపుణ్యాని పురాకృతాని॥

27 భూపతికృపనమ్మి భూమిఁ జెఱచువాఁడు, ప్రజలయుసురుదాకి పడును బిదప
ఎగురవేయు బంతి యెందాక నిలుచురా, విశ్వదాభిరామ వినురవేమ॥

కృపాం విశ్వస్య భూపస్య ప్రజాద్రోహీ వినశ్యతి।
కందుకో వేమ! విక్షిప్తః కియత్కాలం వసే ద్దివి?॥

తా॥ ఎగురవేయుబంతి ఎగురవేయుచుండినచే పైకెగురుచుండును. లేదా క్రిందపడిపోవును. అట్లే ప్రభువుల అండఁజేరి వారిని మెప్పించుచు సాధారణప్రజకు కీడుచేయుచుండువాఁడు తుదకు ప్రజల యుసురుతగిలి అటు ప్రభుల ఆదరణకు నిటు ప్రజల ఆదరణకుకూడ చెడి నశించును.

28 ఇనుము విఱిగెనేని యినుమాఱు ముమ్మాఱు, గాచి యతుకనేర్చుఁ గమ్మరీఁడు
మనసు విఱిగెనేని మఱియంట నేర్చునా, విశ్వదాభిరామ వినురవేమ॥

తప్త్వా ద్విస్త్రి రయో భగ్నం సంధాతుం లోహకారకః।
శక్నోతి న మనో భగ్నం వేమ! సంధీయతే క్వచిత్॥

తా॥ కమ్మరి ఇనుపకడ్డీ విరిగిపోయిన రెండుమూడు సార్లైనకాచి శ్రమపడి యేలాగో అతుకఁగలఁడు. కాని ఒకసారి విసుగుచెంది మనస్సు విఱిగిన అట్టి మనస్సును నెవ్వఁడుకాని యెట్లులైనకాని అతుకఁజాలఁడు.

29 నీళ్లలోనఁ జేప నెఱి మాంసమాశకు గాలమందుఁజిక్కి కూలుఁగాదె?
ఆశపుట్టి మనుజుఁ డాకీతిఁజెడిపోవు, విశ్వదాభిరామ వినురవేమ॥

మాంసాకాంక్షీ జలే మత్స్యో బడిశే వేమ! బధ్యతే।
ఆశాపాశశతై ర్బద్ధో వినశ్యతి తథా నరః॥

తా॥ గాలమందలి ఎఱను ఆశించి నీటిలోని చేప చచ్చుచున్నట్లు దురాశాపీడితుఁడును, ఆశచే ఁబలుపాట్లుపడి నశించుచున్నాడు (వి) ఆశయా బద్ధతే లోకే కర్మణా బహు చింతయా, ఆయుఃక్షీణం న జానాతి తస్మాత్ జాగృత జాగృత. 1 తృష్ణాదయః స్వర్గపదం కిమస్తి? 2 కో వా దరిద్రోహి? విశాలతృష్ణః, 3 శ్రీమాంశ్చకో? యస్య సమస్తతోషః 4 కిం వాఽమృతం స్యాత్? సుఖదా నిరాశా 5 శతో్ఽర్మహాశత్రుతమో ఽస్తి కో వా? కామస్సకోపానృతలోభతృష్ణః॥ శం॥ మణి॥

30 నరహరి యనవచ్చు నారాయణనవచ్చు, మేలు మేలటంచు మెచ్చవచ్చు
కొంగుకాసువిడిచి గొబ్బునసీరాదు, విశ్వదాభిరామ వినురవేమ॥

వక్తుం శక్యా నృసింహేతి వేమ! నారాయణేతిచ।
సాధుసాధ్వితి శ్లాఘోక్తిః న తథా స్యాద్ధి దాతృతా॥

తా॥ నరసింహా అనవచ్చు, నారాయణా అనవచ్చు. నీవు ఇంద్రుఁడవు చంద్రుఁడవుఅని ఎదుటవానిని మెచ్చవచ్చు. కాని ఎదుటివాఁడు ఆపదతో చచ్చుచున్నను రొంటినున్న పైసయయినను నిచ్చుటకు చేయరాదు.

31 మేడిపండుఁజూడ మేలిమైయుండును, పొట్టవిచ్చిచూడఁ బురుగులుండు
పిఱికివానిమదిని బింకమీలాగురా, విశ్వదాభిరామ వినురవేమ॥

ఔదుంబరఫలం రమ్యం తద్గర్భం కృమిసంకులమ్।
తథా భీరోశ్చ మనసి దార్ఢ్యం వేమ! కథం భవేత్?॥

తా॥ మేడిపండు పైకి చూచుటకు ఎఱ్ఱగా బాగుగనేయుండు కాని చిదిపిచూచిన లోపల అన్నియు పురుగులేయుండును. అట్లే యె సిరియున్నను, పైకి యెంత అందచందములు కలిగియున్నను త్యాగబు ధైర్యములేనివాఁడు నిత్యము పిరికితనముచేతనే యేడ్చుచు దార్ఢ్య (బింకము) లేక దిగులు కలిగియుండును.

32 తలనుపాగ పైన తగుపచ్చడము బొజ్జ, చెవులపోగు లరసి చేర నర్థి
శుద్ధపశువటంచు బుద్ధిలో నెఱుఁగక, విశ్వదాభిరామ వినురవేమ॥

మూర్ధ్న్యుష్ణీషం కర్ణయోశ్చ భూషే శాటీం మహోదరమ్
వీక్ష్యార్థీ వేమ! సంయాతి పశురిత్యవిమర్శయన్॥

తా॥ ఒక్కొకడు తలపాగాచుట్టి తగిన దుస్తులువైచికొని, తగినబొ కాయపుష్టి కలిగి ఆడంబరముగ నుండుట చూచి అర్థి యతఁడుదా యనుకొని తనకేమైన లాభించకపోవునా? యని దరికిచేరి దీనత్వము తన కష్టములు చెప్పుకొననారంభించును. అంతియకాని అతడు ఆడం రపుగొడ్డు, శుద్ధపశువు అనిమాత్రము పైవేషమునుచూచి గమనించఁడు

33 భూమియందుఁ బుణ్యపురుషులులేకున్న, జగములేలనిల్చు పొగులుఁగాని
అంత తెలియ దొరక రాడనాడనుగాని, విశ్వదాభిరామ వినురవేమ॥

యద్యుర్వ్యాం పుణ్యపురుషాః న వసంతి జగం త్వహో
కథం తిష్ఠంతి? తే వేమ! తత్ర తత్ర వసంతి హి॥

తా॥ ఈప్రపంచమున నందఱును దుర్మార్గులేకారు. పుణ్యపురుషులున కలరు. అట్టి పుణ్యాత్ములే లేనియెడల సృష్టి నశించిపోవును. కాని దుర్మార్గు లున్నంత యెక్కువగ సన్మార్గులుండరు. వి॥ కేసంతిసంతో౽ఖి వీతరాగాః, అపాస్తమోహాః శివతత్త్వనిష్ఠాః॥ (శం॥ మణి)

34 చిత్తశుద్ధికలిగి చేసినపుణ్యంబు, కొంచెమైన నదియుఁ గొదువకాదు
విత్తనంబు మఱ్ఱివృక్షంబునకు నెంత, విశ్వదాభిరామ వినురవేమ॥

చిత్తశుద్ధ్యా కృతం పుణ్యం న స్వల్పమపి హీయతే ।
కియన్మాత్రం వేమ! బీజం న్యగ్రోధస్య మహాతరోః ? ॥

తా॥ మఱ్ఱిచెట్టు విత్తనము చాల చిన్నదైనను అందుండి బయలుదేరు వృక్షము మాత్రము చాల గొప్పది. అట్లే చిత్తశుద్ధితో చేసెడి పుణ్యకార్యము స్వల్పమైనదైనను దానఁగలుగు ఫలితముమాత్ర మధికతమము.

35 **ఇంటియాలివిడిచి యిల జారకాంతల, వెంటఁదిరుగువాఁడు వెఱ్ఱివాఁడు**
**పంటచేను విడిచి పరిగె యేరినయట్లు, విశ్వదాభిరామ వినురవేమ॥**

విహాయ గృహిణీం వేమ! జారకాంతాసు యో రతః ।
స స్యాత్ సస్యపరిత్యాగాత్ ఉంఛగ్రాహీవ భగ్నధీః ॥

తా॥ పంటచేను విడిచి యక్కడక్కడ రాలిన పరక యేఱికొనుటకు ప్రయత్నించు మూర్ఖుఁడెట్టివాఁడో యింటియందలి సలక్షణయగుభార్యను విడిచి జారకాంతగోరువాఁడంతటి వెఱ్ఱివాడు (రమ్యం కులస్త్రీరతమ్.)

36 **రాజవరులకెపుడు రణరంగములచింత, పరమమునులకెల్లఁ బరముచింత**
**అల్పనరుల కెప్పు డతివలపైచింత, విశ్వదాభిరామ వినురవేమ॥**

రాజ్ఞాం రణాంగణే చింతా పరే చింతా తపస్వినామ్ ।
అధమానాం నృణాం వేమ! చింతా యోషిత్సు సర్వదా ॥

తా॥ మహర్షులకు నిత్యము పరమాత్మ విచారణ యందే యాలోచన, ఉత్తమక్షత్రియులకు యుద్ధకార్యములయందే ఆసక్తి. అట్లే అల్పులకు, నీచులకు, ఆడవాళ్ళగొడవలనిననే యిష్టము వి॥ (భర్తృ) నాన్యస్మనోహారి నితంబినీభ్యో, దుఃఖైకహేతు ర్న చ కశ్చిదన్యః.

37 **తల్లిదండ్రులపయి దయలేనిపుత్రుండు, పుట్టనేమి? మఱియు గిట్టనేమి?**
**పుట్టలోనఁ జెదలు పుట్టవా? గిట్టవా?, విశ్వదాభిరామ వినురవేమ॥**

మాతాపిత్రోః కృపా యేషాం నాస్తి తై ర్నీచమానవైః,
జాతై ర్వేమ! మృతైః కింవా? వల్మీకే తు ఘుణై ర్వృథా ॥

తా॥ పుట్టలోఁజెదలు పుట్టుచుఁ, జచ్చుచునుండునట్లు, తల్లిదండ్రుల పయిదయలేని పుత్రులు పుట్టినను, పెరిగినను, చచ్చినను ఒకటే.

38 అభిజాత్యముననునాయువుగలనాళ్ళుఁ, దిరుగుచుందురు భ్రమఁ ద్రిప్పలేక
ముఱికిభాండమందు ముసరు నీగలభంగి, విశ్వదాభిరామ వినురవేమ॥

ఆభిజాత్యమదే నాజ్ఞాః యావజ్జీవం భ్రమంతి హి ।
మలభాండే పరివ్యాప్తా వేమ! వై మక్షికా ఇవ ॥

తా॥ ముఱికికుండ నంటిపెట్టుకొని యీగలు దానిని విడువలేక దానిచుట్టునసే ముసరుచుండునట్లు మూర్ఖులు 'ఇదినాకొంప,ఇదినాభూమి, ఇది నా సంతానము' అని మమకారముతో వానినే యంటిపెట్టుకొని విడువలేక ఆయుష్యున్నంతవరకు భ్రమించుచుందురు.

39 కుండపగిలెనేని క్రొత్తదికుదురును, భూతలంబునందుఁ బొందుగాను
కూలఁబడిననరుఁడు కుదురుట యరుదయా, విశ్వదాభిరామ వినురవేమ॥

భిన్నే కుంభే నవం కుంభం ప్రాప్తుం శక్యం యథోచితమ్ ,
ప్రభ్రష్టో మానవో వేమ! న ప్రాప్నోతి యథాస్థితిమ్ ॥

తా॥ కుండ పగిలిపోయిన క్రొత్తకుండ కుదుర్చుకొనవచ్చు. కాని కూలబడిపోయిన నరుఁడుమాత్రము మఱి కుదురుట యరుదు.

40 దొంగమాటలాడ దొరకునా మోక్షంబు?, చేతకానికూత చెల్లదెపుడు
గురువుపస్తుకాదు గుణహీనమదికాని, విశ్వదాభిరామ వినురవేమ॥

కింస్యాన్ముక్తి శ్ఛద్మవాక్యైః? న యుక్తం వ్యర్థజల్పితమ్ ,
తద్గురోర్లక్షణం న స్యాత్ వైగుణ్యం వేమ! కేవలమ్ ॥

తా॥ ప్రబోధకులమని కొందఱు దుష్టులు చేతకాని కూతలు, దొంగ మాటలు పలికి లోకుల వంచింతురు. అందువల్ల వినువారికి చెప్పువారికి కూడ ఫలితముండదు. అట్టివారు గుణవంతులుకారు.

41 అనఁగననఁగరాగ మతిశయిల్లుచునుండుఁ, దినఁగదినఁగ వేము తీపినుండు
సాధకమునఁ బనులు సమకూరు ధరలోన, విశ్వదాభిరామ వినురవేమ॥

గీతే గీతే రాగవృద్ధిః భుక్తే భుక్తే చ మాధురీ ।
నింబే తు స్యాత్ క్రియా స్సర్వా వేమ! వశ్యాః కృతే కృతే ॥

తా॥ పాడినకొలఁది రాగ మభివృద్ధిచెందును. తినిన కొలది చేదైనవేప చెక్కయుఁ దీయగనుండును. అభ్యాసము సాధించినకొలది పనులు నెరవేరును.

42 తేనెతెఱలజాడఁ దేనెటీఁగ యెఱుంగు, మకరసంబుజాడ భ్రమర మెఱుఁగు
పరమయోగిజాడ భక్తుఁ డెఱుంగును, విశ్వదాభిరామ వినుర వేమ॥

సరఘా మధుకోశానాం భృంగ స్సుమరసస్య చ ।
భక్తిమార్గ యోగివర్యాణాం వేమ! జానాతి పద్ధతిమ్ ॥

తా॥ తేనెయున్నచోటు తేనెటీగకు, మకరందముజాడ తుమ్మెదకుఁ దెలిసినట్లు మహాత్ములజాడ దైవభక్తులకు మాత్రమే తెలియును. వి॥ విద్వానేవ విజానాతి, విద్వజ్జనపరిశ్రమమ్.

43 శివునియనుభవంబు సృష్టిలోపలలేక, సంశయంబుచెడదు సాధకులకు
వెలుఁగుదివ్వెలేక చీఁకటిపాయునా ?, విశ్వదాభిరామ వినుర వేమ॥

వినా శివానుభూతిం స్యు స్సాధకా నాస్తసంశయాః ।
వినా దీపం దీప్తిమంతం తమః కిం వేమ! నశ్యతి? ॥

తా॥ దీపపువెలుగులేక చీఁకటిపోనియట్లు, పరమాత్మానుగ్రహముచే కలుగు అంతస్సాక్షిప్రేరణమునకాని సాధకులకు సంశయము విడిపోదు.

44 కంగిగోవుపాలు గరిటెడైననుజాలుఁ, గడవెడైననేమి ఖరముపాలు?
భక్తికలుగుకూడు పట్టెడైనను జాలు, విశ్వదాభిరామ వినుర వేమ॥

దర్వీమితం చ గోక్షీరం యోగ్యం కుంభమితేన చ ।
ఖరక్షీరేణ కిం? వేమ! భక్త్యాదత్తాన్నం లఘు ప్రియమ్ ॥

తా॥ కపిలగోవుపాలు ఒక్కగరిటెడైననుమేలే, కాని గాడిదపాలు కుండెడైనను మనకేమిప్రయోజనము? అట్లే భక్తితోకూడిన అన్నము పట్టెడైననుమంచిదె కాని, విసుగుకొనుచు, కసరుకొనుచు పెట్టినఅన్నము ఎంతయెక్కువైనను నిష్ప్రయోజనమే.

45 బండమీఁదచెలమ పాటించిత్రవ్విన, నలయికెక్కుడగు మఱాశలేదు
గుంటపట్టుచెలమ కులముద్ధరించురా, విశ్వదాభిరామ వినుర వేమ॥

పాషాణే కూపఖననాత్ ఫలాభావః పృథుశ్శ్రమః ।
పూర్ణం నిమ్నస్థలే కూపం వేమాత్మకుల ముద్ధరేత్ ॥

తా॥ నీరూరనిరాతిబండపై నూయిత్రవ్వినశ్రమ కాని ఫలితముండదు. నీరూరెడిపల్లపుప్రాంతమున నూయి త్రవ్వినశ్రమతక్కువ, ఫలితమధిక

భేత్తుం శక్య శ్శిలాగోళః శైలా శ్చూర్ణయితుం తథా।
కర్కశానాం మనో వేమ! ద్రవీకర్తుం న శక్యతే॥

**తా॥** ఎట్టిరాతిగుండునైన పగులగొట్టవచ్చు. కొండలన్ని పిండిపిండిగ గొట్టవచ్చు. కాని కఠినాత్ముని హృదయము మాత్రము కరిగించలేము.

ౕ॥ (భర్తృ) న తు ప్రతినివిష్టమూర్ఖజనచిత్త మారాధయేత్,

10 **మిరెపగింజఁజూడ మీఁదనల్లగనుండుఁ, గొఱికిచూడ లోనఁ జుఱుకుమనును సజ్జనులగువారి సారమిట్టులనుండు, విశ్వదాభిరామ వినురవేమ॥**

మరీచోపరిభాగ స్తు వర్ణతో వేమ! మేచకః।
దష్టో రూక్షో భవే దంతస్సతాం సారోహి తాదృశః॥

**తా॥** మిరియపుగింజ పైకి నల్లగ సాధారణముగనున్నను కొఱికినంతన చుఱుకుమనును. అట్లేసత్పురుషులు పైకిసాధారణముగకనబడినను వారి ప్రభావముమాత్రము దుస్సహముగ నుండును.

1 **మృగమదమునుజూడ మీఁదనల్లగనుండు, పరిఢవిల్లు దానిపరిమళంబు గురువులైనవారి గుణములీలాగురా, విశ్వదాభిరామ వినురవేమ॥**

కస్తూరీ వర్ణతో నీలా తస్యాగంధో ముదావహః।
యే తు సద్గురవో వేమ! తేషా మేతాదృశా గుణాః॥

**తా॥** కస్తూరి పైకి నల్లగనేయుండును. కాని దానిపరిమళముమాత్రము గుబాళించుచుండును. అట్లే మహనీయులు పైకి ఆకారముచే తగుమాత్ర ముగనున్నను వారిగుణములు, ప్రభావములు, మాత్రము ఆశ్చర్యము గల్గించును.

2 **ఇచ్చుదానియొద్ద నీనివాఁడుండినఁ, జచ్చుఁగాని యీవి సాగనీఁడు కల్పతరువుక్రింద గచ్చచెట్టున్నట్లు, విశ్వదాభిరామ వినురవేమ॥**

య ద్యదాతా వసే ద్దాతుః పార్శ్వే దానం న వర్తతే।
అధః కల్పతరో ర్వేమ! యథాటీవ నిరుధ్యతే॥

**తా॥** అన్నికోరికలనీడేర్చెడి కల్పవృక్షము మొదట గ్రచ్చపొద ఆవరించి యెవ్వరినిఁజేరనీయకయుండునట్లు దాతదగ్గర లోభిచేరి దాతనునెవ్వరికిని పయాపెసా అయినను నీనీఁడు.

53 అల్పబుద్ధివాని కధికారమిచ్చిన, దొడ్డవారినెల్లఁ దొలఁగఁగొట్టు
చెప్పుఁదినెడికుక్క చెఱకుతీపెఱుఁగునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

అల్పబుద్ధా వధికృతే శ్రేష్ఠాన్ సర్వాన్ వ్యపోహతి ।
పాదరక్షాశన శ్శ్వా కిం వేత్తీక్షో ర్వేమ! మాధురీమ్? ॥

తా॥ చెప్పుతినుకుక్కకు చెఱకుతీపి తెలియనట్లు అల్పబుద్ధివానికి అధికారమువచ్చిన అధికులసంగతి వానికితెలియదు. కాన వారిని దరికి చేరనీయక తఱుమగొట్టుచుండును.

54 తప్పులెన్నువారు తండోపతండంబు, లుర్విజనులకెల్ల నుండుఁదప్పు
తప్పులెన్నువారు తమతప్పు లెఱుఁగరు, విశ్వదాభిరామ వినురవేమ॥

దోష స్సర్వజనానాం స్యాత్ సర్వే దోషగవేషిణః ।
వేమ! దోషాన్వేషిణ స్తు స్వదోషం న విదంతి హి ॥

తా॥ తప్పులెన్నువారు తండోపతండములుగనుందురు. కాని అందరకు నేదో యొకవిధమగు తప్పుండకమానదు. ఇక విశేషమేమన ? తప్పులెన్నువారికి తమ తప్పులుమాత్రము గోచరించవు.

55 ఆలివంకవార లాత్మబంధువులైరి, తల్లివంకవారు తగినపాటి
తండ్రివంకవారు దాయాదు లౌదురు, విశ్వదాభిరామ వినురవేమ॥

స్వబాంధవా దారపక్షే మాతృపక్షే యథోచితాః ।
పితృపక్షే జనా యే తు దాయాదా వేమ! సర్వశః ॥

తా॥ ఆలివంకవారలు ఆత్మబంధువులు. (ముఖ్యులు) తల్లివంకవారు సాధారణ బంధువులు. తండ్రివంకవారలు దాయాదులు (పగవారు)

56 పదుగురాడుమాట పాటియై ధరఁ జెల్లు, నొక్కఁడాడుమాట యెక్కదెందు
ఊరకుండువాని కూరెల్లనోపదు, విశ్వదాభిరామ వినురవేమ॥

అనేకోక్తం వచో గ్రాహ్యం ఏకోక్తం వేమ! నేష్యతే ।
తూష్ణీం భూతం నరం జేతుం పురం సర్వం న శక్యతే ॥

తా॥ ఎక్కువమంది చెప్పునది న్యాయము. కాని ఒక్కడుమాత్రము చెప్పునది న్యాయముగతోచదు. అందువల్ల ఊరుకొన్నవానికి నెవరును సరిపోరు.

57 కొండెగాడు చావఁ గొంపదనుకఁబోవు, వంతుకింతెకాని వగపులేదు
కొంకనక్కచావ గొడ్డులేమిటికేడ్చు, విశ్వదాభిరామ వినురవేమ॥

నాస్తి చింతా జనో గేహం ప్రాప్నోతి పిశునే మృతే।
వృకే మృతే కిం రుదంతి? మేషా వేమ! స్వచేతసి॥

తా॥ తమకు అపకారియగు కొంకనక్క (తోడేలు) చచ్చినచో గొఱ్ఱెలెందులకేడ్చును? అట్లే చాడీలుచెప్పి ప్రజలకు అపకారముచేయు దుర్మార్గుఁడు చచ్చిపోయిన వంతుకు కొంపదగ్గఱకు పోవుదురుకాని అట్టివాని చావునకు విచారించువారెవ్వరు నుండరు.

58 కోఁతిఁబట్టితెచ్చి క్రొత్తపుట్టముఁగట్టి, కొండ్రముచ్చులెల్లఁ గొలిచినట్లు
నీతిహీనునొద్ద నిర్భాగ్యు లుందురు, విశ్వదాభిరామ వినురవేమ॥

చోరా గిరిచరా నీత్వా కృత్వా నూత్నాంబరం కపిమ్।
యథార్చంతి తథా వేమ! నిర్భాగ్యా నీతివర్జితమ్॥

తా॥ కోతినిదెచ్చి క్రొత్తబట్టలు చుట్టబెట్టి కొండ్రముచ్చులు కొలిచినట్లు నీతిహీనుని నిర్భాగ్యులు సేవించుచుందురు.

59 చాకివాఁడుకోకఁ జీకాకుఁబడఁజేసి మైలఁబుచ్చి మంచిమడుపుఁజేయు
బుద్ధిఁజెప్పువాఁడు గుద్దిన నేమయా?, విశ్వదాభిరామ వినురవేమ॥

రజకో లులితం కృత్వా వస్త్రం శుద్ధం కరోతి హి।
హితోపదేష్టా శిక్షేత యది స్యాత్తేన వేమ! కిమ్?॥

తా॥ చాకలి బట్టను బండమీఁదపెట్టి యుతికి యేలాగైన మురికినంతయుఁబోగొట్టి పరిశుభ్రమగు వస్త్రముగ తయారుచేయును. అట్లే గురువు బుద్ధిచెప్పి శిష్యుని మంచివానినిగ తయారుచేసెడల నెన్ని గుద్దులు గుద్దినను నష్టమేమి యుండును?

60 పాలుపంచదార పాపరపండ్లలోఁ, జాలఁబోసి వండఁ జవికిరావు
కుటిలమానవునకు గుణమెట్లుకలుగురా?, విశ్వదాభిరామ వినురవేమ॥

శర్కరాక్షీరసమ్మిశ్ర గోతుంబీపాక ఏవ చ।
న రోచతే హి దుర్బుద్ధేః గుణో వేమ! కథం భవేత్?॥

తా॥ చేదుకల పాపరపండ్లలో నెంత పంచదార పాలు పోసి వండినను అవి తినుటకు పనికిరావు. అట్లే కుటిలస్వభావముకల దుష్టునకు నెంత హితబోధ చేసినను మంచిగుణము మాత్రము కలుగదు.

61 పట్టనేర్చుపాము పడగ నోరగఁజేయుఁ, జెఱుపఁజూచువాఁడు చెలిమిఁజేయుఁ
జంపఁదలఁచురాజు చనువిచ్చుచుండురా, విశ్వదాభిరామ వినురవేమ॥

సాచీకరో త్యహి ర్భోగం దిదంశు ర్వేమ! నాశకః।
మైత్రీం కరోతి రాజా చ జిఘాంసుః కురుతే ప్రియమ్॥

తా॥ కఱువఁదలఁచిన పాము పడగనోరగవంచును. పాడు చేయఁ దలఁచిన దుష్టుఁడు కపటమైత్రినెరపును. చంపఁదలఁచిన ప్రభువు దరికిఁ జేరునట్లు చనువిచ్చుచుండును. కాన తెలిసి సంచరించుడు.

62 పూర్వవాసనకల పుణ్యాత్మునికలిమి, యూటచెలమరీతి నూరునెపుడు
ఎందఱికోఁగినను నెప్పటియట్లుండు, విశ్వదాభిరామ వినురవేమ॥

ప్రాగ్వాసనాయుతస్య శ్రీ ర్వేమ! పుణ్యాత్మన స్సదా।
ఝరీవ స్యందతే ऽన్యేభ్యో దత్తాప్యాస్తే యథాతథమ్॥

తా॥ అదృష్టవంతుని యైశ్వర్యము ఊటబావివలె నెందఱికొసఁగినను నెప్పటియట్లు తరుగులేక పెరుగుచునేయుండును.

63 కానివానితోడఁ గలిసివర్తించెనా, హానివచ్చు నెంత వానికైన
తాటిక్రిందఁబాలు త్రాగినచందమౌ, విశ్వదాభిరామ వినురవేమ॥

యది తిష్ఠే త్సమం దుష్టైః భవే ద్ధాని స్సతో ऽపి చ।
వేమాధస్తా త్తాళతరోః పయఃపానసమం హి తత్॥

తా॥ తాటిచెట్టుక్రింద పాలుత్రాగినను కల్లేయందురు. అట్లే దుష్టునితో కలిసి సంచరించిన నెంత మంచివానికైన హానికలుగక మానదు.

64 ఎఱుకలేనిదొరల నెన్నాళ్ళుగొలిచిన, బ్రతుకులేదు వట్టి భ్రాంతికాని
గొడ్డుటావు పాలు గోరినఁజేపునా? విశ్వదాభిరామ వినురవేమ॥

అజ్ఞాన్ ప్రభూన్ కియత్కాలం భజతోऽపి న జీవికా।
ఆకాంక్షతోऽపి వంధ్యా గౌః వేమ! ప్రస్నౌతి కిం పయః?॥

తా॥ గొడ్డుటావుదగ్గరఁజేరి యెట్లుమచ్చికచేసికొనినను అది యేలాగున పాలు చేపదో అట్లే మూర్ఖులగు ప్రభువుల నెట్లుకష్టపడి సేవించినను తమ వట్టిభ్రాంతిచే వెట్టిచేయుటకాని బ్రతుకుదెరువుమాత్రము లభ్యముకాదు.

65 గొడ్డుటావుఁబిదుకఁ గుండఁ గొంపోయినఁ, బండ్లనూడఁదన్ను బాలుఁలేవు
లోభివాని నడుగ లాభంబులేదయా, విశ్వదాభిరామ వినురవేమ॥

వంధ్యాంధేనుం వేమ! దోగ్ధుం ఘటే నీతేఽప్రఘ్నిభి ర్దతః।
పాతయేన్న పయో దత్తే న లాభో లుబ్ధయాచ్ఞయా॥

తా॥ గొడ్డుటావును పాలు పిదుకుటకు కూర్చున్న పండ్లూడులాగున తన్నును. కుండపగులును. కాని పాలుమాత్రము శూన్యము. అట్లేలోభిని యాచించినవానికి లాభముకలుగదు సరికదా నష్టముకూడ కలుగును.

66 హీనగుణమువాని నిలుసేరనిచ్చెనా, హానివచ్చు నెంతవానికైన
ఈఁగ కడుపుఁజొచ్చి యిట్టట్టుఁజేయదా?, విశ్వదాభిరామ వినురవేమ॥

యది గేహే విశేన్నీచో హాని స్స్యా న్మహాతోఽపి చ।
ప్రవిశ్య మక్షికః కుక్షౌ క్షోభం వేమ! కరోతి హి॥

తా॥ ఈఁగ కడుపులో ప్రవేశించి నానా వికారచేష్టలు కలిగించునట్లు గుణహీనుని తనయింటిలోఁబ్రవేశింపనిచ్చిన నెంతవానికైన హాని చేకూరఁ గలదు.

67 ధార్మికునకుఁగాని ధర్మంబుఁగనరాదు, కష్టజీవికెట్లు కానఁబడును?
నీరుఁజొరక లోతు నిజముగాఁదెలియదు, విశ్వదాభిరామ వినురవేమ॥

వేద్యో ధర్మో ధార్మికేన న తథా కష్టజీవినా।
అప్రవిశ్య జలే వేమ! జ్ఞాయతే న హ్యగాధతా॥

తా॥ నీటిలోదిగినవానికి నీటియొక్క లోతు తెలియును. కాని పైవాని కెట్లు తెలియఁగలదు? అట్లే ధర్మాత్మునకు ధర్మము సంగతి తెలియును. కాని కఠినుఁడగు పాపికి ధర్మముసంగతి యెట్లు తెలియఁగలదు?

68 తనకుఁబ్రాప్తిలేక దాత లీయరటంచు, దోషబుద్ధిచేత దూఱుటెల్ల
మొగ్గువంకఁజూచి ముకురంబుదూఱుటే, విశ్వదాభిరామ వినురవేమ॥

ప్రాప్తిం వినైవ దాతారో నదాస్యంతీతి గర్హణమ్ ।
స్వనాసావక్రతాం వీక్ష్య వేమ! దర్పణదూషణమ్ ॥

తా॥ దాతలు తనకీయనప్పుడు అర్థి వారిని నిందించకూడదు. తనకు ప్రాప్తి లేదని సమాధాన పడవలెను. అట్లుగాక తనకు ప్రాప్తిలేనిదానిని వారీయలేదని దూషించిన నది యద్దములో తనముక్కువంకరఁజూచుకొని అద్దమును నిందించినట్లుగ నుండును.

69 తండ్రికన్న సుగుణి తనయుఁడుగల్గెనా, పిన్నపెద్దతనము లెన్నఁదగదు
వాసుదేవువిడిచి వసుదేవునెంతురా?, విశ్వదాభిరామ వినురవేమ॥

గుణీ పితు స్సుత శ్లాఘ్యో న గణ్యా బాలవృద్ధతా ।
వేమ! త్యక్త్వా వాసుదేవం వసుదేవం స్మరంతి కిమ్? ॥

తా॥ వసుదేవుఁడుతండ్రి. వాసుదేవుఁడు(కృష్ణుఁడు)కొడుకు. కృష్ణుఁడు గొప్పవాఁడు. అందువలనకృష్ణునే(కొడుకునే)అందఱునుతలంచుచుందురు. పెద్దతనము ప్రవర్తనవలననే కలుగకలదుకాని వయస్సుచేతనుకాదు.

70 చెప్పులోనిరాయి చెవిలోనిజోరీఁగ, కంటిలోనినలుసు కాలిముల్లు
ఇంటిలోనిపోరు నింతింతకాదయా, విశ్వదాభిరామ వినురవేమ॥

ఉపానహి శిలా వేమ! శ్రోత్రేచ పశుమక్షికా ।
కంటకం ప ద్యక్షిరేణుః దుర్భరః కలహో గృహే ॥

తా॥ చెప్పుననున్నబెడ్డ, చెవియందలి జోరీఁగ, కంటిలోని నలక, కాలిలోనిముల్లు ఎంతగ బాధించునో ఇంటిలోని కలతలుకూడ అట్లే యెంత గనో బాధించఁగలవు.

71 ఆఁకటికిఁదొలంగు నాచారవిధులెల్లఁ, జీఁకటికిఁదొలంగుఁ జిత్తశుద్ధి
వేఁకటికిఁదొలంగు వెనుకటిబిగువెల్ల, విశ్వదాభిరామ వినురవేమ॥

సదాచారః క్షుధా వేమ! తమసా చిత్తశుద్ధతా ।
గర్భోత్పత్త్యా చ పూర్వస్థం దార్ఢ్యం దేహస్య నశ్యతి ॥

తా॥ గర్భవతికి వెనుకటి బింకము తగ్గునట్లు ఆకలిగొన్నవారికి సదాచారములన్నియు నశించునట్లు, అజ్ఞానమువలన (తమోగుణమువలన) చిత్తశుద్ధియు చెడును.





72 కోపమునను ఘనత కొంచెమైపోవును, కోపమునను మిగుల గోడుఁజెందు
కోప మడఁచెనేని కోర్కి లీడేరు, విశ్వదాభిరామ వినురవేమ॥

కోపేన ఘనతా నశ్యేత్ కోపే నైతి వ్యథాం భృశమ్।
యది సంహరతే కోపం వేమ! సిద్ధ్యతి వాంఛితమ్॥

తా॥ కోపమువలన గౌరవము చెడును. దుఃఖము కలుగును. కాన కోపమణచుకొనిననే కోరికలు సిద్ధించఁగలవు. (వి) త్రివిధం నరకస్యేదం ద్వారం నాశకమాత్మనః, కామః క్రోధః తథాలోభః తస్మాదేతత్త్రయం త్యజేత్ (గీత)

73 పరగ లేమిచేత బంధువుల్ పగవారు, పరగ లేమిచేతఁ బరముఁ దప్పు
పరగ లేమిచేతఁ బరపతి తప్పురా, విశ్వదాభిరామ వినురవేమ॥

దారిద్ర్యే బాంధవో వైరీ దారిద్ర్యే హీయతే పరమ్।
దారిద్ర్యే వేమ! మర్త్యానాం వినశ్యే దాత్మగౌరవమ్॥

తా॥ దారిద్ర్యముచే బంధువులు శత్రువులగుదురు దారిద్ర్యముచే నిహపరసౌఖ్యములకు దూరుఁడగును. దారిద్ర్యముచే గౌరవమును నశించును.

74 చిక్కియున్నవేళ సింహంబునైనను, బక్కకుక్కసేరి బాధఁజేయు
బలిమిలేనివేళఁ బంతంబు సెల్లదు, విశ్వదాభిరామ వినురవేమ॥

కృశీభూతం మృగేంద్రం చ పార్శ్వే శ్వా వేమ! బాధతే।
యదా బలం విలుప్తం స్యాత్తదా ప్రజ్ఞా న శోభతే॥

తా॥ చిక్కియున్నప్పుడు సింహమునైనను ప్రక్కను కుక్కచేరి బాధించును. అందువలన మనకు బలిమితగ్గినప్పుడు పంతము, పట్టుదలలు పనికిరావు.

75 ఎదుటితనబలంబు నెంచుకోనేరక, దీకొని చలమున నెదిర్చెనేని
ఎలుగు దివ్వెసేవ కేగినచందమౌ, విశ్వదాభిరామ వినురవేమ॥

బలం పరస్యాత్మనశ్చ న జానన్ యోఽభివర్తతే।
స వేమ! దీపికాసేవిభల్లూకసదృశో భవేత్॥

తా॥ తనబలము ఎదుటివానిబలము తెలిసికొని యెదిరించవలయును, అట్లుకాదేని ఎలుగుగొడ్డు మంటతోడకొనిన చందముగనుండును.

76 దుండగినికొండదు కొండడు చెలికాండు, బండరాజునకును పాడుమంత్రి
కొండముచ్చునకును కోతియుబంధౌను, విశ్వదాభిరామ వినురవేమ॥

ధూర్తస్య సూచకో మిత్రం కుమంత్రీ మూఢభూపతేః ।
వానరో బాంధవో వేమ! చోరస్యగిరిచారిణః ॥

తా॥ 'యథారాజా తథాప్రజాః' అన్నట్లు ఎటువంటివానికి అటువంటి వాండేదరిజేర్చుచుండును. దుండగునకు కొండెగాడు చెలికాడు. ఖండరాజునకు పాడుమంత్రి, కొండముచ్చునకు కోతిచుట్టము.

77 ఔనటంచు నొక్కండాడినమాటకుం, గాదటంచుంబలుక ఋణముపట్టు
దానినిల్వందీయం దాతలుదిగవలె, విశ్వదాభిరామ వినురవేమ॥

సాధునిర్ధారితో క్తేశ్చ నేతి గిర్హా ఋణాద్భవేత్।
తాం తు వేమ! స్థిరీకర్తు మవతీర్యాః పితామహాః ॥

తా॥ 'ఔను, అని యొకండన్నమాటకు 'కాదు, అని అనుటకు ఋణము కూడపట్టదు. కాని ఆవిషయము ఔనో కాదో తేల్చుకొనుటకు మాత్రము వారల తాతలవంటివారికి కూడ చాలకాలమునకైన తేలదు.

78 తనదుబాగుంగోరి ధర్మంబుంజెప్పినం, దిట్టుచుండ్రు మొఱకు లెట్టయెదుట
గడ్డివేయుం బోట్లగొడ్డు కొమ్మాడించు, విశ్వదాభిరామ వినురవేమ॥

శ్రేయో విచింత్య సర్వేషాం వేమ! ధర్మం బ్రువంతియే ।
తా న్నిందంతి ఖలా ధూర్తో హినస్తి తృణదం వృషః ॥

తా॥ పోట్లగొడ్డు తనకు గడ్డివేయుచుండిన వానినే యది కొమ్ముతో పొడుచును. అట్లే మూర్ఖులు తమ బాగుకోరి యెవండైన హితవుచెప్పం బూనుకొనిన నెట్టయెదుట వానినే దూషింతురు.

79 బహుళకావ్యములను బరికింపంగావచ్చు, బహుళశబ్దచయముం బలుకవచ్చు
సహనమొక్కటబ్బం జాలకష్టంబురా, విశ్వదాభిరామ వినురవేమ॥

అనేకకావ్యపఠనం బహుశబ్దాభిభాషణమ్ ।
కథంచి చ్ఛక్యతే వేమ! దుర్లభా హి సహిష్ణుతా ॥

తా॥ కావ్యములు చదువవచ్చు. వ్యాకరణములు వల్లించవచ్చు. ధర్మపన్నాలు, శ్రీరంగనీతులు చెప్పవచ్చు. కాని తమకంటె అధికులను చూచి సహనము కలిగియుండుట మాత్రము కష్టమైనపని.

80 ఝషము నీరువెడలఁ జచ్చుటే సిద్ధంబు, నీటనుండెనేని నిగిడిపడును
అండ తొలఁగువెడల నందఱపనియింతె, విశ్వదాభిరామ వినురవేమ॥

నిర్గత స్సలిలాన్మత్స్యో మ్రియతే నాత్రసంశయః ।
జలస్థః ప్లవతే వేమ! తథా సర్వే నిరాశ్రయాః ॥

తా॥ చేప నీటిలో నెగిరియెగిరిపడును. ఆనీటనుండి చేప బయటకు వచ్చిన చావవలసినదే కాని బ్రతుకుటయుండదు. అట్లే తమకున్న అండ (ఆధారము) తొలఁగిన ప్రతివారిపనియు నట్లేయగును.

81 ఐకమత్య మొక్కటావశ్యకం బెప్డు, దానిబలిమి నెంతయైనఁ గూడు
గడ్డివెంటిఁబెట్టి కట్టరా? యేనుఁగున్, విశ్వదాభిరామ వినురవేమ॥

ముఖ్యం వేమైకమత్యం స్యా త్తద్బలేన మహత్ఫలమ్ ।
రజ్జుం కృత్వా శుష్కతృణైః కిం న బధ్నంతి సామజమ్? ॥

తా॥ గడ్డివెంటిఁబెట్టి ఏనుఁగును కట్టివేయవచ్చును. కాన ఐకమత్యము చాల ముఖ్యమైనది. దానిబలిమిచే నెట్టికార్యమునైన సాధింపవచ్చును.

82 ఈతవచ్చినపుడు లోతనిపించునా?, పాతదోషి కరయ భయముకలదె?
కోఁతికొమ్మనెక్కి కుప్పించిదూకదా, విశ్వదాభిరామ వినురవేమ॥

నాగాధతాభయం వేమ! తరణోపాయశాలినః ।
ప్రాగ్దోషిణ స్తు కిం భీత్యా కపి శ్చంక్రమతే న కిమ్? ॥

తా॥ ఈతవచ్చినపుడు లోతనిపించదు. కోతి యలవాటు చొప్పున ర్భయముగ కొమ్మలపైన దుముకును. అట్లే పాతనేరగాఁడును శిక్షలకు ంకక నేరములఁ జేయుచునేయుండును.

83 వ్యాధి నెఱుఁగలేని వైద్యమదేలరా?, కొదువఁ దెలియలేని కోర్కెలేల?
మనసుఁదెలియలేని మర్మజ్ఞులేటికి?, విశ్వదాభిరామ వినురవేమ॥

కిం వైద్యై ర్నాగదజ్ఞేన? కి మలోపజ్ఞకాంక్షయా? ।
చిత్తానభిజ్ఞైః కిం? వేమ! మర్మజ్ఞైః పూరుషై ర్భువి ॥

తా॥ వ్యాధినెఱుఁగని వైద్యము, తన లోపము తెలియని కోరికలు, ర్థమైనట్లు మనసు మర్మము తెలియనిమర్మజ్ఞత్వమునునిష్ప్రయోజనమే.

84 లవణమెంత దానిలాభంబు గనదెంత, కొద్దిదనుచు నెన్న గూడునయ్య?
భోగమేటికి నుపభోగంబె లెక్కగు, విశ్వదాభిరామ వినురవేమ॥

లవణం స్యా త్క్రియ ద్వేమ! తల్లాభ స్తు కియా నితి ।
న మంతవ్యో హి భోగై కిం? ఫలం స్యా దుపయోగతః

తా॥ ఉప్పు, అననెంతటిది ? స్వల్పపువెలకలది, అంతట దొరకునది అని నిరసించకూడదు. దాని ఉపయోగమేగొప్పది. అలాగుననే సృష్టియందలి ప్రతివస్తువును, ప్రతివ్యక్తిని, నవసరములుగనే పరిగణించవలయును.

85 ఔననంగవచ్చు నైనది కానిది, యన్యుడెదుటనుండి యడుగడేని
నిలిచి యడుగువాడు గలిగిన నిలువడు, విశ్వదాభిరామ వినురవేమ॥

యద్యగ్రేఽన్యో జనస్థిత్వా న పృచ్ఛేత్ సాధ్వసాధ్వపి ।
సాధ్వి త్యేవ వదే ద్వేమ! యది ప్రష్టా న తిష్ఠతి ॥

తా॥ తెలిసినవాడు యెదుటనుండి ప్రశ్నించకుండిన ఐనది, కానిది, తెలిసినట్లుగనే మాట్లాడవచ్చును. అడుగువాడుండిన మఱి తెలియని వాడు నిలబడుట యరుదు.

86 ఫణికి గోరలుండ భయమొందునట్లే, వెఱతురయ్య దుష్టవిభవమునకు
గోరలూడ దార్చు మీఱునా? దుష్టత, విశ్వదాభిరామ వినురవేమ॥

అహేరివ క్రూరదంష్ట్రాత్ త్రసేయుః దుష్టవైభవాత్ ।
దౌష్ట్యం వేమ! కథం తిష్ఠేత్? వీతదంష్ట్రఫణాభృతః ॥

తా॥ విభవముతోకూడిన దుష్టునకు కోరలతోకూడిన పామునకువలె భయపడుదురు. కోరలుపెరికిన పామువలె వైభవ ముడిగిన దుష్టుడును ప్రజల కపకారము చేయలేక యొకచోట పడియుండును.

87 నూఱు బలుకవచ్చు నుడివ్రాయగారాదు, వ్రాతకన్న సాక్షి వలవదెన్న
పరగ లేనివ్రాత భంగపాటును దెచ్చు, విశ్వదాభిరామ వినురవేమ॥

వచశ్శతం వేమ! వాచ్యం నైకం లేఖ్యం మనాగపి ।
సాక్ష్యం న యుక్తం లేఖాయాః అసల్లేఖా తు హానయే ॥

తా॥ శతంవద, ఏకం మా లిఖ, నూరు చెప్పు, ఒకటివ్రాయవద్దు. ఒకటివ్రాయుము. సాక్షివికాకుము. తప్పుడువ్రాతలు భంగపాటుసుమా.

88 దరినిసున్న వాఁడు తప్పక దక్కుండు, ఎడమపడినవాఁడు దుడుకుఁ గదుసు
అనుసరించువారి కయ్యెడుఁ గార్యముల్, విశ్వదాభిరామ వినుర వేమ॥

దక్షో నూనం సమీపస్థః ప్రౌఢో దూరస్థలస్థితః ।
యే చరం త్యనుసృత్యేహ వేమ! సిద్ధ్యంతి తత్క్రియాః ॥

తా॥ 'ఎదుటనున్నవాఁడు పెండ్లికొడుకు, అన్నట్లు ఎప్పుడును దగ్గరగ నున్నవాఁడు సమర్థుఁడుగా తోచును. ఎప్పుడు దరికిచేరనివాఁడు పెంకిగ తోచును. అందువలన కార్యసాధకుఁడెప్పుడును అనుసరించి సంచరించును.

89 కారుకారుగురులు కాగుణింతముఁ జెప్ప, శాస్త్రపాఠములను జదివిచెప్ప
ముక్తిదారిఁ జూపు మూలమె గురుఁడగు, విశ్వదాభిరామ వినుర వేమ॥

న కాగుణితబోధేన న శాస్త్రాధ్యాపనేన చ ।
భవంతి గురవో వేమ! స్యాద్గురు ర్ముక్తిదర్శకః ॥

తా॥ తమకు జన్మతరించు తరుణోపాయము బోధించువారు గురువులుకాని, కా గుణింతము చెప్పువారినికాని, శాస్త్రాధ్యయనము చేయించువారినికాని గురువులుగా తలంపరాదు. వి॥ అవిద్యాహృదయ గ్రంథి బంధమోక్షోభ వేద్యతః, తమేవ గురురిత్యాహు ర్గురుశబ్దార్థవేదినః.

90 ద్వారబంధమునకుఁ దలుపులు గడియలు, వలెనె నోటికొప్పఁ గలనియతులు
ధర్మ మెఱిఁగిపలుక ధన్యుఁడౌ భువిలోన, విశ్వదాభిరామ వినుర వేమ॥

కవాటా శ్చార్గళా వేమ! ద్వారబంధే యథాస్థితాః ।
తథా వక్త్రస్య నియమాః ధన్యస్స్యా ద్ధర్మవాచకః ॥

తా॥ ద్వారబంధమునకు తలుపులు గడియలునున్నట్లే మాట్లాడుటకు నోటికిని కొన్ని నియమములు కలవు. ఆ నియమముల నుల్లంఘించి యిష్టము వచ్చినట్లు మాట్లాడకూడదు. అట్టి ధర్మ మెఱిఁగి మాట్లాడినవ్య-ధన్యుఁ డనిపించుకొనును.

91 ఛురికతోడఁ గోయఁ జొప్పడు నేకాని, దానిపిడినిగోయఁ దరమె? నీకుఁ
దెలివిలేని మేని బలిమేమిచేయును?, విశ్వదాభిరామ వినుర వేమ॥

ఛురికా కృంతనే దక్షా తత్సరు ర్న తథా మనాక్ ।
వినా జ్ఞానేన కింకుర్యా? ద్వేమ! శారీరికం బలమ్ ॥

తా॥ కత్తితో దేనినైనఁ గోయవచ్చును. కాని దాని పిడితో దేనిని కోయలేము. అట్లే బుద్ధిబలములేని కేవల శరీరబలముతో నే కార్యమును సాధించలేము.

92 సకలవిద్యలందు సంపన్నులై యున్న, నట్టివారు పరిచయమునఁ జౌక
పెరటిచెట్టుమందుఁ బరికింప మెచ్చరు, విశ్వదాభిరామ వినురవేమ॥

సర్వవిద్యాసు సంపన్నా యే తే పరిచయా త్సదా।
లఘవో వేమ! నేహాంతే ప్రాంతవృక్షభవౌషధమ్॥

తా॥ అన్ని విద్యలయందు పరిపూర్ణపాండిత్యము కలవారైనను పరిచయులు పెరటిచెట్టుమందువలె తేలికగా చూడఁబడుదురు.

93 మంచినీరుఁబోయ మల్లెపూయును గాని, ఫలితమొనరు టెట్లు? పనిఁజొరమిని
వంటఁ జేయ కెట్లు వంటకమబ్బును?, విశ్వదాభిరామ వినురవేమ॥

జలాసేకాత్ వేమ! మల్లీ పుష్పయుక్తా భవే త్ఖలు।
అక్రియస్య ఫలం కుత్ర చాపాకా దోదనం కథమ్?॥

తా॥ వంటచేసికొన్నకాని అన్నము లభింపదు. మంచినీళ్ళు పోయుచుండినకాని మల్లెపూయదు. అట్లే మనము పనులు ప్రారంభించి చేయుచుండినకాని ఫలితమెట్లు కలుగఁగలదు?

94 కసవుసుదినువాఁడు ఘనఫలంబులరుచి, కానలేడుకాదె? వానియట్లు
చిన్నచదువులకును మిన్నజ్ఞానము రాదు, విశ్వదాభిరామ వినురవేమ॥

రసం ఫలానాం స్వాదూనాం తృణఖాదీ న వేత్తి హి।
తథా వేమాల్పవిద్యానాం జ్ఞానం భవతి నాధికమ్॥

తా॥ గడ్డితినువానికి పండ్లరుచి యేమి తెలియఁగలదు? అట్లే చిన్న చిన్న చదువులు చదువువారికి అధికమగు జ్ఞానమెట్లు లభింపఁగలదు?

95 తల్లియున్నయపుడె తనయు గారాబము, నామెపోవఁ దన్ను నరయ రెవరు
మంచికాలమపుడె మర్యాద నార్జించు, విశ్వదాభిరామ వినురవేమ॥

యద్యస్తిమాతా వేమాస్తే లాలనా స్వస్య తన్మృతౌ।
న కోఽపి పశ్య త్యాత్మానం కాలే గౌరవ మార్జయ॥

తా॥ తల్లియున్నయపుడె తన గారాబమంతయు చెల్లును. కాని ఆమె పోయినవెనుక తన్నెవరు గారాబముగ చూతురు ? అట్లే నీకు మంచికాలముగా నున్నపుడె మర్యాద నార్జించుటకు కూడ ప్రయత్నించుము.

96 గట్టుమీఁదనున్నఁ గాన్పించు సర్వముఁ, దెలిసి తేటఁబడినఁ దెలియు నెల్ల
లోకవిషయములును లోనిరహస్యముల్, విశ్వదాభిరామ వినురవేమ॥

దృశ్యతే హి తటస్థేన సర్వం వేద్యం చ వేద్యతే।
వేమైవం లోకవిషయా అంతర్గుహ్యాశ్చ తత్త్వతః ॥

తా॥ గట్టుమీఁదనుండి చూచిన గట్టుకు అవతల విషయములు నివతల విషయములుకూడ గోచరించును. అట్లే యేవిధమగు మమకారముల లోన మునుఁగక నీవు మధ్యస్థుఁడవుగ నుండిన లోక విషయములు, లోని రహస్యములుకూడ స్పష్టముగ తెలియఁబడఁగలవు.

97 టంకమతుకకున్నఁ బొంకంబుగారాదు, స్వర్ణభూషణంబు జగమెఱుంగ
భటుఁడు వెంటలేక ప్రభువు శోభించునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

టంకసంధానరహితం న సాధు స్వర్ణభూషణమ్।
భటేన రహితో వేమ! కిం ప్రభు స్సాధు శోభతే? ॥

తా॥ ఎంతటి బంగారపు నగకైన టంకములేకుండ శోభ రాదు. అట్లే బంటులేకుండ ప్రభువును రాణించఁడు.

98 మేఁకకుతుకఁబట్టి మెడచన్నుఁగుడువఁగా, నాకలేలమాను? నాసగాక
లోభివానినడుగ లాభంబుగల్గునే? విశ్వదాభిరామ వినురవేమ॥

ధృత్వా మేషగళం వేమ! పిబేద్యది గళస్తనమ్।
న క్షున్నివృత్తి ర్వ్యర్థాశా లోభియాచ్ఞా తథా వృథా ॥

తా॥ మేక మెడదగ్గఱనున్న చన్ను కుడుచుకొనుచుండిన భ్రాంతికాని పాలువచ్చి ఆకలి తీర్చునా ? అట్లే భ్రాంతి తీరక లోభినెంతగా వేడుకొనిన‌ను లాభము కలుగునా ?

99 మునుదెలిపినవారు మూఢనష్టమైరిల, తిరిగిచెప్పితనుచుఁ దిట్టవలదు
తెలియఁజెప్పినమతి తెలిసికోలేవయా, విశ్వదాభిరామ వినురవేమ॥

ప్రాగ్బోద్ధారో వినష్టాస్స్యుః పునర్ర్బూతే భవా నితి ।
న నిందేత్సుప్రోక్తమపి వేమ! నజ్ఞాయతే హితత్ ॥

తా॥ మునుపు ఈలాగున ననేకులు నీతులు బోధించి ముదనష్టమయినారు. వేమన్నా! నీకేమైన పిచ్చా? వెఱ్ఱా? మఱల నీవు నీతులు చెప్ప మొదలిడినావు. అని యేమియు నన్నుతిట్టవద్దు. ఎన్నిసార్లు ఎంత మంది ఏ విధమునఁ దెలియఁజెప్పినను అజ్ఞానపులోకము తెలిసికొనలేదు.

100 నీతిఁదెలియఁజెప్పి నిజముగ వేమన, పాతకములనెల్లఁ బాఱఁబెట్టె
లోతుతత్త్వ మరసి లోకులకును జెప్పె, విశ్వదాభిరామ వినురవేమ॥

నీతి ముద్ఘాట్య వేమాఖ్యో న్యషేధత్ పాతకాని చ ।
అగాధతత్త్వం లోకానాం వేమ! సమ్యక్ న్యబోధయత్ ॥

తా॥ నిజముగ చెప్పవలెనన్న నీ వేమనయే బాగుగ నీతులఁజెప్పి అగాధమగు తత్త్వరహస్యము లోకమునకు వెల్లడించి పాతకములఁబాఱఁ దోలుటకుఁ బ్రియత్నించి చరితార్థుఁడైనవాఁడు.

# సాంస్కృతిక విభాగము

101 కల్లగురుఁడుకట్టు నెల్లకర్మంబుల, మధ్యగురుఁడుకట్టు మంత్రచయము
ఉత్తముండుకట్టు యోగసామ్రాజ్యంబు విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ! కర్మసు సర్వేషు నిబధ్నా త్యధమో గురుః ।
మంత్రేషు మధ్యమశ్చైవ యోగసామ్రాజ్య ఉత్తమః ॥

తా॥ అధముఁడగు గురుశబ్దవాచ్యుఁడు కర్మకాండనంటఁ గట్టును. మధ్యముఁడగు గురువు మంత్ర తంత్రముల నంటఁగట్టును. ఉత్తముఁడగు గురువు సహేతుకమగు యోగ సామ్రాజ్యము నందించును.

102 తా వసించుచోటఁ దగ నజ్ఞుఁడాయెనా, సౌఖ్యముకలభూమి జనఁగవలయు
కొలను లింకెనేని కొంగలందుండునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

స్వనివాసస్థలే కష్టం భవేద్యది సుఖస్థలమ్।
వ్రజేత్ శుష్కే హ్రదే వేమ! బకా స్తత్ర వసంతి కిమ్? ॥

తా॥ కొలకు లింకినఁగొంగలచట నుండవు. అట్లే మనమున్నచోట నేదైన నలజడి కలిగిన సౌఖ్యము కలుగుచోటునకుఁ బోవలయును.

108 కాకిగూటిలోనఁ గోకిలమనినట్లు, భ్రమరమవుచుఁ బురువు బ్రతికినట్లు
గురునిగొల్చువెనుక గురువుతానౌనయా, విశ్వదాభిరామ వినురవేమ॥

యథా పికః కాకనీడే కీటః కుట్యామళే ర్యథా।
గుర్వర్చానంతరం ఛాత్ర స్తథా వేమ! స్వయం గురుః ॥

తా॥ కాకి గూటిలోని కోకిలవలె, తుమ్మెదరూపు నొందిన పురుగువలె సద్గురువు నాశ్రయించిన శిష్యుఁడు గురువువెనుక తానే గురువు కావలెను. వి॥ సత్సంప్రదాయసంయుక్త బ్రహ్మవిద్యా విశారదః, ఏవమాదిగుణోపేతో దేశికోఽశేషవందితః॥

104 అధికుఁడైనరాజొకల్పునిఁజేపట్ట, వానిమాటచెల్లు వసుధలోన
గణకులొప్పియున్న గవ్వలుచెల్లవా?, విశ్వదాభిరామ వినురవేమ॥

మహారాజస్వీకృతేఽల్పే తదాజ్ఞా పరిపాల్యతే।
గణకాంగీకృతా వేమ! వరాకా మూల్యసంయుతాః ॥

తా॥ గణకు లంగీకరించిన గవ్వలుకూడ నాణెములుగ విలువకలవి యగును. అట్లే యధికుఁడైన రాజుయొక్క ప్రాపకముగల యల్పుని యొక్క మాటలును జెల్లుబడియగును.

105 ఉత్తమునికడుపున నోగుజన్మించిన, వాఁడు చెఱుచు వాని వంశమెల్ల
చెఱకువెన్నుపుట్టి చెఱచదాతీపెల్ల? విశ్వదాభిరామ వినురవేమ॥

యద్యుత్తమస్య కుక్షౌ స్యాత్ ఖలో వేమ! స తత్కులమ్।
హీనస్త్విక్షోః ఖలూద్భూయ మంజరీ హంతి మాధురీమ్ ॥

తా॥ చెఱకున వెన్నుపుట్టి చెఱకుతీపిని పాడుచేయుచున్నది. అట్లే చెడ్డవాఁడు మంచివానికిఁ బుట్టి యా మంచివాని వంశప్రతిష్ఠయంతయు మంటఁగలుపుచున్నాఁడు. వి॥ కోటరాంతర్భవోవహ్ని స్తరుమేకం దహిష్యతి, కుపుత్రస్తు కులే జాతః, స్వకులం నాశయేత్ పరమ్ ॥

106 ఎలుగుతోలుఁదెచ్చి యెందాక నుతికిన, నలుపెకాక యేల తెలుపుఁగల్గు?
కొయ్యబొమ్మఁదెచ్చి కొట్టినగుణియౌనె?, విశ్వదాభిరామ వినురవేమ॥

పరిక్షాళితం భల్లుకస్య చర్మ నైతి వలక్షతామ్ ।
తాడితా ప్రతిమా దారోః కిం వేమ! గుణినీ భవేత్?॥

తా॥ ఎలుగుబంటితోలుఁ దెచ్చి యెంత యుతికినను నలుపేకాని తెలుపుకాదు. అట్లే కొయ్యబొమ్మను (మొద్దును) తెచ్చి యెంతకొట్టి బుద్ధిగఱపినను గుణము రానేరాదు.

107 కుక్కతోఁకఁదెచ్చి గొట్టంబుఁజేర్చినఁ, గొఱకతినుండుఁ గొంతతడవు
ఎంతఁజెప్పఁజెడుగు పంతంబుమానునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

యావచ్ఛ్వపుచ్ఛం నాళస్థం తావదేవ భవేదృజు ।
బహూపదిష్టోఽపి ఖల స్స్వార్థం కిం వేమ! ముంచతి? ॥

తా॥ కుక్కతోకఁదెచ్చి యేదైన గొట్టములోనుంచిన నందున్నంత సేపే గొట్టమువలెనుండి మరల నెప్పటివలె వంకరగును. అట్లే యెంతగా బోధించినను చెడుగు తనపద్ధతి విడనాడనేరఁడు.

108 ముచ్చు యాత్రపోయి ముల్లెవిప్పునుగాని, మొక్కఁబోఁడులేదు మొనసియెపుడు
కుక్కయిల్లుసొచ్చి కుండలు వెదకదా?, విశ్వదాభిరామ వినురవేమ॥

చోరో యాత్రాస్థలం ప్రాప్య హర్తుం విత్త ముపక్రమేత్ ।
ప్రభుం నేక్షేత వేమ! శ్వా భాండాన్వేషీవ గేహగః ॥

తా॥ దొంగ యాత్రాస్థలము చేరినను నందు యాత్రికుల మూటముల్లె నపహరింపఁ జూచునే కాని దేవునిదర్శనము చేసికొనుటకు తీరిక యుండదు. కుక్క యింటిలోఁబ్రవేశించి కుండలు వెదకును. కాని యింటి లోని వినోదపువస్తువులఁ జూచుటకు దానికి కాంక్షయుండునా?

109 గుణయుతునకు మేలు గోరంతఁజేసినఁ, గొండయౌను వానిగుణముచేత
కొండకొద్ది మేలు గుణహీనుఁడెఱుఁగునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

కృతం గుణవతే శ్రేయః లఘ్వ ప్యద్రిసమం భవేత్ ।
అగుణః కిం విజానాతి? వేమ! శ్రేయోఽద్రిసన్నిభమ్ ॥

తా॥ గుణవంతునకు మేలు గోరంత చేసినను వాని మంచిగుణముచే నది కొండంతయగును. గుణహీనునకుఁ గొండంత మేలుచేసినను నది నిష్ప్రయోజనమే. వి॥ పరగుణపరమాణూ న్పర్వతీకృత్య నిత్యం, నిజహృది వికసంతి స్సంతి సంతః కియంతః॥

110 మాటనిలుపలేని మనుజుండు చండాలుఁ, డాజ్ఞలేనిరాజు నాడుముండ
మహిమలేనివేల్పు మంటఁజేసినపుల్లి, విశ్వదాభిరామ వినురవేమ॥

చండాలో౽స్థిరవాక్ మర్త్యః ధ్వస్తాజ్ఞో భూప అంగనా।
వేమ! దైవం నిర్మహిమ వ్యాఘ్రో మృన్నిర్మితః ఖలు॥

తా॥ మాట నిలుపుకొనలేని మనుజుఁడు చండాలుఁడు. ఆజ్ఞ నమలు జరుపలేని ప్రభుపు ఆడుముండ, మహిమలేనివేలుపు మన్నుతోఁజేసినపులి.

111 ఇంచుకంతబోన మీశ్వరార్పణమన్న, పుణ్యలోకమునకుఁ బోవునతఁడు
అన్నదానమునకు నధికదానములేదు, విశ్వదాభిరామ వినురవేమ॥

శివార్పితా త్కించిదన్నాత్ పుణ్యలోకం వ్రజే న్నరః।
అన్నదానాన్మహోత్కృష్టం దానం వేమ! న విద్యతే॥

తా॥ ఈశ్వరార్పణముగ కొంచెము అన్నదానము చేసినను నట్టిదాత పుణ్యలోకమునకుఁ బోవును. అన్నదానమునకు మించినదానము మఱి యొకటిలేదు. వి॥ అన్నస్య క్షుధితం పాత్రమ్॥

112 వెఱ్ఱివానిమిగుల విసిగించఁగారాదు, వెఱ్ఱివానిమాట వినఁగరాదు
వెఱ్ఱికుక్కఁబట్టి వేటాడవచ్చునా? విశ్వదాభిరామ వినురవేమ॥

నోద్వేజయేత్ ఖలూన్మత్తం నేయా దున్మత్తజల్పితమ్।
అలర్కేణసమం వేమ! కిం కార్యా మృగయారతిః॥

తా॥ వెఱ్ఱివానిని విసిగించకూడదు. వెఱ్ఱివాని మాటలువినకూడదు. వెఱ్ఱికుక్కతో వేటకు వెళ్ళకూడదు.

113 ఖరముమేనినిండ గంధంబుఁబూసిన, నేమియొఱుఁగలేక యొగసితన్ను
ఈడుకానివాని యిష్టమీలాగురా, విశ్వదాభిరామ వినురవేమ॥

స్వాంగే గంధం విలింపంతం ఖర స్తాడయతే౽ంఘ్రిణా।
కృతా౽నర్హజనాభ్యర్చా వేమైవం స్యాద్ధి నిష్ఫలా॥

తా॥ గాడిదకు సరదాగా గంధము రాయఁబూనిన దానికది తెలియక తన్నుటకే చూచును. అల్లే సరసమెఱుఁగని వారల పద్ధతియు నుండును.

114 విడువవలయు నూరు విశ్రాంతిలేకున్న, విడువవలయు నాలి వినముఁదెలసి
విడువవలయు రాజు వితరణికాకున్న, విశ్వదాభిరామ వినురవేమ॥

సుఖాపేతం త్యజేద్గ్రామం త్యజేద్భార్యా మసద్గుణామ్ ।
రాజాన మ ప్యదాతారం త్యజే ద్వేమాశు బుద్ధిమాన్ ॥

తా॥ విశ్రాంతిలేని గ్రామమును, వ్యతిరేకముగా నడచు భార్యను, పిసినిగొట్టు ప్రభువును విడిచిపెట్టిననే సుఖము లభించును.

115 ఎడ్డెఁదెలుపవచ్చు నేడాదికైనను, మొనిఁదెలుపవచ్చు మాసమునను
మొప్పెఁదెలుపరాదు ముప్పదేండ్లకునైన, విశ్వదాభిరామ వినురవేమ॥

బోధ్యోజడో వత్సరేణ బోధ్యో మాన్యేకమాసతః ।
త్రింశదబ్దైరపి మనాక్ వేమ ! మూర్ఖో న బోధ్యతే ॥

తా॥ ఎంత మాటలు రానివానినైన నొక మాసములోను నెంత మోటువానినైన నేడాదిలోను తెలిసినవారినిగాఁ జేయవచ్చును. కాని మూర్ఖుని మాత్రము ముప్పది సంవత్సరములకైనఁ దెలిసినవానినిగాఁ జేయలేము.

116 ఆడితప్పువార లభిమానహీనులు, గోడెఱుఁగనివాఁడు కొద్దికాఁడు,
కూడికీడుసేయఁగూర్చుండు తలపోయ, విశ్వదాభిరామ వినురవేమ॥

ప్రతిశ్రుతం యే త్యజంతి వేమ ! తే మానవర్జితాః ।
పరదుఃఖానభిజ్ఞోఽల్పో మిత్రద్రోహీ ఖలః ఖలు ॥

తా॥ ఆడితప్పువారలు అభిమానము లేనివారు. కష్టము తెలిసికొనలేనివాఁడు అల్పుఁడు. కలిసిమెలిసియుండి మిత్రద్రోహము చేయువాఁడు మహాక్రూరుఁడు. వి॥ ప్రాణానపి పరిత్యజ్య, మానమేవాభిరక్షయేత్, ప్రాణాస్తరంగచపలా మాన మాచంద్రతారకమ్॥

117 వానరాకడమతి ప్రాణంబుపోకడ, కానఁబడదు ఘనునకైనఁగాని
కానఁబడినమీఁదఁ గలియెట్లునడచురా ? విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ ! వర్షాగమంచైవ ప్రాణనిర్గమమేవ చ ।
మనీష్యపి న జానాతి జ్ఞాతే తిష్ఠే త్కలిః కథమ్? ॥

తా॥ వాసరాకడ, ప్రాణము పోకడ, ఇట్టి దైవిక సంఘటన లెంతటి మానవమాత్రులకైనను దెలియఁ జాలవు. అట్లు తెలియఁబడిన నిఁక మానవునకు మానవాతీతుఁడగు దైవమునకు నంతర మేముండును ? ముందు సృష్టి యెట్లునడుచును?

118 నోటిపుప్పికల్ల నొప్పిలేకుండగా, ఆకుపోకసున్న మౌషధంబు,
పెట్టకుండెనేని పెనుకోతవేయురా, విశ్వదాభిరామ వినురవేమ॥

వక్త్రదుర్గంధనాశాయ నాగవల్లీదళం సుధామ్ ।
క్రముకం చౌషధం దేయాత్ నోచే ద్వేమ! జుగుప్స్యతే ॥

తా॥ భోగ్యవస్తువగు ఆకు, వక్క, సున్నముతోకూడిన తాంబూలము నోటిపుప్పికి నోటికంపునకు నుపయోగించు మందుకాని మఱియొకటి కానేరదు.

119 పరులమోసపుచ్చి ధర ధనమార్జించి, కడుపునింపుకొనుట కానిపద్దు
ఋణముఁజేయుమనుజుఁ డెక్కువకెక్కునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

వంచయిత్వా పరా న్విత్త మార్జయిత్వోదరంభరిః ।
ప్రతిష్ఠాం నాప్నుయా ద్వేమ! ఋణీ ప్రాప్నోతి కిం ప్రథామ్? ॥

తా॥ పరుల మోసపుచ్చి ధనముగడించి కడుపునింపుకొనుట సరియైన పద్ధతికాదు. అదంతయు వారలకు ఋణమే. ఋణముఁ జేసెడి మనుజునకు గౌరవము కలదా ?

120 పాల నీడిగింటఁ గ్రోలుచునుండెనా, మనుజులెల్లఁగూడి మద్యమండ్రు
నిలువఁదగనిచోట నిలువ నిందలువచ్చు, విశ్వదాభిరామ వినురవేమ॥

శౌండికస్య గృహే పీతం క్షీరం మద్య మితీర్యతే ।
అస్థాతవ్యస్థలే వేమ! స్థితి ర్నిందాస్పదా ఖలు ॥

తా॥ కల్లుగీయువానియింటఁ బాలుత్రాగుచున్నను కల్లే యందురు. అట్లే నిలువకూడనిచోట నిల్చిన నిందలపాలుఁగాక తప్పదు.

121 తుమ్మచెట్ల ముండ్లు తోడ నెపుట్టును, విత్తులోననుండి వెడలినట్లు
మూర్ఖునకుఁ గుబుద్ధి ముందుగఁబుట్టును, విశ్వదాభిరామ వినురవేమ॥

బీజాదేవోద్భవం త్వాశు కంటకాః కంటకద్రుమే ।
మూర్ఖస్య ఖలబుద్ధి శ్చ వేమ! సంజాయతే తథా ॥

తా॥ తుమ్మచెట్లకు ముండ్లు పుట్టుకతోనే పుట్టుకొని వచ్చును. అట్లే మూర్ఖునకు చెడ్డబుద్ధి పుట్టుకనుండియే వచ్చును. సంస్కారణకట్టివాఁడు పనికిరానేరఁడు.

122 ఒకటికిక్రింద నొక్క టొనరఁబెట్టి, వలనుగ గుణియింప వరుసపెరుఁగు
అట్టిరీతినుండు నౌదార్యఫలములు, విశ్వదాభిరామ వినుర వేమ॥

ఏకయా గుణితా వేమ! ఏకసంఖ్యా హ్యాధస్థయా ।
వర్ధతే ఖలు తద్రూప మౌదార్య స్యాపి సత్ఫలమ్ ॥

తా॥ ఒక సంఖ్యక్రింద మఱియొక సంఖ్యపెట్టి గుణించిన నెంతయేని వరుస పెరుగును. అట్లే యౌదార్యఫలములును నుత్తరోత్తరాభివృద్ధిఁ బెందుచుండును.

123 వంటకుఁడు రుచిగా వండిన వంటకమమృతంబు, కంటికింపుగాను కానుపించు
ఒడలఁదినినతిండి వడిమించఁగనుదోరు, విశ్వదాభిరామ వినుర వేమ॥

సుపక్వం భక్ష్య మమృతం లోచనప్రీతిదాయకమ్ ।
భోజనే నామితే నాశు వేమ! సంప్రాప్నుయాన్మృతిమ్ ॥

తా॥ వంటకుడురునపుడు వంటకము (వండినపదార్థము) కంటి కింపుగ కనఁబడును. మితముగఁ దినిన నారోగ్యమును కలుగును. మితముతప్పి తినిన మృతిని తేగలదు. వి॥ అతి సర్వత్ర వర్జయేత్॥

124 వంటతప్పినపుడు వంటకము విషంబు, కంటఁజూడఁగానె కంటగించు
కంటకమునఁదిన్న కడి గండమైవచ్చు, విశ్వదాభిరామ వినుర వేమ॥

దుష్పాకేన విషం భక్ష్యం లోచనగ్లానిదం భృశమ్ ।
తాదృగ్భక్ష్యే వేమ! భుక్తే కబళం మృత్యుదాయకమ్ ॥

తా॥ వంటకుదుర నప్పుడు వంటకము విషముగనగును. కంటికింపుగను నుండదు. అట్లు కంటగించుకొనుచుఁ దినినపదార్థ మొకముద్దయైనను ప్రాణము తీయఁగలదు.

125 పశ్రిభువుకోఁతియైనఁ బశ్రిగడలు పందులు, సైనికుండు పక్కి సేన పసులు
ఏన్గులశ్వచయము లెలుకలుఁబిల్లులు, విశ్వదాభిరామ వినురవేమ॥

పశ్రిభుః కపిశ్చే త్సచివాః క్రోడా వేమ! భటాః ఖగాః ।
సేనా చ పశవ శ్చాశ్వాః గజా శ్చాఖుబిడాలకాః ॥

తా॥ "యథా రాజా తథా ప్రజాః" అన్నట్లు ప్రభువు కోతియైన (చపలుఁడైన) మంత్రులు పందులు (లంచము మేయువారు) సైనికులు పక్షులు (ఆజ్ఞకు దొరకకుండ నెగిఱిపోవువారు) సైన్యము పశుసమూహామే (మస్తుగ తిని పశువులుగ సంచరించువారు) ఏనుగులు, గుఱ్ఱములు, ఎలుకలు, పిల్లులు (వశముతప్పి యన్యోన్యము హింసించుకొనునవే)

126 చంపఁదలఁచురాజు చనువగ్గలంబిచ్చు, చెఱుపనున్న పగఱ చెలిమిఁజేయు
కఱవనున్న పాము నెఱిగాచుకొనియుండు, విశ్వదాభిరామ వినురవేమ॥

వధోద్యుక్తో నృపో వేమ! దత్తే ప్రీతిం వినాశకృత్ ।
మైత్రీం కుర్యా ద్రిపు ర్భోగీ దంశోద్యుక్తో నిరీక్షతే ॥

తా॥ చంపవలెననియున్న ప్రభువు చనువిచ్చుచుండును. పాడుచేయవలెననియున్న శత్రువు మైత్రిఁ జేయుచుండును. కఱవనున్న పాము పగబట్టి సమయమునకు నిరీక్షించుచునే యుండును.

127 దిక్కులేనిరోగి దీనతఁబాపిన, పురుషుఁడిహమునందుఁ బూజ్యుఁడగును
పరమునందువాని భాగ్యమేమనవచ్చు?, విశ్వదాభిరామ వినురవేమ॥

యది క్షీణో త్యనాథస్య రోగిణో దీనతాం నరః ।
వేమేహ స పుమాన్పూజ్యః పరత్రాప్యురుభాగ్యవాన్ ॥

తా॥ దిక్కులేని రోగి దైన్యము పోగొట్టిన మహానీయుఁ డిహమునఁ బూజ్యుఁ డగును. పరమున వాని యదృష్టము చెప్పనలవియేకాదు.

128 ఇమ్ముదప్పువేళ నెమ్మెలన్నియుఁదప్పి, కాలమొక్కరీతి గడుపవలయు
విజయుఁ డనువుఁదప్పి విరటుని గొల్వఁడా?, విశ్వదాభిరామ వినురవేమ॥

అనానుకూల్యే త్యక్తేష్టః నయేత్కాలం కథంచన ।
వేమ! జిష్ణు ర్నానుకూల్యే విరటం కిం న సేవతే? ॥

తా॥ మన కననుకూలమగు సమయమున సుఖము విడిచి యేదో యొకవిధమున కాలము గడుపవలయును. విజయుఁడు (అర్జునుఁడు) వీలుకాని సమయమున విరటుని సేవింపలేదా ?

128 గూబయెక్కినట్టి గురముఁబాడుగఁబెట్టి, వెళ్లిపోదురంత వెఱ్ఱివారో!
గూబయేమిచేసె? గుహమేమిచేయును?, విశ్వదాభిరామ వినురవేమ॥

ఘూకేనాధిష్ఠితం గేహం త్యక్త్వాన్యత్ర వ్రజం త్యహో!।
పశ్యోన్మాదం మనుష్యాణాం తాభ్యాం వేమేహ కిం కృతమ్?॥

తా॥ గుడ్లగూబ యెక్కిన యిల్లు పాడుగఁబెట్టి మఱొకచోటునకు మానవులు వెఱ్ఱులై వెళ్ళిపోదురు. తన యదృష్టమును మించి గూబేమి చేయఁగలదు ? గృహమేమి చేయఁగలదు ?

130 వేముఁ బాలుఁబోసి వెయ్యేండ్లు పెంచిన, జేదువిడిచి తీపిఁ జెందదెపుడు
ఓగుగుణమువిడిచి యుచితజ్ఞుఁడునుకాఁడు, విశ్వదాభిరామ వినురవేమ॥

క్షీరేణ వర్ధితో నింబః వేమ! వర్ష సహస్రకమ్ ।
తిక్తం త్యక్త్వా న మధుర స్తథా దుష్టస్య నౌచితీ ॥

తా॥ వేఁపచెట్టునకు పాలుఁబోసి వెయ్యేండ్లు పెంచినను చేదు విడిచి తీపిని బొందఁజాలదు. అట్లే నీచుఁడు చెడ్డగుణమువిడిచి యుక్తాయుక్త వివేకజ్ఞానము కలవాఁడును కాఁజాలఁడు.

131 పంద నధికుఁజేసి పవరంబునకుఁబంపఁ, బాఱిపోవుఁ గార్యభంగమగును
పాఱువాఁడు బంటు పనికిరాఁడెందును, విశ్వదాభిరామ వినురవేమ॥

శూరం కృత్వా వేమ! భీరుం యది యుద్ధే నియోజయేత్।
పలాయితే కార్యహాని ర్నాలం భీరు ర్భటోద్యమే ॥

తా॥ పిఱికిపందను నెంతగా ప్రోత్సహించి పంపినను యుద్ధమునకు సిద్ధపడక పాఱిపోయి యేవచ్చును. దానివలన కార్యభంగమగుటయే తప్ప ప్రయోజనములేదు. అట్టిపిఱికిబంటును నెందులకును నుపయోగింపరాదు.

132 కుంటికుక్కకేల కుందేటిపరువులు?, పిఱికిబంటుకేల బిరుదుగొడుగు?
ముసలిముండకేల ముసిముసినగవులు? విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ పంగో॰ కుర్కురస్య కిం వా నాక ధావనై॰?।
ఖీరో॰ కిం శూరవిరుదై॰? వృద్ధాయా॰ కిం దరస్మితై॰? ॥

తా॥ కుందేలువలె పరుగులు కుంటికుక్కకేందులకు? యుద్ధవీరునకుఁ బోలె బిరుదుగొడుగు పిఱికిబంటునకేందులకు? యువతికిఁబోలె ముసి ముసినగవులు ముసలిముఁ దకేందులకు?

133 గురుబృహస్పతియును గుణమించుక యులేక, చందమామకిచ్చె శాపమపుడు
గురుఁడు కోపమూనఁకూడ దెన్నటికిని, విశ్వదాభిరామ వినుర వేమ॥

గురుర్బృహస్పతి శ్చందో ర్దదౌ శాపం హి నిర్గుణ॰ ।
కదాపి వేమ! స్వే చిత్తే గురు॰ క్రోధం న ధారయేత్ ॥

తా॥ దేవగురువు బృహస్పతియు వివేకభ్రష్టుండై చందమామకు కోప మణచుకొనలేక శాపమిచ్చెను. సాధారణ గురుశబ్దవాచ్యుఁడును నెట్టి సమయమునను కోప ముపయోగింపకూడదు.

134 ఆత్మనెఱుఁగనిస్తుతి నట్టిట్టుఁ జేసిన, వానిమెచ్చువాఁడు నట్టివాఁడె
ముక్కుడిదియుఁబాడ మూర్ఖుండు మెచ్చఁడా?, విశ్వదాభిరామ వినురవేమ॥

స్తుతిం కరో త్యనాత్మజ్ఞాం య-స్తచ్ఛ్లాఘీ జడో నర॰ ।
గాయంతీం శ్లాఘతే విఖ్యాం న కింవేమ! జడో జన॰ ? ॥

తా॥ ముక్కులేనిది పాడినను మూర్ఖుఁడు మెచ్చుకొనును. అట్లే తన సంగతి తెలియక తన్నుఁగూర్చి యేవేవో యెదుటివాఁడు పొగడుచున్నను మూర్ఖుఁడు సంతోషమునే వెలిబుచ్చును.

135 ఖరముపాలుదెచ్చి కాచిచక్కెరవేయ, భక్ష్యమగునె? యున్నభ్రష్టుఁడట్లె
ఎంతయేనిజెప్పి యెసగింపఁ బోసఁగునే?, విశ్వదాభిరామ వినురవేమ॥

సంపచ్య గార్దభక్షీరం యది శర్కరయాప్లుతమ్ ।
భక్ష్యం భవే త్కిమ్? మూర్ఖోఽపి వేమార్థ్యో న తథా కదా॥

తా॥ గాడిదపాలఁదెచ్చి కాచి చక్కెర వేసినను నవి త్రాగుటకెట్లను కూలమైనవికావో యట్లే చెడిపోయినవాఁడును నెంతగా ప్రబోధింపఁ బడినను సరియైనవాఁడు కాఁజాలఁడు.

136 పొట్లకాయరాయి పొదిగి త్రాటనుగట్టి, లీలతోడ వంకలేక పెరుగు
కుక్కతోఁకఁగట్టఁ గుదురునా చక్కఁగా, విశ్వదాభిరామ వినురవేమ॥

ఋజుతా మశ్నుతే రజ్జ్వా శిలాబద్ధా పటోలికా ।
తథా బద్ధ శ్శునః పుచ్ఛః త్యజేత్కిం వేమ ! వక్రతామ్?॥

తా॥ పొట్లకాయచివర రాతిని త్రాటితోఁకట్టిన నది వంకలేక తిన్నగా పెరుగఁగలదు. అట్లే కుక్కతోఁకకు కట్టిన వంక కుదురఁగలదా ? (అన్నియును సంస్కరణ కుపయుక్తములైనవి కానేరవు)

137 బండబూతులాడు పరమనీచుండెన్న, దండివారిగొప్ప తానెఱుఁగునె?
చందనంబుఘనత పందియేమెఱుఁగును?, విశ్వదాభిరామ వినురవేమ॥

అవాచ్యవాదీ నీచాత్మా సతాం జానాతి కిం ప్రథామ్ ? ।
వేమ ! చందనసౌరభ్యం కిం వేత్తి గ్రామసూకరః ? ॥

తా॥ మంచిగంధపుయొక్కసుగతి పందికేమి తెలియును? అట్లే బండబూతులఁబల్కు పరమనీచునకు గొప్పవారలసుగతి యేమి తెలియఁగలడు?

138 కులమునీఁటఁజేసి గురువునువధియింపఁ, బొంకఁగ నేర్చినను బొంకు బొంక
పేరుధర్మరాజు పెనువేపవిత్తనా, విశ్వదాభిరామ వినురవేమ॥

'గజ,శ్వత్థస్మృతం [illegible] గురుం హంతుం కులం దహన్ ।
వేమ ! నామ్నా ధర్మరాజో నింబబీజోపమః ఖలు ॥

తా॥ కులమును సర్వనాశనముఁజేసి గురువగు ద్రోణుని వధింప 'అశ్వత్థామ చచ్చెను, అని గట్టిగాను, ఏనుఁగు, అని నెమ్మదిగను ధర్మరాజబద్ధమాడెను ఇట్టి వారలు నేతిబీరకాయలవలె పేరుకు మాత్రము ధర్మరాజులుకాని విషబీజములే సుమా.

139 విన్నసుద్దికొంత విననిసుద్దులుకొన్ని, వింతసుద్దులెన్నొ వినఁగఁజెప్పు
తానుగన్నయట్లె డాంబికుం డెప్పుడు, విశ్వదాభిరామ వినురవేమ॥

కించి చ్ఛ్రుతం డాంభిక స్తు కించిదేవాశ్రుతంవచః ।
చిత్రం చిత్రం వదే ద్వేమ ! సాక్షాద్దృష్ట మివాధికమ్ ॥

తా॥ విన్నవికొన్ని, విననవికొన్ని, వింతలైనవికొన్ని యుల్లో డాంబికుఁడు తాను కళ్లారాచూచినట్లే యబద్ధములఁజెప్పి ప్రజలమోసగించును. అజ్ఞాను లవే నమ్మి మోసపోదురు.

140 పుడమిమీఁదిరిగిపడయు పుణ్యంబులెల్లను, కల్గు సాధుజనులఁగన్నయపుడె
పడినవీరునదిని గడుఁదేటమైయుండు, విశ్వదాభిరామ వినుర వేమ॥

దేశాటనేన యత్పుణ్యం దర్శనేనైవ తత్సతామ్ ।
వర్షాంబుమలినం వేమ ! నదీసంగాద్ధి నిర్మలమ్ ॥

తా॥ దేశాటనవలని పుణ్యా మాయాస్థలముల సత్పురుషులఁగాంచి వారివారి యనుభవసూక్తుల వినుటవలననే కలుగును. పవిత్రమగునదిని జేరుటచేతనేకదా పిల్లకాలువలకుఁ బవిత్రత? వి॥ యస్తు పర్యటతే దేశాన్ యస్తు సేవేత పండితాన్, తస్య విస్తారితా బుద్ధి స్తైలబిందు రివాంభసి ॥

141 బంటువలెను లేవఁ బండితమ్మన్యుండు, సాధుపండితుండు శాంతుఁడగును
కుక్కమొఱుఁగనేమి గుజ్జుమనకులెక్క?, విశ్వదాభిరామ వినుర వేమ॥

ఉత్థితే పండితమ్మన్యే భటవత్ వేమ ! పండితః ।
శాంతోఽభవేత్స్వ దశ్వస్య కా హాని ర్భషతా శునా ॥

తా॥ పండితుఁడు కాక పండితుఁడనని భావించుకొను నీచుఁడు పరమ శాంతులగు నుద్దండ పండితులపై కవియును. అయినను వారు ప్రశాంతముగనేయుందురు. కుక్కలు మొఱఁగినమాత్రమున గుజ్జుమునకులెక్కా?

142 మాలకన్నియలకు మంచిరూపంబున్న, ముట్టెనే? త్రిశంకుపట్టి నాఁడు
కానిపనులఁజేయ ఘనులాసపడుదురా?, విశ్వదాభిరామ వినుర వేమ॥

చండాలకన్యాసౌరూప్యం, దృష్ట్వా త్రైశంకవః పురా ।
న మేనే వేమ ! నేచ్ఛంతి, హ్యకార్యకరణం ఘనాః ॥

తా॥ మాతంగకన్యలు వరించివచ్చినను వారికి రూపమున్నను హరిశ్చంద్రుఁడు వారలఁదాకెనా? కానిపనులఁజేయుటకు మహనీయులాసపడరు.

143 విద్యలేనివాఁడు విబుధులసభలోన, నుండఁగాని పండితుండుఁగాఁడు
కొలనిహంసలకడ కొక్కెరయున్నట్లు, విశ్వదాభిరామ వినుర వేమ॥

విదుషామంతికే వేమ ! విద్యాహీనో వసే ద్యది ।
న విద్వాన్ భవితుం యోగ్యో, హంసమధ్యే బకో యథా॥

తా॥ కొలనిలోని హంసల దగ్గఱ కొంగయున్నట్లు విద్యావిహీనుఁడు విబుధుల సభలోనున్నంత మాత్రమున పండితుఁడు కానేరఁడు.

144 వ్యాధికలిగనేని వైద్యునిచేతను, మందుదినకకాని మానదెందు
చెంత దీపమిడక చీఁకటిపాయునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

యది వ్యాధి ర్భవే ద్దేహే నాపైతి హ్యౌషధాదృతే।
వేమ! తన్నికటే దీప మకృత్వాపైతి కిం తమః?॥

తా॥ దగ్గఱ దీపము పెట్టినకాని చీకటి పోనేరదు. అట్లే వైద్యము చేయించుకొనకున్నను, మందు తినకయున్నను వ్యాధి నివారణకాదు. వి॥ పూర్వజన్మకృతం పాపం వ్యాధిరూపేణ బాధతే, తచ్ఛాంతి రౌషధై ర్దానై ర్జపహోమార్చ నాదిభిః॥

145 ఛత్రిమున్నఁ దగినఛాయయేర్పడుచుండు, శాస్త్రమెఱుఁగఁదగిన జ్ఞానమొదవు
అబ్బయున్నవాని కండయుండునుగదా?, విశ్వదాభిరామ వినురవేమ॥

ఛత్రే స్థితే భవేచ్ఛాయా జ్ఞానం స్యాచ్ఛాస్త్రదర్శనే।
జనకే చ స్థితే వేమ! స్వాశ్రయో విద్యతే ఖలు॥

తా॥ గొడుగున్ననే నీడ యేర్పడును. అట్లే తండ్రియున్ననే తన కాధారము. అట్లే శాస్త్రాధ్యయనమువలననే జ్ఞానము లభించును.

146 చీముకారుపంటఁ జెదలుపట్టినయింట, పురుగుపట్టుగుంటఁ బుసులకంట
బిడ్డచీకుచంట బిగియుండనేర్చునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

శిధిలే ధతి దూష్యేఽక్ష్ణి, వేమ! గేహే ఘుణాన్వితే।
కృమిగర్తే స్తనేపీతే దార్ఢ్యం కిం సాధు తిష్ఠతి?॥

తా॥ చీముకారు పంటికి, చెదలుపట్టిన యింటికి, పురుగుపట్టిన గుంటకు, పుసులుకలిగినకంటికి, బిడ్డచీకు చంటికి, పూర్వపుబిగి రానేరదు.

147 కాననంబుఁజేరి కడుశ్రమనొందిన, యానలుండు రాజ్యమొందెమరలఁ
గష్టములకునోర్వఁ గల్గవా సుఖములు?, విశ్వదాభిరామ వినురవేమ॥

వనం గత్వా శ్రమక్లిన్నః ప్రాప రాజ్యం తతో నలః।
సహతే వేమ! కష్టాని య స్ససౌఖ్యాని విందతే॥

తా॥ అడవిలో ననేక కష్టము లనుభవించి నలమహారాజు తిరిగి రాజ్యము నొంది సుఖించెను. కష్టములకు నోర్చుకొనిన సుఖములుకూడ రావచ్చును.. వి॥ దివ్యవ్రతం కిం చ? సమస్తధైర్యమ్॥

148 వసుధ నెడ్డకేల వైద్యకార్యంబులు?, గుడ్డివానికేల గునుగుపరుగు?
బుడ్డవానికేల పో గుప్పిగంతులు?, విశ్వదాభిరామ వినురవేమ॥

అనుచేః కిం వైద్యకార్యైః ? కి మంధస్య ప్రధావనైః ।
బృహదండయుతస్యాపి కిం వేమాశువిలంఘనైః ?॥

తా॥ గ్రుడ్డివానికి గునుగుపరుగు, బుడ్డవానికి కుప్పిగంతులు నెట్లు లాభదాయకములు కావో, అట్లే ఎడ్డెవానికారోగ్యనియమములు, వైద్య కార్యములు ప్రయోజనమును గల్గించనివే.

149 రజ్జులాడ రాదు రణభూమిలోపల, బుజ్జగింపరాదు బొంకువాని
నొజ్జతోడ వాదు లోనరంగ మానరా, విశ్వదాభిరామ వినురవేమ॥

న హి బ్రూయాత్ ప్రగల్భోక్తీః రణే చాసత్యవాదినమ్।
న లాలయే త్తథా వేమ ! గురుణా చ న తర్కయేత్ ॥

తా॥ యుద్ధభూమిని డాంబికములు పనిచేయవు. అబద్ధమాడువానిని బుజ్జగించిన ప్రయోజన ముండదు. గురువుతో వాదన మంచిది కానేరదు.

150 మాటఁజెప్పవినని మనుజుఁడు మూర్ఖుఁడు, మాటవిన్న నరుఁడు మాన్యుఁడగును
మాటవినఁగఁజెప్ప మానుటకూడదు, విశ్వదాభిరామ వినురవేమ॥

అశ్రోతా వచసో మర్త్యో మూర్ఖ శ్శ్రోతాతిమానితః ।
శ్రుతేఽశ్రుతేపి వేమార్యః న త్యజే త్కథనోద్యమమ్ ॥

తా॥ మంచిమాటలఁజెప్పుచుండ విననివాఁడుమూర్ఖుఁడు. వినినవాఁడు మాన్యుఁడు. చెప్పెడి మంచిమాటలు వినువారులేరని మానుట మాత్రము కూడదు. వి॥ మూకో స్తికోవా ? బధిరశ్చ కో వా ? వక్తుం న యుక్తం సమయే సమర్థః, తథ్యం సుపథ్యం న శృణోతి వాక్యమ్॥

151 మాటఁదెలిసి యొకనిమాటకుఁబ్రతిఁజెప్ప, సంతసించు నతఁడుఁ జాలమెచ్చు
మనసుఁదెలియఃనిన గునియుచు ననునేదో, విశ్వదాభిరామ వినురవేమ॥

భావజ్ఞః పరవాక్యస్య ప్రత్యుక్తిం యది భాషతే ।
తుష్యే ద్వేమ ! పరిశంసే త్స నోచే దాత్మని కుత్సతి ॥

తా॥ ఎదుటివాని మాటలధోరణి గ్రహించి వానికిఁదగినట్లు వలుకఁగా నతఁడు సంతసించును. కాని వాని ధోరణి గ్రహించక వేఱుగ ననిన నసంతుష్టిచే నేదియో గొణుగుకొనును.

152 భారతమునఁబల్కు పలుధర్మములయందు, సత్యనిష్ఠ మేటిసత్యముకద?
వసుధ దానఁగలుగు వస్నెయె మిన్నయౌ, విశ్వదాభిరామ వినురవేమ॥

భారతోక్తేషు సర్వేషు ధర్మేష్వపి చ సూనృతమ్।
ఉత్తమం వేమ! తత్సత్య, భావాచ్ఛ్రేయఃప్రదా భువి॥

తా॥ సత్యనిష్ఠయే యన్నిటికన్నను మిన్న. భారతమునఁ జెప్పఁబడిన ననేక ధర్మములయందును నదియేకదా చెప్పఁబడినది? వి॥ సత్యం చ కిం? భూతహితం సదైవ॥

153 పలుతెఱంగులుఁ నుపగయుండుచోటులఁ, జిటుకుచునక ప్రియమెచెప్పవలయుఁ
గాల్పఁదగినయగ్ని కట్టెలోనుండదా? విశ్వదాభిరామ వినురవేమ॥

ద్వేషస్థలేషు బహుధా ప్యుదాసీనః ప్రియం వదేత్।
దాహకః పావకో వేమ! వసే న్న హి కి మింధనే?॥

తా॥ కాల్పతగినయగ్ని కట్టెలోనే యిమిడియున్నట్లు శతృత్వమున్న చోట నా శత్రుభావము బహిర్గతము కానీక ప్రియమునే పల్కుచు నణఁగి యుండవలెను.

154 పరులచిత్తమెుప్పి పాలనఁజేసిన, నిలస్వదత్తమునకు నినుమడియగు
నవనిఁ బరులదత్త మపహరింపఁగరాదు, విశ్వదాభిరామ వినురవేమ॥

యది రక్షే త్పరై ర్దత్తం, స్వదత్తా ద్ద్విగుణం భువి।
అన్యై ర్దత్తం ధనం వేమ! న హరే జ్జాతు మానవః॥

తా॥ ఇతరులిచ్చినదాని నపహరింపక దానిని రక్షణఁజేసినఁ, దానిచ్చు దాని ఫలితమునకంటె రెట్టింపు ఫలమువచ్చును.

155 పట్టివిడువరాదు పదిలక్షలకునైన, పెట్టిదెప్పరాదు పేదకైన
వెట్టిగొలువరాదు విభుఁడెట్టివాఁడైన, విశ్వదాభిరామ వినురవేమ॥

గృహీత్వా న త్యజే ద్వేమ! దశలక్షఫలే న వా।
దే ద్దత్వార్థినే నాధ్యమపి చార్చే ద్వృథా విభుమ్॥

తా॥ పట్టిన మంచికార్యము యొక్క పట్టుదల పదిలక్షలు వచ్చినను మధ్య విడువరాదు. ఎట్టి పేదకైనను పెట్టి యిటులపెట్టితి నటులఁ

బెట్టితి నని చెప్పరాదు. యజమాని యెంత మంచివాఁడైనను ప్రతిఫలము లేకుండ వెట్టిచాకిరిఁ జేయఁగూడదు.

156 దొమ్మతెగులు చేతఁ దూలిన గేదెకు, వాతవేయ బ్రతికివచ్చె నేని
వాతయెనుము పాలు రోతనవచ్చునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

మహిషీ వాతరోగార్తా దాహైః స్వాస్థ్య ద్యదిజీవితా।
తస్యాః క్షీరం తు కిం వేమ! జుగుప్సిత మితీర్యతే॥

తా॥ దొమ్మ తగిలిన బఱ్ఱెకు వాతలు వేసిన,నది బ్రతికిన, దాని పాలను రోతయని మనము విడుతుమా? అట్లే కార్యసాధకునకుఁ బ్రియతోఁ బ్రయోజనముకాని వ్యక్తితోఁ బ్రయోజనమేమి?

157 తనయుఁడెవ్వఁడేని తనతండ్రికంటెను, పేరుఁదెచ్చునట్టి పెద్దయైన
జనకుహీనుఁజేయసాహసించినఁ జేటు, విశ్వదాభిరామవినురవేమ॥

సుతః కశ్చిత్ పితు ర్వేమ! ఘనో యద్యపి వర్తతే।
తథాపి పితరం హీనం కర్తుం నేచ్ఛే త్తతోఽత్యయః॥

తా॥ కుమారుఁడు తండ్రికంటె ఘనుఁడైనను తండ్రిని మాత్రము హీనునిఁజేయఁగూడదు. అట్లుఁజేసినఁ జేటుమూడును. వి॥ కుతో హి భీతిః సతతం విధేయా? లోకాపవాదాత్, భవకాననాచ్చ॥

158 తండ్రిమాటలువిని తల్లినిదెగటార్చి, పరశురాముఁ డేమిబాముకొనెనొ?
నిలువనీడలేక కులగిరిఁ జేరఁడా? విశ్వదాభిరామ వినురవేమ॥

శ్రుత్వా వచః పితు ర్వేమ! హత్వా మాతర మంజసా।
భార్గవః కిం ఫలం ప్రాప? జగామాద్రిం నిరాశ్రయః॥

తా॥ తండ్రి మాటలు విని తల్లిని నఱికి పరశురాముఁడేమిబాము కొనెను? నిలువ నీడలేక కుల గిరియగు మహేంద్ర పర్వతమునఁబడి యుండఁడా? వి॥ మాతాపితృ సమం దైవం సర్వేషాం న హి విద్యతే, తస్మాత్సమర్చయే న్నిత్యం పితరౌ దేవరూపిణౌ॥

159 ఢీకొనంగఁదగదు డెంద మెఱుంగక, యడుగవచ్చి కొంత యనినవాని
జెప్పునంత వినియు మెప్పుగాఁ బలుకుమీ, విశ్వదాభిరామ వినురవేమ॥

వక్తుకామార్థినో భావ మజానన్నేవ ధిక్కృతిమ్ ।
న కుర్యాత్తేన భణితం శ్రుత్వా వేమ! ప్రియం వదేత్ ॥

తా॥ ఎదుటివాఁడు చెప్పఁ దలఁచుకొన్నదంతయుఁ జెప్పినమీదట విని దాని మంచిచెడ్డల గుర్తించి యతఁడు సంతృప్తిఁ జెందులాగునఁ బలుకుము. అంతేకాని మధ్యనే కస్సుబుస్సుమని యతఁడనుదానిని వినక వాని యభిప్రాయ మెఱుఁగక ధీకొనకుము.

160 ఖలులతోడిపొందు కలుషంబుఁ గల్గించు, మానదెంత మేటి మానికైన
వానిజేరదీయ వలవదు చెడుదువు, విశ్వదాభిరామ వినుర వేమ॥

సంగో దుష్టై స్సమం వేమ! భవే త్పాపకరో భువి ।
మహార్ఘేశ్చాపి నాశ్యైతి తత్సంగో మా స్తు నశ్యసి ॥

తా॥ దుర్మార్గులతో పొందు నష్టకష్టములకు నిలయమగును. ఎట్టి మహనీయునకైనను నది హానిచేయక మానదు. కాన నట్టి నీచుల దరిఁజేరనీకుము. చెడిపోదువు.

161 అనువుఁగానిబంటు నల్పుఁడేలినయెడ, మాఱుమలయునొండె మగుడునొండె
దూలమూతకోల దొరికినచందంబు, విశ్వదాభిరామ వినుర వేమ॥

అల్పేన పాలితోఽవశ్యః ప్రతీపం వర్తతే భటః ।
నివర్తతే వా వేమైతత్ స్థూణాలంబాటనోపమమ్ ॥

తా॥ అలవికాని బంటును నల్పుఁడేలునెడల నాబంటు యజమానిమాట వినిపించుకొనఁడు. సరికదా యెదుఱుతిరిగి దెబ్బలాడును. అట్టివానిఁ జేఁబట్టుట దూలము, చేతికి నూతకఱ్ఱగా గైకొనుటవంటిది సుమా.

162 పీడవలయువాని గూడినసెగ్గు, వీటివాడలందు వెలయువాఁడు
పాడుచేయుపనులు పరిపాటికోలఁదిని, విశ్వదాభిరామ వినుర వేమ॥

త్యాజ్యపూరుషసంగత్యా హానిస్స్యా త్సర్వవీథిషు ।
స ఏవ వర్తతే వేమ! దుష్క్రియానిరతో హి సః ॥

తా॥ విడచిపెట్టివేయవలసిన వానినిఁ జేరదీసిన ప్రమాదము వాటిల్లును. వాఁడు ప్రతి వీధిని తిరిగి పరిపాటికోలది పనుల పాడుచేయుచుండును.

163 విజయుఁడైనవాఁడు విల్లుఁదినంతనే, కుజనులైనవారు కూలిరికద
భజనఁజేయువతఁడు విజయముఁగాంచఁడా?, విశ్వదాభిరామ వినురవేమ॥

కుజనా శ్చాపతన్ వేమ! విజయే ధృతకార్ముకే ।
భజనాభిరతో న్మానం విజయం నైతి కిం భువి? ॥

తా॥ విజయుఁడు విల్లుఁ బట్టినంతమాత్రమునఁ గుజనులెల్లరును నేలఁ గూలిరి. దైవము నాశ్రయించి భజనఁజేయునతఁడు విజయముఁ గాంచుటలో నబ్బురమేముండును ?

164 వానభయము చేత వడిదూరెదరులోన, నెండకెంతయైన మొండిచఱతు
రేల లోకజనులు మేలోర్వకుందురు?, విశ్వదాభిరామ వినురవేమ॥

వృష్టిభీత్యా విశే దంతః సహతే తీక్ష్ణమాతపమ్ ।
కథం లోకే జనా వేమ! న సహంతే శుభం ఫలమ్? ॥

తా॥ లోకులకు మేలు పనికిరాదు కాబోలు, మేలు పనికివచ్చెడిదైన చల్లనైన వానకు దాగెదరేమి ? తీవ్రమగు నెంతయెండకైనను మొండి చరతురేమి ?

165 న్యాయశాస్త్ర మఱియ నన్యాయమొనరించు, ధర్మశాస్త్ర మొసఁగు దుర్మతంబు
జ్యోతిషంబు జనుల నీతులఁదప్పించు, విశ్వదాభిరామ వినురవేమ॥

అన్యాయాయ న్యాయశాస్త్రం,ధర్మశాస్త్రం తథైవ చ ।
దుర్మతాయ జ్యోతిషం తు వేమ!స్యా దవినీతయే ॥

తా॥ న్యాయశాస్త్ర మన్యాయమును, ధర్మశాస్త్రము దుర్మతమును, జ్యోతిషము అవినీతిని కూడ కల్గించగలవు. హృదయము నడిగి తెలిసికొనుము నిజము గుర్తించఁగలవు.

166 తనకుఁగల్గు పెక్కుతప్పులటుండఁగా, నొరుల నేరమెంచు నోగెపుడును
చక్కిలంబుఁజూచి జంతిక నగినట్లు, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ! స్వదోషబాహుళ్యే పరదోషాన్ ఖలో జనః ।
గణయేత్ శష్కులీం దృష్ట్వా యథా హసతి యంత్రికా ॥

తా॥ చక్కిలమును జూచి జంతిక నవ్వినట్లు తనకు పెక్కు తప్పులుండ నితరుల నేరములెంచుచు నీచుఁడు హేళనఁజేయుచుండును.

167 పక్షిజాతిఁబట్టి పరఁగ హింసలఁబెట్టి, గూఁడు కట్టి యందుఁ గుదురఁబెట్టి
ఉంచువారి కట్టి వంచనరాదొకో, విశ్వదాభిరామ వినురవేమ॥

పక్షిజాతిం గృహీత్వాఽపి హింసయిత్వా చ నిర్దయమ్ ।
నిబధ్య పంజరే వేమ! న్యసతాం తద్గతి ర్భవేత్ ॥

తా॥ చిలుక గోరువంక మొదలగు పక్షులను తమ వినోదార్థము పంజరముల బంధించియుంచి హింసలపాలు చేయుదురు. అట్టి వారలకుమాత్ర మట్టి వంచన రాకుండునా ?

168 దేహమూలమందు దేహి దేవుఁడటంచుఁ, దెలిసియున్న బుధులు తీర్థయాత్ర
లరయఁబోరు జగతి నాత్మతామైయుండ్రు, విశ్వదాభిరామ వినురవేమ॥

దేహీ దేవో దేహమూల మితి జానంతి యే బుధాః ।
న యాంతి తే తీర్థయాత్రా ఆత్మారామా హి వేమ! తే

తా॥ దేహమందున్న దేహియే దేవుఁడని తెలిసికొనిన బుధులు తీర్థయాత్రలు గమనింపరు. జగత్తంతయు నాత్మస్వరూపముగనే చూచెదరు. ఆత్మయన తాను. వి॥ దేహబుద్ధ్యాతు దాసోఽహం, జీవబుద్ధ్యా త్వదంశకః, ఆత్మబుద్ధ్యా త్వమేవాహ మితి మే నిశ్చితా మతిః॥

169 పుక్కిటిసతివాని పూజింపదోసంబు, ఉరముసువతివాని యూహలెస్స
నెత్తి యుండదవాని బత్తిఁయే వరమిమ్చు, విశ్వదాభిరామ వినురవేమ॥

పూజా ముఖస్థదారస్య నోచితోరస్థ యోషితః ।
రమ్యోఽహో వేమ! మూర్ధస్థదారభక్తిః ఫలప్రదా ॥

తా॥ నోటిమాట మాత్రము కలవానిని పూజింపరు. హృదయము మంచిదైనవానిఁ బూజింతురు. అంతకంటె మేధావియగు విజ్ఞానిని పూజించుటయే మఱియును నుత్తమముగ భావింతురు.

170 పుట్టినజనులెల్లఁ బుడమిని మనియున్న, పట్టునే జగములు? పట్టవెపుడు
యముని లెక్క హెచ్చు నవలఁదగ్గుమనుండు, విశ్వదాభిరామ వినురవేమ॥

సంజాతా యది జీవేయు ర్జనా భువి జగత్సు చ ।
నమము ర్వేమ ! కాలస్య న్యూనా స్యా ద్గణనాధికా ॥

తా॥ పుట్టిన జీవి మరణించకుండ నుండిన లోకములే చాలవు. కాన సృష్టి యెంత పెఱిగిన నంత తఱుగునకే కారణము కాఁగలదు.

171 పక్షిజాతిఁబట్టి పరగ హింసలఁబెట్టి, కుక్షినిండఁ గూడు కూరుటకును
వండితినెడివాఁడు వసుధఁ జండాలుండు, విశ్వదాభిరామ వినుర వేమ॥

గృహీత్వా పక్షిణో వేమ! హత్వా స్వోదరపూర్తయే।
సంపచ్య భువి యో భుఙ్క్తే నూనం చండాల ఏవ సః॥

తా॥ పొట్టనిండ కూడు కూరుకొనుటకుఁగాను పక్షిజాతిని బట్టి కాళ్లు ఱెక్కలు విఱిచి హింసలఁబెట్టి తుదకు పీకి నులిమి చంపి వండుకొని తినెడి వాఁడు పరమ చండాలుఁడు నిక్కముసుమా!

172 తాను వెలయుభూమిఁ దనరంగఁదిరిగెడు, జనులఁగాంచి పొంచి సరగఁగఱచు
కుక్కబుద్ధియగుట గుణహీనులకు నౌను?, విశ్వదాభిరామ వినుర వేమ॥

స్వనివాసస్థలే వేమ! సంవీక్ష్య చరతో జనాన్।
దశతి శ్వా కథం నీచః గుణం నైసర్గికం త్యజేత్?॥

తా॥ కుక్క తన నీచప్రబుద్ధికొలది తాను సంచరించు ప్రదేశమందలి జనులనే పొంచియుండి కఱచును. అట్లే నీచుఁడు తన కాశ్రయమిచ్చిన వారికే ద్రోహ మొనర్చును.

173 గనులఁబుట్టు లోహగణమునందెల్లెడఁ, బనికివచ్చు నొక్క యినుము చాల
నైనఁ జులకఁబరతు రది హెచ్చుగానుంట, విశ్వదాభిరామ వినుర వేమ॥

వేమరాయ స్వర్ణలోహేషు ఖనిజేషూపయుజ్యతే।
బహుధా ప్రాప్తిబాహుళ్యాత్ క్రియతే తత్ర లాఘవమ్॥

తా॥ గనులలోఁబుట్టు లోహములన్నిటికన్న నినుమే యుపయుక్తమైనది. కాని యది యెక్కువగా దొరకుటవలనఁ జులకనఁగఁజూతురు అతి పరిచయమువలన నవజ్ఞత కలుగును.

174 కాంతసిందురంబుఁ గడుపిత్తరోగికి, నొనర మధువుతోడ నొసఁగినంతఁ
దనరు దేహబలము ధన్యుఁడై గన్పట్టు, విశ్వదాభిరామ వినుర వేమ॥

మధునా కాంతసిందూరం దత్తం చేత్ పిత్తరోగిణః।
దేహదార్ఢ్యం భవేత్తస్య ధన్యో వేమ! సుఖీ భవేత్॥

తా॥ కాంతసింగారము పైత్యరోగికి తేనెతో సేవింపనిచ్చిన దేహ దార్ఢ్యము కలిగి రోగవిముక్తుఁడగును. శాస్త్రాధ్యయనము మానవులకు మేలు చేకూర్చఁగలదు.

175 ఋతమనృతమెటులంగ నెవ్వరికెఱఁ బడగు?, స్థితియు గతియుఁదెలియఁ జేటుపడును విన్నమాత్రమునను వివరింపఁగా రాదు, విశ్వదాభిరామ వినుర వేమ॥

సత్యాసత్యగతిం జ్ఞాతుం శక్తాః కే వేమ! చింతయ ।
క్రమాత్ స్థితి ర్గతి ర్వ్యక్తా న తథా శ్రుతిమాత్రయా ॥

తా॥ సత్యాసత్యములు నాకస్మికముగఁ దెలిసికొనుట కెవ్వరికిని శక్యముకాదు. నిజము నిలకడమీఁదనే తెలియఁగలదు. అందువలన విన్నంత మాత్రమున వివరింపఁగూడదు.

176 ఆలినమ్మి భువిని నాచారహీనుఁడై, ప్రాలుమాలె నొక్క ప్రతినకొఱకు ఆడితప్పకుండఁ గాఁడుగాచినవాఁడు, విశ్వదాభిరామ వినుర వేమ॥

ఏక స్సత్యప్రతిజ్ఞార్థె వేమ! విక్రీయ చాంగనామ్ ।
హీనాచారః శ్మశానోర్వ్యాం పాలక స్స న్నవర్తత ॥

తా॥ సత్యప్రతిజ్ఞకొఱకు హరిశ్చంద్రుఁడు భార్యను విక్రయించి ఆచారము విడిచి చండాలదాసుఁడై కాఁడు కాచెను. అందువలననే సత్యహరిశ్చంద్రుఁడని నేటివఱకు యశఃకాయముచే నిలిచియుండెను.

177 వేడుచున్నయట్లె వినయంబుఁజూపును, గోతదింపుసుమ్ము కొండెగాఁడు చేర్పరాదువాని జెఱచును దుదినెట్లొ, విశ్వదాభిరామ వినుర వేమ॥

వినయం దర్శయన్ వేమ! స్నేహాభ్యర్థీవ సూచకః ।
గర్తే పాతయతి దాతవ్యో నాశ్రయ స్తస్య దుర్మతేః॥

తా॥ కొండెగాఁడు వినయము చూపించుచునే వేడుచునే గోతిలో పడఁద్రోయును. అట్టివానిని దరిఁజేరనీయకూడదు. చేరనిచ్చిన తుదకెట్టులైన యా చేరనిచ్చినవానిని పాడుచేయును.

178 కల్లునీల్లుఁద్రాగి కడుపెద్దవారిలోఁ, జీరవిడిచి తిరుగు చెడినయందు పనులుతీరువెనుక పాతలుఁగట్టును, విశ్వదాభిరామ వినుర వేమ॥

మద్యం పీత్వా సజ్జనేషు త్యక్తవస్త్ర శ్చరే న్నరః ।
సర్వనాశే జీర్ణవస్త్రధారీ స్యా ద్వేమ! నిర్ధనః ॥

తా॥ కల్లు త్రాగి కట్టు బట్టనైనఁగానక పెద్దపెద్దవారిలో సిగ్గువిడిచి త్రాగుబోతు తిరుగును. పుదకు కట్టుబట్టయైన లేక చినిగిన పాతలుకట్టి హైన్యముగ జీవించును.

179 ఓపఁగల్గుదునని యొక్కింతమినికిన, సున్నవాసికూడ నున్నజొట్టి
మూలఅంకులాగి గేలిసేయుదురయా, విశ్వదాభిరామ వినురవేమ॥

శక్తో౽హమితి వేమేహ యది మన్యేత తత్ర్పథా ।
శూన్యా భవతి ప్రాగ్దుష్టకర్శోర్మైహాట్య హాసంతి హి ॥

తా॥ నేనే సమర్థుఁడనని కొంచెము మిడిసిపడిన సున్న యాకొంచెము నౌకవముకూడ నొక మూలకుఁద్రోసిపుచ్చి మారుమూలనున్న అంకు లాగి లోకులు గేలిసేయుటకే చూతురు.

180 వానకురియకున్న వచ్చును క్షామంబు, వానకురిసెనేని వరదపాఱు
వరదకఱవు రెండు వరుస లో నెఱుఁగుండీ, విశ్వదాభిరామ వినురవేమ॥

వర్షాభావా ద్భవే త్క్షామో వర్షాధిక్యేన సంప్లవః ।
క్షామం చ సంప్లవం వేమ! క్రమా జ్జానీహి తత్త్వతః ॥

తా॥ అనావృష్టి వలన కఱవు, అతివృష్టివలన వఱద వచ్చును. కాన వానివిధమును గుర్తెఱఁగి హెచ్చుతగ్గులు కాక జాగ్రత్తగ జీవయాత్ర గడుపుము.

---

## ఆర్థిక విభాగము

181 కలిమినాఁడునరుఁడు కానఁడు మదమున, లేనినాఁడు మొదలె లేదుపెట్ట
కలిమిలేమిలేని కాలంబుఁగల్గునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

న పశ్యతి మదాద్భాగ్యే దారిద్ర్యే దాతు మేవ న ।
సంపద్దరిద్రితాబాహ్యః కాలో భవతి వేమ! కిమ్? ॥

తా॥ మానవుఁడు కలిమికలుగునాఁడు మదమునఁ బెట్టలేఁడు. లేమి నాఁడు లేక యీలేఁడు. ఇఁక కలిమి లేమి లేని కాలముండఁగలదా? వి॥ దానం పరం కిం చ ' సుపాత్రదానమ్ ॥ శం॥మణి॥

182 అరయఁ దఱచు కల్లలాడెడు వారిండ్ల, వెడలకేల లక్ష్మి విశ్రమించు?
భిన్నఘటమునీరు చన్న చందంబున, విశ్వదాభిరామ వినురవేమ॥

అనిర్గమ్య కథం వేమ! ప్రాయశోఽనృతభాషిణామ్ ।
గృహేషు విశ్రమేల్లక్ష్మీః? భిన్నకుంభే జలం యథా ॥

తా॥ పగిలిన కుండలోని నీరు క్రమమున కారిపోయినట్లు తఱచు కల్లలాడి చెడుపనులఁ జేయు వారింట లక్ష్మి జారిపోక యెట్లు విశ్రమించి యుండఁగలదు ?

183 ధనముఁగూడఁబెట్టి ధర్మంబు సేయక, తానుదినక లెస్స దాచుఁగాక
తేనె నీఁగగూర్చి తెరువరికియ్యదా?, విశ్వదాభిరామ వినురవేమ॥

స్వయం న భుక్త్వా చాదత్త్వా సంచితో త్యక్ష్యతీ ధనమ్ ।
మధు సంచిత్య సరఘా న దత్తే పథికాయ కిమ్? ॥

తా॥ తేనెను తేనెటీఁగ ప్రోగుఁజేసి బాటసారికి సమర్పణముఁ జేసినట్లు లోభి తాను దినక ధర్మముసేయక ధనము కూడబెట్టి తుదకెవరికో సమర్పించును.

184 కనలులేనివాఁడుఁ గాళ్ళుపోయినవాఁడు, ఉభయులరయఁగూడి యుండునట్లు
పేదపేదఁగూడి పెనగొనియుండును, విశ్వదాభిరామ వినురవేమ॥

అక్షిహీనోంఘ్రిహీన శ్చ యథోభౌ సహచారిణౌ ।
తథా దరిద్రా శ్చాన్యోన్యం వేమ! తిష్ఠంతి సంగతాః ॥

తా॥ గ్రుడ్డివాఁడు కుంటివాఁడు కలిసి ప్రయాణము సాగించునట్లు పేదపేదకలిసి జీవితయాత్ర సాగించవలెను.

185 పాగపచ్చడంబు పైనకూసంబును, పోగు లుంగరములు బొజ్జకడుపుఁ
గలిగినట్టివాని గందురు మస్తాలు, విశ్వదాభిరామ వినురవేమ॥

శాట్యుష్ణీషం కంచుకం చ తాటంకే చాంగుళీయకమ్ ।
యస్య లంబోదరం తం హి వేమ! కాంక్షంతి బాంధవాః ॥

తా॥ ఉంగరములు, మురుగులు మొదలగు నాభరణములు, తలపాగ మొదలగు మంచి మంచి వస్తులు బొజ్జకడుపు మొదలగు కాయపుష్టి

కలిగిన యాడంబర వ్యక్తినే బంధువు లాదరింతురు. వి॥ సర్వేగుణాః కాంచన మాశ్రియంతి॥ (భర్తృ)

186 కలిగినమనుజుండు కాముండు సోముండు,మిగులతేజమునను మెఱయుచుండు
విత్తహీనుఁడైన రిత్తయైపోవును, విశ్వదాభిరామ వినురవేమ॥

కామస్సోమో ధనీ మర్త్యః భృశం రాజతి తేజసా ।
విత్తహీనో నరో నూనం రిక్తో వేమ! ప్రవర్తతే ॥

తా॥ ధనముకలవాఁడే కాముఁడు సోముఁడు ఇంద్రుఁడుగనెన్నఁబడి పొగడఁబడును. ధనములేనివాఁ డెంతటివాఁడైనను వ్యర్థుఁడే.

187 విడువముడువలేక కుడువఁగట్టఁగ లేక, వెరవులేక విద్య నోరయులేక
వెడలలేనివాని నడుపీనుఁగందురు, విశ్వదాభిరామ వినురవేమ॥

దాతుం గోపయితుం వేమ! భోక్తుం ధర్తు మశక్నువన్ ।
అవిద్యో నిరుపాయ శ్చ గచ్ఛచ్ఛవ ఇతీర్యతే ॥

తా॥ విడువలేక ముడువలేక కూడులేక గుడ్డలేక సంపాదించు విద్యలేక విధానములేక నలుగురిలో తిరుగలేక వ్యర్థుఁడై తిరుగువానిని నడిచే పీనుఁగందురు.

188 లేనికాలమునను లేకిమనమునొందు, ఈనినపులిరీతి నెఱుఁగకుండు
కఠినబుద్ధికలుగఁ గలిమెట్లుకలుగురా?, విశ్వదాభిరామ వినురవేమ॥

దారిద్ర్యే లఘుచిత్తస్స్యాత్ సూతా వ్యాఘ్రీవ వర్తతే ।
వేమ! కర్కశచిత్తస్య కథం సంప ద్భవే దిహా? ॥

తా॥ లేమి కలుగునపుడు లేకిభావము కలుగును. ఈనిన పులివలె మంచి చెడ్డలు గుర్తించలేకుండును. ఇట్టివేళ నిట్టి చెడుబుద్ధి కలుగ కలిమెట్లు వచ్చును ? ఎట్లు నిలుచును ?

189 ప్రియములేనివిందు పిండివంటలచేటు, భక్తిలేనిపూజ పత్రిచేటు
పాత్రిమెఱుఁగనీవి బంగారుచేటురా, విశ్వదాభిరామ వినురవేమ॥

భోజనా దప్రియా ద్వేమ! భక్ష్యనష్టి రభక్తితః ।
పూజనాత్ పత్రనష్టి శ్చాపాత్రిదానా ద్ధనవ్యయః ॥

తా॥ ఆదరణలేని విందు పిండివంటలనష్టమే. భక్తిలేనిపూజ పత్రములు పుష్పములు నష్టమే. అపాత్రులకిచ్చు దానము ధననష్టమే. వి॥ నైక గ్రామీణ మతిథిం, సంగృహ్ణీత కదాచన, అనిత్యమాగతో యస్మా త్తస్మా దతిథి రుచ్యతే, బ్రాహ్మణోప్యాసధీయాన స్తృణాగ్నిరివనశ్యతి, తస్మై హవ్యం న దాతవ్యం న హి భస్మని హూయతే॥

190 పూసపోగులైన పుష్టంబు విడియంబుఁ, గాయపుష్టి మిగులఁగల్గియున్న
హీనజాతినైన నిందురమ్మందురు, విశ్వదాభిరామ వినుర వేమ॥

ఊర్మాంబరాణి తాటంకే కాయపుష్టి శ్చ వీటికా ।
యస్య సంతీహ తం హీనమపి వేమాహ్వాయంతి హి ॥

తా॥ ఎంత హీనుఁడైనను కాయపుష్టి, మంచి మంచి దుస్తులు ఆభరణములు ధరించి హుంగుగా నున్నవానిని దరికి రమ్మని యాదరింతురు.

191 మాసినతలతోడ మలినవస్త్రముతోడ, నొడలజిడ్డుతోడ నుండెనేని
అగ్రజన్ముడైన నట్టిపొమ్మందురు, విశ్వదాభిరామ వినుర వేమ॥

శిరో వస్త్రం శరీరం చ మాలిన్యకలితం యది ।
వేమాగ్రజన్మానమపి వదం త్యపసరే త్యత ॥

తా॥ మాసినతలతో మలినవస్త్రములతో మురికిశరీరముతో నున్నవాని నెంత మంచివానినైన నాదరముగా పొమ్మని తిరస్కరింతురు.

192 అప్పుఁదీయరోత హరిహరాదులకైన, మొప్పెతోడమైత్రి మొదలెరోత
తప్పుబలుకరోత తాకట్టిడుటరోత, విశ్వదాభిరామ వినుర వేమ!

ఋణాదాపం మూర్ఖమైత్రీ మృషోక్తి ర్న్యాసపవ చ ।
ఏహ్యో హరిహరాదీనాం వేమ! నైవాత్రసంశయః ॥

తా॥ ఋణముచేయుట, మూర్ఖునితో చెలిమిచేయుట, అబద్ధమాడుట, తాకట్టుపెట్టుట హరిహరాదులకైన రోతపుట్టించునవియే.

193 తనదుభార్యతల్లె దానంబుఁజేయంగఁ, దనకుఁగలదటంచు మనఁగరాదు
తనదుకాలుఁగోయఁ దనతిమ్ముఁజేద్చునా?, విశ్వదాభిరామ వినుర వేమ॥

దత్తే స్వభ్రాతృభి ర్వేమ! మమేత్యేవం న చింతయేత్ ।
కృత్తే స్వపాదే కిం దుఃఖా దాతుః బాహ్యా ।సగోగి॥ ॥

తా॥ తన కాలుకోసిన తానే యేడ్చును కాని సోదరుఁడేడ్వఁడు. అట్లే సోదరుఁడిచ్చు దానఫలితమును తనదిగా భావించుట పొరపాటు.

194 దాతకానివాని దఱుమగా వేడిన, వాఁడు దాతయౌనె వసుధలోన?
అవుస దర్భయౌనె? యబ్ధిలో ముంచిన, విశ్వదాభిరామ వినుర వేమ॥

యది యాచే దదాతారం దాతా భవతి కిం పునః? ।
నిమజ్జితం వేమ! వార్ధౌ దర్భస్స్యాత్కిం చ చీరణమ్? ॥

తా॥ ఆవురుగడ్డి యమృతసముద్రమున ముంచినను పవిత్రమగు దర్భ కానేరదు. అట్లే యర్థి పలుసార్లర్థించినను లోభి దాత కానేరఁడు.

195 దొడ్డవారమనుచు దొంకలుకట్టి, అడ్డమైనజనుల నంటఁగట్టి
దోచుకొన్న నట్టిదోష మెటుపోవు?, విశ్వదాభిరామ వినుర వేమ॥

అధికోఽస్మ్యహ మిత్యుక్త్వా మూర్ఖం గుల్మైర్నిరోధయన్ ।
పాంథా న్నిహన్య ద్రవ్యాహృతి స్యాద్వేమ! దోషభాక్ ॥

తా॥ గొప్పవారలమని కొంపలు దారులడ్డముఁగొట్టి జనుల దోచుకొందురు. ఎంత గొప్పవారలైన నట్టి దోషము వారిని కష్టములపాలు సేయక నెచటికైన పోవునా ?

196 ఎంత సేవఁజేసి యేపాటుఁబడినను, రాచమూకనమ్మరాదు రన్న!
పాముతోటిపొందు పదివేలకైనను, విశ్వదాభిరామ వినుర వేమ॥

సేవాం కృత్వా చ బహుధా ప్రభ్వాదిం రాజమండలమ్ ।
న విశ్వసే ద్వేమ! సర్పమైత్రీ స్యాత్తత్సహస్రశః ॥

తా॥ ఎంత సేవఁజేసి యేపాటుపడినను ప్రభువుల నమ్మరాదు అధికారిని సేవకుఁడు నమ్ముట క్రూరసర్పమును నమ్ముటవంటిదే కాఁగలదు.

వి॥ పితరశ్చకే వా ? పరిపాలకా యే। 2 కో వాతిబంధుశ్చ? విపత్సు హాయః శo॥మణి॥

197 వెఱ్ఱిమొద్దుకేల వేదశాస్త్రంబులు?, ముద్దరాలికేల ముసలిమగఁడు?
చలిదిమిగులనింట సంసారమేలరా?, విశ్వదాభిరామ వినుర వేమ॥

జడస్య శాస్త్రైః కిం? వృద్ధభర్త్రా కిం తరుణీమనోః?।
యద్గేహే నాస్తి శీతాన్నం తత్సంసారేణ వేమ! కిమ్? ॥

తా॥ వేదశాస్త్రములు వెట్టిమొద్దుల కెట్లు సంతృప్తిని కలిగించలేవో, ముద్దరాలికి ముసలిమగఁడెట్లు సంతృప్తిని కలిగించలేఁడో అట్లే చలిది యన్నము మిగులని లేమి సంసారమును సంసారికి తృప్తిని కలిగించలేదు; కాని సంతృప్తిని భాగ్యముగా తలపోయువానివలె భాగ్యముతో సంతృప్తినిపొందఁదలచినవాఁడు సుఖపడలేఁడు.

198 మొదటనాసఁబెట్టి తుదలేదుపొమ్మను, పరమలోభులైన పాపులిలను
వారియుసురుఁదాకి వగఁజెడిపోదురు, విశ్వదాభిరామ వినురవేమ॥

కృత్వాశాకలితా నాదావంతే నాస్తీతి వాదినః ।
లుబ్ధాన్ దుష్కృతినో వేమ! తేషాం నాశయతి వ్యథా ॥

తా॥ మొదటనాసఁబెట్టి తుదకు లేదుపొమ్మను పాపులగు లోభులు, అట్టి యర్థుల యుసురుదాకి సమూలముగ నాశనముకారా?

199 బడుగుచెలుఁగలేని ప్రాభవంబదియేల?, ప్రోదిఁయుడని బంధుభూతియేల?
వ్యాధిదెలియలేని వైద్యుఁడు మతియేల?, విశ్వదాభిరామ వినురవేమ॥

దీనానభిజ్ఞ భూత్యా కిం? కిము నాశ్రియబంధునా? ।
వేమ! వ్యాధ్యనభిజ్ఞేన వైద్యేనాపి చ కిం ఫలమ్? ॥

తా॥ వ్యాధి సంగతి తెలియని వైద్యుఁడెందుకు? కావలసినవాని కష్టము గుర్తించని బంధువుల సంపద యెందుకు? అట్లే దీనుని యవస్థ గుర్తించనేరని గొప్పఁదనమెందుకు?

200 తనదుదానమవనిఁ దనకూతుసమంబు, తండ్రిదానమెల్లఁ దనతోఁడు
అన్యులిచ్చుదాన మదితల్లివంటిది, విశ్వదాభిరామ వినురవేమ॥

స్వస్య దానం సుతాతుల్యం పితుశ్చ భగినీసమమ్ ।
అన్యేషాం వేమ! యద్దానం తన్మాతృసదృశం భవేత్ ॥

తా॥ తానుచేయుదానము తన కూతురుతోను, తండ్రిచేయుదానము తన తోఁబుట్టినదానితోను, ఇతరులిచ్చు దానము తన తల్లితోను సమానము.

201 ఒడ్డుపొడుగుగల్గి గడ్డంబుఁబొడుగైన, దానగుణములేక దాతయగునె?
ఎనుము గొప్పదైన నేనుఁగుఁబోలునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

దైర్ఘ్యస్థౌల్యయుతాంగోఽపి వేమో చ్ఛ్మశ్రుక్రుశువానపి।
న దాతా దాతృతాహీనః నేభోహి ఘనకాసరః ॥

తా॥ ఒడ్డు, పొడుగు, గడ్డము, మీసము కలిగి యాడంబరముగ నున్నంతమాత్రమున దానగుణములేక దాత కానేరఁడు. దున్నపోతు ఎంత గొప్పదైనను పనుగుతో సమానము కాఁగలదా ?

202 కులముఁగలుగువారు గోత్రంబుఁగలవారు, విద్యచేత విఱ్ఱవీగువారు
పసిడికలుగువాని బానిసకొడుకులు, విశ్వదాభిరామ వినురవేమ॥

కులవంతో గోత్రవంతో విద్యావంత శ్చ సర్వశః।
వేమాస్తి కాంచనం యస్య తస్య దాసీసుతాః ఖలు ॥

తా॥ మంచి కులము కలిగిన, మంచి గోత్రము కలిగిన మంచి విద్య కలిగిన విఱ్ఱవీగుటతప్ప యందఱును ధనముగలవాని దాసీపుత్రులే.

203 కులములేనివాఁడు కలిమిచే వెలయును, కలిమిలేనివాని కులముదిగును
కులముకన్న మిగులఁ గలిమిప్రధానంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

ధనేన నిష్కులో భాతి నిస్స్వస్తు ఛియతే కులమ్।
వేమాత్ర్యంతం కులాన్ముఖ్యా సంపదేవ సహస్రశః ॥

తా॥ మంచి కులము కలిగినను కలిమి లేనియెడల కులము విలువ తగ్గును. మంచి కులము కాకున్నను కలిమి కలిగిన రాణించును. ఆలోచింప కులముకన్నను కలిమియే ప్రధానముగఁ గన్పించుచున్నది.

204 నెయ్యిలేనికూడు నీయాన కసవది, కూరలేనితిండి కుక్కతిండి
ప్రియములేనికూడు పిండంపుఁగూడురా, విశ్వదాభిరామ వినురవేమ॥

తృణం స్యాత్ ఘృతహీనాన్నం శాకహీనం శ్వభోజనమ్।
ప్రీత్యా విరహితం చాన్నం పిండాన్నం వేమ! కథ్యతే॥

తా॥ నెయ్యిలేని భోజనము గడ్డితోసమానము. కూరలేనితిండి కుక్కతిండితో సమానము. అట్లే ప్రీతిలేని కూఁడు పిండపుకూటితో సమానము.

205 అల్పుఁడైనవాని కధికారమిచ్చినా, దొడ్డకొంచెమనక తూలఁబల్కు
చెప్పుఁగొఱుకుకుక్క చెఱకుతీపెఱుఁగునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

స్యాచ్ఛే దల్పస్యాధికారః సాధ్వసాధ్వపి నిందతి ।
కిమిక్షోర్మాధురం వేత్తి? వేమ! శ్వా చర్మభక్షకః ॥

తా॥ చెప్పును కొఱుకుచుండు కుక్క చెఱకుతీపి నెఱుఁగనట్లు అల్పున కధికార మబ్బ, గొప్ప కొలది యనక యందఱిని తూలఁబల్కును.

206 దానమడుగువాఁడు ధరలోన నధముండు, దానమడుగఁడేని దైవసముఁడు
దానమీనివాఁడు ధన్యుండు కాఁడయా, విశ్వదాభిరామ వినురవేమ॥

యాచమానోఽధమో భూమౌ దైవతుల్యోహ్యయాచకః।
యో న దత్తే యాచితోఽపి వేమాఽధన్య స్స ఏవ హి॥

తా॥ దానమడుగు దరిద్రుఁ డధముఁడు. దానమడుగనివాఁడు దైవముతో సమానుఁడు. దానమడిగినను నీఁగలిగి యుండియు నీఁజాలనివాఁడు పరమ దరిద్రుఁడు. వి॥ మనసిచ పరితుష్టే కోర్థవాన్ కోదరిద్రః?

207 పెక్కుజనులఁజంపి పేదలవధియించి, డొక్కకొఱకు నూళ్ళు దొంగిలించి
ఎక్కడికిఁ రిగినను నెఱిఁగి యముఁడుఁజంపు, విశ్వదాభిరామ వినురవేమ॥

హత్వా బహూన్ జనాన్ దీనాన్ చోరయిత్వా పురాణ్యపి।
యత్ర కుత్ర గతం జ్ఞాత్వా వేమ! హంత్యంతకో ధ్రువమ్॥

తా॥ పేదల హింసించిన, డొక్కకొఱకు నూళ్లు దొంగిలించిన నట్టివారెక్కడకరిగినను యముఁడు పట్టి హింసించకుండునా?

208 ధనములేకయున్న ధైర్యంబు నిలువదు, ధైర్యమొదవదేని ధనములేదు
ధనముధైర్యమరయఁ దగు భూమిపతులకు, విశ్వదాభిరామ వినురవేమ॥

యది నాస్తి ధనం వేమ! ధైర్యం కించి న్న తిష్ఠతి।
యద్యస్తి ధైర్యం న ధనం ధనధైర్యే నృపోచితే॥

తా॥ ధనము లేకయున్న ధైర్యము నిలువదు. ధైర్యము లేనియెడల ధనముండదు. ప్రభువునకు ధనమును, ధైర్యమును కూడ నవసరములే.

209 కలిమిగల్గనేమి? కరుణ లేకుండెనా?, కలిమియేలనిల్చు కర్ములకును?
తేనెఁగూర్చి యీఁగ తెరువునఁబోవదా?, విశ్వదాభిరామ వినురవేమ॥

సంపదా కిం నిష్కృపస్య? కథం శ్రీ ర్భాతి కర్మిణామ్?।
మధు సంచిత్య సరఘా వేమ! యాతి స్వవర్త్మనా॥

తా॥ కలిమి కలిగినను కరుణలేని కఠినాత్ములకు కలిమెట్లు నిలువఁ గలదు? తేనెటీగ తేనెనుగూర్చి తనదారిని తాను పోయినట్లే కాగలదు.

210 కుక్క గోవు కాదు కుందేలు పులి కాదు, దోమ గజము కాదు దొడ్డదైన
లోభి దాత కాఁడు లోకంబులోపల, విశ్వదాభిరామ వినుర వేమ॥

మహానపి న గౌశ్శ్వా స్యాత్ న వ్యాఘ్రో శశక స్తథా।
న గజో మశకో వేమ! న దాతా లుబ్ధఏవ చ॥

తా॥ దొడ్డదైనమాత్రమున కుక్క గోవుకాదు, దోమ యేనుఁగుకాదు. అట్లే లోభియు దాత కానేరఁడు.

211 తన్నుఁజూచి యొరులు తగ మెచ్చవలెనని, సొమ్ములెలమిఁబెట్టు నెమ్మి మీఱ
ఒరులకొఱకె తాను నుబ్బుచునుండును, విశ్వదాభిరామ వినుర వేమ॥

దృష్ట్వాత్మానం పరే వేమ! శ్లాఘేర న్నితి చింతయన్।
భూషణాని స్వయం ధత్తే పరేభ్యో హి విజృంభతే॥

తా॥ లోభి తన్నుఁజూచి యొరులు మెచ్చుకొనవలెనని యే సొమ్ములు ధరించి యితరుల కొఱకే తా నుబ్బుచుండును.

212 అన్న మరుగనతని కన్నంబుఁ బెట్టినఁ, బాఱవేయు దానఫలిత మేమి?
ధనికునకు నొసంగు దానము లట్లుండు, విశ్వదాభిరామ వినుర వేమ॥

అజీర్ణకుక్షి ర్దత్తాన్నం వర్జయే ద్వేమ! కిం ఫలమ్?।
ధనికాయ ప్రదత్తాని దానా న్యేతాదృశాని హి॥

తా॥ అన్న మరుగనతని కన్నంబుఁ బెట్టినఁబాఱవేయును. దానివలన ఫలిత మేమి? అట్లే ధనికునకునొసంగుదానమును నిష్ప్రయోజనమైనదే.

213 ఆకలన్నవాని కన్నంబుఁబెట్టిన, హరునికర్పితముగ నారగించు
ధనవిహీనున కిడు దానము లిట్లుండు, విశ్వదాభిరామ వినుర వేమ॥

దత్తమన్నం క్షుధార్తో హి భుక్తే కృష్ణై వార్పితం యథా।
విత్తహీనాయ దత్తాని వేమ! దానాన్యహో తథా॥

తా॥ ఆకలన్నవాని కన్నంబుఁ బెట్టిన పరమేశ్వరార్పణమస్తు, అని సంతృప్తిగ భుజించును. దరిద్రున కిచ్చుదాన మిట్లు ప్ర

214 కలిగి పెట్టలేని కర్మజీవులకెల్ల, తిరిపెమును దొరకదు దీనులార!
తెలియఁజూచుకొనుఁడు దృష్టాంతమిది మీకు, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ ! స్వయ ుదాత్మ్యాణాం ధనినాం కర్మజీవినామ్।
భిక్షాపి న భవే నాః ! దృష్టాంతం సాధు పశ్యత॥

తా॥ కలిగియుఁబెట్టలేని కఠినాత్ముల కొకవేళ దారిద్ర్యము వచ్చిన బిచ్చమెత్తుకొన్నను బిచ్చనుకూడ దొరుకదు. దృష్టాంతముఁజూడుఁడు.

315 తిరిపెగాఁడయినను తిరిపెమెత్తి వయస్త్రీ, తిరిపెమందుఁ దాను దిరిపెమిడినఁ
దిరిపెము దిరిపెమున దిగబడిపోవురా, విశ్వదాభిరామ వినురవేమ॥

భిక్షు ర్భిక్షాం సమాహృత్య తస్యాం భిక్షాం దదాతిచేత్ ।
భిక్షాదోషం హరేద్వేమ ! భిక్షాదానం సమంతతః॥

తా॥ బిచ్చమెత్తుకొనువాఁడైనను తనకు దొరికిన బిచ్చమునఁ గొంత బిచ్చమిడిన తాను బిచ్చమెత్తుకొను దోషము తఱిగిపోఁగలదు

216 తాముబలిమిఁబెట్టఁ దమకుఁదా మేకల్గు, నడుగనిడినఁ దాము నడుగఁగల్గు
ఇందునీనివాని కెందునుగల్గదు, విశ్వదాభిరామవినురవేమ॥

వేమ ! విత్తేబలాద్దత్తే స్వయమేతి తదార్థినే।
దత్తేఽర్థినే భవేత్స్వస్మై నేహాదాతు శ్చ కుత్రచిత్॥

తా॥ తామితరులకు బలాత్కారముగఁబెట్టినఁ దమకు వద్దనుకొన్నను లభ్యముకాఁగలదు. అడిగినఁ బెట్టినఁ దా మడిగిననే లభ్యమగును. ఇఁక నిందీనివాని కెందును లభ్యముకాదు.

217 తాముగడనఁజేయు ధనము తమదియంచు, నమ్మియుంద్రు వెఱ్ఱినరులు భువిని.
తామొకరికినిచ్చు దానంబె తమదియా, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమేహా స్వార్జితం విత్తం ఆత్మీయమితి బాలిశాః।
మన్యంతే నూన మన్యేభ్యో దత్తం విత్తం స్వకం భవేత్॥

తా॥ తాము సంపాదించుకొనిన ధనమే తమదియని మూఢులు నమ్మి యుందురు. కాని వాస్తవమునకు తా మొకరికిచ్చు దానమే తమది.

218 అర్థవంతుసొమ్ము నాసించు రర్థుల, య్యర్థికీనిసొమ్ము వ్యర్థమె సుమి
వ్యర్థమైనసొమ్ము వ్యర్థులఁజేరురా, విశ్వదాభిరామ వినురవేమ॥

అర్థాఢ్యస్య ధనం వేమ ! కాంక్షంతే భృశ మర్థినః।
అ దత్త మర్థినే వ్యర్థం వ్యర్థానేతి వృథా ధనమ్॥

తా॥ ధనము గలవాని ధనము నర్థులాశించుట సహజము. అట్టి యర్థులకీని ధనము వ్యర్థము. అట్టి వ్యర్థమైన ధనమెవరినో వ్యర్థులఁ జేరును.

219 కలిగి ధర్మమీయఁగానివారును, కలిగితినకచాలఁ గాగువారు
కలిమి నెచటఁజూడఁ గానక చెడుదురు, విశ్వదాభిరామ వినురవేమ॥

న దాస్యంతి న భుంజంతి పైశున్యా ద్ధనినో యది।
అపశ్యం త శ్శ్రియం వేమ ! నశ్య న్త్యు త్తరజన్మసు॥

తా॥ కలిగియు ధర్మము చేయనివారును, తామనుభవింపనివారును తుదకుఁ గలిమి నెచటను గాంచలేక నశింతురు.

220 ధనములేమియను నెడు దావానలంబిలఁ, దన్నుఁజెఱుచును దరిదాపుఁజెఱుచు
ధనములేమిఁ జూడఁ దలఁచనే పాపంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ ! దారిద్ర్యదావాగ్ని రాత్మప్రాంతీయనాశకః।
నిర్ధనత్వే సకృద్దృష్టే స్మృతే చా ప్యఘకారణమ్॥

తా॥ దరిద్రమను దావానలము తన్నును తన దరిదాపును గూడ పాడుచేయును. అట్టి దరిద్రమును దలఁచుకొనిననే పాపముసంభవించును.

221 మాటలాడనేర్చి మనసుఁగరుగఁజేసి, పరఁగఁ బ్రియముఁబుట్టఁ బలుకకున్న
నొకరిచేతిసొమ్ము లూరకవచ్చునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

ఆలాపచతురో వేమ ! ద్రవీకృత్య భృశం మనః ।
యది ప్రీతిం నజనయేత్ పరద్రవ్యం లభేతకిమ్ ? ॥

తా॥ మాటలాడుటనేర్చి మనస్సుకరుగులాగునఁజేసి ప్రీతిపుట్టులాగున బలుకకున్న నొకరిచేతిలోనిసొమ్ములు మఱియొకరి కెట్లురాఁగలవు ?

222 అరుదుగానడిగిన నతఁడర్థికాఁబోఁడు, తఱచుగానొసఁగక దాతకాఁడు
దాతకర్థికింత తారతమ్యముఁగల్గు, విశ్వదాభిరామ వినురవేమ॥

సకృదర్థీ భవేన్నార్థీ న దాతా స్యా దనేకదః ।
వేమారినశ్చ దాతు శ్చ తారతామ్యమపీద్నశమ్ ॥

తా॥ ఏదోయొకసారి తప్పనిసరిగా ప్రమాదావస్థలో నడిగినంత మాత్రమున నతఁడర్థియుఁగాఁబోఁడు. అట్లే యేదోయొకసారి యిచ్చినంత మాత్రమున దాతయుఁగాఁబోఁడు వి॥ లఘుత్వమూలం చ కిమర్థిత్వ 2 గురుత్వమూలం య దయాచనం చ॥ శం॥ మణి॥

223 పరఁగఁదా నొసఁగక పరులుచెప్పినదైన, నీకఁజాలక భ్రమియించు నెపుడు
పొట్టఁదినెడిలోభి బువ్వలుపెట్టునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

న దదాతి స్వయం చాన్యైరుక్తంచాపి న యచ్ఛతి।
వేమ! మూఢ స్తుషాభోజీ లుబ్ధ స్త్వన్నం దదాతి కిమ్?॥

తా॥ ఊక మేయు లోభి యితరునకు బువ్వలుపెట్టునా? అట్టివాఁడు తనంతటతానుకాని యితరులుచెప్పినకాని యీఁజాలక యేవేవియో భ్రమలలో మునిగియుండును.

224 ధనములేమి సుతులుదప్పులనిడుదురు, ధనములేమి పత్ని తాకనీదు
ధనములే మెవరికిఁ దాళికైయుండదు, విశ్వదాభిరామ వినురవేమ॥

నిందంతి నిర్ధనం పుత్రాః న స్పర్శం సహతేఽంగనా।
వేమాహో! ధనరాహిత్యం సర్వస్యాపి సుదుస్సహమ్॥

తా॥ ధనములేకపోయిన సుతులుసైతము నేవేవియో నేరము లారోపింతురు. భార్యముట్టుకొననీదు. కాన దారిద్ర్యము స్థాయికుదురనీదు.

225 పచ్చఁజూచువారుఁ బచ్చమెచ్చెడువారు, పచ్చమీఁద వాంఛ పడెడువారు
పచ్చవిడుచువానిఁ బ్రభువుఁగాఁజూతురు, విశ్వదాభిరామ వినురవేమ॥

కాంచనం వేమ! పశ్యంతః ప్రశంసంత శ్చ సర్వదా।
వాంఛంత శ్చేహ పశ్యంతి ప్రభుం సంత్యక్తకాంచనమ్॥

తా॥ ధనమునేచూచుకొనువారు (హిరణ్యాతులు) ధనమునే మెచ్చుకొనువారు, ధనముమీఁదనే కాంక్షగలవారు ధనమిచ్చువానినే దేవునిగ భావింతురు.

226 కులత నడవినుంచి మృగమువెంటనుబోవు, రామచంద్రుఁకన్న రసికుఁడేడి
చేటుకాలమునకుఁ జెడుబుద్ధిపుట్టును, విశ్వదాభిరామ వినురవేమ॥

కాంతా మరణ్యే విన్యస్య చానుసృత్య మృగం గతః ।
శ్రీరామః కిం న రసికః ? నాశకాలే హ్యాసన్మతిః ॥

తా॥ చక్కనైన తనభార్యను బంగారపు లేడికొఱకు భ్రమించి యడవిలో నొంటరిగావిడిచివెళ్ళిన రామచంద్రునకంటె తెలివెనవాఁడు కలఁడా ? వి॥ వినాశకాలే విపరీతబుద్ధిః 2 బుద్ధిఃకర్మానుసారిణీ॥

127 లంకపోవువాఁడు లంకాధిపతిరాజ్య, మంత కీశసేన లాక్రమించె
చేటుకాలమైనఁ జెఱుప నల్పుఁడేచాలు, విశ్వదాభిరామ వినుర వేమ॥

లంకావినాశసమయే రాజ్యం లంకాపతేర్ఘనమ్ ।
ప్లవంగసేనాచక్రామ నాశాయాల్పోఽల మాపది ॥

తా॥ లంకాధిపతిరాజ్యము నాశనముకాఁగల కాలమాసన్నమగుసరికి ల్లకోతులాక్రమించఁ గలిగినవి. చెడుకాలమునకు నల్పుఁడే చాలును.

128 రామవిభుఁడుపుట్టి రఘుకులం బలరించె, కురువిభుండుపుట్టి కులముఁ జెఱచె
ఎవరికుంచిచెడ్డ లెంచిచూచినఁదేలు, విశ్వదాభిరామ వినుర వేమ॥

జాతోరామో వేమ! చక్రే కులవృద్ధిం సుయోధనః ।
కులాంతం చ స్పష్టమేవం సాధ్వసాధు వివేచనాత్ ॥

తా॥ రాముఁడుపుట్టి రఘువంశమునకు వన్నెఁదెచ్చెను. దుర్యోధనుఁడు పుట్టి కౌరవవంశమును నాశనముఁ గావించెను. ఎవఁడెట్టివాఁడో మంచి, చెడ్డ, క్రియలఁబట్టి తెలియును.

129 శుద్ధదృష్టిఁ దెలిసి శుక్రునంతటివాఁడు, పట్టలేక మనసు పాఱవిడిచి
కన్ను పోయి తుదకుఁ గాకిచందంబాయె, విశ్వదాభిరామ వినుర వేమ॥

శుద్ధదృష్టిం వినా వేమ ! మహాన్ శుక్రోఽపి ముగ్ధధీః ।
మనో విసృజ్య చాశక్తః కాణోఽభూ త్కాకవ త్పురా ॥

తా॥ మంచిదృష్టిగల శుక్రునంతటివాఁడు కూడ మనసునిల్పుకొనలేక జారవిడిచి కాకివలె నేకాక్షియయ్యెను.

130 దేశదేశములను గాసిలితిరుగంగ, నాత్మయందు ధ్యాన మంటుకొనునె?
కాసులకునుదిరుగఁ గలుగునా మోక్షంబు?, విశ్వదాభిరామ వినుర వేమ॥

ద్రాఘ్దేశాటన మాత్రేణ ధ్యానమాత్మని కిం భవేత్?।
యా ద్రవ్యార్థ మటే ద్వేమ! తస్య ముక్తిర్భవేత్కథమ్?॥

తా॥ దేశదేశాలు కష్టములకులోనయి కాసులకొఱకే తిరిగిన నాత్మ యందు పరమాత్మ ధ్యాన మంటుకొనునా? మోక్ష మబ్బునా?

231 కన్నెమీఁదనాశ కనకంబుపైనాశ, లేనివాఁడు పుడమిలేనివాఁడు
కలిగెనేనినతఁడు గానంగరాఁడయా, విశ్వదాభిరామ వినురవేమ॥

కాంతాయాం కనకే యస్య న తృష్ణా భువి నాస్తి సః।
యద్యస్తి వేమ! తత్త్వజ్ఞః స కదాపి న దృశ్యతే॥

తా॥ కాంతాకనకములపై నాశలేనివాఁడీ లోకమున లేనివాఁడే. ఒకవేళనున్నను వానికీలోకముతోఁబనియేమి? అందువలనఁగనుపించఁడు.

232 ఖరము మేనినిండ గంధంబుఁబూసిన, బూదిలోనఁబడుచుఁ బొర్లమరల
మోటువారిసొగసుఁబోలు నియ్యదిసుమీ, విశ్వదాభిరామ వినురవేమ॥

లిప్తేఽంగే చందనేనాపి ఖరో భస్మని లుంఠతి।
అనాగరికమర్త్యానా మీదృశీ వేమ! వైఖరీ॥

తా॥ గాడిద శరీరమునిండ పరిమళ ద్రవ్యముఁ బూసినను నది మరల బూడిదలోనే దొర్లును. అట్లే నీచున కెంతగా నీతుల బోధించినను వక్ర మార్గమును మాత్రము విడువఁడు.

233 గ్రాసమింతలేక కడుకష్టపడుచున్న, విద్యయేలనిల్చు వెడలుగాని?
పచ్చికుండ నీళ్ళు పట్టిననిల్చునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

యదీహ గ్రాసహైన్యేన పద్యంతే వేమ! పండితాః।
తర్హి విద్యా కథం తిష్ఠే? దామకుంభే జలం యథా॥

తా॥ పచ్చికుండలో నీళ్లు నిలువనట్లు గ్రాసమునకులేక కష్టములఁబడు చున్న విద్యకూడ నిలువదు. శోభించదు.

234 దానమరసిచేయు దాతదగ్గఱఁజేరి, వక్రభాషణములఁ బలుకు మొఱకు
చందనతరువందు సర్పముండినరీతి, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ! సంచింత్య పాత్రత్వం దాతుస్సనిధ మాశ్రితః।
దుర్వచః కురుతే మూర్ఖో యథాహి శ్చందనద్రుమే॥

తా॥ మంచిగంధపు చెట్టునకు పాము చుట్టుకొన్నట్టు దానముచేయు దాతదగ్గఱకుఁజేరి మూర్ఖుఁడు వంకరమాటలఁ బలుకుచునే యుండును.

235 పైరునిడినవాని ఫలమదిసఫలంబు, పైరునిడనివాఁడు ఫలముఁగనునె?
పైరునిడినవాఁడె బహుసౌఖ్యవంతుఁడౌ, విశ్వదాభిరామ వినురవేమ॥

సస్యోత్పాదీ ఫలం భుఙ్క్తే తథా వేమేహ నేతరః ।
సస్యోత్పాదక ఏవేహ బహుధా సౌఖ్యవాన్ భవేత్ ॥

తా॥ పైరువేసికొన్న ఫలితము లభించును కాని పైరువేసికొనకున్న ఫలితము లభించునా? వి॥ కృషితో నాస్తి దుర్భిక్షమ్॥

236 కనకమృగము భువిని కలుగులేదనకను, తరుణివిడిచిపోయె దాశరథియు
దైవమైన ధనముఁగలఁచుచుండునుకాదె?, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ! హేమమృగోఽభూవావ స్తినాస్తి త్యచింతయన్ ।
త్యక్త్వా పత్నీం గతో రామో దేవోఽపి ధన మిచ్ఛతి ॥

తా॥ 'బంగారపు లేడి యుండునా?', అను నాలోచనయైన లేక ప్రేమాస్పదురాలగు భార్యను నొంటిగ విడిచి బంగారపులేడి నాసించి శ్రీరామచంద్రుఁడు వెళ్ళెను. దైవమునకయిన ధనమునిన నంత యాశ కాఁబోలు!

237 కనకమున్నవాఁడు కాముఁడు భీముఁడై, మిగులతేజమునను మెఱయుచుండు
విత్తహీనుఁడైన వెల్తులలోనేటు, విశ్వదాభిరామ వినురవేమ ॥

వేమేహ హేమ యస్యాస్తి సకామో భీమ ఏవ చ ।
విరాజతేఽతితేజస్వీ సర్వభాగ్తో హి నిర్ధనః ॥

తా॥ ధనమున్నవాఁడే కాముఁడు భీముఁడు ఇంద్రుఁడు చంద్రుఁడునై శోభిల్లును. ధనము లేనివాఁడు తెలివితక్కువవారిలో మఱియుఁ దెలివి తక్కువవాఁడై కళావిహీనుఁడగును.

238 కనకపర్వతమునఁ గాపురంబుండిన, ననిమిషేశ్వరునకు నాసపోదు
కనకకుండలములు కర్ణనినదుఁగఁదే?, విశ్వదాభిరామ వినురవేమ॥

ఇంద్రస్య వాసో హేమాద్రౌ తథాప్యాశా న శామ్యతి ।
కిం నార్థయామాస? వేమ! కర్ణం కనకకుండలే ॥

తా॥ బంగారపు పర్వతమగు మేరుపర్వతమునఁ గాపురముండినను దేవేంద్రునకు బంగారముపై నాశపోలేదుకాబోలు! బంగారముపై నాశ పోయిన కర్ణుని కనకకుండలముల నెందుకు యాచించును ?

239 కర్ణుఁడొకఁడే కాని ఘనుఁడెవ్వఁడును లేఁడే?, దానశీలుఁడనుచుఁ దలఁపఁబడఁగఁ
దలప ధనము కర్ణు దాతఁ గాఁ జేసెను, విశ్వదాభిరామ వినురవేమ॥

ఏకఏవహి కర్ణస్స్యాత్ ఘనః కిం వేమ! నేతరః।
దానశీలఇతి ఖ్యాతో దాతారం కురుతే ధనమ్॥

తా॥ దానకర్ణుఁడనుపేరు కర్ణున కొక్కనికి మాత్రమే యెందులకు వచ్చెను ? అట్టి ఘనులు మఱిలేరా ? ఎవరిసొమ్మయిననేమి ? ధనముచేతికి కావలసినంత చిక్కుటయే కర్ణుఁడు దాతయగుటకుఁ గారణము.

240 కలిమికలుగ సకలకులములకెక్కువ, కలిమి భోగభాగ్యములకు నెలవు
కలిమిలేనివాని కులమేమికులమయా, విశ్వదాభిరామ వినురవేమ॥

కులీనో ధనవానేవ ధనం సర్వార్థసాధనమ్।
యస్య నాస్తి ధనం వేమ! కులం తస్య తు నిష్ఫలమ్॥

తా॥ కలిమి కలుగుటయే సకలకులములకునెక్కువ. కలిమియే సకల సౌభాగ్యములకును నెలవు. కలిమిలేనివాని కులమునకు విలువలేదు.

241 తనకుబంధువనుచుఁ దానెతోడ్కొనివచ్చి, కలిమిఁగలయఁజూచి కాంక్షఁబడుచు
దక్షిణలనొసంగి తనయ నీయఁగఁజూచు, విశ్వదాభిరామ వినురవేమ॥

ఆత్మబంధురితిస్నేహో దానీయ ధనినం స్వయమ్।
సదక్షిణం దదాత్యస్మై కన్యాం వేమ! స్వలంకృతామ్॥

తా॥ ధనముఁ గలవాఁడు తనకు ముఖ్య బంధువని కలిమి కాసించుచు కుమార్తెనుదెచ్చి దక్షిణల నొసంగి వాఁడెట్టివాఁడైనను సంతోషముతో కన్యాదానముఁ గావించును.

242 తల్లికొడుకులకును దగవును బుట్టించు, ధనముసుఖముఁగూర్పదని పచింత్రు
కాని గడనలేక గడుచుటయెట్లురా, విశ్వదాభిరామ వినురవేమ॥

సుఖావ ది ధనం న స్యాత్ మాతాపుత్రవిరోధకృత్।
తథాప్యాహో! కథం వేమ! జీవనం చార్జనం వినా॥

తా॥ తల్లికొడుకులమధ్య తగువును బుట్టించు ధనము కూడబెట్టుట మహాపాతకమందురు. కాని ధనమును దానిగడనయులేక కాల మెట్లు గడువఁగలదు? వి॥ ధన మార్జయ కాకుత్స్థ! ధనమూల మిదం జగత్, అంతరం నాభిజానామి నిర్ధనస్య మృతస్య చ॥

248 తరుణి సుతులు ధనము ధాన్యముల్ సంపద, లెంతచుట్టుకొనిన నంతచేటు
పసిరికాయపురుగుపద్ధతి కానంగ, విశ్వదాభిరామ వినురవేమ॥

దారాపత్యార్థధాన్యాది సంపద్వ్యాప్నోతి యావతీ।
కార్పాసకీటకస్యేవ వ్యథా వేమాస్య తావతీ॥

తా॥ పసిరికాయ పురుగు పద్ధతిగా భార్య, పిల్లలు, ధనము, ధాన్యములు, సంపదలు వీనియందలి మమకారము, భ్రమ, యెంతగా చుట్టుకొనిన నంతగా చెఱుపు కలుగఁగలదు. సంపద, అవివేకికి నుపచర్యఁజేయును. మూఢుని భుజములపై కెక్కి స్వారిచేయును.

244 పాలసాగరమునఁ బవ్వళించిన హరి గొల్లపల్లెఁ బాలుఁగోరనగునె?
ఎదుటివారిద్రవ్య మెల్లవారికిఁదీపె, విశ్వదాభిరామ వినుగవేమ॥

య శ్శేతే క్షీరపాథోధౌ స హరి ర్వ్రజవేశ్మసు।
క్షీరం హి చకమే వేమ! సర్వే పరధనార్థినః॥

తా॥ పాలసముద్రమున నివసించు శ్రీహరి గొల్లపల్లెలో పాలనుగోరి యపహరింప వచ్చునా? దేవునికేమి? మఱియొకనికేమి? ఎదుటివారి ద్రవ్యమెల్ల వారికిఁ దీపేకాబోలు!

245 పుత్త్రడికలవాని పుండుబాధయుఁగూడ, వసుధలోనఁజాల వార్త కెక్కు
పేదవానియింటఁ బెండ్లైన నెఱుఁగరు, విశ్వదాభిరామ వినురవేమ॥

ధనినో వ్రణబాధాపి బహుధా వేమ! వర్ణ్యతే।
దరిద్రస్య గృహేప్యత్రో వివాహోఽపి న వేద్యతే॥

తా॥ పేదవానికి పెద్దయెత్తున పెండ్లియైనను నెవరికిని తెలియఁబడఁజాలదు. ధనవంతుని రేయే చిన్న కురుపు పొక్కు స్వల్పబాధయైనను వార్తా పత్రికలకెక్కి యందఱికిని తడుణమే తెలియఁబడఁగలదు.

246 గండికోటలోనఁ గత్తిపట్టినయంత, రాజుగారి దొడ్డరాతుకాఁడు
ఎంతవారికైన నెత్తినఁగొట్టునా?, విశ్వదాభిరామ వినురవేమ॥
గండికోటే నరో వేమ ! ఖడ్గధారణమాత్రతః
న స్యాద్రాజభటశ్శ్రేష్ఠః తాన్ కిం హం త్యభిముఖాన్ యుధి ? ॥

తా॥ గండికోటలోఁ గత్తిపట్టుకొన్న మాత్రమున రాజు ప్రాపకము గలుగుటచే దొడ్డయోధుఁడు కాఁగలఁడా? ఎంత వారికైన నెత్తినిగొట్టునా?

247 పెట్టెడుపతి వెంట పెట్టని లోభున్నఁ, దిట్టితిట్టి తిరుగఁగొట్టుచుండు
పండ్లచెట్టుక్రింద ముండ్లకంపలువోలె, విశ్వదాభిరామ వినురవేమ॥
దాతుః పత్యు ర్వేమ ! పార్శ్వే య ద్యదాతా వసే త్ఖలః ।
నివ ర్తయే ద్గ్రాసయిత్వా ఫలద్రౌ కంటకా ఇవ ॥

తా॥ పండ్లచెట్టుక్రింద ముండ్లకంపలున్నట్లు పెట్టెడు ప్రభుని దగ్గఱ పెట్టని లోభియున్న తిట్టి తిట్టి తిరుగఁ గొట్టించుచునే యుండును.

248 లక్ష్మియేలినట్టి లంకాధిపతిపురి, పిల్లకోఁతిపౌజు కొల్లఁగొట్టె
కలిసివచ్చువేళ ఘనులౌదు రల్పులు, విశ్వదాభిరామ వినురవేమ॥
లంకాపురం శ్రియో ధామ విధ్వస్తం స్వల్పవానరైః।
అనుకూలే వేమ ! కాలే ఘనాస్స్యు రధమా అపి ॥

తా॥ లక్ష్మి నివాసమగు లంకాధిపతి పట్టణము పిల్లకోతిపౌజు చుట్టుముట్టి కొల్లఁగొట్టెను. కలిసివచ్చుకాలమం దల్పులును ఘనులేయగుదురు.

249 పతకమందునొప్పు బలురత్నముల పెంపు, బంగరందుఁగూర్పఁ బరువుఁగనును
కాని యితరలోహమైన హీనమొకదా?, విశ్వదాభిరామ వినురవేమ॥
పతకస్థమణిశ్రేణీ స్థగితా హేమ్ని శోభతే।
న తథేతరలోహేషు వేమ ! నష్టద్యుతి ర్భవేత్ ॥

తా॥ పతకమందు రత్నములు బంగారమున పొదిగిననే శోభిల్లును కాని యితర లోహముల పొదుగఁబడిన రత్నములు శోభింపవు. మంచివాని పరిచయమునకు మంచివాఁడైననే శోభించఁగలఁడు.

250 దళముకొనియొకష్ట దారిద్ర్యమేర్పడ, హీనకార్యములు సహించిచేయఁ
బరువుమాయునంతె ఫలమింతచిక్కదు, విశ్వదాభిరామ వినురవేమ॥

పాప్తే ప్రగాఢదారిద్ర్యే యది కుర్యా దసత్క్రియాః ।
తతో నశ్యేత్ స్వప్రతిష్ఠా ఫలం వేమ! న లభ్యతే ॥

తా॥ దట్టమగు దారిద్ర్యావస్థ కలిగినప్పుడు సహించి చెడుకార్యములఁ జేయ గౌరవము పోవునే కాని ఫలితము మాత్రము లభింపఁజాలదు.

251 ఋణముఁ బెంచి సుతునిహీనుఁ గానొనరించి, విడుచుతండ్రి వైరివీరుఁడరయ
నలవికానియట్టి యాలునునట్టులే, విశ్వదాభిరామ వినురవేమ॥

ఋణాధిక్యకరః పుత్రం హీనం యః కురుతే పితా ।
స వైరీ వేమ! భార్యా చ తథైవ హ్యావశంగతా ॥

తా॥ ఋణముఁ బెంచి సుతుని హీనుఁజేయు తండ్రి శత్రువు. అలవి కాని భార్యయు నట్టులే శత్రువు. వి॥ పితా చ ఋణవాన్ శత్రుః.

252 ఈఁగ తేనెరుచికి నిఁ పుగాఁ జచ్చును, ఓగుకామరుచికి నొదిగిచచ్చు
త్యాగికానివాని ధర్మమడుగఁ జచ్చు, విశ్వదాభిరామ వినురవేమ॥

మక్షికా స్యాన్మధురుచేః కామీ కామరుచే స్తథా ।
త్యాగహీనో హతాద్వేమ! ధర్మాత్తార్థిభి రర్థితః ॥

తా॥ తేనెరుచికి నీఁగచచ్చును. కామరుచికి నల్పుఁడుచచ్చును. అట్లే త్యాగికానివాని ధర్మమడుగఁ జచ్చును.

253 స్నానసంధ్యజపముఁ జరియించు భుజియించు, నిష్ఠలెన్నినైన నెరపుఁగాని
ఒకనికీయఁ డెపుడు సుకృతంబు నెఱిఁగియు, విశ్వదాభిరామ వినురవేమ॥

స్నానసంధ్యాజపాహార నిష్ఠా బహ్వీ స్సమాచరన్ ।
వర్తతే వేమ! పుణ్యజ్ఞో న దత్తే కస్యచి ద్ధనమ్ ॥

తా॥ స్నానము, సంధ్య, జపము, ఇట్టి వెన్నైనఁజేయునుకాని, పుణ్యపాపములఁ దెలిసియు నొకనికిమాత్ర మజ్ఞాని యేమియు నీయఁజాలఁడు. వి॥ చత్వారో ధనదాయాదాః ధర్మాగ్నినృపతస్కరాః, తేషాం జ్యేష్ఠావమానేన త్రయః కుప్యంతి సోదరాః ॥

254 స్నానమొనరఁజేసి సద్ధర్మమీయక, నీళ్లమునుఁగఁ గుణమె? నేర్పులేక
నీరుకోడి నీళ్ల నెలవుగా మునుఁగదా?, విశ్వదాభిరామ వినురవేమ॥

స్నాత్వా న దత్తే చేద్ధర్మం వృథా కిం జలమజ్జనైః? ।
న మజ్జ త్యప్సుకిం వేమ ?! తత్రత్యో జలకుక్కుటః ॥

తా॥ స్నానముల మాత్రముఁ జేయుచు ధర్మముఁజేయనేరని ఛాందసుఁడు నీటిలో మునుఁగు నీరుకోడి వంటివాఁడే యగును.

255 సత్యపరులతోడ సరసమాడఁగరాదు, పేదవారితోడఁ బెనఁగరాదు
కలిమికలుగువారిఁ గలియనే రాదయా, విశ్వదాభిరామ వినురవేమ॥

న హేళయే త్సత్యసంధా న్ దరిద్రై ర్న వివాదయేత్ ।
కదాచిదపి సంపన్నైః వేమ ! కుర్యా న్న సంగతిమ్ ॥

తా॥ సత్యవాదులతో సరసము, పేదవారితో పెనుఁగులాట, పనికి రాదు. ఇఁక ధనవంతులతో దరిద్రుఁడు కలియుటయే కూడదు.

256 వల్లవైపులేక వాగ్దత్తములఁజేసి, యదిగొ యిదిగొ యనుచు నాసఁబెట్టి
గడువుఁబెట్టి రేపుగడువగాఁబొమ్మను, విశ్వదాభిరామ వినురవేమ॥

వాగ్దత్తం రక్షసాత్ కృత్వా చాద్య శ్వ ఇతి మోహయన్ ।
శ్వోఽతీతే వేమ ! గచ్ఛేతి నిష్కాసయతి నిర్ఘృణః ॥

తా॥ ఒక్కొక్కఁడు విలుసాలు లేకుండ వాగ్దానములఁజేసి "అదిగో ఇదిగో" అని యాసఁబెట్టి గడువుఁబెట్టి, రేపని మాపని త్రిప్పి త్రిప్పి తుదకు లేదు పొమ్మనును.

257 పట్టుకుండి యధికభాగ్యంబుఁబట్టైనా, దొడ్డవారిఁదిట్టి త్రుళ్ళిపడును
అల్పజాతికుక్క యధికులనెఱుఁగునా? విశ్వదాభిరామ వినురవేమ॥

కథంచి ద్యది భాగ్యం స్యాత్ సాధూన్నిందే న్మదాన్వితః ।
వేమాధికా నల్పజాతిః కిం విజానాతి కుర్కురః ? ॥

తా॥ అల్పజాతికుక్క యధికులఁ దెలియఁగలదా? అట్లే పట్టుకుండి యధిక భాగ్యము పట్టిన నల్పుఁడు దొడ్డవారిని దిట్టి త్రుళ్ళిపడుచుండును.

258 అతిథిరాకఁజూచి యదలించి పడవైచి, కఠినచిత్తులగుచుఁ గానలేరు
కర్మమునకుముందు ధర్మంబుఁ గానరు, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమాతిథ్యాగతిం దృష్ట్వా భర్త్సయంతః ఖలాశయాః ।
అతాదరం న పశ్యంతి దరోఽగ్రే [illegible] ॥

తా॥ అతిథియొక్క రాకఁజూచి పాపి కఠినుఁడై యదలించి పడవైచును. అంతియకాని సత్కర్మకు ప్రధానము ధర్మమని గ్రహింపనేరఁడు.

వి॥ అతిథౌ తిష్ఠతి ద్వారి ఆపోగృహ్ణాతి యో నరః, ఆపోశనం సురాపాన మన్నం గోమాంసభక్షణమ్॥

259 **కైపువస్తువులను గాంక్షించి సేవింప, కానిపనులొనర్చు మేలెఱుఁగక
అట్లు పూనువారి నధము లటందురు, విశ్వదాభిరామ వినురవేమ॥**

మత్తాః కుర్వం త్యకార్యాణి మాదకద్రవ్యసేవయా ।
అకార్యకారిణో మర్త్యాన్ ప్రవదం త్యధమా ఇతి ॥

తా॥ కైపువస్తువుల సేవించువాఁడు ఒడలెఱుఁగక కానిపను లొనర్చుచు లోకులచే నధముఁడనిపించుకొనును.

260 **అండలేనిమనుజుఁ డతిధార్మికునియిల్లుఁజేరవలయుఁ, బ్రతుకఁజేయునతఁడు
ఆవిభీషణుఁ దొలి యారామవిభుఁబోలె, విశ్వదాభిరామ వినురవేమ॥**

అనాశ్రయో నరో వేమ! వ్రజేద్ధార్మికమందిరమ్ ।
స రక్షతి పురా రామో విభీషణ మివాశ్రితమ్ ॥

తా॥ అండలేనివాఁడు విభీషణుఁడు శ్రీరామచంద్రుని శరణుఁ బొచ్చినట్లు మిగుల ధార్మికుఁడైనవాని యాశ్రయము నొందవలెను. అట్లైన నతఁడు సురక్షితముగ జీవింపఁ గలఁడు.

261 **కోమటికి దురాశ కొండలు వాములు, చందనంపుసానలుఁ జంద్రికలు
ఆశకుమితిలే దికక్కడ గతిలేదు, విశ్వదాభిరామ వినురవేమ॥**

గిరయో రాశయ శ్చంద్రికా శ్చందనచర్చికాః ।
దురాశా వేమ! వైశ్యస్య త్వాశాఽనంతా న తద్గతిః॥

తా॥ ధన మార్జించుటకు వర్తకమునకంటె మించిన మంచివృత్తి మఱియొకటిలేదు. అట్టి ధన సంపాదనయే ప్రధానముగఁ దలంచు వర్తకునకు దురాశ కొండలు వాములు మంచిగంధపుజాళులు చంద్రకళలో అన్న లెక్కువగనుండును. ఈ లోకమున నాశకు మితియుండదు. ఆలోకమున గతియుండదు.

262 దశగలారెల్ల తమబంధువులటంచుఁ, దశయులేమి నెంతు రెక్కువగను
దశయనంగను ధనదశయొక్కటేసుమీ, విశ్వదాభిరామ వినురవేమ॥

ప్రాహుర్దశావతోబంధూన్ మన్యన్తే న్యూనం చ నిర్దశమ్।
దశా నామ భవే ద్వేమ! చైకా ధనదశా భువి॥

తా॥ దశగలవారినెల్లఁ దమ బంధువులే యందురు దశలేనివారలఁ దక్కువగఁ దలఁతురు. దశయనఁగ ధనదశ యొక్కటేయని లోకుల యభిప్రాయము.

263 తల్లిబిడ్డలకును దగవుఁబుట్టించెడి, ధనము సుఖముఁగూర్చునని గడింత్రు
కాని యెల్లయెడల ఘనదుఃఖకరమది, విశ్వదాభిరామ వినురవేమ॥

ఆర్జయంతి ధనం వేమ! మాతాపుత్రవిరోధకృత్।
మత్వా సుఖకరం కిం తు ధనం దుఃఖకరం భృశమ్॥

తా॥ తల్లిబిడ్డలమధ్యఁ దగవుఁబుట్టించెడు ధనము సుఖము గూర్చునని గడింతురుకాని యెల్లయెడల ధనము దుఃఖమును కల్గించునదియే. వి॥ అర్థానామార్జనే దుఃఖం అర్జితానాం చ రక్షణే, రక్షితానాం వ్యయే దుఃఖం ధిగర్థం దుఃఖభాజనమ్ 2 లాంగలేన హంతామాతా విషాన్నేన హాత స్మృతః, మాతా పుత్రవిరోధాయ హిరణ్యాయ నమో నమః॥

264 ప్రభులకిచ్చునట్లు రహి పేదలకునీరు, వేశ్యకిచ్చునట్లు వెలఁదికీరు
సురకునిచ్చునట్లు సుధనునీయరు, విశ్వదాభిరామ వినురవేమ॥

న దరిద్రాయ దాస్యంతి ధనం వేమ! ప్రభోరివ।
న స్త్రైణ్యై వేశ్యాకాంతావత్ న సుధాయై సురాసమమ్॥

తా॥ ప్రభులకిచ్చునట్లు పేదల కీయరు. వేశ్యలకిచ్చునట్లు భార్యకీయరు. కల్లుకిచ్చున ట్లమృతమునకైన నీయరు.

265 పెట్టిపోయువాఁడు కట్టడిగలదాత, తిట్టిపోయువాఁడు తుట్టెపురుగు
రట్టుసేయువాఁడు రాణింపునకురాఁడు, విశ్వదాభిరామ వినురవేమ॥

దానశీలో మహాన్ దాతా నిందకః కీటకోపమః।
య స్త్వనర్థకరో వేమ! స్వప్రతిష్ఠాం న విందతి॥

తా॥ పెట్టిపోయువాఁడే నెరదాత. తిట్టిపోయువాఁడే తుట్టెపురుగు. (ఎగిరెగిరిపడునది)గాలు(రొష్టు)చేయువాఁడెప్పుడును రాణింపునకు రాఁడు

266 దాతయైనవాఁడు తాను మున్నిచ్చెడుఁ, గానివాఁ డొసఁగునె? కాసునైన
జలముదప్పిఁ దీర్చు మలమెట్లుఁ దీర్చును?, విశ్వదాభిరామ వినురవేమ॥

ప్రాగ్దదాతి స్వయం దాతా నాదాతా కాకణీమపి ।
తృష్ణాహరం జలం వేమ! న తథా కుత్రచిన్మలమ్ ॥

తా॥ జలము దప్పిఁ దీర్చును కాని మలము తీర్చలేదు. అట్లే దాతయైన వాఁడే యర్థికోరిక నెరవేర్చగలఁడు కాని దాతకానివాఁడు కాసైనను నీయఁగలఁడా?

267 కలిమిగలయతనికిఁ గన్యక నిచ్చియు, మురియుచుందురికాదె? మూఢజనులు
పూజఫలముకాని పూనిక ల్ నిల్చునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

కన్యాం ధనవతే దత్వా మోదంతే బాలిశాజనాః ।
పూజాఫలం స్థిరం వేమ!యత్నా హి న తథైకదా ॥

తా॥ ధనవంతునకు పిల్లనువివాహము చేసితిమని యజ్ఞానులు మురియుచుందురు కాని వారల (దంపతుల) పూజాఫలముఫలించును గాని మన ప్రయత్నములు పనికివచ్చునా ?

268 కోమటి మదిఁ గోరు క్షామమే యెల్లెడ, వైద్యుఁ డోరులకెపుడు వ్యాధిఁ గోరు
నూరిపేద ధనికుఁ జేరఁగాఁ గోరును, విశ్వదాభిరామ వినురవేమ॥

వైశ్యో వాంఛతి దుర్భిక్షం [illegible]షాం రుగ్ణతాం భిషక్ ।
[illegible] ధనికం వేమాశ్రయితు మిచ్ఛతి ॥

తా॥ వర్తకుఁ డెప్పుడును [illegible] కోరును. వైద్యుఁ డెప్పుడును వ్యాధినే కోరును. [illegible] ఎప్పుడును ధనవంతుని యాశ్రయమే కోరుచుండును.

269 ఋణమొసంగునాఁడు చూడఁగుంటోలునోర్తు, నద్దినాలలనడుఁ యముఁడుగనగు
అప్పుఁ జేసితీర్ప నగడునివారికి, విశ్వదాభిరామ వినురవేమ॥

ఋణదాతా ప్రభు ర్భ్రాతా యదియాచేత్తదా యమః।
ఋణం కృత్వా పునర్దాతుం వేమ! న్యాయా మనిచ్ఛతామ్॥

తా॥ ఋణమిచ్చునప్పుడు షాహుకారు ప్రభువుగఁ దోచును. అప్పుఁ జేసి తీర్చలేనివాని కాషాహుకారే మరల నప్పు సంగతి యడిగినప్పుడెల్ల యముఁడుగఁ దోచును.

270 చమురుగల్గుదివ్వె చక్కఁగా వెల్గును, ధనముఁగలుగువాని తలఁపుఁజెలఁగు
ధనములేనివాని తలఁపులుండీరునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

స్నేహయుక్తో వేమ! దీపః సమ్యగ్జ్వలతి నిత్యశః ।
సిద్ధ్యంతి ధనినో వాంఛా నిర్ధనస్య న వై తథా ॥

తా॥ చమురుగల్గినదీపము చక్కఁగా వెలుఁగును. ధనముఁగలవాని తలఁపులును నీడేరును. ఇఁక ధనములేనివాని తలంపు లణఁగిపోవలసినవే కాని యెట్లు నెరవేరఁగలవు?

271 అడుగ కర్థమిచ్చు నతఁడుబ్రహ్మజ్ఞాని, అడుగనరమిచ్చు నతఁడుత్యాగి
అడుగనీకులేని యాతఁడు పెనులోభి, విశ్వదాభిరామ వినురవేమ॥

అయాచితో ఽపి యో దత్తే బ్రహ్మజ్ఞానీ స కథ్యతే ।
యాచితార్థప్రద స్త్యాగీ వేమాదాతాహి లోభవాన్ ॥

తా॥ అడుగకుండ కోరిక నెరవేర్చువాఁడు బ్రహ్మజ్ఞాని. అడిగినఁగోరిక నెరవేర్చువాఁడు త్యాగి. అడిగినను కోరిక నెరవేర్చనివాఁడు లుబ్ధుఁడు.

272 తోటకూరకైన దొగ్గలికైనను, తవిటికుడుముకైనఁ దవుడుకైన
కావ్యములను జెప్పు కవులెల్లధనపరుల్, విశ్వదాభిరామ వినురవేమ॥

కంబూకతన్మోదకేభ్యః శాకాయ లవణాయ వా ।
కుర్వతే వేమ! కావ్యాని యే తే విత్తపరాః ఖలు ॥

తా॥ తోటకూరకుఁగాని యంతకంటెనుహీనమగు దొగ్గలికూరకుఁగాని తవిటికుడుమునకుఁగాని తవుడుకుఁగాని కావ్యములను జెప్పు చౌకబారు కవులు ధనాశాపరులు లుబ్ధులు దరిద్రులుసుమా.

273 తవిటికిరయఁబోవఁ దండులంబులగంప, శ్వానమాక్రమించు సామ్యముగను
వైశ్యవరునిసొమ్ము వసుధ నీచులపాలు, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ! కంబూకలాభాయ నిర్గతే మానవే తదా ।
శ్వాత్తి తండులకండోలం వైశ్యవిత్తం తథా ఖలాః ॥

తా॥ తవుడుకొఱకుఁ బోయిన వియ్యాపుగంప కుక్కపాలా యెనన్నట్లు లుబ్ధత్వమున సంపాదించిన వర్తకునిధనము వసుధకు నీచులపాలగును.

274 నీతి జ్యోతిలేక నిర్మలంబగునేది, యెట్లు కలుగుపరమ దెంతయైన
ధనముఁ గల్గియున్న దైవంబు కల్గునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

నీతిజ్యోతిర్విహీనం స్యా ద్యది వేమ! హినిర్మలమ్ ।
కథం పరం తత స్సిద్ధ్యేత్? న ధనేన పరం భవేత్ ॥

తా॥ నీతియను జ్యోతిలేక నిర్మలమగుపరమపద మెట్లుసిద్ధింపఁగలదు? ధనముకలిగియున్న దైవముకల్గునా?

275 చచ్చిపడిన పసువు చర్మంబుఁగండలఁ,బట్టి పెఱికితినును పరగ గ్రద్ద
గ్రద్దవంటివాఁడు గజపతి కాఁడొకో, విశ్వదాభిరామ వినురవేమ॥

చర్మ మాంసం మృతపశోః గృధ్రోఽత్త్యుత్ఖాత్య వై బలాత్ ।
వేమ! తద్గృధ్రసంకాశః క్రూరో గజపతిః ప్రభుః ॥

తా॥ చచ్చిపడిన పసువుయొక్కచర్మముఁ గండలుపట్టి గ్రద్ద పెఱికి తినును. దుర్మార్గుఁడు, నిరంకుశప్రభువునగు గజపతి (అప్పటిరాజు) ప్రజల పీడించితినుటకా గ్రద్దవంటివాఁడుకాఁదా?

276 వైశ్యులమనిచెప్ప వార్తమాత్రమెకాని, దొంగలింతకన్న దొరకరెందు
నేలమీఁద వీరినేర్పుల నేమందు?, విశ్వదాభిరామ వినురవేమ॥

వైశ్యాఇత్యస్తి వార్తైకా నాసతే దస్యవ స్తతః ।
ప్రావీణ్యంతత్తు వేమైషాం కిం బ్రవీమి మహీతలే? ॥

తా॥ వర్తకులమనే పేరుతప్ప యింతకన్న దొంగలు ధనముపుంజుకొనుటకు మఱియొకరులేరు. ధనార్జనకు వీరినేర్పులతిచిత్రమైనవికదా?
వి॥ తార్క్యేన కించిత్ తులయా చ కించిత్ మానేన కించిత్ శపథైశ్చ కించిత్, కించిచ్చ కించిచ్చ హరంతి సర్వం వణిక్సమో నాస్తి ప్రశస్తచోరః॥

277 కల్లుకిచ్చునట్లు చల్లకీయఁగలేరు, కోళ్లకిచ్చునట్లు గురువుకీరు
పాలఁతులకిడునట్లు పుణ్యానికీయరు, విశ్వదాభిరామ వినురవేమ॥

మద్యాయేవ స తక్రాయ దదతే దేశికాయ చ ।
కుక్కుటాయేవ వేమార్థం పుణ్యాయాపి స్త్రియై యథా ॥

తా॥ కల్లుకిచ్చునట్లు చల్లకును,కోళ్లకిచ్చునట్లు గురువునకును,భోగస్త్రీలకిచ్చునట్లు పుణ్యమునకును నీయఁజాలరు.

278 వెంటిమేళమునకుఁ బెద్దగానిత్తురు, పోతుమేళమునకుఁ బోకనీరు
పుండుమునురునీఁగ పుష్పమైవ్రాలునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

స్త్రీమేళాయ దదత్యర్థం పుంమేళాయ న కించన।
వ్రణస్థా మక్షికా వేమ! పుష్పే కిం జాతు వర్తతే? ॥

తా॥ వెంటిమేళమున కెంతయైన నిత్తురుకాని పోతుమేళమునకు పోకనైన నీయరు. పుండునకునిష్టపడి వ్రాలునీఁగ పుష్పమై వ్రాలునా ?

279 శ్రీకరపరతత్త్వశీలుఁడౌ వేమన, పల్కినట్టి వేలపద్యములను
లోకమందుఁ జదివి లోవెలిఁబాయుఁడీ, విశ్వదాభిరామ వినురవేమ॥

పరతత్త్వవిదాఽనేన ప్రోక్తం పద్యసహస్రకమ్।
లోకే పఠిత్వా త్యజత వేమాంతశ్చ బహిస్తమః ॥

తా॥ మోక్షలక్ష్మీస్థానమగు పరతత్త్వమందాసక్తికల యీ వేమన పలికిన యీ వేయి పద్యములనైనఁ జదివి లోపల వెలుపలనున్న కల్మషములఁ బోఁద్రోలుఁడు. వి॥ మోక్షద్వారే ద్వారపాలాశ్చత్వారః పరికీర్తితాః, శమో విచార స్సంతోష శ్చతుర్థ స్సాధుసంగమః॥

280 వేయిపద్యములు వివేకియై భక్తితోఁ, బఠనఁజేయునట్టి భక్తునకును
బాయకుండు మోక్షపద మఱచేతిదై, విశ్వదాభిరామ వినురవేమ॥

భక్త్యా సహస్రం పద్యానాం వివేకీ యః పఠే న్నరః।
తస్య వేమ! నచాపైతి ముక్తిః కరతలస్థితా

తా॥ వివేకముగల్గి యీ వేయిపద్యములనైన భక్తిశ్రద్ధలతోఁ బఠించు భక్తునకు మోక్షపద మఱచేతిలోనిదై విడువకుండును. 

## సామాజిక విభాగము

281 సత్యమమరియుండ జ్ఞానమమరియుండు, జ్ఞానమమరి[illegible] సత్యముండు
జ్ఞానసత్యములును సమమైనద్విజుఁడగు, విశ్వదాభిరామ వినురవేమ॥

సత్యేస్థితే జ్ఞానలబ్ధిః లబ్ధేజ్ఞానే ఋతస్థితిః।
'ద్విజ, ఇత్యుచ్యతే వేమ! జ్ఞానసత్యసమస్థితేః ॥

తా॥ సత్యము (ఋజుత్వము) ననేజ్ఞానము. జ్ఞానముననే సత్యముఁ గలుగును. ఎఱిఁగి ఋజుత్వమార్గమున సంచరించిననే ద్విజుఁడు.

వి॥ న యోని ర్నాపి సంస్కారో న శ్రుతం న చ సంతతిః, కారణాని ద్విజత్వస్య వృత్తమేవ చ కారణమ్ (భాగవతము)

282 హృదయమందునున్న యీశుని దెలియక, శిలలకెల్ల మ్రొక్కు జీవులార!
శిలలనేమియుండు? జీవులందే కాక, విశ్వదాభిరామ వినుర వేమ॥

హృత్స్థమీశ్వర మజ్ఞాత్వా శిలా నమథజీవినః!।
జీవే ష్వేవేశ్వరో భాతి కిం వేమాస్తి శిలాదిషు? ॥

తా॥ హృదయమందలి పరమేశ్వరుఁ దెలియఁజాలక శిలలఁబూజించు వెఱ్ఱిజీవులారా! జీవులందున్న చైతన్యపదార్థము శిలలందుఁగలదా ?

283 శిష్యవర్గమునకు శివుఁజూపనేరక, కానిమతములోనఁ గలుపునట్టి
గురునియెఱుక యరయ గ్రుడ్డెద్దు జొన్నరా, విశ్వదాభిరామ వినుర వేమ॥

యోఽశక్తః శిష్యబృందాయ శివం ప్రదర్శయితుం గురుః।
అంధోక్షుజీర్ణతుల్యం హి జ్ఞానం స్యా ద్వేమ! తద్గురోః ॥

తా॥ పరమేశ్వరు నెఱుకపరుపఁజాలక ఏవేవియో మతకర్మముల ముంచు నసద్గురుబోధ గ్రుడ్డెద్దు చేలోపడినట్లుండును.

284 గురువులేకవిద్య గుఱుతుగా దొరకదు, నృపతిలేక భూమి తృప్తికాదు
గురువు విద్యలేక గురుతరద్విజుఁడౌనె?, విశ్వదాభిరామ వినుర వేమ॥

గురుం వినా నాత్మవిద్యా న భూతృప్తి ర్వినా నృపమ్ ।
గురుం విద్యాం వినా మర్త్యో వేమ! కిం భవతి ద్విజః? ॥

తా॥ ప్రభువున్ననుకాని భూలోకము సంతసము నొందఁజాలదు. అట్లే గురువులేక సమస్తముఁ దెలియఁబడు విద్య లభించనేరదు. అట్టి గురువు సద్విద్యలేనిది ద్విజుఁడు కానేరఁడు.

285 శూద్రుతనముఁబోయె శూద్రుఁడేఁగానని ద్విజుఁడనుకొను పెల్లఁ దెలివిలేమి
ఇత్తడెన్నఁగు పసిడి కీడనవచ్చునా?, విశ్వదాభిరామ వినుర వేమ॥

న శూద్రతా న శూద్రోఽహం ద్విజోఽహ మితి భావనా ।
అజ్ఞాన మారకూటం కిం? వేమ! హేమసమం భవేత్? ॥

తా॥ ఎట్టి యిత్తడియైన బంగారమునకు దీటుకాదు. అట్లే "నాకు శూద్రత్వము పోయినది, నేను ద్విజుఁడను" అని సామాన్య మానవుఁడను కొనుట తెలివి తక్కువయేకాని మఱియొకటికాదు.

286 **వచ్చువిల్తుచేతఁ గ్రిచ్చఱజనులెల్లఁ, దగ్రిచ్చనాడఁబడిరి ధరణిలోనఁ**
**గులజుఁ డెవ్వఁడిందుఁ గులహీనుఁ డెవ్వఁడు, విశ్వదాభిరామ వినురవేమ॥**

వేమేతుధన్వనా సర్వేజనా శ్చ మథితా భువి ।
కోఽత్రభూమౌ కులీన స్స్యాత్ కులహీనో జన శ్చ కః ॥

తా॥ మన్మథునిచేఁ దఱచఁబడుటవలననే జనులందఱుఁ బుట్టుచున్నారు. ఇఁక కులభేదమెక్కడిది? సంస్కారముననే విశిష్టుఁడుకావలెను.

287 **జాతులందు మిగులజాతియేదెక్కవో, యెఱుకలేక తిరుగ నేమిఫలము?**
**ఎఱుకగలుగువాఁడె హెచ్చైనకులజుండు, విశ్వదాభిరామ వినురవేమ॥**

కులేష్వగ్ర్యం కులం వేమ! న జానన్ కిం ఫలం భ్రమైః? ।
యస్యాస్తి నిర్మలం జ్ఞానం స ఏవాగ్రకులోద్భవః ॥

తా॥ ఏ జాతి యెక్కువయినదో తెలియక యెందులకుఁ దిరిగెదరు? ఎఱుక కలిగినవాఁడే హెచ్చైన కులముగలవాఁడు.

288 **మాలమాలకాఁడు మహిమీఁద నేపార్గ్రిద్దు, మాటఁదిరుగువాఁడె మాలగాక**
**వానిమాలయన్న వాఁడెపో పెనుమాల, విశ్వదాభిరామ వినురవేమ॥**

చండాలో న హి చండాలః చండాలో వేమ! నష్టవాక్ ।
తం చండాల ఇతి బ్రూతే య శ్చండాల స్స ఏవ హి ॥

తా॥ మాట నిలుకడలేని యసత్యవాది మాలకాని సాధారణముగ 'మాల, యని పిలువఁబడువాఁడు మాలకాఁడు. అట్టి వానిని మాలయన్న వాఁడే పెద్దమాల.

289 **ఎన్నిమతములైన నేమంత్రమైనను, సత్యమింతలేక జాడవిడఁడు**
**సత్యమున్ గలిగిన జగతిలో ద్విజుఁడగు, విశ్వదాభిరామ వినురవేమ॥**

మంత్రాధిక్యే మతాధిక్యే వేమ! సత్యపి భూరిశః ।
ఋతాదృతే న సిద్ధిస్స్యాత్ సత్యవాక్ వర్తతే ద్విజః ॥

తా॥ ఎన్ని మతములుకాని యేమంత్రములుకాని ఋజుత్వము, సత్ప్రవర్తనలేనిదే తరింపఁజేయఁజాలవు. అట్టి ఋజుత్వము కలవాఁడే ద్విజుఁడు.

**290 రామ నామపఠనచే మహి వాల్మీకి, పరఁగ బోయఁడయ్యు బాపఁడయ్యె**
**కులముఘనముకాదు గుణమె ఘనంబురా, విశ్వదాభిరామ వినురవేమ॥**

రామనామజపేనైవ కిరాతోఽపి ద్విజోఽభవత్ ।
వాల్మీకి ర్వేమ! న కులం ఘనం కిం తు గుణో ఘనః ॥

తా॥ రామనామ జపముచేఁగలుష మడఁగి బోయఁడయ్యు వాల్మీకి బ్రాహ్మణులలో నగ్రగణ్యుఁడైన మహర్షి యయ్యెను. అక్కడ కులమా ఘనతఁదెచ్చినది ? గుణమా ?

**291 కలియుగమునయున్న కాపుకులమునను, వేమన తనకీర్తి విక్రయించె**
**ఉన్నధర్మమెల్ల నుర్విపై వెదఁజల్లె, విశ్వదాభిరామ వినురవేమ॥**

కాపువంశే కలౌ వేమ! యశ స్స్వయం ప్రపూరయన్ ।
చిక్షేప సకలాన్ ధర్మాన్ లోకేఽస్మిన్ వసుధామణిః ॥

తా॥ కర్షకవృత్తికలిగి ప్రజాజీవితమున కాధారమగు నాహారోత్పత్తిఁ గలిగించి మోసములేక ఋజుత్వము ననుసరించు పాలకవర్గమగు (కాపు) కర్షకుల తెగకే వేమన తన కీర్తిని విక్రయించెను. సమస్త ధర్మముల మానవులకొఱకు వెదఁజల్లెను.

**292 పరధనములకుఁ జేయిపట్టును మిక్కిలి, సత్యమింతలేక జారుఁడగును**
**ద్విజుఁడనుకొనుఁ దాను దేజమింతయులేక, విశ్వదాభిరామ వినురవేమ॥**

పరద్రవ్యాపహర్తా చ జారశ్చానృతవాద్యపి ।
వేమ! నిష్ప్రభ మాత్మానం మన్యతే ద్విజ మల్పధీః ॥

తా॥ పరధనమునకుఁ జేతులు సాచును. జారుఁడు, నబద్ధములాడువాఁడుగ నుండును. నేను ద్విజుఁడననుకొనును. కళాహీనుఁడై తిరుగును.

వి॥ శమో దమ స్తప శ్శౌచం క్షాంతి రార్జవమేవ చ, జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్॥ (జన్మాంతరకృతసంస్కారః ప్రాణినాంవర్తమానజన్మని స్వకార్యాభిముఖత్వేనాభివ్యక్తస్స్వభావః॥)

293 విప్రవరులమనుచు వేదంబుఁజదువుచుఁ, బ్రాకృతులనుజూచి పరిహసించు
ధరణిసురులకన్న దాసరిపతమెచ్చు, విశ్వదాభిరామ వినురవేమ॥

విప్రోత్తమా వయమితి వేదాధ్యయనతత్పరాః ।
హసంతి ప్రాకృతా న్వేమ! తేభ్యో దాసనుతం వరమ్ ॥

తా॥ "మేము విప్రవరులము" అని వేదపారాయణము మాత్రము చేయుచు సామాన్యమానవుల వెక్కిరించుచుండు జనులకంటె నేమియు జదువుకొనకున్నను నిత్యము భగవంతునిభజించి కీర్తించుదాసర్లేయధికులు.

వి॥ సత్యం దానం క్షమా శీల మానృశంస్యం తపో ఘృణా, దృశ్యంతే యత్ర నాగేంద్ర! సబ్రాహ్మణ ఇతి స్మృతః. శూద్రే తు యద్భవేల్లక్ష్యం ద్విజేతచ్చ న విద్యతే, నై వశూద్రో భవేచ్ఛూద్రో బ్రాహ్మణో న చ బ్రాహ్మణః, యత్రైతల్లక్ష్యతే సర్ప! వృత్తం సబ్రాహ్మణఃస్మృతః.(భారతం)

294 సోమయాజిననుచు సొంపుగో వేషంబుఁ, గట్టిమాంసమెల్లఁ గాల్చితినును
ద్విజుఁడ నేననఁగ నధిక మేమితనవల్ల?, విశ్వదాభిరామ వినురవేమ॥

యజ్వా ద్విజో౽హమితి యో వేషధారీ యథావ్యయా ।
పక్త్వా తు మాంస మశ్నాతి కిమాధిక్యం తతో భువి ॥

తా॥ నేను యజ్వను యజ్ఞముఁజేసినిని ద్విజుఁడను అని సోమయాజి వేషముతో తిరుగును. యజ్ఞముచేసెను. అంటు దేవతలపేరుతో మద్యము (సోమము) త్రాగెను. మాంసము కాల్చుకొని తినెను. అందువలన నతనికి వచ్చిన యాధిక్యమేమి ? (సోమలతలు= తీగెలు. దానితో సారా తీయువారు. దానిసే సోమమునిరి. దానివలననే సోమయాజి)

295 కల్లటికపబూది గట్టిగాఁబెట్టిన, నందులోని కంపు లడఁగనట్లు
మెడను ద్రాడువేయ మెఱయుచు ద్విజుఁడౌనె, విశ్వదాభిరామ వినురవేమ॥

సూతిలిప్తం సురాభాండం దుర్గంధం నశ్యతి క్వచిత్ ।
ఉపవీతే ధృతేపం ద్విజన్మా వేమ! కిం భవేత్?

తా॥ కల్లుకుండకు పైన విభూతి దట్టముగఁబట్టించిన లోని కంపు పోవునా ? అట్లే మెడను ద్రాడువేసికొన్నంత మాత్రమున ద్విజుఁడెట్లు కాఁగలఁడు ? ఎట్లు బోధకవర్గమునఁజేరి ప్రజలఁ దరింపఁజేయఁగలఁడు ?

296 బిందురక్తములను బెరసిన దేహంబు, చందమెఱుఁగక ద్విజశబ్దమిడుక
నడచినను విడుచునొ నరకంబు మృత్యువు, విశ్వదాభిరామ వినురవేమ॥

బిందురక్తభవం దేహ మజాన న్ద్విజశబ్దభాక్ ।
యది స్యాద్వేమ! నిరయం నిధనం చ కథం త్యజేత్ ॥

తా॥ శుక్ల శోణితములఁ గూడిన దేహముతోఁ బుట్టి యాత్మసంస్కార రహితుఁడై నేను ద్విజుఁడనని యనుకొన్నంత మాత్రమున మృత్యువు, నరకము వీనిని విడువఁగలవా ?

297 శివుఁడుగలఁడటంచు శిలలకు మ్రొక్కేడు, వెఱ్ఱిజీవులార! వెతలవిడుఁడి
జీవులందె కాక శిలలనేమున్నది? విశ్వదాభిరామ వినురవేమ॥

శివోఽస్తీతి శిలా వేమ నమస్యంతో జడాజనాః ! ।
శివో జీవేషుచైవాస్తి న శిలాసు కదాచన ॥

తా॥ నిన్ను నీవు తెలిసికొనలేక రాతిలో మాత్రమే దేవుఁడున్నాఁడని యెందులకు భ్రమపడెదవు ? ప్రతి చైతన్య పదార్థమున్నను జీవులందే కదా యున్నది ? వి॥ అగ్నిర్దేవో ద్విజాతీనాం మునీనాం హృది దైవతమ్, ప్రతిమాస్వల్పబుద్ధీనాం సర్వత్ర సమదర్శినామ్, తీర్థానితోయరూపాణి దేవాః పాషాణమృణ్మయాః, యోగినో న ప్రపద్యంత ఆత్మ ధ్యానపరాయణాః (ఉ॥ గీత)

298 ఎంబెరుమతమంచు సెసఁగిమాంసముఁదిని, మాఱుపేర్లఁబెట్టి మధువుఁద్రావి
వావివరుసఁదప్పి వనితపాలై చెడు, విశ్వదాభిరామ వినురవేమ॥

ఎంబెర్వాఖ్యం మతమితి మధుపీత్వాన్యనామభిః ।
మాంసం భుక్త్వా క్రమంత్యక్త్వా స్త్రీవశో వేమ! నశ్యతి ॥

తా॥ ఒక్కొక్కఁడు ఎంబెరుమతమని మాఱుపేర్లతో మద్యముత్రాగి మాంసము తిని వావివరుసలు విడిచి స్త్రీలోలుఁడై యధోగతి పాలగును.

299 జాతిమతము విడిచి చనియోగిగా మేలు, జాతితో నెయున్న నీతులేల?
మతముఁబట్టి జాతిమానకుంటకొఱంత, విశ్వదాభిరామ వినురవేమ॥

త్యక్త్వా జాతిమతే గత్వా యది యోగీ భవే చ్ఛుభమ్ ।
స్వజాతిమతబద్ధస్య వేమ! నీతి ర్విలుప్యతి ॥

తా॥ జాతిమతముల కతీతుఁడై యోగి యగుటమేలు. లేకున్న జాతి మతముల నియమములకు బద్ధుఁడై నీతులఁజెప్పిన లాభమేమి ?

300 జననమరణములను సంధ్యతాద్రిడునులేదు, సంధ్యతాద్రిడులేదు జనని కెపుడు
తల్లిశూద్రురాలు తానెట్లుద్విజుఁడగు?, విశ్వదాభిరామ వినురవేమ॥

యజ్ఞోపవీతం నాస్త్యేవ జననే మరణేఽపి చ ।
మాతు స్తన్నాస్తి సా శూద్రా స్స్వయం వేమ! కథం ద్విజః? ॥

తా॥ పుట్టినపుడు జందెపుత్రాడులేదు. చనిపోయినపుడును ఆ త్రాడుంచరు. తల్లికెపుడును జందెపుత్రాడులేదు. తల్లి శూద్రురాలా ? తాను ద్విజుఁడా? దేనిచేతనా ద్విజత్వము?

301 పెతరయన్నమనుచుఁ బ్రీతితోఁబిలిపించి, కాకులకును బెట్టు కర్మలార!
కాకులందునేమి? ఘనులకుఁబెట్టుఁడీ, విశ్వదాభిరామ వినురవేమ॥

పితన్నమితి సంప్రీత్యా కాకానాహూయ కర్మఠాః ।
దద్వే కి మస్తి కాకేషు? మహాద్భ్యో వేమ! దీయతామ్॥

తా॥ శ్రద్ధతోఁబెట్టునదికాన శ్రాద్ధము. అట్టి పితృదేవతలకుఁ బెట్టు భోజనము ఘనులకా ? కాకులకా ? వి॥ అక్రోధనైః శౌచపరైః సతతం బ్రహ్మవాదిభిః, భవితవ్యం భవద్భిశ్చ మయా చ శ్రాద్ధకర్మణి ॥

302 పిండములను జేసి పితరులఁదలపోసి, కాకులకును బెట్టు కర్మలార!
పెంటఁదినెడికాకి పెతరయెట్లాయెరా?, విశ్వదాభిరామ వినురవేమ॥

పిండాన్ కృత్వా పితౄన్ మత్వా కాకేభ్యో దదతః ఖలాః!।
కథం పితా భవే ద్వేమ! వాయసో మలభుగ్భువి? ॥

తా॥ పితరులపేరిటఁ బిండములఁ గాకులకుఁబెట్టు మూఢులారా ! అట్లు చేయుటమాని ఘనులకుఁబెట్టుఁడు. పెంటతినెడి కాకులు పితరులా?

303 పలుగురాళ్లఁదెచ్చి పరఁగగుడులఁగట్టి, చెలఁగిశిలలసేవఁ జేయనేల?
శిలలసేవఁజేయ ఫలమేమికల్గురా?, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ! కర్కశపాషాణా- నానీయాలయనిర్మితిమ్ ।
కృత్వా శిలా స్సమర్చంతి కిం స్యా దుపలసేవయా? ॥

తా॥ పిల్లలు బొమ్మరిండ్లు కట్టుకొన్నట్లు రాతిపలకలఁ దెచ్చి గుడులఁగట్టి యందొక రాతినునిచి, సేవించి తృప్తినెందుచుందురు.

304 ఉపవసములనున్న నూరపంబైపుట్టుఁ, దపసినైన దరిద్రితను వహించు
శిలకు మొక్కినఁ గన? జీవముగల బొమ్మ?, విశ్వదాభిరామ వినుర వేమ॥

ఉపవాసీ గ్రామకిటేర్జన్మాప్నో త్యశ్నుతే యతిః ।
దరిద్రతాం వేమ! శిలాం ప్రాణినార్హాతి వందితుమ్ ॥

తా॥ ఉపవాసములుండి లోపలమాత్రమాకలిచే నెప్పుడువ్రతమగునా? ఎప్పుడు తిందుమా? అని తలఁచుచుందువా రూరపందు లగుదురు.తపస్సుఁ జేయుచు మనము భోగము లనుభవించుట కెప్పుడు తపస్సిద్ధియగునో యని తలంచువా రెప్పుడును పరమ దరిద్రులైయె యుందురు. జీవము కలిగినతాను నిర్జీవప్రతిమనే తలఁచుచుండిన శిలవలె మొద్దువారిపోఁగలఁడు.
వి॥ కామాన్ యః కామయతే మన్యమానః స కామైర్జాయతే తత్ర తత్ర॥
(ముండకోపనిషత్) 3-2-20. యద్భావం తద్భవతి॥

305 పరఁగ బొమ్మగుడ్డుఁ బరికించి చూచినఁ, గులములన్ని యందుఁగూడిపుట్టె
అందరొకటెకలియ నన్నదమ్ములెకదా?, విశ్వదాభిరామ వినురవేమ॥

బ్రహ్మాండే వేమ! జాతాని సకలాని కులాన్యపి ।
సర్వేపి సోదరా ఏవ భవంత్యేకత్వ మాస్థితాః ॥

తా॥ ఆలోచించి చూచిన సమస్త జీవులును నీ బమ్మగుడ్డు(బ్రహ్మాండము)లోనుండియే యుద్భవించెను. కాన జీవులందఱుసోదరులే.

306 కూడదేమిచేసెఁ గులమేమిచేసెను?, భూమి యేమిచేసె? బొందె కిట్లు
నరుఁడుపడెడుపాట్లు నగుబాట్లుచూడఁగా, విశ్వదాభిరామ వినురవేమ॥

కిం చక్రేఽన్నం? కులంచాపి? కిన్నైవ వసుధా తనోః? ।
తదర్థం యతతో వేమ! నుర్త్యస్తై త్యపహాస్యతామ్ ॥

తా॥ కూడేమిచేసినది ? కులమేమి చేసినది ? ప్రదేశమేమిచేసినది ? ఈ పాడు బొందెకు నరుఁడుపడు పాట్లు గమనించిన నగుబాటుగఁదోచును.

307 పూజకన్న నెంచ బుద్ధినిదానంబు, మాటకన్న నెంచ మనసుదృఢము
కులముకన్న మిగుల గుణము ప్రధానంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

బుద్ధిఃప్రశస్తా పూజాభ్యో వచనేభ్యో మనోదృఢమ్ ।
కులాదపి చ వేమేహ ప్రధానో విమలోగుణః ॥

తా॥ పూజకన్నను బుద్ధిముఖ్యము. మాటకన్నను మనస్సుముఖ్యము. కులముకన్నను గుణము ముఖ్యము.

308 **కులము హెచ్చుతగ్గు గొడవలఁబనిలేదు, సానుజాతమయ్యె సకలకులము
హెచ్చుతగ్గుమాట లెట్లెఱుంగఁగనగు?, విశ్వదాభిరామ వినురవేమ॥**

శృణు వేమ! కులస్యాత్ర కిం న్యూనాధికగాథయా? ।
సానుజాతం కులం సర్వం కథం జ్ఞేయోచ్చనీచతా ॥

తా॥ కులముల హెచ్చుతగ్గుల గొడవ లటుండనిండు. అన్ని కులములు నొకమాదిరిగనే పుట్టుచున్నవి. హెచ్చుతగ్గు లెట్లెఱుఁగుటకు సాధ్యపడును?

309 **మాలవానినేల మహిమీఁదనిందింప?, నొడలిరక్తమాంస మొకటికాదె?
వానిలోన మెలఁగు వానికులంబేది?, విశ్వదాభిరామ వినురవేమ॥**

చండాలనిందయా కిం వా? రక్తమాంసం సమం తనౌ ।
కులం కిం? వేమ! తత్త్వేన చాంతర్దేహానువర్తినః ॥

తా॥ రక్తమాంసములతోఁగూడిన శరీరమందటిది యొకటే. శరీర మందలి యాత్మపదార్థమును నొకటే. సంస్కృతి ననుసరించియే యంత రము లేర్పడఁగలవు.

310 **మాలవానినంటి మఱిమున్గుదురునీటు, మనుజకర్మచేత మాలఁడయ్యె
ఏలఁదెలియఁజాలరీ నరపశువులు?, విశ్వదాభిరామ వినురవేమ॥**

చండాలం వేమ! సంస్పృశ్య జలే మజ్జంతి పామరాః ।
స్వకర్మణైవ చండాలో న విదంతి కథం త్విదమ్ ॥

తా॥ మాల తానుచేసిన దుష్కర్మచేతనేకదా (అస్పృశ్యుఁడు) లంట రానివాఁడాయెను ? తానంతకన్నను చెడుకర్మఁ జేయుచు మాలయై యస్పృశ్యుఁడై స్పృశ్యు నేలస్పృశించి నీళ్ళమునుఁగును ?

311 **మాదిగ, యనవద్దు మఱిగుణమొనరిన, మాదిగనువసిష్ఠమౌని తేడె?
మాదిగ గుణమున్న మఱిద్విజుఁడగునయా, విశ్వదాభిరామ వినురవేమ॥**

గుణీస్యాద్యది మాతంగ ఇతి వేమ! న తం వదేత్ ।
మేనే వసిష్ఠో మాతంగీం మాతంగోఽపి గుణీ ద్విజః ॥

తా॥ మతంగమహర్షి మాదిగయందురు. వాని కుమార్తె యరుంధతి మహాపతివ్రత. వసిష్ఠమహర్షి భార్య. (కులమింటికోతిని పెండ్లాడుటకంటె స్త్రీరత్నం దుష్కులాదపి అని ఏ కులమందలి స్త్రీయైనను గుణవతియగు కన్యను పెండ్లాడుట మంచిదందురు) మహర్షిని మాదిగయనవద్దు.

812 శిలను బ్రతిమఁజేసి చీకటింటనుబెట్టి, మ్రొక్క వలదు వెఱ్ఱిమూఢులార!
ఉల్లమందు బ్రహ్మముండుటఁదెలియుఁడీ, విశ్వదాభిరామ వినురవేమ॥

శిలాం తు ప్రతిమాం కృత్వా సంస్థాప్య చ తమోగృహే ।
న భజధ్వం జడోన్మత్తాః! బ్రహ్మ జానీత హృత్స్థితమ్ ॥

తా॥ నీ హృదయ మందలి పరమేశ్వరుని నంతర్వీక్షణమునఁ గాంచి ధ్యానించి తరించుము. అంతియకాని రాతిని బ్రతిమఁజేసి చీకటింటిలోఁ బెట్టి మ్రొక్కినంత మాత్రమున ముక్తిఁబడయనేరవు.

813 మాలవాఁడయినను మఱిమనసు మాలైనఁదను, మనసునిల్పలేని మాలకాఁడు
మనసునిల్పకున్న మహిమీఁదమాలఁడు, విశ్వదాభిరామ వినురవేమ॥

చండాలోఽపి న చండాలో యద్యాత్మని మనస్థితమ్ ।
యస్యాత్మసంస్థం న మనః చండాలః ఖలు వేమ! సః ॥

తా॥ పరిశుద్ధ మనస్సు కలవాఁడు మాలకాదు. అపరిశుద్ధ మనస్సు కలవాఁడే మాల.

814 తాతఁగన్నతల్లి తన తండ్రిఁగనుతల్లి, తన్నుఁగన్నతల్లి తల్లితల్లి
తల్లికూదురిరాలు తానెట్లుబాపఁడు?, విశ్వదాభిరామ వినురవేమ॥

పితామహస్య మాతా చ వేమ! మాతాపితు స్తథా ।
స్వమాతా మాతృమాతా స్యుః శూద్రా విప్రః కథం స్వయమ్?॥

తా॥ తన్నుఁగన్నతల్లి, ఆ తల్లి తల్లి, తండ్రినిగన్నతల్లి, తాతనుగన్నతల్లి, తల్లులందఱును శూద్రులేనా? (జందెపుత్రాడులేనివారే) తానేద్విజుఁడు? (సంస్కారమన యజ్ఞోపవీతధారణకాదు. అంతశ్శుద్ధి మానవత్వముల నుండి దానవత్వమునకు దిగజారక దేవత్వమునకు నర్హుఁడగుట)

315 తనదుతల్లివేశ్య తనయాలుమాదిగ, శ్రీపతికిగురువు వసిష్ఠుఁడరయఁ
దపముచేత ద్విజుఁడు తర్కింపఁగులమెట్లు?, విశ్వదాభిరామ వినురవేమ॥

జననీగణికా వేమ! మాతంగీ చాత్మనస్సతీ ।
గురుర్వసిష్ఠ శ్శ్రీజానేః ద్విజశ్శక్త్యా కులేన కిమ్?॥

తా॥ తల్లివేశ్య (ఊర్వశి) భార్య మాదిగ (అరుంధతి) ఇట్టి వసిష్ఠ మహర్షి శ్రీరామచంద్ర ప్రభువునకు కులగురువు, జ్ఞానగురువు. ఎంత తర్కించినను దపోమహిమచే ద్విజత్వముకాని కులముచేమాత్రముకాదు.

316 జాతిభేదములేక జన్మక్రమంబున, నెమ్మదిని నభవుని నిల్పనేని
నఖిలజనులకెల్ల నాతండెఘనుఁడయా, విశ్వదాభిరామ వినురవేమ॥

జన్మక్రమేణ హృదయే వినా జాతివ్యవస్థయా ।
యది స్థాపయతే దేవం వేమ! సర్వేషు సోఽధికః ॥

తా॥ జాతి, మతము, గోడపకాక పుట్టినది మొదలు సత్కర్మలచే మనఃపారిశుద్ధ్యమునకుఁ బ్రయత్నించుచు నట్టి పరిశుద్ధ మనమునఁ బరమేశ్వరుని ధ్యానించుచు విజ్ఞానమునఁ దత్త్వము గుర్తెఱింగినవాఁడే జనులందఱిలోను ఘనుఁడుసుమా.

317 ఊర్వివారికెల్ల నొక్క కంచముఁబెట్టి, పొత్తుఁగుడిపి కులముఁబొలియఁజేసి
తలనుజేయిపెట్టి తగనమ్మఁజెప్పరా, విశ్వదాభిరామ వినురవేమ॥

కులభేద మథఃకృత్య చైకపాత్రాన్నభోజినః ।
కృత్వా న్యస్య కరం శీర్షే వేమ! విస్రంభయ ప్రజాః ॥

తా॥ ప్రజలనందఱ సమైక్యపఱచి యొకే యొక కంచమునఁ దిను సోదరభావము కల్పించి కులములయంతరములు సమూలనాశనముఁ గావించి శిరస్సునఁ జేయియుంచి ప్రమాణముఁగావించి తత్త్వజ్ఞానమున నమ్మకము కుదురులాగునఁ జేయుము.

318 గట్టురాళ్ళఁదెచ్చి కాళ్ళఁద్రేళ్ళనుఁద్రొక్కి, కాసెయులులచేత గాసిఁజేసి
మొఱపరాళ్ళకెఱఁగు మొప్పెలనేమందు?, విశ్వదాభిరామ వినురవేమ॥

ఆనీయ పర్వతశిలాః పాదై రాక్రమ్య సర్వశః ।
టంకైః స్సంతత్య యే వేమ! భజంతే తే జడాః ఖలు ॥

తా॥ కొండరాళ్ళఁ దెచ్చి కాళ్ళను వ్రేళ్ళను ద్రొక్కి సేనముల నులుల నుపయోగించి పేడులూడఁదీసి చెక్కి బొమ్మఁజేసి దానికే మ్రొక్కఁ దొడంగిన మనమునకు మూఢత్వము తొలఁగఁగలదా ?

319 రాతిబసవనిగని రంగుగా మ్రొక్కుచు, రూఢిబసవనిగని క్రుమ్మ మంద్రు
బసవభక్తులెట్టి పాపులో! తలపోయు, విశ్వదాభిరామ వినురవేమ॥

శిలోత్థానాం ప్రేక్ష్య వేమ! నమస్కుర్వంతి సర్వశః !
సత్యోత్థానాం ఘ్నంతి దండైః తద్భక్తాః ఖలు పాపినః ॥

తా॥ మేము బసవభక్తులమని కొందఱు అజ్ఞానులు సజీవమగు వృషభమును గాళ్ళను దన్ని, చేతులఁ గ్రుమ్మి బాధఁ గూర్చి రాతినందికి పూజలు చేయుదురు. ఇట్టి భక్తు లెట్టి పాపులో యోచించుము. మానవుని జీవసామ్య మంపలి యసూయయే యిట్లు గావించుచున్నది కాబోలు !

320 సున్న మెత్తి కరిగి మఱి రూపుఁ గావించి, గుంటనింటఁ బూన్చి గుఱుతు నిలిపి
మనుజులెల్లఁ గూడి మఱి దేవుఁడందురు, విశ్వదాభిరామ వినురవేమ॥

మృదా లోహాదినా వేమ! కృత్వా చ ప్రతిమాం నరైః।
గర్తే గృహే చ సంస్థాప్య దేవోఽయమితి కథ్యతే ॥

తా॥ త్రొక్కిన మన్నునో కరిగిన లోహమునో యొక రూప మేర్పఱచి ఆలయమున గుంటలోఁ బాతి యొక గుఱుతుఁ బెట్టి దేవుఁడని పూజింపఁ గడంగుదురు. ఇదెంత యవివేకమో యోచించుఁడు.

321 తిరుమలకును బోవఁ దురక దాసరి కాఁడు, కాశికేగ లంజె గరిత కాదు
కుక్క సింగమౌనె గోదావరికిఁ బోవ? విశ్వదాభిరామ వినురవేమ॥

గత త్తిరుపతిం మ్లేచ్ఛో న దాసః కాశికాం గతా ।
రండా న సాధ్వీ వేమ! శ్వా న సింహో గౌతమీంగతః ॥

తా॥ కాశికిఁ బోయినంత మాత్రమునఁ గులట పతివ్రత కానేరదు. గోదావరికిఁ బోయినంత మాత్రమునఁ గుక్క సింహమగునా ? అట్లే మతనియమముల బద్ధుఁడగువాఁడును నెక్కడకుఁ బోయినను మఱియొక మతస్థుఁడు కానేరఁడు. తిరుపతి వెళ్ళినంతమాత్రమున తురక వైష్ణవ మతస్థుఁడును మక్కా వెళ్ళినంతమాత్రమున దాసరి తురకయుఁ గానేరఁడు.

322 కాశికాశియనుచుఁ గడు వేడ్కఁ బోదురు, అందుఁగలుగు దేవుఁ డిందు లేఁడె?
ఇందునందుఁగలఁడు హృదయంబు లెస్సైన, విశ్వదాభిరామ వినురవేమ॥

కాశీకాశీతి గచ్ఛంతి మూఢా దేవస్తు తత్రగః ।
కిం నాస్త్యత్ర ? హృదిస్వచ్ఛే వేమ ! సర్వత్ర వర్తతే ॥

తా॥ కాశీ, కాశీ, యని పలవరించుచు నక్కడకు వేడుకతోఁ బోవుదురు. అందున్న దేవుఁ డిందుమాత్రము లేఁడా? మనహృదయము బాగుపడిన నిందును నందునుఁగూడఁగలఁడు. వి॥ అనంతకర్మ శౌచం చ, జపయజ్ఞస్తథైవ చ, తీర్థయాత్రానుగమనం యాపత్తత్త్వం నవిందతి (ఉ॥ గీత)

323 నీళ్ళమునుఁగ నేల? నిధులమెట్టఁగ నేల?, మొనసి వేల్పులకును మ్రొక్కనేల?
కపటకల్మషములు కడుపులోనుండఁగా, విశ్వదాభిరామ వినురవేమ॥

కుక్షిస్థితే పాపపంకే గంగాస్నానై ర్నిధిప్రతైః
దేవతావందనై శ్చైవ కిం ఫలం వేమ ! చింతయ ॥

తా॥ కపటము మొదలగు కల్మషములు లోనఁబెట్టుకొని నీటిలో మునిఁగిననేమి ? నిధులఁ ద్రొక్కిననేమి ? ఎంతటి దేవతలకు మ్రొక్కిన నేమి ? కపటమునకుఁ దగిన ఫలితమును మాత్రమే యనుభవించును. వి॥ న దేవో విద్యతే కాష్ఠే న పాషాణే నమృణ్మయే, భావేహి విద్యతే దేవో తస్మాత్ భావోహి కారణమ్ ॥

324 పరఁగ జలకమాడి పట్టెనామముఁదీర్చి, నీరుకావిపంచె నెరయఁగట్టి
వారకాంతఁజూచి వ్రతమెల్ల మఱచురా, విశ్వదాభిరామ వినురవేమ॥

స్నాతోఽప్యూర్ధ్వపుండ్రం నిక్షిప్య ధృత్వా కాషాయ మంబరమ్।
వేశ్యాం వేమ ! నరోఽన్వీక్ష్య విస్మరత్యఖిలంవ్రతమ్ ॥

తా॥ ఒక్కొకఁడు స్నానముఁజేసి యూర్ధ్వపుండ్రములధరించి నీరుకావి పంచెలఁ గట్టి తుదకు భోగపుస్త్రీనిఁ జూచి వ్రతనియమము మఱచి నీచాతినీచుఁడగును. వి॥ తావద్వివేకవిభవ స్తావత్సన్మార్గవర్తనమ్ పుంసామ్, నిపతంతి దృష్టివిశిఖా యావ న్నేందీవరాక్షీణామ్॥

325 సకలతీర్థములను సకలయజ్ఞంబులఁ, దలఁచుకొనుఁగకున్న ఫలముకలదె?
మంత్రిజలముకంటె మంగలిజలమెచ్చు, విశ్వదాభిరామ వినురవేమ॥

సర్వతీర్థేషు యజ్ఞేషు శిరస్సంవపనాదృతే ।
న ఫలం తన్మంత్రజలాత్ వేమాంబష్ఠజలం ఘనమ్ ॥

తా॥ అన్ని తీర్థయాత్రాస్థలములందును అన్ని యజ్ఞప్రదేశము లందును మంగలిచే తలలు గొరిగించుకొన్నఁ గాని ఫలితము లేదందురు. మంత్రజలముకంటె మంగలి జలమునకే పవిత్రత కలదా యేమి ?

326 పట్టుబట్టఁగట్టి పట్టనామముఁబెట్టి, వట్టి భ్రాంతిఁజెంది వైష్ణవుఁడయి
లొట్టెతాగియతఁడు లోకులఁజెఱచురా, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ! కౌమాంబరం ధృత్వా చోర్ధ్వపుండ్రం నిధాయ చ।
వైష్ణవోహమితిభ్రాంతో జనాన్వంచతి మద్యపః ॥

తా॥ పట్టుబట్టలఁగట్టి పట్టనామములఁబెట్టి లొట్టెత్రాగి నేను వైష్ణవుఁడనను భ్రాంతిఁజెంది లోకులను పాడుజేయుచున్నాఁడు.

327 బాపలన్న మాత్రఁ బరువునఁజూడరు, కానిపనులఁజేయఁ గడలుకొనరు
కులము లెక్కయేమి? గుణమె ప్రధానంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

న సహంతే తుచ్ఛకార్యం నాద్రియంతే ద్విజా ఇతి ।
గణనా కా? కులస్యాహో! వేమ! ముఖ్యో గుణః ఖలు ॥

తా॥ కానిపనులఁ జేయుచు మేము బ్రాహ్మణుల మన్నంత మాత్రమున నెవరును గౌరవింపరు. గుణము ప్రధానముకాని కులముగొప్ప యెవరికావలెను ?

328 బ్రాహ్మణులకు సకలభాగ్యంబులీవచ్చు, గౌరవింపవచ్చుఁ గలియవచ్చు
జ్ఞానమొసఁగి జనులఁగడతేర్చువటులైన, విశ్వదాభిరామ వినురవేమ॥

జ్ఞానం దత్వా యది జనాం స్తారయిష్యంతి బాడబాః ।
తేషాం దేయం మహద్భాగ్యం సఖ్యం వేమాతిగౌరవమ్ ॥

తా॥ జ్ఞానమొసఁగి జనులఁదరింపఁ జేయువారైన బ్రాహ్మణులకే బోధకవర్గమని యెంచి సకల భాగ్యముల నీయవచ్చు. గౌరవింపవచ్చు, కలియవచ్చు. లేకున్న వారివలనఁ బ్రయోజనమేమి ?

329 ఒరులకొఱకు భూమి నొదిగించువారును, అవనిపతికి పశ్యులైనవారు
పాలవంటికులమువారు కాపులెఱుంగ, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ! భూమిపతే ర్వ్యశ్యా అన్యేభ్యో భూమికర్షకాః ।
క్షీరోపమకులోత్పన్నా ధన్యా భూపాలకా భువి ॥

తా॥ కృషిచేయువారు, భూమినుంచి యాహార పదార్థములనుత్పత్తిఁ గావించి ప్రజలఁగాపాడువారు, ప్రభువునకుఁ బ్రభుత్వమునకు నండగా వశ్యులైనుండువారునగు కర్షకవర్గమే పాలవంటి పవిత్రము స్వచ్ఛము నగు తెగసుమా.

330 కసవు నేరితిను పసరముఁదినువాని, మాలయండ్రుకాదె? మహిని నరులు
పట్టికోడిఁదిన్న బాపలటందురా, విశ్వదాభిరామ వినురవేమ॥

తృణాశి పశుఖాదీ య స్స'చండాల' ఇతీర్యతే ।
వేమ! కుక్కుటభోక్తారః కిం కధ్యంతే 'ద్విజా' ఇతి? ॥

తా॥ గడ్డితిను పశువును దినుటచే మాలయని బహిష్కరింతురు. కోడిని దినిన బ్రాహ్మణునిగా గౌరవింతురు కాబోలు !

331 పాలపిట్ట శకునఫలమిచ్చునందురు, పాలపిట్టకేమి ఫలముఁదెలియుఁ?
దనదు మేలుకీళ్ళు తనతోడనుండంగ, విశ్వదాభిరామ వినురవేమ॥

శాకునం తు ఫలం దత్తే క్షీరపక్షీతి కధ్యతే ।
కిం పక్షీ వేత్తి? వేమాహో! ఆత్మన్యేవ శుభాశుభే ॥

తా॥ తన మేలుకీడులు తనతోనుండుచుండ పాలపిట్ట శకునమిచ్చె నందురు. పాలపిట్ట కెటుల ఫలము దెలియఁగలదు ?

332 పాడికాఁగుజగతి పంచాంగములుసెప్పి, కొంచెమైన బుద్ధినొంచలేక
బ్రహ్మమెఱుఁగకిట్లు పౌరోహితముఁజేయు, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమాజితాత్మాఽనాత్మజ్ఞః వృథా పంచాంగజల్పనైః ।
పౌరోహిత్య కరశ్చేత్తత్ భవే దనుచితం భువి ॥

తా॥ కొంచెమైనను బుద్ధిని నదుపునఁ బెట్టలేక బ్రహ్మపదార్థముఁ దెలియఁజాలక యేవేవో పంచాగములఁ జెప్పుచు నిట్లు పౌరోహిత్యముఁ జేయుచుండుట తగనిపని.

333 ద్విజకులంబునందుఁ దేజరిల్లుచుఁబుట్టి, తాఁదరించి యొరుల దాటఁజేయ
లేనియాతఁడున్న లేకున్ననొక్కటే, విశ్వదాభిరామ వినురవేమ॥

భూత్వా ద్విజకులే తీర్ణః స్వయం నాన్యాం శ్చ తారయేత్।
య స్తేన వేమ! కో లాభో జీవితేన? మృతేన వా? ॥

తా॥ ద్విజకులమునఁ బుట్టి బ్రాహ్మణుఁడనని చెప్పికొనుచుఁ దాను తరించలేక యొరులఁ దరింపఁజేయలేక యుండువాఁ డున్ననులేకున్నను నొక్కటే. వి॥ వేదవేదాంగతత్త్వజ్ఞో విప్రస్సర్వత్రపూజ్యతే, అనధీత శ్రుతి ర్విప్రః సభామధ్యే న శోభతే ॥

384 ఐదువ్రేళ్ళబలిమి హస్తంబుపనిఁజేయు, నందొకటియువీడఁ బొందికచెడు
స్వీయుఁడొకఁడువిడినఁ జెడుఁగదా తనబల్మి?, విశ్వదాభిరామ వినురవేమ॥

పంచాంగుళిబలా ద్వేమ! కర్మాణి కురుతే కరః।
నైకోనోఽపి తథైకేన వినాప్నైతి స్వకం బలమ్ ॥

తా॥ అయిదువ్రేళ్ళ బలిమిచేతనే హస్తము పనిఁజేయునుకాని యందొకటి విడిపోయిన పూర్వపు పొందిక కుదురదు. అట్లే కావలసినవారిలో నొకఁడు విడిపోయిన సాంఘికబలము చెడునుకదా ?

335 సోమలతలరసము సోలలకొలదిని, డ్రావి మిగులఁ దామె చేవటండ్రు
క్రతుఫలంబు కంఠగతమగుఁగాబోలు?, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ! ప్రస్థమితం భూరి పీత్వా సోమలతారసమ్ ।
ధన్యంమన్యా శ్చరంత్యాహో! కంఠస్థం కిము తత్ఫలమ్? ॥

తా॥ సోమలతల రసము (తిప్పతీగెల సారా) సోలలకొలది త్రాగి నేనుసోమయాజిని నేనే ఘనుఁడననుచు. యజ్ఞఫలితము మద్యపానముననే కంఠగతమయినది కాబోలు ? వి॥ లోకే వ్యవాయామిషమద్యసేవా నిత్యాస్తు జంతో ర్నహి తత్ర చోదనా, వ్యవస్థితి స్తాసు వివాహయజ్ఞ సురాగ్రహై రాసునివృత్తి రిష్టా (భాగవతము) ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా, అష్టాదశోక్త మవరం యేషు కర్మ (ముండకోపనిషత్)

336 సముద్రయుంబునందు సర్వమొక్కటియైన, వైరమొకపద్దొట్టివారలైన
హెచ్చుతగ్గులందు చేర్పడురా హాని, విశ్వదాభిరామ వినురవేమ॥

సర్వస్మిన్ ప్రాపితే హ్యైక్యం సంఘూతే నాస్తి శాత్రవమ్ ।
న్యూనాధికక్రమే వేమ! వైరం హాని శ్చ జాయతే ॥

తా॥ అందఱు నొకచేయను సాముదాయిక భావమున విరోధమంత రించును. ఇఁక హెచ్చు తగ్గుల యంతరముననే హాని యేర్పడును.
వి॥ యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాభూ ద్విజానతః, కో మోహ స్తత్ర క శ్శోక ఏకత్వ మనుపశ్యతః (ఈశావాస్యోపనిషత్తు)

387 వేషధారినెపుడు విశ్వసింపఁగరాదు, వేషదోషములొకవిధమె యగును
రట్టుకాదె మున్ను రావణువేషంబు?, విశ్వదాభిరామ వినురవేమ॥

న విశ్వసే ద్వేషధరం వేషదోషౌ సమౌ ఖలు ।
పురావేషో రావణస్య వేమ! హానిప్రదోసను ॥

తా॥ వేషధారిని నమ్మకూడదు. వేషము, దోషము, రెండును సమానమైనవే. పూర్వము రావణాసురుని వేషమునమ్ముటచే సీతామహాసాధ్వి కెట్టి కష్టములు సంభవించినవి ?

388 ఊపిరున్నయపుడె యుపదేశమందుము, రూపుమాయు నెపుడొ రూఢిగాను
బాపఁడైననేమి? బడబాగ్ని మ్రింగునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

ప్రాణే స్థితే సోపదేశో భవ ప్రాణః కదావన ।
నశ్యే ద్వేమ! బ్రాహ్మణోఽపి కిం గ్రసేత్ బడబానలమ్? ॥

తా॥ ఊపిరియున్నయప్పుడే తరుణోపాయ మాలోచించుము. లేకున్న నెపుడో యీ తనువు రూపుమాయఁగలదు. ఎవడైననేమి ? బ్రాహ్మణుఁడైనంత మాత్రమున బడబాగ్ని మ్రింగఁగలఁడా ?

339 శూద్రయువతికొడుకు శుద్ధాంతరంగుఁడై, వేదవేద్యమైన పాదుఁదెలిసి
బ్రహ్మపదవిఁగన్న బ్రాహ్మణుఁడేకదా?, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ! శుద్ధాంతరంగస్సన్ శూద్రాపుత్రోఽపి మర్మవిత్ ।
యది బ్రహ్మపదం వేత్తి స బ్రాహ్మణ ఇతీర్యతే ॥

తా॥ శూద్రస్త్రీకి జనించి పరిశుద్ధాంతరంగుఁడై వేదవేద్యమగు పరబ్రహ్మము గుర్తెఱింగి బ్రహ్మపదవిఁగన్న బ్రాహ్మణుఁడే సుమా:

340 బ్రాహ్మణునకుమ్రొక్కి బలువీవెనలొసంగు, నాత్మశుద్ధికలుగు నాతఁడైనఁ
గలుగునన్ని కామి కంఠశోషయెసుమీ, విశ్వదాభిరామ వినురవేమ॥

నమస్కృతో వేమ! విప్రో దదాతి భృశ మాశిషః ।
యద్యాత్మశుద్ధ స్తా స్సర్వాః నోచేత్స్యాత్ కంఠశోషణమ్॥

తా॥ ఆత్మశుద్ధి కలుగు బ్రాహ్మణునకు నమస్కరింప నతఁడొసంగిన యాశీస్సులును వృథాకావు. లేకున్న కంఠశోషకాని మఱొండు కాదు.

341 బాపఁడైన నేమి? భక్తుఁడైనను నేమి?, యతియునైన నన్యుఁడైన నేమి?
ఇన్నియైన వెనుక నినజుండుపనిదీర్చు, విశ్వదాభిరామ వినురవేమ॥
భవతు బ్రాహ్మణో భక్తో యోగీ వా చేతరోఽపివా ।
సర్వేఽప్యేతే తతో వేమ ! హన్యంతే సమవర్తినా ॥

తా॥ బాపఁడగుఁగాక భక్తుఁడగుఁగాక యతియగుఁగాక మఱియొకఁడగుఁగాక కాలుఁడు తనపనికిఁ గనిపెట్టుకొనియే యుండును.

342 కల్లుద్రాగువాని కల్లుమ్రిచ్చవరాదు, కల్లలాడువాఁడె కల్లుమ్రిచ్చు
నిజముఁబల్కకున్న నీచచండాలుండు, విశ్వదాభిరామ వినురవేమ॥
నాధమో మద్యపాయీ స్యాత్ అధమోఽనృతభాషకః ।
న బ్రూతే వేమ ! యస్సత్యం నీచచండాల ఏవ సః ॥

తా॥ కల్లలాడువాఁడు త్రాగుఁబోతుకాని కల్లుత్రాగువాఁడు కాదు. నిజముఁబలుకనియతఁడే నిజమగు చండాలుఁడు.

343 దాసరనఁగవచ్చు వేసాలకైనను, జంగమనఁగవచ్చు లింగమున్న
బాపఁడనఁగరాదు పదివేలకైనను, విశ్వదాభిరామ వినురవేమ॥
బహుధా దాసతాహార్యః లింగవాన్ వేమ ! జంగమః ।
న వాచ్యో బ్రాహ్మణఇతి తథా దశసహస్రిశః ॥

తా॥ లింగమున్న జంగమనుము. ఊర్ధ్వపుండ్రములున్న దాసరనుము, పదివేలఁజెప్పనిమ్ము. సామాన్యుని బ్రాహ్మణుఁడనుటమాత్రము కూడదు.

344 దర్శనములయందు ధరమతమ్ములందు, వర్ణమాశ్రమముల వదలకెపుడు
తిరుగుచున్నవాఁడు ధరలోన నజ్ఞాని, విశ్వదాభిరామ వినురవేమ॥
దర్శనేషు మతేష్వేవ వేమ ! వర్ణాశ్రమేషు చ ।
నిత్యసక్తో య శ్చరతి స స్యా దజ్ఞానవాన్ భువి ॥

తా॥ ఆఱుమతములని, ఆఱుదర్శనములని, నాలుగు వర్ణములని నాలుగాశ్రమములని వదల కందే మూఢత్వమునఁ దిరుగువాఁ డజ్ఞాని.

345 టీకవ్రాసిన ట్లనేకులు పెద్దలు, లోకమంతచెప్పి శేకమనుచుఁ
గాకులట్టిజనులు కానరీమర్మమ్ము, విశ్వదాభిరామ వినురవేమ॥

లోకేఽనేకే బుధా వేమ ! టీకాకృత ఇవాబ్రువన్ ।
ఏకంబ్రహ్మేతి తన్మర్మ కాకాభా న విదుర్జనాః ॥

తా॥ పెద్దలు లోకమంతయు నేకమేయని స్పష్టముగా నొక్కి వక్కాణింప కాకులవంటి యజ్ఞాను లీ మర్మమేలకానరో తెలియకున్నది.

346 జాతిమతములందు జనులెల్లబద్ధులై, భావపరమునందుఁ బ్రాలుమాలి
చచ్చిపుట్టుచుందు్రి జడమతులై భువి, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ ! జాతిమతైర్బద్ధా శ్చాలసా భావసంగ్రహే ।
జాయంతే చ మ్రియంతే చ మానవా జడబుద్ధయః ॥

తా॥ జాతియని మతమని జనులందఱుఁ గొంతగొంత యావరణమున యథార్థము తెలిసికొనఁ జాలక బద్ధులగుచున్నారు. అట్టి యజ్ఞానులిట్లే చచ్చుచుఁ బుట్టుచు చర్వితచర్వణులై వెతల నొందుచుందురు.

347 గుడులుదేవతలని గుర్తులుగావింతు్రి, ముష్టిబాపలనుచు మూల్గనేల?
మొప్పెలనుదారి మరియుఁగఁజూపిరి, విశ్వదాభిరామ వినురవేమ॥

దైవతాన్యాలయానీతి చిహ్నం కుర్వంతి వేమ ! యే ।
తద్విప్రనిందయాలం తైః మూర్ఖాణాం దర్శితాగతిః ॥

తా॥ ముష్టిబాపలు గుడులని దేవతలని యేవేవియో గురులుగావింతురని యెందుకు మూలిగెదరు ? మూర్ఖులకు మొదట భక్తిమార్గ మలవడుటకే వా రట్లుగావించిరి.

348 బట్టెలట్టు లరవ ఫలమేమికలదయా, అందు సార్థకంబుఁ జెందకున్న
విన్నవారు వారి వెట్టులుగానెంతు్రి, విశ్వదాభిరామ వినురవేమ॥

యది సార్థకతా నాస్తి సమాభి ర్మహిమాపిరవైః ।
వాగ్భిః కిం ? వేమ ! మన్యంతే తా నున్మత్తాన్ జనాభువి ॥

తా॥ బట్టెలవలె యథార్థముఁదెలియని చదువఱచినంత మాత్రమున నేమి ఫలము ? విన్నవారు వారిని ఛాందసులని, యింగితజ్ఞాన శూన్యులని, వెట్టివారని భావించుటకే యుపయుక్తమగును.

349 ప్రాకటముగ నింతలోకమందున గుంటి, పల్లెముత్తఁడెన్నఁ బరమగుణుఁడు
అన్నదానమునను హరిభక్తిచేతను, విశ్వదాభిరామ వినురవేమ॥

హరిభక్త్యాన్నదానేన లోకేఽస్మిన్సకలేఽపి చ।
స్యాద్గుంటుపల్లీముత్తాఖ్యో గుణవాన్ వేమ! సర్వశః॥

తా॥ ఇంత లోకములోను అన్నదానముచేత హరిభక్తిచేత మంచివాఁడనిపించుకొనుటచే గుంటుపల్లిముత్తఁడే శ్రేష్ఠుఁడు.

350 ఋగ్యజుస్సులెఱిఁగి యోగ్యతలేకున్న, విప్రుఁడైన నెట్లువిహితుఁడగును?
భర్తకల్గి యన్యుభావింపసతివలె, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమర్గ్యజుర్వేదినోఽపి నౌచితీ యస్య విద్యతే।
స విప్రోఽపికథం పూజ్యః? జారేవ స్త్రీ సభర్తృకా॥

తా॥ భర్త కలిగియు నన్యుని భావించు స్త్రీవలె, ఋగ్యజుస్సామాది విద్య లభ్యసించియు యోగ్యతలేకున్న బ్రాహ్మణుఁడైనను నెట్లు గౌరవింపఁబడఁగలఁడు? శ్లో॥ యథా కాష్ఠమయో హస్తీ యథా చర్మమయో మృగః, యశ్చ విప్రోఽనధీయానః త్రయస్తే నామధారకాః, యోఽనధీత్య ద్విజో వేద మన్యత్ర కురుతే శ్రమమ్, సజీవన్నేవ శూద్రత్వ మాశుగచ్ఛతి సాన్వయః॥ (మనుస్మృతి)

351 మూఢభక్తిచేత ముక్కంటిఁబూజింప, ముక్తిబోయనరుఁడు ముక్తుఁడాయె
పూజకేమి? తనదు బుద్ధి ప్రధానంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

మూఢభక్త్యా శివం వేమ! పూజయిత్వా కిరాతకః।
ముక్తోఽభూత్ పూజయా కిం వా? స్వబుద్ధిస్తత్ర కారణమ్॥

తా॥ మూఢభక్తిచేత ముక్కంటిని బూజింపబోయబాలుఁడు ముక్తిఁగాంచెను. వాని పూజా విశేష మేమున్నది? అందుకు వాని బుద్ధియే ప్రధాన కారణమైనది.

352 కొండ దండిమామ కొండకూతురె యాలు, కొండమేటివిల్లు కొండయిల్లు
కొండవంటి దొరయు గుండయిపోయెను, విశ్వదాభిరామ వినురవేమ॥

శ్వశురస్తు గిరిశ్రేష్ఠ! భార్యాచ గిరినందినీ।
గిరిర్ధనుర్గిరిర్గేహం గిరితుల్యః శిలాఽభవత్॥

తా॥ కొండ (హిమవంతుఁడు) మామగారు. కొండకూతురు (పార్వతి) భార్య. కొండ (మేరుపర్వతము) ధనుస్సు. కొండ (రజతాద్రి) నివాసము. ఇట్టి కొండవంటి గొప్పదేవుని సైతము గుండ్రాతిని (లింగాకారమును) చేసి కూర్చుండఁబెట్టితిమి.

353 విష్ణుభక్తులెల్ల వెలిబూదిపాలైరి, వాదమేల? మతవిభేదమేల?
తెలియ లింగధరులు తిరుమణిపాలైరి, విశ్వదాభిరామ వినురవేమ॥

వాదైః కిం? మతభేదైః కిం? భస్మీభూతా హి వైష్ణవాః।
తథా లింగధరా వేమ! సర్వేష్వ్యర్మృత్తికామయాః॥

తా॥ విష్ణుభక్తులు భస్మమును హేళనఁజేసి తుదకు దహనసంస్కారమున భస్మమగుచున్నారు. శివభక్తులు తిరుమణిని (తెల్లమట్టిని) హేళనఁజేసి తుదకు ఖననసంస్కారమున మట్టియగుచున్నారు. ఇఁక వాదములెందుకు? మతభేదములెందుకు?

354 దొమ్మమాయ కొఱకు నమ్మవారికివేట, లిమ్మటంచ్రదేమి దొమ్మతెవులొ?
అమ్మవారిపేర నందఱుఁదినుటకా, విశ్వదాభిరామ వినురవేమ॥

పశుజాడ్యనివృత్త్యర్థం శక్త్యై పశుబలిం కురు।
ఇతి బ్రువంతి వేమాజ్ఞాః యత్నోఽయం కిం? స్వభుక్తయే॥

తా॥ దొమ్మ (పశువుల రోగము) పోపుటకు నమ్మవారికి వేటవెయ్యవలెనందురు. ఇదేమి వారికిఁబట్టుకొన్న దొమ్మతెవులో తెలియకున్నది. అమ్మవారిపేర దామంచయుఁ దినుటకుఁగాని బలియెందుకు?

355 మనసునదయలేని మాలకొడుకునొద్దఁ, జేరియున్న ప్రజకుఁ జేటునిజము
పెద్దతనములేదు పెంకెల కెపుడును, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ నిర్దయచిత్తస్య చండాలస్యాంతికే ప్రజా।
యది వర్తేత నశ్యేద్ధి నధూర్తానా మభిజ్ఞతా॥

తా॥ మనస్సున దయలేని చండాలుని చెంతఁజేరియున్న ప్రజకుఁ జేటుమూడుటనిజము. పెంకెలకు పెద్దతనము గుర్తించుశక్తియుండదు.

356 తగవుఁదీర్చువేళ ధర్మంబుఁదప్పిన, మానవుండు పాప మూనియుండు
ధర్మము నెపలికిన దైవంబుతోడగు, విశ్వదాభిరామ వినురవేమ॥

న్యాయోద్ఘాటనవేళాయాం యది ధర్మం త్యజే న్నరః।
పాపీ స్యా ద్వేమ ! తద్దైవం సాహాయ్యం ధర్మబాధినః॥

తా॥ తగవుఁ దీర్చునప్పుడు చాల ధర్మముగఁ బ్రవర్తింపవలెను. ధర్మముఁ దప్పి చరించిన పాపి యగును. ధర్మమార్గము వదలకున్న దైవముకూడ సహాయకారి కాఁగలఁడు.

357 **భావలాడకున్నఁ బరులు మెచ్చరుకాన, భావలాడవలయుఁ బరువుఁజూచి**
**భావపరువు తెలుఁగుఁ బరమాత్ముఁ డెఱుఁగును, విశ్వదాభిరామ వినురవేమ॥**

అబ్రువంతం పరే వేమ ! న శ్లాఘంతే తతోబుధః ।
ప్రతిష్ఠార్థీ వదేన్నిత్యం భాషాప్రాముఖ్యవి చ్ఛివః ॥

తా॥ మాట్లాడ కూరకున్న నెవ్వరును మెచ్చరుకాన మంచిమాటలని తోఁచినవే పలుకవలెను. తరువాత మాటల యొక్క గౌరవాగౌరవములా పరమాత్మకే తెలియఁగలవు.

358 **వావివర్తనలును వరుసలు మర్యాదఁ, దప్పినడిచెనేని దగులుఁ గీడు**
**వదలదెపుడుఁ దాను పందురఁ దప్పదు, విశ్వదాభిరామ వినురవేమ॥**

మర్యాదాక్రమ ముల్లంఘ్య చరేద్యది విపశ్చవేత్ ।
సదా నాప్నైతి సా వేమ ! దుఃఖం చ స నివార్యతే ॥

తా॥ వావులు వరుసలు నియమములు మర్యాదలు మీరి సంచరించినఁ గీడు తగులక మానదు. తరువాత పశ్చాత్తాపపడిన లాభముండదు.

359 **హింసఁజేయకుంటయే ముఖ్యధర్మంబు, ప్రాణిఁజంపితినెడువారికన్న**
**గావుపసువుఁదినెడి చండాలుఁడే మేలు, విశ్వదాభిరామ వినురవేమ॥**

అహింసాపరమోధర్మో హ్యేష వేమ ! ప్రాణిఖాదినః ।
తేభ్యోఽపి మృతపశ్వాశీ వరం చండాల ఏవ హి ॥

తా॥ హింస చేయకుండుటయే పరమ ధర్మము. "అహింసా పరమో ధర్మః" ప్రాణిని జంపి తినెడివారికన్న చచ్చిన పశువు మాంసము దిను చండాలుఁడు మంచివాఁడు కాదా?

360 **వేమఁడిట్లు సెప్పు వేలపద్యంబులఁ, దప్పు లెన్నియున్న నొప్పెయుండు**
**తత్తరపడకుండు బిత్తరిపైయుండు, విశ్వదాభిరామ వినురవేమ॥**

వేమ ప్రోక్తేషు పద్యేషు సంతు దోషా స్సహస్రశః ।
తథాపి గుణసంవాస్తే వేమ ! ప్రాప్నుహి ధీరతామ్ ॥

తా॥ కంగారు పడక ధైర్యమువహించి స్థిరబుద్ధితో నాలోచించిన వేమనయోగి చెప్పిన వేలకొలఁది పద్యములయందును నేదైనఁ దప్పుగాఁ దోచినను తుద కందుండుసది యొప్పేకాని తప్పయి యుండదు.

# సాంసారిక విభాగము

361 కూటికి నెడబాసి కూర్చున్న మనుజుఁడున్, వెలదులఁగనుఁగొన్న వెతలఁజిక్కు
వెలఁగి యగ్నిఁజూచు శలభంబుచాడ్పున, విశ్వదాభిరామ వినురవేమ॥

అన్నచింతాజ్వరార్తోఽపి వేమాన్వీక్ష్య పుమాం స్త్రియః ।
జ్వలంతం జ్వలనం దృష్ట్వా పతంగఇవ ముహ్యతి॥

తా॥ అగ్నినిజూచి భ్రమించి యందుపడి తగులఁబడుమిడతవలె కూటికి గతిలేని యసమర్థుఁడును స్త్రీ మోహమునఁ జిక్కి పలుబాధ లనుభవించు చున్నాఁడు, వి॥ అహాహ ! గహనో మోహమహిమా॥ (భర్తృ)

362 ఎవ్వరిగుణములును నేమన్న మానవు, చక్కఁజేయరాదు కుక్కతోఁక
గడుసురాలు మగనిగంపఁబెట్టియు నమ్ము, విశ్వదాభిరామ వినురవేమ॥

స్వగుణా న నివర్తంతే,శ్వపుచ్ఛం యాతి నార్జవమ్ ।
పరిగల్భా వేమ! నిక్షిప్య విక్రీణాతి పిటే పతిమ్ ॥

తా॥ కుక్కతోఁక సరిచేయుట కెట్లసాధ్యమో యట్లే యెవరెవరి సహజనీచగుణములును సరిచేయ నసాధ్యమైనవే. ఎన్ని పతివ్రతానియమములు విన్నను నొక్కొక్క గడసరిది భర్తను గంపలోఁబెట్టి యమ్ముటకే ప్రయత్నించును కదా ?

363 అంగమెల్లవదలి యటుదంతములునూడి, తనువుముగిమిచేతఁ దఱచు వణఁక
ముప్పతిప్పలఁబడి మోహంబువిడువఁడు, విశ్వదాభిరామ వినురవేమ॥

దేహే జర్జరితే వేమ! దంతేషు గళితేష్వపి ।
జరయాంగే వేపమానేఽప్యార్తో మోహం న ముంచతి ॥

తా॥ శరీరము పట్టువదలి దంతము లూడిపోయి, ముసలితనమున శరీర మెంతగా [illegible] కష్టములు పొందుచున్నను మానవుఁడు మోహము మాత్రము విడువఁజాలకున్నాఁడు.

384 ఆడువారిఁగన్న నర్థంబుఁజూడఁగన్న, సారమైనరుచుల చవులుఁగన్న
అయ్యగార్లకైన నాశలుపుట్టవా?, విశ్వదాభిరామ వినురవేమ॥

కాంతాం చ కనకం దృష్ట్వా వేమ! సారాన్వితాన్ రసాన్।
గురూణా మపి చార్యాణాం ద్రాగాశా న భవంతి కిమ్?॥

తా॥ ఆడువారిని ధనమును మంచిమంచి రుచులుగల పదార్థములను జూచిన నెట్టిప్రబుద్ధునికైన నాశపుట్టకమానదు. వి॥ పీత్వా మోహమయీం ప్రమాదమదిరా మున్మత్త భూతం జగత్ ॥ 2 వినా మే మృగశాబాక్ష్యా తమోభూత మిదం జగత్॥ భర్తృ॥

365 స్త్రీలసుఖముఁజూచి చిత్తంబు నిలుకడ, సేయనిమనుజుండు చెడునిజంబు
ఏటిగట్టుమ్రాను కెప్పుడుఁజలనంబె, విశ్వదాభిరామ వినురవేమ॥

స్త్రీసుఖం ప్రేక్ష్య యచ్చిత్తం నిగ్రహీతుం న శక్యతే।
స నశ్యేత్ కంపితో వేమ! నదీతీరద్రుమో యథా॥

తా॥ ఏటిగట్టుననున్న చెట్టున కెప్పుడైన నేటిపోటువలన ప్రమాదము కలుగకమానదు. అట్లే స్త్రీసుఖముఁగాంక్షించి మనస్సునునిలుపుకొనలేని మానవుఁడెన్నటికైన చెడిపోవుటనిజము.

366 కూలినాలిచేసి గుల్లాపుపనిఁజేసి, తెచ్చిపెట్ట నాలు మెచ్చునేర్చు
లేమిఁజిక్కువిభుని వేమాఱుఁదిట్టును, విశ్వదాభిరామ వినురవేమ॥

భృత్యా చ సేవయా విత్తం అర్జయిత్వా భిభర్తి చేత్।
శ్లాఘతే శతశో భార్యా వేమ! నిందతి నిర్ధనమ్॥

తా॥ కూలిపనో, నాలిపనో లేక యేనీచమగు సౌఖరియో చేసి తెచ్చిపెట్టు మన్న భార్య గౌరవముగాఁజూచునుగాని సంపాదించలేక దరిద్రముతో బాధపడుచున్న భర్తను పలుసార్లుతిట్టుచు మిక్కిలి వేధించుచునేయుండును.

367 వెఱ్ఱివానికైన వేషధారికైన, రోగికైనఁ బరమయోగికైన
స్త్రీలఁజూచినపుడు చిత్తంబు రంజిల్లు, విశ్వదాభిరామ వినురవేమ॥

ఉన్మత్త స్యాత్తవేషస్య రోగిణో యోగినోఽపివా ।
యోషితాం దర్శనే వేమ! ద్రవీభవతి మానసమ్ ॥

తా॥ వెట్టివాఁడగుఁగాక వేషధారియగుఁగాక రోగియగుఁగాక యోగియగుఁగాక యెట్టివానికైన స్త్రీలఁజూచినప్పుడు చిత్తము చలించకమానదు. వి॥ కంస వశీకురుతే భువి రామా (భర్తృ)

368 **గుణవతియగుయువతి గురముచక్కఁగనుండుఁ, జీకటింట దివ్వెచెలఁగురీతి**
**దేవియున్నయిల్లు దేవార్చన గృహంబు, విశ్వదాభిరామ వినురవేమ॥**

యువతీ యా గుణవతీ వేమ! తత్సద్మ రాజతే ।
సా దీపికా తమోగేహే తచ్ఛ దేవార్చనాలయమ్ ॥

తా॥ గుణవంతురాలగుభార్య యున్న యిల్లు చీకటింటిలో దీపమువలె ప్రకాశించును. అట్టియిల్లు దేవతార్చనగృహమువలె పవిత్రమైనది.

369 **మగనికాలమందు మగువకష్టించిన, సుతులకాలమందు సుఖము నొందు**
**కలిమిలేమి రెండుఁగల వెంతవారికిన్,విశ్వదాభిరామ వినురవేమ॥**

భర్తృకాలే వేమ! కష్టం యది ప్రాప్నోతి మానినీ ।
పుత్రకాలే సుఖం భుక్తే సకలం సుఖదుఃఖగమ్॥

తా॥ కలిమి లేమి యనునవి యెంతవారికైనకలవు. కాన మగనికాలమందు భార్యకష్టించిన సుతులకాలమందైనను సుఖ మొందఁగలదు.

370 **దొంగతనము అంకు దొరసియుండుజగతి, అంకులాడి కింట శంకపుట్టు**
**దొంగకన్న రేవెలుం గొప్పకానట్లు, విశ్వదాభిరామ వినురవేమ॥**

చోరత్వం వేమ! జారత్వం వ్యాప్త మేతద్ద్వయం భువి ।
జారాయా స్తు గృహే శంకా జ్యోత్స్నా చోరస్య నేష్యతే ॥

తా॥ దొంగతనము అంకుతనము రెండును గొంచె మెంచుమించు సమానములైనవే. మంచివీరికిఁబనికిరాదు. అందఱికిసంతసముఁ గల్గించు వెన్నెల దొంగకిష్టము కానట్లే సుఖముఁగల్గించు తనయిల్లును అంకులాడి కిష్టముకాదు.

371 **ఆపదందుఁజూడు మూరసిబంధుల, భయమువేళఁజూడు బంటుగుణము**
**పేదపడినవెన్క పెండ్లాముగతిఁజూడు, విశ్వదాభిరామ వినురవేమ॥**

బంధూన్ విపది వీక్షస్వ భటస్యాపి గుణం భయే ।
సంప్రాప్తే వేమ! దారిద్ర్యే గతిం పత్న్యా విలోకయ ॥

తా॥ బంధువుల యాదరణ యెట్టిదో యాపదసమయమునఁ జూడుము. సేవకునిగుణ మెట్టిదో భయసమయమునఁ జూడుము. పెండ్లాము ప్రేమ యెట్టిదో పేదఱికమునఁ జూడుము.

372 మగఁడు మదనుఁడైన మంచికాపురమైన, సహజ మేలమాను? జారకాంత
పాలుఁ ద్రావుకుక్క పడిపడిపోవదా? విశ్వదాభిరామ వినుర వేమ॥

పతి ర్మన్మథతుల్యోఽపి ససౌఖ్యమపి జీవితమ్ ।
నాస త్యజతి నైసర్గ్యం యథా శ్వా వేమ! దుగ్ధపః ॥

తా॥ పాలుపోసి పెంచుచున్నకుక్కయైనను నేదో మునిగిపోయినట్టు వెంటకే పడిపోవును. అట్లే మన్మథునివంటిమగఁడైనను మంచికాపురమైనను జారిణి తనసహజమునుమాత్రము వీడఁజాలదు.

373 పురుషుఁ డెఱుఁగఁ జంపు భూపతిసేఁజేటు, అఖిలనిందలకును నాలయంబు
పరపురుషగమనము ప్రత్యక్షనరకంబు, విశ్వదాభిరామ వినుర వేమ॥

యది వేత్తి పతి ర్హంతి విపద్భవతి భూవరాత్ ।
సర్వనిందాస్పదం వేమ! కౌలట్యం నిరయం ఖలు ॥

తా॥ భర్తకుఁ దెలిసినఁ జంపును. ప్రభువునకుఁ దెలిసిన ప్రమాదము. అన్నిందలకుస్థానము. ఇట్టిపరపురుషభ్రాంతిస్త్రీకి ప్రత్యక్షనరకముసుమా.

374 అలివంచలేక యధమత్వమునసుండి, వెనుకవంతుననుట వెఱ్ఱితనము
చెటుముదురనిచ్చి చిదిమినఁబోవునా?, విశ్వదాభిరామ వినుర వేమ॥

వశీకర్తు మశక్త స్త్రీస్సం పశ్చాదిత్యుక్తి రజ్ఞతా ।
వృక్షః ప్రవృద్ధో హి నఖై శ్ఛేత్తుం కిం వేమ! శక్యతే? ॥

తా॥ చెట్టునుముదరనిచ్చి గోటునుదునిమినఁబోవునా? అట్లేభార్యను మప్పునఁబెట్టలేక యధముఁడై యెప్పుడో ముందునదుపునఁ బెట్టుదుననుట వెఱ్ఱితనముసుమా.

375 అలుమగనిమాట కడ్డంబువచ్చెనా, అలు కాదు వాని ప్రాలుకాని
అట్టియాలివిడిచి యడవినుండుట మేలు, విశ్వదాభిరామ వినుర వేమ॥

యాతిక్రామతి పత్యుక్తిం స సా భార్యా హ్యసద్గుణా।
లలాటలిఖితం వేమ! తాం త్యక్త్వా విపినం వ్రజేత్ ॥

తా॥ ఆలు మగనిమాట కడ్డముతగులునదియైన నది యాలు కాదు వానితలవ్రాలు. అట్టిభార్యనువిడిచి యడవిలోనుండుటే సుఖప్రదము.

376 మాటవిననియాలు మగనికిమృతియౌను, ఓరపడఁగసర్ప మొంటిగృహము తనకుఁగానియాలు దానవురాలయా, విశ్వదాభిరామ వినురవేమ॥

భార్యా త్వవశ్యా పత్యుస్స్యాత్ మృతి ర్దంశోద్యతః ఫణీ।
దేహోవిష్టా పిశాచీ చ రాక్షసీ హ్యాత్మవైరిణీ ॥

తా॥ మాటవినిపించుకొననియాలు మగనికిమృత్యుదేవత. కఱచుటకు సిద్ధముగపడగనెత్తిపెట్టిన క్రూరసర్పము. వంటిపంటి పెట్టుకొనియుండు దయ్యము. సాక్షాత్తు తనకుఁగాను నవతరించిన రాక్షసి.

377 ఓజమాలుపోలఁతి యాలిమాడలచేటు, పోటుకెడలుబంటు కూటిచేటు పనికిమాలుతొత్తు బత్తెంబుచేటురా, విశ్వదాభిరామ వినురవేమ॥

అసతీ కుల్యనష్టస్స్యాత్ భటో భీతోఽన్ననష్టయే।
భృతినష్టై భవే ద్వేమ! దాసి కార్యేషు కృత్రిమా ॥

తా॥ పనికిమాలినభార్య ఒలిదండుగ. యుద్ధమునకు జంకుభటుఁడు భోజనముదండుగ. పనిచేయనిదాసీ భత్యము దండుగ.

378 కల్లలాడువాని గ్రామకర్తయెఱుంగు, సత్యమాడువాని సామియెఱుఁగు పెక్కుతిండిపోతుఁ బెండ్లా మెఱుంగురా, విశ్వదాభిరామ వినురవేమ॥

మిథ్యాభిభాషిణం వేత్తి గ్రామణీ స్సత్యవాదినమ్ ।
స్వామీ వేత్తి తథా వేమ! భార్యా వే త్త్యతిభక్షకమ్ ॥

తా॥ అబద్ధములాడువానిసంగతి గ్రామపెద్దకుఁదెలియును. నిజమాడువానిసంగతి యజమానికిఁ దెలియును. తిండిపోతుమగనిసంగతి పెండ్లామునకుఁదెలియును.

379 కలిమికలిగెనేని గాముఁగాఁజూతురు, లేమిచేతఁ జిక్కలేవలేని మదనువంటిమగని మాలఁగాఁజూతురు, విశ్వదాభిరామ వినురవేమ॥

సంపన్నంపురుషం కామం మన్యంతే వేమ! యోషితః ।
పశ్యంతి కామసదృశం చండాలమివ నిర్ధనమ్ ॥

తా॥ కలిమికలిగినమగని కురూపియైనను మన్మథునివలె భార్య చూచును. లేమిచేఁజిక్కి లేపలేని మన్మథునివంటి మగనినైన మాలఁగాఁ (అంటరానివానినిగా) చూచును.

380 విటులకనుల కెంతొ విభ్రమమైయుండు, సాటిలేని పొలఁతి చక్కఁదనము
కంటిలోనిపాప కంటెనుగాఁదయా, విశ్వదాభిరామ వినురవేమ॥

యోషిల్లావణ్య మనఘం భ్రాంతిదం విటచక్షుషామ్ ।
నేత్రైకనీనికా వేమ! చిత్ర స్యాత్ ప్రీతమర్దకః ॥

తా॥ స్త్రీయందమెట్టిదైనను విటునికంటికి ఎంతో యాశ్చర్యముఁ గలిగించుచుండును. వానికంటిలోని చెడుపాపయు వానికి తారుచుకత్తె యిమూ. వి॥ వైవాస్యనిలతా యుక్తా వియుక్తా విషవల్లరీ (భర్తృ)

381 గురువుకుచ్చి పుచ్చుకూరైననీయడు, అడుగు శిష్యుకిచ్చు నర్థమెల్ల
గురుఁడు శిష్యుకన్న గుణహీనుఁడే మొకో!, విశ్వదాభిరామ వినురవేమ॥

పుష్పితస్తు చామ్లకం గురవే న దదాత్యహో! ।
శిష్యాయైవ దదాత్యర్థం తస్మాత్ వేమ! కిం గురుః? ॥

తా॥ ఉంపుడుకత్తెకు (బెక్కుధనము లిచ్చునుకాని గురువునకు పుచ్చి పోయిన కూరగాయలనైన నీయఁజాలఁడు. గురువు,దానికంటెఁగూడ చెడిపోయినవాఁడా ?

382 తీపిలోనఁదీపి తెలియంగఁబ్రాణంబు, ప్రాణవితతికన్నఁ బసిడితీపి
పసిడికన్న మిగులఁ బడఁతిమాటలుతీపి, విశ్వదాభిరామ వినురవేమ॥

మధురేభ్యశ్చ సర్వేభ్యః ప్రాణో మధుర ఏవ హి ।
ప్రాణాత్ స్వర్ణం తతో వేమ! మధురం తరుణీవచః ॥

తా॥ అన్నితీపివస్తువులలోను ప్రాణము తీపి. ప్రాణముకంటె ధనము తీపి. ధనముకంటెఁగూడ ప్రియురాలిమాటలధికమగు తీపికలవిగా నుండును. వి॥ తస్మైనమో భగవతే కుసుమాయుధాయ. (భర్తృ)

383 పనసతొనలకన్నఁ బంచదారలకన్న, జుంటితేనెకన్న జున్నుకన్న
చెఱకురసముకన్నఁ జెలిమాటతీపిరా, విశ్వదాభిరామ వినురవేమ॥

శర్కరా మధు పీయూష పనసేక్షురసాదపి ।
ప్రేయసీవచనం నూనం, వేమాతిమధురం భువి ॥

తా॥ పనసతొనలకన్నను పంచదారకన్నను పట్టుతేనెకన్నను జున్ను కన్నను చెఱకురసముకన్నను ప్రియురాలిమాట లధికతమమగుతీపిసుమా.

384 కొమ్మదిమ్మరైన దిమ్మరులనె కోరు, సరసవిటుల నేలసమ్మతించు?
పేడఁదినెడిపురుగు బెల్లమే మెఱుఁగురా, విశ్వదాభిరామ వినురవేమ॥

జారాస్త్రీ కాంక్షతే జారాన్ సరసాన్ వేమ! నేచ్ఛతి।
గోమయాశీ కృమి స్స్వయ్య క్కింవేత్తి మధురం గుడమ్?॥

తా॥ పేడఁదిను పురుగునకు బెల్లపురుచి తెలియనేరదు. అట్లే చెడు జారిణియుసరసవిటులను గోరక దుర్వ్యసనలోలురగునీచవిటులనేకోరును.

385 కుక్కయేమెఱుఁగు గురులింగజంగంబుఁ జిక్కయొడిసిపట్టి పీకుఁగాని
సంతపాకతొత్తు సన్యాసినెఱుఁగునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

కిం వేత్తి శివభక్తం శ్వా జంఘా మాకృష్య దంశతి।
ఆపణేరీ రతా దాసీ వేమ! కిం వేత్తి యోగినమ్?॥

తా॥ సంతలో పాకవేసికొని వ్యభిచరించు దాసికి సన్యాసి ప్రవర్తన మేమి తెలియఁగలదు? లింగధారియై శివభక్త వేషమునసున్న మహనీయుఁడగు జంగమదేవర సంగతి కుక్కకుఁ దెలియఁగలదా? పిక్కపట్టి పీకుటయే దానికిఁ దెలియును.

386 తనదునృపతితోడఁ దగనాయుధముతోడ, నగ్నితోడఁ బరునియాలితోడ
హాస్యమాడుటెల్లఁ బ్రాణాంతమౌ సుమ్ము, విశ్వదాభిరామ వినురవేమ॥

స్వస్వపాలే నాయుధేన వహ్నినా పరభార్యయా।
హాస్యప్రవర్తనం వేమ! భవేత్ ప్రాణాంతకం నృణామ్॥

తా॥ ప్రభువుతోను, ఆయుధముతోను, అగ్నితోను, పరునిభార్యతోను హాస్యమాడుట ప్రాణాంతకమౌను జుమా!

387 తరుణి సొగసుగానిఁ దనయునిగన్నను, మరునికిలమించి మనముజాఱు
పాపజాతిమనముఁ బట్టంగరాదయా, విశ్వదాభిరామ వినురవేమ॥

అన్వీక్ష్య సుందరంపుత్ర మపిస్యాత్ స్త్రీస్మరార్దితా।
మానసం వేమ! పాపిష్ఠం నిగ్రహీతుం న శక్యతే॥

తా॥ అందగానిని కుమారునివరుసవానిని గాంచినను, యువతికి మన్మథావస్థకలిగి మనస్సు భ్రమించును. మనస్సుచాల పాపిష్ఠిది. దానిని జారకుండ నిలుపుట చాల కష్టము. కాన జాగ్రత్త వహించుట మంచిది.

**388 తేనె పంచదార తియ్యమామిడిపండుఁ దిన్నఁగాని తీపి తెలియరాదు,**
**కన్నవింపుపుట్టుఁ గామినీయధరంబు, విశ్వదాభిరామ వినురవేమ॥**

శర్కరాయా మధో ర్వేమ ! రసాలస్య చ మాధురీ ।
జ్ఞేయా నాస్వాదితో జ్ఞేయా వీక్షితో యోషిదోష్ఠయోః॥

తా॥ తేనె, పంచదార, తియ్యమామిడిపండు తిన్ననుగాని తీపి తెలియఁబడదు. కాని స్త్రీ యధరముతీపి చూచిన మాత్రముననే తెలియఁబడును.

వి॥ క శ్చుంబతి కులపురుషో వేశ్యాధరపల్లవం మనోజ్ఞ మపి । చారభట చోరచేటకనటవిటనిష్ఠీవనశరావమ్ ॥ (భర్తృ)

**389 సుతులవలనఁ బుణ్యసుఖమునొందుదమని, మనుజుఁడుండుఁ గర్మమతముఁదవిలి**
**ఏనుఁగుపడియున్న నెత్తునా మశకంబు?, విశ్వదాభిరామ వినురవేమ॥**

పతేత్ [illegible] ప్రత్యాప్తికర్మిహ చింతతి ।
వారణం [illegible] ! మశకః కథ ముద్ధరేత్ ?॥

తా॥ ఏనుఁగు పడిపోయిన [illegible] గె యెత్తవలెనుగాని దోమ యెత్తఁగలదా? అట్లే మానవుఁడు కర్మకాండములో సుతులవలన సుఖమును పొందవచ్చునని భ్రమించి [illegible] యుండును.

**390 వాడసతికితిట్టి పలవన్నె మొగముఁ జిట్లి, ముందు మగనితిట్టి ముసుఁగుఁబెట్టి**
**గడుసురాలు మగని కంపఁబెట్టియు నమ్ము, విశ్వదాభిరామ వినురవేమ॥**

వధ్వాం నిందే ద్వేమ ! రుద్ధా [illegible] తదగ్రే పతిం శపేత్ ।
స్వాత్మాపలుంఠా పిటగం విక్రీణాం త్వసతీ పతిమ్ ॥

తా॥ ధూర్త, వాడుపెళ్ళికి తిట్టును. వద్దంటే పెద్దపెట్టున నేడ్చును. మగనిని ముందు తానేతిట్టి మగఁడేదియో యన్నట్లు మూతి బిగించి ముసుగుపెట్టి పరుండును. ఇంకను మగనిని నేమైనఁజేయఁగలదు.

**391 ఆలు రంభయైన నతిశీలవతియైన జారపురుషుఁ డేల జాడమాను ?**
**మాలవాడఁగుక్క మరిగినచందంబు, విశ్వదాభిరామ వినురవేమ॥**

స్వభార్యాం సాధుశీలాపి రంభాభాపి స్త్వైఖరీమ్ ।
జారో నోజ్ఝతి వేమ ! శ్వా యథా చండాలవాటికామ్॥

తా॥ మాలవాడలో మాంసము తినసుబిగిన కుక్కవలె భార్య రంభ వంటి రూపముకలదియైనను పతివ్రతయైనను జారపురుషుఁడు తన పద్ధతిని మాత్రము మానఁజాలఁడు.

392 కలిమినాఁడు మగని కామించిచూచును, లేమిఁజిక్కునాఁడు లేవకుండు
మనినమగనినైన మడిసినట్లుగఁజూచు, విశ్వదాభిరామ వినురవేమ॥

సకామా విభవే పత్యౌ దారిద్ర్యే నాభిమన్యతే ।
జీవంతమపి తం వేమ ! పశ్యేన్మృతమివాంగనా ॥

తా॥ కలిమి కలిగిననాఁడు మగనినెంతగనో కామించి ప్రేమించును. లేమిచేఁ జిక్కియున్ననాఁడు లేచి గౌరవించుటకుఁగూడ నిష్టపడదు. సరికదా బ్రతికియున్న మగనినైనను జనిపోయిన వానినిగనే చూచును.

393 కడు విచిత్రమైన మరయంత్రమును, పువ్వుబోడిచుక్కబొట్టుఁగన్నఁ
గాంచిబెళుకుఁగన్నఁ గడు సొక్కుపుట్టురా, విశ్వదాభిరామ వినురవేమ॥

అహో ! చిత్రం కామయంత్రం స్త్రీబిందుతిలకం పుమాన్ ।
ధాళధళ్యం మేఖలాయా దృష్ట్వా వేమ ! విముహ్యతి॥

తా॥ ఆ మన్మథయంత్రము చాల విచిత్రమైనది. స్త్రీని జూచిన మోహము కలుగుటగొప్పకాదు. పూఁబోడి చుక్కబొట్టుఁజూచినను నడుమునకుఁ బెట్టుకొను వడ్డాణము సొగసుఁ గాంచినను గూడ మోహమును గొల్పును. వి॥ స్త్రీణాం మేతద్భూషణం చాయుధం చ (భర్తృ)

394 కనకమొదల మంచికాంతలయెడలను, వలచియుండు రెంతవారలైనఁ,
దోయజాక్షిఁబాయు దొరలెవ్వరునులేరు, విశ్వదాభిరామ వినురవేమ॥

కాంతాసు కనకే చైవ ముహ్యంతి ఖలు పండితాః ।
యోషిద్విమోచితాత్మానః కేఽపి వేమ ! న సంతి హి ॥

తా॥ ధనముఁజూచినను సుందరాంగులఁజూచినను నెంతవారలైనను భ్రాంతిని గలిగియుందురు. అందునను స్త్రీ భ్రాంతికిఁజిక్కని మహానీయు

లెవ్వరును గాన్పించకున్నారు. వి॥ సంసారేణ కదర్థితా వయ మహో! మోహోన్న లజ్జామహే (భర్తృ) సంగాత్సంజాయతేకామః కామాత్క్రోధోఽభిజాయతే, క్రోధాద్భవతి సంమోహః సమ్మోహాత్ స్మృతి విభ్రమః॥ (గీత)

395 తొత్తుతోడిపొందు దోషంబుదోషంబు, లంజతోడిపొందు లజ్జచెడును
జారతోడిపొందు చావుకమూలమౌ, విశ్వదాభిరామ వినురవేమ॥

దాసీసంగో మహాన్ దోషః వేశ్యాసంగ స్త్రపావహః।
జారాసంగస్తు వేమేహ మృత్యోర్మూలం న సంశయః॥

తా॥ దాసిపొందు చాల దోషము. లంజపొందు మానభంగము. ఇఁక పదిమందితో వ్యవహరించు జారిణిపొందు ప్రాణములఁదీయునదిరా.

396 సాధుచరితమైన సతి సత్ప్రవర్తన, జార యేమెఱుంగు? సాధువైన,
బ్రహ్మనిష్ఠయెఱుఁగుఁ బ్రాకృతుఁడెఱుఁనా? విశ్వదాభిరామ వినురవేమ?॥

సద్వృత్తం యోషితః స్సాధ్వ్యాః కిం విజానాతి పుంశ్చలీ?।
సాధు ర్వేత్తి బ్రహ్మనిష్ఠాం ప్రాకృతో వేమ! వేత్తి కిం?॥

తా॥ సత్పురుషునకే బ్రహ్మనిష్ఠ తెలియఁ బడును కాని సాధారణ మానవునకదెట్లు తెలియఁ బడఁగలదు? అట్లే పతివ్రత ప్రభావము జారిణికినిఁ దెలియఁబడదు.

397 చక్కఁదనములేల? సంపత్కరములేల? విద్యయేల? భూమివిరివియేల?
పుత్రిపదవికన్నఁ బుట్టునాపదవులు?, విశ్వదాభిరామ వినురవేమ॥

సౌందర్యేణ చ సంపత్త్యా భూవిస్తృత్యా చ విద్యయా।
కిం ఫలం వేమ! తత్సర్వం కిం పుత్రకపదా ద్ఘనమ్?॥

తా॥ చక్కఁదనము, సంపద, విద్య, భూమివిస్తృతి మొదలైన వన్నియు లభించిన సంతసము సత్పుత్రసంతానమునకదా సార్థకము?

398 తుంటవింటివానితూఁపులఘాతను, మింటమంటనడుసు మిడుకఁదరమె?
ఇంటిజాలివిడిచి యెట్లుండవచ్చురా?, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమేక్షుధన్వనో బాణైః పీడితో న హి శక్యతే।
సంస్థాతుం భూసభోమధ్యే పత్నీం త్యక్త్వా కథం వసేత్?॥

తా॥ మన్మథ బాణముల తాకిడికిఁ దట్టుకొని భూమ్యాకాశ మధ్యప్ర దేశముల స్థిరచిత్తతతో మెలఁగుట కెవ్వరికిని సాధ్యముకాదు. కనుక యింటియాలిని విడిచి యెట్లుండవచ్చును?

399 తగినకులజుఁడైనఁ దలయెత్తుధనమైన, భాగ్యపురుషు నేలపట్టెంచు ?
పరమసాధ్విచూడఁ బరులనంటదు సుమీ, విశ్వదాభిరామ వినురవేమ॥

కులీనం ధనినం చాన్యం భాగ్యవంతం చ పూరుషమ్।
సాధ్వీ చ పరమా వేమ ! గ్రహీతుం కథ మిచ్ఛతి ?॥

తా॥ పతివ్రత తగిన కులము కలవాఁడైనను, తలయెత్తు ధనము పోసినను, భాగ్యముగల పురుషునైనను వరపురుషు నేల ప్రేమించును ?

400 కూటికిగతిలేకకూర్చున్నవారికి నాడుదానిమీఁద నాసయున్నె ?
అన్నమదముచేత నన్నిమదంబులౌ, విశ్వదాభిరామ వినురవేమ॥

అన్నాభావా న్నిషణ్ణస్య కథం వాంఛా భవేత్ స్త్రియామ్।
సర్వే మదా శ్చాన్నమదా దేవ వేమ ! భవంతి హి ॥

తా॥ కూటికిలేక యాకలిచే బాధపడువానికి నాడు దానిమీఁద నాసకలుగదు. అన్నమదముచేతనే యన్నిమదములును గలుగుచున్నవి.
వి॥ తేషా మింద్రియనిగ్రహో యది భవే ద్వింధ్యః ప్లవే త్సాగరే (భర్తృ)

401 సతులఁజూచి నరుఁడు సౌఖ్యంబుఁగోరును, గతులఁగానలేఁడు కర్మమందు,
గతులు సతులవలనఁ గానంగలేరయా, విశ్వదాభిరామ వినురవేమ॥

ఈప్సేప్సిత్వ్య సతీసౌఖ్యం గతీః కర్మసు నేక్షతే।
సతీభ్యో న గతీ ర్మర్త్యో వేమ ! నూనం న పశ్యతి ॥

తా॥ స్త్రీలవలననే సుఖముకలుగునని యజ్ఞాని భ్రమించి సత్కర్మలఁ జేయఁజాలఁడు. స్త్రీలవలన దుర్గతికలుగఁ గలదుకాని సద్గతిగలుగఁగలదా?
వి॥ బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి॥

402 ఆలిమాటలువిని యన్నదమ్ములరోసి, వేఱుఁబడెడువాఁడు వెఱ్ఱివాఁడు
కుక్కతోఁకఁబట్టి గోదావరీదునా ?, విశ్వదాభిరామ వినురవేమ॥

విభక్తో దారవచసా వేమ ! యో భ్రాతృవంచకః।
స ఉన్మత్త శ్శ్వపుచ్ఛేన కిం వా తరతి గౌతమీమ్ ?॥

తా॥ ఆలిమాటలు విని యన్నదమ్ముల నిరసించి వేఱుపడఁజూచు వెఱ్ఱివాఁడు కుక్కతోకఁ బట్టుకొని గోదావరినది యీదదలచినవానితో సమానుఁడు కాఁడా. (వేఱింట ముఱుపు - గోరింట యెఱుపు ఎంతో కాలము నిల్వదు)

403 స్త్రీలుఁగల్గుచోటఁ జెర్లాటములుఁగల్గు, స్త్రీలులేనిచోటు చిన్నబోవు
స్త్రీలచేత నరులు చిక్కుచున్నారయా, విశ్వదాభిరామ వినురవేమ॥

యత్రస్త్రియ స్తత్ర కేళ్యః రిక్తం స్త్రీరహితమ్ స్థలమ్।
వశా భవంతి వేమ! స్త్రీమాయాకృష్టధియో నరాః॥

తా॥ స్త్రీలున్నచోటఁ జెర్లాటములుఁ గలుగును. స్త్రీలులేనిచోటు చిన్నఁబోవును. ఏమన్నను స్త్రీలచేతనే మానవుఁ డజ్ఞానాంధకారమునఁ బడుచున్నాఁడు. వి॥ న విషయాన్ భోక్తుం న మోక్షుం క్షమః (భర్తృ

404 కరఁగఁగరఁగఁబుట్టుఁ గనకంబునకువన్నె, పెనఁగఁ బెనఁగఁబుట్టు ప్రేమసతికి,
మానినిముదియఁబుటు మోహంబు లోభంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

తప్తేతప్తే హేమ్నివర్ణః ముహుస్సంగే స్త్రియారతిః।
జరాపరిణతా వేమ! మోహో లోభ శ్చ జాయతే॥

తా॥ కరిగినకొలదియు బంగారమునకు వన్నెవచ్చును. స్త్రీ పురుషులు కలిసిమెలసి సంచరించినకొలదియుఁ గామ మధికమగును. ముసలితనము వచ్చినకొలదియు మోహమును లుబ్ధత్వము నధికమగును. వి॥ సుతాంగనాబంధుషు సోదరేషు, సృపేషు భృత్యేషు చ జాతమోహః, ప్రవాసమాత్రేణ హి నశ్యతేఽఖిలం, చిరంప్రవాసేన హార త్యశేషమ్॥

405 అన్నమదమువలన నతివలుఁబురుషులు, నేపురేగి మదనుఁ డేచెనండ్రు
అన్నముడుగువెనక నతఁడెందుఁబోవురా, విశ్వదాభిరామ వినురవేమ॥

స్త్రియః పుమాంసోఽన్నమదా దుద్రిక్తభ్రష్టబుద్ధయః।
వవృధే స్మరఇత్యాహుః గతేఽన్నే వేమ! కుత్ర సః?॥

తా॥ తినుటకుఁదిండి మస్తుగ నున్నకొలది స్త్రీ పురుషుల మన్మథుఁడు చెలరేగి బాధించుచునే యుండును. తిండిలేక పస్తులతోనున్నప్పుడా మన్మథుఁడు దరిదాపులకైనరాఁడు.

406 ఎట్టిదానిఁ బురుషుఁ డేపారఁ జూచిన వేఁకిపుట్టి చాలవెఱ్ఱిపట్టు,
పల్లుఁదెఱచి నగినఁ బట్టుఁ బెనుభూతంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

స్వర్ణాంగీం నా యదీ క్షేత జ్వరోన్మాదయుతో భవేత్ ।
భూతావిష్టో భవే ద్వేమ ! వివృతే దంతకుట్మలే ॥

తా॥ అందగత్తెను గాంచినంత మాత్రమునఁ బురుషునకు మన్మథ జ్వరము తగిలి, వెఱ్ఱిచేష్ట లధికమగును. ఇఁక నా యందగత్తె పల్లుకనబడు నట్లు నవ్వినఁ బెద్దదయ్యము పట్టినట్లు వికారగుణములు కలవాఁడగును.

407 ఎట్టిస్త్రీలుఁగనిన నింతింతయనరాదు, కాలవహ్నిలక్క కరగినట్లు,
ఇట్టిగాఢమోహ మెంతైనఁ జేయురా, విశ్వదాభిరామ వినురవేమ॥

స్త్రీసాన్నిధ్యా ద్ద్రవేచ్చిత్తం యథా లాక్షాగ్నిసంగతేః ।
వేమైతాదృ గ్గాఢమోహః కుర్యా త్కిం యద పి ధ్రువమ్ ॥

తా॥ ఎట్టి హీనలగు స్త్రీలను జూచినను గాఢాగ్నికి లక్కకఱిగినట్లే పురుషుని చిత్తము కఱుగును. ఇట్టిచెడ్డదగు మోహ మెట్టిచెడుకార్యములఁ జేయించలేదు ? వి॥ అంగారసదృశానారీ ఘృతకుంభసమః పుమాన్, తస్మాన్నారీషుసంసర్గం దూరతః పరివర్జయేత్॥ భాగవతము॥

408 కాంత కుంటదైన కానికులంబైన, బాయలేక విటుఁడు బ్రిమసియుండు
మఱగి గ్రద్దకుక్క మాంసంబుఁ దిన్నట్లు, విశ్వదాభిరామ వినురవేమ॥

నీచాం చ నిష్కులాం వా స్త్రీం విట స్త్యక్తు మశక్నువన్ ।
భ్రాంత స్తిష్ఠతి వేమాంధ శ్శ్వేవ దుర్మాంసభక్షకః ॥

తా॥ గ్రద్దకుక్క మాంసమునకుమఱిగి తిన్నదే తినుచు దానిని వదల లేకయున్నట్లు విటుఁడు స్త్రీకుంటదైన, కులవిహీన గుణవిహీన కురూపి యైనను విడువలేక భ్రమచే లోకమునుమఱచి దానితోనేయుండును.

409 వారకాంతలెల్ల వలచియేతెంతురా ?, పొందుఁజేసి ధనము పుచ్చుకొనక
మారిసొచ్చి యిల్లు మఱియూరకేగునా, విశ్వదాభిరామ వినురవేమ॥

మోహంగతా వేమ ! వేశ్యా ఆగచ్ఛంతి కిమంతికమ్? ।
ధనం సంగేన కర్షంతి వృథా మారీ న గేహగా ॥

తా॥అమ్మవారు (విషూచి, మశూచి) ఇంటిలోఁబ్రవేశించి యెవనినో బలిగొనకయూరకపోవునా ? అట్లే వేశ్య తన్నువలచి యూరకవచ్చునా? కపటప్రేమఁ గనఁబరచి ధనమపహరించి సర్వభ్రష్టునిఁగావిచుటకేచేరును.

410 కులమువలనఁగొంత బలమువలనఁగొంత కలిమివలనఁగొంత గర్వమునను,
అంకుచదువుచదివి అంకునఁబడుదురు, విశ్వదాభిరామ వినురవేమ॥

కులాఢ్యత్వాత్ బలాఢ్యత్వాత్ ధనాఢ్యత్వాచ్చ గర్వతః।
వ్యభిచారపరాం విద్యాం వేమాధీత్య వినశ్యతి ॥

తా॥ మంచికులముగలవాఁడనని (కులమదము) బలముగలవాఁడనని (శరీరమదము) ధనముగలవాఁడనని (ధనమదము) ఇట్టియష్టమదముల గర్వించి పోతరించి అంకుచదువు (శృంగారగ్రంథముల) చదివి అంకుకులోనై మానవుఁడు భ్రష్టుఁడగుచున్నాఁడు. వి॥ యౌవనం ధనసంపత్తిః ప్రభుత్వ మవివేకితా, ఏకైక మప్యనర్థాయ కిము యత్రచతుష్టయమ్?॥

411 ఇచ్చిపుచ్చుకొన్న హితమైనమనువులు, తగ్గులేక యల్లుఁ దామరవలె,
కాచిపూచిపండి కడురమ్యమైయుండు, విశ్వదాభిరామ వినురవేమ॥

దానప్రతిగ్రహాభీష్టసంబంధాః పద్మినీసమాః ।
అనల్పత్వేన శోభంతే వేమ ! రమ్యాం హి తత్ఫలమ్ ॥

తా॥ భార్యాభర్తలు పెద్దలు నిష్టపడి కావించుకొన్న పెండ్లిసంబంధము లేవిధమగు లోపములేక తామరతంపరగ నల్లుకొని కాచి పూచి చాల శోభాయమానముగ శోభిల్లుచుండును.

412 కూడుఁగుడిచి లెస్సకూర్చున్నవాఁడైన నాడుదానికన్న నట్టైతగులు,
అన్నరసమ మొదలి కతిమదంబగుఁజుమీ, విశ్వదాభిరామ వినురవేమ॥

భుక్త్వాన్నం సమ్యగాసీనః స్త్రియం దృష్ట్వా విముహ్యతి ।
వేమాన్నరసపవాకు తనో ర్దత్తే ఘనఁ మదమ్ ॥

తా॥ సంతృప్తికరముగఁ దిని సావధానముగఁ గూర్చున్నవాని కాడుదానిమీఁద మనస్సట్టే తగులును. అన్నరసమే శరీరమున కధికతమమగు మదమును గల్గించును.

413 తల్లి కెదురుకొనుట తండ్రి కెదురుకొంట, అన్న కెదురుకొనుట లరయ మూఁడు
పాతకముల నెఱిఁగి వర్తింపఁగావలె, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమేహ మాతృధిక్కారః పితృధిక్కార ఏవ చ ।
భ్రాతృధిక్కార ఇత్యేతాన్ జ్ఞాత్వాఽఽగసాం స్త్రీం శ్చరే న్నరః॥

తా॥ తల్లికి, తండ్రికి, అన్నకు నెదురుకొనుట యను నీ మూఁడు పాతకములఁ బడకుండు పద్ధతి యెఱింగి సంసారి ప్రవర్తించవలెను. వి॥ కే కే హ్యుపాస్యాః ? గురుదేవవృద్ధాః॥ (శం॥మణి)

414 ఇంతి తనదు పేరు నెల్లకాలంబును, బ్రజలుతలఁచునట్లు బ్రతిభఁ గాంచు,
ఇంతికిఁ బతిభక్తి యెంతనవచ్చును ?, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ ! స్త్రీపతిభక్త్యైవ ప్రతిభాం యాతి సర్వశః ।
తస్యాః కీర్తి ర్లోకనుతా పతిభక్తిః స్త్రియో ధనమ్॥

తా॥ స్త్రీ పతిభక్తివలననే తనకీర్తి యెల్లకాలము ప్రజలు తలంచులాగున ప్రతిభఁగాంచును. స్త్రీకి పాతివ్రత్యమే ప్రభావము కల్గించును.

415 ఇంగలంబుతోడ నిలనల్లుతోడను, పరునియాలితోడఁ బతితుతోడ,
సరసమాడు టెల్లఁ జావుకు మూలంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

అంగారేణ తథాల్వేన పతితే నాన్యజాయయా ।
పరహాసకథా వేమ ! మృత్యోర్మూలం న సంశయః ॥

తా॥ అగ్నితో అల్లునితో పరునిభార్యతో పాపితో సరసమాడుట చావుకుమూలముసుమా.

416 పరయువతిరతంబుఁ బాటించికోరినఁ గోటిపూజ లెల్లఁ గొల్లబోవు,
సెగకుఁబొంత వెన్న చెడదె? తాపముచేత, విశ్వదాభిరామ వినురవేమ॥

కోటిపూజా వినశ్యంతి పరస్త్రీరతకాంక్షిణః ।
న నశ్యేత్కిం వేమ ! తాపాత్ ? నవనీతం శిఖాంతికే ॥

తా॥ నిప్పుసెగకు వెన్న రూపుమాయునట్లు పరస్త్రీసంగమము కోరుచుండెడి వ్యక్తికి కోటిపూజలైనను వృథాయగునుజుమా.

417 మంచిశకునములని యెంచి పెండిలియాడు వారలొకరు లేరు వసుధలోన,
జనులకర్మములను శకునముల్ నిల్పునా ?, విశ్వదాభిరామ వినురవేమ॥

అన్వీక్ష్య శకునం సమ్యగ్ గూఢావపి చ దంపతీ ।
మిథ్రియేతే వేమ ! నేహా_స్తః శకు_నైః కర్మ కిం హ్యాతమ్?॥

తా॥ మంచిశకునములు ముహూ_ర్తములుచూచియే పెండ్లిచేయుదురు. కాని యట్టివారొకరై నన్నుండఁగలిగిరా? బ్రతుకుల శకునములు నిల్చునా?

418 వాడకదిన కేల వావివర్తమునలు? చాడిగానికేల జాడబుద్ధి?
మూఢమతులకేల ముదముతో జ్ఞానంబు?, విశ్వదాభిరామ వినురవేమ॥

వాటీవధూనికాయాస్తు, కిం వేమ! క్రియవ_ర్త_నైః ?।
కిం సూచకస్య సద్బుద్ధ్యా ? కిం జ్ఞానేన జడాత్మనామ్?॥

తా॥ వాడకెల్ల వదినెవరుసగుదానికిఁక వావివరుసలతోఁ బనియేమి? చాడీలుచెప్పువానికి మంచిచెడ్డలతో నిమి_త్తమేమి ? అట్లే మూఢులకు జ్ఞానానందముతోను పనియుండదు.

419 తొత్తుతొత్తెకాని దొరసానికాఁబోదు, హత్తదెపుడు దాని కైనగుణము
మిత్తికూళ్ళదొంగ మేలెన్న నేర్చునా ?, విశ్వదాభిరామ వినురవేమ॥

దాసీదాస్యేవ వేమాహో ! న స్యాత్సా స్వామినీ క్వచిత్।
ఔచిత్యం తు న తస్యాస్స్యాత్ శుభార్థీ కిం మృతాన్నభుక్?॥

తా॥ మి_త్తికూళ్లు (పీనుగుపైకూడు) దొంగిలించువానికి బాగుసంగతి తెలియఁబడఁగలదా ? అట్లే దాసికి దాసీగుణముకల్గునుకాని సాధ్వియగు యజమానురాలిసద్గుణము పట్టువడునా ?
(వృ_త్తి ప్రవ_ర్తన భావనలననుసరించికూడ మంచిచెడుగుణములలవడును)

420 నాడెమైనచెడిపె నయమెఱింగిమెలంగు, విటునిగుస్తరించు వివరమెఱుఁగు
బానిసైనతొత్తు పాటించలేదయా, విశ్వదాభిరామ వినురవేమ॥

శ్రేష్ఠా తు కులటా వేమ ! నయజ్ఞా సతతం విటమ్ ।
వే_త్తిమర్మాత్మసాత్కర్తుం న దాసీ జారిణీ తథా ॥

తా ॥జారిణియైనను మంచిదై_న విటుని స్వాధీనముచేసికొను వినయాది మంచిగుణముల మెలంగును. కాని బానిసయైనది యట్లు మెలఁగనేరదు.

421 కులుకుగుబ్బఁజూపి గొబ్బునఁగరగించి, చేతికాసులెల్లఁ జేర్చుకొంచు,
రతను చేతికత్తె లరయంగఁగాంతలు, విశ్వదాభిరామ వినురవేమ॥

పీనస్తనౌ దర్శయిత్వా ద్రవీకృత్య భృశం మనః ।
హరంతి విత్తం కాంతాస్తాః వేమానంగకరాసయః ॥

తా॥ కులుకుగుబ్బలఁజూపి వెంటనే విటునిఁ గరగించి ధనమెల్ల పుంజుకొందురు. స్త్రీలన్నసామాన్యులుకారు. మన్మథునిచేతిలోని చూరకత్తులు.

422 అనుకూల్యముగల యంగనకలిగిన, సతికిఁబతికిఁబరమసౌఖ్యమమరుఁ
ప్రాతికూల్యమైనఁ బరిహరింప సుఖంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

అనుకూలసతీప్రాప్తౌ సతీపత్యో స్సుఖం మహత్ ।
యది స్యాత్ ప్రతికూలా సా వేమ ! తద్వర్జనా త్సుఖమ్॥

తా॥ అనుకూలదాంపత్యమైన సతికిఁబతికిఁగూడ సౌఖ్యములభించును. ప్రతికూలదాంపత్యమైన విడిపోవుటయే సౌఖ్యమీయఁగలదు.

423 గొప్పపిరుదుఁగన్నఁ గుచకుంభములఁగన్న, జెప్పరానిచోటు చెలమఁగన్న
ముప్పిరిఁగొనునయ్య మునికైన మోహంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

నితంబ మున్నతం ప్రేక్ష్య కుచకుంభౌ చ పీవరౌ ।
అవాచ్యస్థలగర్తం చ వేమ ! మౌన్యపి ముహ్యతి ॥

తా॥ స్త్రీ పెద్దపెద్దపిరుదులు కుంభములవంటికుచములు ఇఁక చెప్పరాని మర్మస్థలముఁగాంచిన మునికైనను మోహాము ముప్పేటఁ బడును. వి॥ నివృత్త స్సర్వతత్త్వజ్ఞః కామక్రోధవివర్జితః, ధ్యానస్థో నిష్క్రియో దాంత స్తుల్యమృత్కాంచనో మునిః ॥

424 మతముదారిమఱచు మధురాధరముఁజూచి, మగువరూపుఁజూచి మనసుమఱచు
ఉక్తి లాలకించి యోగంబుమఱచురా, విశ్వదాభిరామ వినురవేమ॥

ప్రేక్ష్య కాంతాధరం రమ్యం విస్మరేత్ స్వమతం నరః ।
రూపం వీక్ష్య మనో వేమ ! వచశ్శ్రుత్వా తప స్తథా ॥

తా॥ మధురమగు స్త్రీ యధరముఁ జవిఁజూచి మతనియమములే మఱచును. అందమగురూపుఁజూచి మనస్సే మఱచిపోవును. ప్రేమాలాపముల యోగమే మఱచును.

425 తొడలమెఱుపుఁజూచి తోరంపుకుచములు, వారకొప్పుఁగలుగు వనితఁజూచి,
విటుఁడునిల్చుటెట్లు విరహాగ్నిఁజొరకను ?, విశ్వదాభిరామ వినురవేమ॥

కామ మూరోర్ద్వారాంధశ్యాం పీవర స్తనవిభ్రమమ్ ।
కచం వీక్ష్య స్త్రియో వేమ ! నైతి కిం విరహం విటః ?॥

తా॥ తొడలమెఱుపు దొడ్డవగుకుచములసొబగు వారకొప్పుఁగలస్త్రీనిఁ జూచి మునిసూడ మోహముపొందుచుండ నిఁక విటుఁడు విరహాగ్నిఁబడకుండ నెట్లునిలువఁగలఁడు ?

426 చదువులెల్లఁజదివి సర్వజ్ఞుఁడైయుండి, బ్రహ్మవిద్యలెల్లఁ బడటఁగలిపి,
యువతిఁజూచి పొంగి యోగంబు మఱచురా, విశ్వదాభిరామ వినురవేమ॥

అధీత్య సర్వశాస్త్రాణి సర్వజ్ఞోఽపి మునిస్స్వయమ్ ।
యోషాం వీక్ష్యోత్సుకో వేమ ! యోగం విస్మరతీహ చ॥

తా॥ అన్నిచదువులుఁజదివి సర్వజ్ఞుఁడయ్యు బ్రహ్మవిద్యయందుఁ బరిపూర్ణుఁడయ్యు యువతినిజూడఁగనే యోగముమఱచి భ్రష్టుఁడగును.

427 ఊరపందెఱుంగ దుత్తమగంధంబు, చెడ్డనరక మెల్లఁ జెందుఁగాని,
సాధ్విమహిమ మెట్లు స్వైరిణియెఱుఁగురా?, విశ్వదాభిరామ వినురవేమ॥

గ్రామక్రోడో న జానాతి సుగంధద్రవ్యసౌరభమ్ ।
అమేధ్య మత్తి సాధ్వీత్వం వేమ ! కిం వేత్తి పుంశ్చలీ?॥

తా॥ బురదగుంటలోఁబడి సంతసించునుగాని యూరపంది పరిమళవస్తువులకు నానందించునా? అట్లే జారిణి పాతివ్రత్యప్రభావ మెఱుఁగఁజాలదు.

428 కలిమిఁజూచి యీయఁగాయమిచ్చినయట్లు, సమునకీయ నదియు సరసతయగు
పేదకిచ్చుమనువు పెనవేసినట్లుండు, విశ్వదాభిరామ వినురవేమ॥

దత్తదేహసమా వేమ ! దత్తా ధనవతే సుతా ।
సమాయ సరసత్వాత్తా నిర్ధనాయాతిబంధురా ॥

తా॥ కలిమిఁజూచిచేసెడికన్యాదానము శరీరముకోసియిచ్చినట్లే(శరీరమమ్ముకొన్నట్లే) సమానమైనవానికిఁ జేయుకన్యాదానము సరసమైనదే. ఇఁక కన్యప్రేమించిన పేదకిచ్చుమనువు పెనవేసికొన్నట్లుండఁగలదు.

429 పలికిబొంకలేక బ్రాహ్మణాజటు పడఁతిఁగూడనిచ్చెఁ బరున కపుడు,
శాశిమీఱ నతఁడు బాలుఁడై పడియుండె, విశ్వదాభిరామ వినురవేమ॥

అసత్యభీతః ప్రాగ్వేమ! బల్హాణ స్స్వప్రియాం నృపః।
దదౌ పరస్మై సంగంతుం బాలో౽భూత్ విరహీ చ సః॥

తా॥ పూర్వము బల్హాణచక్రవర్తి కోరిన దిచ్చెదనని వాగ్దానముఁజేసి శివభక్తునకు భార్యనుగూడుట కిచ్చెను. విరహికాఁగ నామె పాతివ్రత్య ప్రభావమున నతఁడు వెంటనే బాలుఁడై పడియుండెను.

430 మగనికలిమిబలిమి మగువకునుబలంబు, కలిమిలేనిమగఁడు కానుఁగాఁడు,
పనికిరానిమగని బాటించి చూడరు, విశ్వదాభిరామ వినురవేమ॥

పత్యు స్సంపద్బలం పత్న్యై నిస్స్వభర్తా నిరర్థకః।
నిరర్థకం పతిం వేమ! నాద్రియంతే హి యోషితః॥

తా॥ మగనికలిమి, బలిమి మగువకును బలమిచ్చును. కలమిలేనిమగఁడు గుడ్డిగవ్వకుఁబనికిరాఁడు. అట్టిపనికిరానిమగని నెట్లాదరింతురు?

431 విటుఁడు స్త్రీనిరోసి విడిచిపెట్టుపిదప, నేడనున్న సిగ్గు నెంచనేల?
కుడిచివేయుపుల్లెగోతుల దొర్లదా?, విశ్వదాభిరామ వినురవేమ॥

కాంతాం విరజ్య సంత్యజ్య విటః పశ్చాత్తు తత్స్థితిమ్।
కిం స్మరే ద్వేమ! నోచ్ఛిష్టపత్రం కిం భువి లుంఠతి?॥

తా॥ తినిపారవేయు నెంగిలియాకే గోతిలోదొర్లిన నెవరికికావలెను? అట్లే విటుఁడు స్త్రీయందలిరోతచే విడిచిపెట్టినపిదప నాస్త్రీ యే నికృష్ట కార్యములొనర్చిన నెవరికిసిగ్గు?

432 విటుఁడుచెఱచిపిదప విడిచిపెట్టినయది, పేదపెనిమిటిఁగని ప్రియముఁజేయు,
కుప్పలోనిచెప్పు కుక్కతిన్నట్లయా, విశ్వదాభిరామ వినురవేమ॥

విటోపభుక్తా త్యక్తాస్త్రీ నిస్స్వ మాద్రియతే పతిమ్।
ఉపానహం రాశిగతాం వేమ! శ్వా ఖలు భక్షతి?॥

తా॥ చెత్తకుప్పలో దిగవిడిచిన పాతచెప్పునే కుక్కతిన్నట్లు విటుఁడు చెఱచివిడిచిపెట్టినయది మఱల నాపేదపెనిమిటినే ప్రియముగఁజూచును.

433 దున్నపోతుమదకి దురుసుగాసాగదు, ఎద్దుమదకకంటె హెచ్చుకాదు,
ముద్దరాలిమగఁడు ముదుసలిమెచ్చునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

మందం స్యాత్సైరిభహాలం న్యూనం వృషభలాంగలాత్ ॥
ముగ్ధాయా వల్లభో వేమ ! శ్లాఘేత జరఠాం కథమ్?।

తా॥ చులుకగునెడ్లనాగలి దున్నువాఁడు మడ్డిదున్నపోతుల నాగలి దున్నుటకిష్టపడఁడు. ముద్దరాలిమగఁడు ముసలదానిని మెచ్చుకొనునా ?

484 కావుకావుమనుచుఁ గరుణకైయేడ్చెడి, శిశువుఁజేరదీసి చిత్తమలరఁ
బాలనిచ్చునట్టి పడఁతిపుణ్యాత్మరా, విశ్వదాభిరామ వినురవేమ।

రక్షరక్షేతి కృపణో యో రోదితి శిశు ర్భృశమ్ ।
తస్మై దదాతి యా స్తన్యం వేమ ! సా పుణ్యభాగినీ ॥

తా॥ 'కావు కావు, మనియేడ్చుబిడ్డ యెవరిబిడ్డయైనను ప్రేమచేఁజేర దీసి మనసారపాలనిచ్చి సంతసింపఁజేయుతల్లియే పుణ్యాత్మురాలుసుమా.

485 ముండమోపికేల ముత్యాలపాపట ? వన్నెలెల్లఁబుణ్యవతికిఁగాక,
కుక్కకేలతలఁపఁ గుచ్చులపాలకీ ?, విశ్వదాభిరామ వినురవేమ॥

కిం వా మౌక్తికసీమంతై ర్విధవాయాః పుణ్యయోషితః ।
సర్వవర్ణోచితా వేమ ! శునః కిం శిబికాంచితా ? ॥

తా॥ పుణ్యస్త్రీకి (ముత్తైదువకు) ముత్యాల పాపట యవసరముకాని ముండమోపికెందులకు ? కుచ్చులపాలకీ కుక్కకెందుకు ?

486 మగనిమీఁద భక్తిమానకుండినకాంత, మూఁడులోకములను ముక్తిగనును,
మగువలందఱకును మగలె దేవతలయా, విశ్వదాభిరామ వినురవేమ॥

పత్యౌ భక్తిం వేమ! యా స్త్రీ న త్యజేత్సా జగత్త్రయే।
ముక్తిం ప్రాప్నోతి పతయో దేవతా స్సర్వయోషితామ్॥

తా॥ మగువకు మగఁడే దేవుఁడు. అట్టిమగనిమీఁదనెల్లపుడు భక్తికలిగి యుండుభార్య ముల్లోకములఁ గీర్తిని ముక్తిని గూడఁబొందును.

487 భావమరసి తన్ను భార్యసేవించిన నింటికైన నగును నీశ్వరుండు,
అదియులేక బ్రతుకు టధమంబు భువిలోన, విశ్వదాభిరామ వినురవేమ॥

భావజ్ఞా యది సేవేత భార్యాత్మానం ప్రభు ర్భవేత్।
గృహస్యాపి వృథా వేమ ! తదభావేతు జీవనమ్ ॥

తా॥ మనసార తన్నుప్రేమించి భార్య సేవించినయజమాని తనయింటి కైనను ప్రభువగును. ఆభాగ్యముకూడ లేకుండ బ్రతుకుట నీచాతినీచము.

438 **పడుచునిచ్చినతని బత్తెమిచ్చినవాని, కడుపుచల్లఁజేసి ఘనత నిడుచు,**
**నడువ నేరనతఁడు నాలిముచ్చేకదా?, విశ్వదాభిరామ వినురవేమ॥**

కృత్వా ప్రశాంతం యః కన్యాదాతారం భృతిదాయకమ్।
నాద్రియేత స వై వేమ! కథ్యతే కూటమానసః॥

తా॥ తనకుఁ గన్యాదానముచేసినమామను బత్తెమిచ్చిపోషించిన ప్రభువును సంతసింపఁజేసి గౌరవమర్యాదలతోఁ జూడనేరనివాఁడునాలిముచ్చు.

439 **తరుణి పుణ్యవతిగ వరునిఁబట్టియెయగు, పాపినియగు మగనిపాపువలన,**
**భర్తవర్తనంబె పడఁతులయందుండు, విశ్వదాభిరామ వినురవేమ॥**

పత్యాశ్రియేణ వేమ! స్యాత్ తరుణీ పుణ్యశాలినీ।
తథైవ పాపినీ భర్తృవర్తనం స్త్రీషు వర్తతే॥

తా॥ భర్తనుబట్టియే భార్యపుణ్యాత్మురాలు, పాపాత్మురాలు నగును. భర్తపరివర్తనమే భార్యకుఁగూడ నలవడును.

440 **తన్నుఁగన్నయట్టి తల్లివంటిదిసుమ్ము, అన్యకాంత న్యాయ మరసిచూడఁ**
**గన్నదానిజనులు కానంగలేరయా, విశ్వదాభిరామ వినురవేమ॥**

అన్యకాంతా మాతృతుల్యా న్యాయబుద్ధ్యా యదీక్ష్యతే,
తథా వేమ! జనా నిత్యం న పశ్యంతి పరస్త్రియమ్॥

తా॥ పరస్త్రీ తన కన్నతల్లివంటిదిసుమా. పెండ్లాడిన స్త్రీ యొక్కతియే భార్య. మిగిలిన స్త్రీలందఱును గన్నతల్లులే.

441 **ఐకమత్యమెన్న నాల్మగలకువాసి. మగనిబుద్ధులెల్ల మగువనేర్చు**
**దానిరక్షణంబె వానిరక్షణమగు, విశ్వదాభిరామ వినురవేమ॥**

ఐకమత్యే సుప్రతిష్ఠా దంపత్యో ర్వేమ! వర్ధతే।
సత్యభ్యాసే న్మతిం పత్యుః భార్యారక్షైవ తస్య చ॥

తా॥ ఆల్మగలకు నైకమత్యమే శోభ. మగనిబుద్ధులే మగువకును వచ్చును. దానిరక్షణయే వానిరక్షణ.

442 వాదమాడితిట్టు వరుననెవ్వరినైనఁజేరరాదటన్నఁ జేటుఁదెచ్చు,
గడుసురాలు తెలియ వడిసెల రాయిరా, విశ్వదాభిరామ వినురవేమ॥

నిందేత్సర్వానపి సదా వేమ! వాదపరాయణా।
దత్తే హాని మకామానాం ధూర్తా స్త్రీ క్షేపణీశిలా॥

తా॥ ధూర్త, వాదమాడి యెవ్వరినైనఁదిట్టును. వలదన్న ప్రమాదముఁ దెచ్చును. అది వడిసెలలో రాయివంటిది సుమా.

443 నావసత్యమెల్ల నడిసముద్రములోన, బండిసత్యమెల్ల బట్టబయల
నాడుదానిసత్య మేడనులేదురా, విశ్వదాభిరామ వినురవేమ॥

నావస్సత్యం వార్ధిమధ్యే శకటస్య బహిస్స్థలే
వ్యక్తం భవతి వేమాహో! స్త్రీ సత్యం నాస్తి కుత్రచిత్॥

తా॥ నావయెట్టిదో దానిసంగతి నడిసముద్రమున ఋజువగును. బండి సంగతి యెడారిలోఁ దెలియును. కాని యాడుదానిసంగతి యెక్కడను ఋజువు కానేరదు.

444 వశముకానియాలి పైరమేమనవచ్చు? యశముఁజెఱుచుఁగాని యనువుపడదు
కొసరుటెల్ల దానికోర్కెఁదీర్చుటయె యా, విశ్వదాభిరామ వినురవేమ॥

అవశ్యాయాః స్త్రియా వైరం కిం వాచ్యం? కీర్తినాశకమ్।
న సంధేయం వేమ! తస్యాః స్సాంత్వనం కామితార్పణమ్॥

తా॥ స్వాధీనపడని (లొంగని) భార్య పగ వర్ణించుటకు వీలులేనిది. కీర్తిని పాడుచేయును కాని స్వాధీనముమాత్రముకాదు. దానిని బ్రతిమాలి కొసరుట దానికోరికలఁదీర్చుటకే యుపయుక్తమగును కాని వాని కేమియు నుపయోగకారి మాత్రము కానేరదు.

445 వరుఁడుచక్కనైన వజ్రాలగనియైనఁదలఁకుకు మెఱుపువంటి తత్త్వమున్న
అన్యపురుషవాంఛ యాడుదానికినుండు, విశ్వదాభిరామ వినురవేమ॥

సుందరోఽపి ధవో వేమ! యదిస్యాత్ వజ్రసేవధిః।
శీలవిభ్రాజితోఽపి స్త్రీ పుమాంసం పర మిచ్ఛతి॥

తా॥ భర్తచక్కనివాఁడైన మంచిగుణములకు పజాౖలగనిదైయెన రసికత్వమున్న నాడుదానికి నన్యపురుషవాంఛ యుండకమానదు.

446 **మానధనము విడదు మతి పుణ్యవతియైన, బూని పతికిభక్తి పొసఁగఁజేయు లోనమెచ్చుచుండు లోగుట్టుకనవలె, విశ్వదాభిరామ వినురవేమ॥**

పుణ్యాస్త్రీ కురుతే పత్యుః భక్తిం మానధనాన్వితా।
ఆత్మని శ్లాఘతే వేమ! విద్యా దంతర్గతం రహః॥

తా॥ పుణ్యవతియగుస్త్రీ భర్తను లోలోనమెచ్చుకొనుచుఁ దనగౌరవమును గాపాడుకొనుచుఁ బతిభక్తి కలిగియుండును. భర్త దాని లోగుట్టు కనవలెను. జారిణివలె నిచ్చకపుమాటలు లేవని తిరస్కరింపఁగూడదు.

447 మగఁడుతప్పుఁగనక మనసిచ్చియున్నను, సహజగుణమువిడదు జారకాంత పిండితినెడికుక్క పెంటకాశించదా, విశ్వదాభిరామ వినురవేమ॥

ఉపేక్ష్య పత్యౌ స్వం దోషం దత్తచిత్తేఽపి జారిణీ।
నైసర్గం న త్యజేద్ వేమ! పిష్టభుక్ శ్వా మలం యథా॥

తా॥ పిండితినుకుక్క పెంటకాశించునట్లు మగఁడు నేరమెన్నక మనసిచ్చియున్నను జారిణి తనసహజగుణమును విడనాడనేరదు.

448 బొల్లిమాటలాడు భోగముదానితో, డొల్లి డుల్లి నిల్లుగుల్లఁజేసి వెళ్లిరమ్మటంచు వెడలించు నింటిని, విశ్వదాభిరామ వినురవేమ॥

అసత్యవాదినీ వేశ్యా స్వాసక్తం వేమ! పూరుషమ్।
ద్రాగ్నష్టసదనం కృత్వా నిస్సారయతి మందిరాత్॥

తా॥ విటుఁడు కల్లబొల్లిమాటలఁబలుకు వేశ్యతో దొర్లి పేదకాఁగ నిల్లుగుల్లఁజేసి యది "వెళ్ళిరా" అని యింటినుండి వెళ్ళఁగొట్టించును.

449 పిచ్చివానికైనఁ బేదవానికైనఁ, కుష్ఠురోగికైనఁ గుంటికైన భామ కానుపింప బాములఁబెట్టురా, విశ్వదాభిరామ వినురవేమ॥

ఉన్మత్తంవా దరిద్రంవా పంగుంవా కుష్ఠరోగిణమ్।
భామా బాధేత సతతం వేమ! దృష్టిపథంగతా॥

తా॥ పిచ్చివాఁడుకాని పేదవాఁడుకాని కుష్ఠురోగికాని, కుంటివాఁడుకాని, యెట్టినికృష్టుఁడుకాని యందకత్తె దృష్టిగోచరముకాఁగ మనస్సుకష్టములపాలుసేయక యూరకుండదు.

450 దేహభావమెల్లఁ దెలియంగఁజూచిన, నఖిలహేయములకు నాలయంబు
పరసతిగమనంబు ప్రత్యక్షనరకంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

యది పశ్యే ద్దేహభావం బహుహేయాలయం ఖలు।
పరస్త్రీసంగమో వేమ! ప్రత్యక్షనరకం ధ్రువమ్॥

తా॥ దేహముయొక్క యథార్థస్థితిఁదెలిసిచూచిన సమస్తమగురోతలకు నది పుట్టిల్లు. అందునను పరస్త్రీసంగమము మఱింత ప్రత్యక్షనరకము.

451 జగడమునకుఁబోదు జారిణియెప్పుడు, మాయఁజేసి పురుషు మమతఁబెట్టుఁ
గానిమాటలాడు గయ్యాళి సతతంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

వశీకరోతి పురుషం జారా న కలహప్రియా।
కుర్యా దవాచ్యవాదాం శ్చ ధూర్తా వేమ! నిరంతరమ్॥

తా॥ జారిణి యెల్లప్పుడును మనుకారముఁజూపి మాయఁజేసి మగని వలలోవేసికొనుటకుఁ బ్రయత్నించును గాని జగడముమాత్రమాడదు. గయ్యాళిభార్య యటుఁగాక కానిమాటలాడుచుఁ గష్టపెట్టుచుండును.

452 జాలలోననుండి స్త్రీలవీథులవంకఁ, జూడనీయరాదు సుమ్ము వినక
చేతులేనియట్లు చేటుమూడునుజుమీ, విశ్వదాభిరామ వినురవేమ॥

జాలేభ్యో వీథీతుం స్త్రీణా మవకాశం న కల్పయేత్।
యదికుర్యా త్తథా వేమ! సర్వనాశో భవే ద్ధ్రువమ్॥

తా॥ కిటికీలలోనుండి స్త్రీలను వీధులవంకఁజూడనీయరాదు. అట్లు జూడనిచ్చినఁ జేటుమూడును జుమా.

453 చక్కనైనవాని మక్కువఁగన్నంతఁ, దక్కువగనుజూచుఁ దనదు విభుని
ఆడుబుద్ధికంటె నవరబుద్ధియులేదు, విశ్వదాభిరామ వినురవేమ॥

యదిపశ్యేత్ రూపవంతం పురుషం స్త్రీ స్వవల్లభమ్।
పశ్యే న్న్యూనం వేమ! నాస్తి స్త్రీబుద్ధే రవరామతిః॥

తా॥ చక్కనైనవాని మక్కువతోఁ జూచినంతమాత్రమునఁ దన మగనిఁ దక్కువగఁ జూచి యేవగించుకొనుచుండును స్త్రీ బుద్ధికంటెఁ గామమున లాఘవమైనది మఱియొకటిలేదు.

454 కాంతమేనుఁజూచి కలవరపడెదరు, కడుపులోనిరోతఁ గానలేక
ఇంతరోతగల్గు నీదేహమేలరా?, విశ్వదాభిరామ వినురవేమ॥

అంగనాయా స్తనుం వీక్ష్య వేమ! ముహ్యంతి పూరుషాః।
కుక్షౌ మలం న పశ్యంతి తన్వా కిం మలయుక్తయా?॥

తా॥ స్త్రీశరీరముఁజూచి కడుపులోని రోతఁగానలేక కలవరపాటుఁ జెందెదవు. పహ్యామగుశరీరమేలరా? (వి) అమేధ్యపూర్ణం కృమిభిస్తు సంకులం స్వభావదుర్గంధ మశౌచ మధ్రువమ్, కళేబరే మూత్రపురీష భాజనే రమేత మూర్ఖో న రమేత పండితః॥ 2 సమస్తభావైః ఖలు బంధనం స్త్రియః. (భర్తృ)

455 ఆడుదానిబొంకు గోడఁబెట్టినయట్లు, పురుషునిబొంకు పూరితడక
స్త్రీలనేర్పు మగలఁ జీకాకుఁబఱచురా, విశ్వదాభిరామ వినురవేమ॥

కుడ్యోపమం నార్యసత్యం పుంసస్తు కటసమ్మితమ్।
స్త్రీణాం తు వేమ! చాతుర్యం పుంసః క్షోభయతే భృశమ్॥

తా॥ ఆడుది యబద్ధమాడిన గోడపెట్టినట్టు. పురుషుఁ డబద్ధమాడిన దడికట్టినట్టులుండును. స్త్రీలనేర్పు మగలఁ జాలఁజీకాకు ఁబఱచునుజుమా.

456 సుగుణవంతురాలు సుదతియైయుండిన, బుద్ధిమంతులగుచుఁ బుత్రులొప్ప
స్వర్గమేటికయ్య? సంసారికింకను, విశ్వదాభిరామ వినురవేమ॥

యది భార్యా గుణవతీ పుత్రకా బుద్ధిశాలినః।
తదా సంసారిణో వేమ! కిం స్వర్గేణ ఫలం? వద॥

తా॥ భార్యగుణవంతురాలైయుండి పుత్రులుబుద్ధిమంతులైన సంసారి కింక స్వర్గ మెందులకు?

457 పతియొనర్చుచెడుగు పతి కళత్ర్యమువచ్చుఁ, బతియొనర్చుమంచి పతికిసగము
పతియొనర్చుచెడుగు పతికేలరాదురా?, విశ్వదాభిరామ వినురవేమ॥

పత్న్యాదోషః పతిం యాతి అర్ధం పతిగుణే సతీమ్।
దోషః పతికృతో వేమ! న సతీం ప్రాప్నుయాత్ ఖలు॥

తా॥ భార్యచేయుపాపమంతయు భర్తదే. భర్తచేయుపుణ్యములో సగము భార్యది. భర్తచేయుపాపముమాత్రము భార్యకు రాదు. ఏలనో!

458 విత్తహీనుడైన వేళలందును దల్లి, తనయులాలుసుహృదు లనెడువార
లెల్లశత్రులగుదు రెంచైన నిజమిది, విశ్వదాభిరామ వినురవేమ॥

యదా భవే ద్విత్తహీనః తదా మాతా చ పుత్రకాః।
భార్యా చ సుహృద స్సర్వే వేమ! స్యు ర్వైరిణో ధ్రువమ్॥

తా॥ దరిద్రునకుం దల్లి, కొడుకులు, భార్య, మిత్రులు, సందఱును శత్రువులే యగుదురు.

459 పాపజాతినగుడు పరసతిఁగోరుట, చేప జిహ్వారుచికిఁ జిక్కునట్లు
తీపినంటి యీఁగ తెగుటతో నీల్గదా?, విశ్వదాభిరామ వినురవేమ॥

పాపీ పరసతీకాంక్షీ జిహ్వాబద్ధో ఝషో యథా।
మధుద్రవ్యే వేమ! లగ్నాః న కిం నశ్యంతి మక్షికాః?॥

తా॥ పాపాత్ముఁడగు మనుజుఁడు పరసతినిఁగోరుట చేప జిహ్వారుచికిఁ జెడినట్లును, తేనెటీగ తీపికిఁజచ్చినట్లును నగును.

460 తల్లిదండ్రిహితులుఁ దగినచుట్టములెల్ల, నేరికోరిపోరు నెగుపుఁజూచి
పడుచునిత్తురంతె భాగ్యమీయఁగలేరు, విశ్వదాభిరామ వినురవేమ॥

మాతా పితా బాంధవా శ్చ హితా స్సర్వే సమీక్షయా।
కన్యాం దిశంతి కిం వేమ! దదతే భాగ్య ముజ్జ్వలమ్?॥

తా॥ తల్లి, తండ్రి, మిత్రులు, బంధువులు. ఇట్లుకావలసినవారందరు పరిస్థితిననుసరించి పడుచునీయఁగలరుకాని భాగ్యము మాత్రమీయలేరు.

461 సతులమాయఁదెలిసి సైరింపలేకను, పెద్దకడుపువాఁడు పెండ్లిమానె
పుట్టుకాసెఁగట్టె భువి నాంజనేయుండు, విశ్వదాభిరామ వినురవేమ॥

యోషిన్మాయాం విదిత్వైవ వేమ! లంబోదరః పురా।
అనూఢవాన్ బద్ధకచ్ఛః జన్మనై వాంజనాసుతః॥

తా॥ సతులమాయఁదెలిసిన విఘ్నేశ్వరుఁడు వారలమాయను దట్టుకొనలేమను భయమునఁ బెండ్లిసేసి మానెను. ఆంజనేయుఁడు పుట్టుకనుంచియే లంగోటీ బిగించి బ్రహ్మచారి యయ్యెను.

462 చదివినతనికన్నఁ జాకలియే మేలు, గృహముపేల్చుకన్న గేదెమేలు
సకలసుకలకన్న జారభామినిమేలు, విశ్వదాభిరామ వినురవేమ॥

రజకో వర ముఖ్యస్తు కుటీవిద్యా తథైవ చ।
గృహదేవాచ్చ మహిషీ సురేభ్యో వేమ ! జారిణీ॥

తా॥ ఈ మాయచదువుఁజదివినవానికన్నఁ జదువుకొనకున్నను గుర్తు కలిగియుండుటకుఁ జాకలియే మేలు. గృహదేవతను బూజించి విఫలుఁడగుట కన్న గేదెను మేపుకొనుటమంచిది. యజ్ఞములఁజేసి దేవతలమెప్పించి రంభాసంభోగమున కుప్పిళ్ళూరుదానికంటె నా ధనముతో వేశ్యలతో స్వేచ్ఛగా సంచరించుటయే మంచిది.

**463 ఔరసుండె నీకు వారసుఁడగుఁగాని, వేశ్యయందుఁబుట్టు విధవకొడుకు నీవుపోయినపుడు నీకైనవదలునా?, విశ్వదాభిరామ వినుర వేమ॥**

ఔరసః ఖలు సత్పుత్రః కిం వేశ్యోద్భవేన సూనునా ?।
వేమ ! త్వయి మృతే దత్తే కిం తిలోదకమప్యహో !॥

తా॥ నీకన్నకొడుకు నీకువారసుఁడగును కాని నీవుంచుకొనిన వేశ్య కొడుకు నీవు చచ్చినప్పుడు తిలోదకములనైన నొసఁగఁగలఁడా ?

**464 గుణవతిగలయిల్లు గోముననొందించుచును, చీఁకటింటదివ్వె చెలఁగునట్లు దేబెమున్న యిల్లు దివ్వెమల్పిన యట్లు, విశ్వదాభిరామ వినుర వేమ॥**

తద్యోగ్యార్యాం స్త్రీ కపోగుణినీ భాసయేత్ గృహమ్।
[illegible] లితర [illegible] వేమాదీప మివాప్రభమ్॥

తా॥ గుణవయురాలుగు భార్యయున్నయిల్లు చీకటింటదీపమువలెఁ బ్రకాశించును. ఇఁచేతచేయైన భార్యయున్నయిల్లు దీపమారిపోయినయిల్లు వలె నంతయు నంధమయముగనుండును.

**465 కాకిగూట [illegible]కోకిల తనగుడ్లఁ, బెట్టి పెనుపఁజేయు గుట్టెఱుఁగుచు నాడువారిమోస మపుడైనఁ దెలియుఁడీ, విశ్వదాభిరామ వినుర వేమ॥**

కాకనీడే పికీ వేమ ! నిధాయాండాని పోషణమ్।
కారయేత్ మర్మ జానీత స్త్రీమాయా జ్ఞాయతే తదా॥

తా॥ ఆడుకోకిల కాకిగూటిలోని కాకిగ్రుడ్లనుబడఁగొట్టి తనగ్రుడ్లను బెట్టి పొదిగించుకొని పిల్లలను జేయించుకొనును. దీనినిబట్టియైన నాగరి కతాస్త్రీల మోసమెట్టిదియో గ్రహింపుఁడు.

466 విడుచుదానిపొందు విడువఁజాలనివాఁడు, చచ్చుదనుక మోయుఁ జాప గుడిసె
భాగవతులపటుఁ బడయంగ నోపఁడు; విశ్వదాభిరామ వినురవేమ॥

త్యక్తవత్యా స్త్రియాస్సంగం వేమ! త్యక్తు మశక్నువన్।
వోఢా కటం కుటీం యావజ్జీవం నైతి మహద్గతిమ్॥

తా॥ తన్నువిడుచుదానిని దాను విడుపఁ జాలనివాఁడు చచ్చువఱకు దానిచాపయు, గుడిసెయు మోయుచుండవలసినదేకాని భగవన్నామ స్మరణఁ జేసికొనుచు భక్తుఁడుమాత్రము కానేరఁడు.

467 వెలఁదిపొంపుఁజూచి విఱ్ఱవీఁగఁగఁగాదు, కలికికపుడు గుణము కారణంబు
చక్కనైనరూపు జారిణికుండ ...దాభిరామ వినురవేమ॥

లావణ్యం యోషితో ...హ్యా ద్వేమ! కారణమ్।
గుణఏవ హి భామి... ...రీ?॥

తా॥ స్త్రీ యందముగనున్న ... మంచిగుణమే ముఖ్యము. రూపప్రధానము ...ండదు.

468 తనకునొప్పిపుట్టి తనువె... ...డఁజూచు
పండ్లుపడినకుక్క పసట... ...నురవేమ॥

నిస్సత్వ శ్వా... ...ంగనామ్॥
నిర్దంతః కుర్కురో ... ...వంశతి ?॥

తా॥ పనికిమాలిన విటుఁడు శరీరమెంత... ...గ్రహించి బాధలఁ గల్గించుచున్నను పండ్లూడినకుక్క గొడ్డెముకనె... ...టుకఁ జూచినట్లు చెడిపె పొందునే కాంక్షించుచుండును.

469 ముండమోపితోడ మునుఁగుచుఁదేలుచు, నుండునప్డె మోహముండుఁగాని
అండబాయువెనుక నాయాశలేపోవు, విశ్వదాభిరామ వినురవేమ॥

రండయా వర్తతే యావ త్తావన్మోహే నిమజ్జతి।
అపాస్తే వేమ! తత్సంగే ఆశా నశ్యంతి తా స్తదా॥

తా॥ ముండమోపితో మునుగుచుఁ దేలుచు నున్నపుడే మోహ ముండును కాని దానియెడబాటుగలిగినప్పుడా యాశయే కొన్నాళ్ళ కంతరించఁగలదు.

470 కావవలయు మగఁడు కాంతనెల్లప్పుడు, కావలేనివాఁడు చావవలయు
కాపురేనిదాని కాపుర మదుగనా?, విశ్వదాభిరామ వినురవేమ॥

రక్షే త్కాంతాం సదా భర్తా ద్రాక్ష్మియేతావనాథుమః।
రక్షావిహీనా యా కాంతా వేమ! తత్సంస్మృతి ర్వృథా॥

తా॥ పెండ్లిచేసికొన్నందులకు భార్యనుగాపాడవలసిన బాధ్యత భర్తది. అట్లుకాపాడలేనివాఁడు చావవలయును. రక్షణలేని యాడుదానియునికి క్లిష్టమైనదిసుమా.

471 భక్తిముక్తికల్గు భాగ్యము గల్గును, చిత్తమెఱుఁగు పడఁతిచెంతఁబతికిఁ
జిత్తమెఱుఁగనిసతిఁ జేరంగనీరాదు, విశ్వదాభిరామ వినురవేమ॥

చిత్తజ్ఞా యా వేమ! పత్న్యాః ప్రాంతే పత్యు ర్భవంతి హి।
భక్తి ర్ముక్తి స్తథా భాగ్య మచిత్తజ్ఞాం స్త్రియం త్యజేత్॥

తా॥ తనభావముగుర్తించి మెలఁగు భార్యచెంతనున్న భర్తకు భక్తి, ముక్తి, భుక్తి, అన్నియు లభించును. తనభావమును గుర్తింపనేరని భార్యనుదగ్గఱకే చేరనీయఁగూడదు.

472 ప్రీతిలేనిలంజె భూతంబె యారుఁజూమీ, ప్రీతిలేనిపాటు చేతచేటు
దాతలేనియూరు దయ్యాలపేటయా, విశ్వదాభిరామ వినురవేమ॥

అప్రీతా కులటా భూతం కర్మాప్రీతం శ్రమావహమ్।
యత్ర దాతా నాస్తి వేమ! సా పూః పైశాచవాటికా॥

తా॥ దాతలేనియూరు దయ్యాలపేట (దయలేనికఠినాత్ములుండునది) ప్రతిఁగల్గింపనిశ్రమ చేతచేటుకాని లాభములేనిది. అట్లే తానంటే ప్రేమలేని భార్య పెనుభూతము (పెద్దరాకాసి)

473 బత్తిలేనిలంజె పలుమారుబిలిచిన, బత్తికాదు లయపుమిత్తికాని
మిత్తిచొరఁగ నిల్లు మ్రింగకపోవునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

ఆహూయమానా బహుశః కులటా భక్తివర్జితా।
మృత్యుస్సా త్సదనం విష్టా వేమ! గ్రసతి సా న కిమ్?॥

తా॥ భక్తిలేనిలంజెను బలుమారులుపిలిచి బ్రతిమలాడినను దానికి భక్తి రాదుసరికదా ప్రళయకాలపుమృత్యువుగాఁ దయారగును. అట్టిమృత్యుదేవత యేయింటిలోనున్న నా యింటినది మ్రింగక విడిచిపెట్టునా!

474 భవుఁడు చిత్రముగను భార్యల మోయును, అట్టిమోయఁగలుగు దిట్టమైన
నతనివలెనె బూది యలఁదిన మెఱుఁగగు, విశ్వదాభిరామ వినుర వేమ॥

భార్యావాహీ భవశ్చిత్రం యది త్వం వహానక్షమః।
తథైవ తత్సమో వేమ! ధూతలిప్తతను ర్భవ॥

తా॥ పరమశివుఁడు భార్యల మోయును. శరీరమునకు బూడిదయుఁ బూయును. అట్లే భార్యల నీవును ధరింప సమర్థుఁడవగుదేని శరీరమున బూడిద నలదుము.

475 విటులఁజూడఁగానె మటుమాయఁజేసియు, కిటికియందుఁ జేరి కేరించు
పటిమమీర స్త్రీలఁ బరికింపలేరయా, విశ్వదాభిరామ వినుర వేమ॥

దృష్ట్వా విటాన్ వంచయిత్వా గవాక్షస్థా నితంబినీ।
విలాసాన్ కురుతే వేమ! మాయాఽజ్ఞేయాహి యోషితామ్॥

తా॥ కిటికీనుండి వీధిని జూచినఁజపల స్త్రీ విటుఁడు కనఁబడఁగనే యింటిలో నున్నవారల నందఱ మటుమాయఁజేసి బయటకుఁబోఁగలదు. స్త్రీలనడత గుర్తించుట చాలకష్టమైనపనిసుమా.

476 ఇంద్రపదవిఁగోరి యింపుగాయజ్ఞముల్, కలిమిచేతఁ జేసి కాములైరి
పరమయోగమూని పట్టంగలేమిని, విశ్వదాభిరామ వినుర వేమ॥

వేమాకాంక్ష్యేంద్రపదవీం యజ్ఞై రిష్ట్వా మహాధనైః।
కామినస్సృర్జనా నూన మక్షమా యోగధారణే॥

తా॥ యోగాభ్యాసము నియమనిష్ఠలు భక్తిజ్ఞానములు కుదుర్చుకొనలేక ధనముకొలఁది నింద్రపదవిలభ్యమగునని యు స్వర్గసుఖము లనుభవింపవచ్చుననియు భ్రమించి కాములై యజ్ఞములఁజేయుట కజ్ఞానులెగబడెదరు, వి॥ శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప! సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే (గీత)

477 పాలప్రియము చేతఁ బరగనేడ్చెడిబిడ్డ, తుత్తుదప్పులకిల శోకపడఁగఁ
దల్లి పనులమాని తనయుని ముద్దాడు, విశ్వదాభిరామ వినుర వేమ॥

క్షుత్పిపాసాభ్యాం వ్యాకులో బాలః స్తనార్థీ యది రోదితి।
త్యక్త్వా కర్మాణి వేమాంబా లాలయంత్యాశు చుంబతి॥

తా॥ పాలకొఱకు నాకలిదప్పులకుఁ దట్టుకొనలేక బిడ్డయేడ్చుచుండినఁ దల్లి యెన్నిపనులున్నను గట్టిపెట్టి తనయునిముద్దాడి పాలనిచ్చును. అట్లే భగవంతుఁడును నాపదుద్ధారకుఁడుసుమా.

478 పడుచునూరకేల పారఁజూచెదరొక్కొ!, ఎంతవారలైన భ్రాంతిఁజెంది లోనమిఱుకు కాము లొంగఁదీయఁగలేరు, విశ్వదాభిరామ వినురవేమ॥

మహాత్మానోఽపి విభ్రాంత్యా హ్యాత్మస్థకామవశంగతాః।
కిమర్థం ? యువతీం వేమ ! పశ్యంతి భ్రాంతదృష్టయః॥

తా॥ లోనఁబెఱుగుకాముని లొంగదీయనేరక యెంతవారలైన సిగ్గు విడిచి యందగత్తెను వృథాగా తేఱిపాఱఁజూతు రేలనో తెలియకున్నది.

479 దాతలేనియూరు దయ్యాలపెనువాడ, నీతిలేనిమాట రాతిపెట్టు ప్రీతిలేనిలంజె ప్రేతవాహనమయా, విశ్వదాభిరామ వినురవేమ॥

పుర్దాతృహీనా పైశాచీ వాగనీతి శ్శిలాహతిః।
కులటా ప్రీతిశూన్యా చ వేమ ! స్యాత్ప్రేతవాహనమ్॥

తా॥ దాతలేనియూరు దయ్యాలపెనువాడ. అట్లే రాతిమీదదెబ్బవలె నీతిలేనిమాటవ్యర్థము. ఇఁక ప్రీతిలేనిలంజెను భరించుట శవమును మోయుచున్నట్లే.

480 ఫాలనేత్రుఁడైన వంచంగ లేఁడయా, ఆలిమీఱఁబెట్టి యాదిమఱువ గోలయనుచు నమ్మఁగూడదు వెఱ్ఱియై, విశ్వదాభిరామ వినురవేమ॥

కృత్వా ప్రగల్భాం విస్మృత్య మూలం త్ర్యక్షోఽపి చాంగనామ్.
న వశీకురుతే వేమ ! అమాయేతి న విశ్వసేత్॥

తా॥ ఆలిని 'అబల, అమాయకురాలు' అని వెఱ్ఱిగా నమ్మఁగూడదు. మొదట నుపేక్షఁజేసి యాడుదానినిమీఁఱబెట్టిన నాపాలాక్షుఁడైనను (మూడవకన్నుకలవాఁడైనను) తరువాత వంచలేఁడు సుమీ.

వి॥ శక్రాదయోఽపి విజితా స్త్వబలాః కథం తాః ? (భర్తృ)

481 ఫలక మొడమ చేతఁబట్టి ఖడ్గంబూన, బంటుతనము రాదు ప్రీతిభలేమి వీధిలోనఁదిరుగ వెలఁది పురుషుఁడౌనె?, విశ్వదాభిరామ వినురవేమ॥

ఖడ్గం చ ఫలకం వేమ ! కరాభ్యాం ధారయన్నపి।
న శూరస్స్యా దప్రతిభః కిం పుమాన్? వీధిగాంగనా?॥

తా॥ వీధిలోఁ దిరిగినంతమాత్రమున స్త్రీ పురుషుఁడు కానేరదు. కుడి చేతఁగత్తి నెడమచేతడాలు 'బట్టినంతమాత్రమున ప్రతిభ లేనివాఁడు యుద్ధ భటుఁడగునా ?

482 పురుషభాగ్యమునను పుణ్యవతిదొరకుఁ, బుణ్యవతికి నట్లె పుట్టుసుఖము
నిరువు రనుభవింప హితులగు పుత్రులు, విశ్వదాభిరామ వినురవేమ॥

భాగ్యేన లభ్యతే పుంసః పుణ్యా స్త్రీ యోషితః పుమాన్,
ఉభయోరపి భాగ్యేన వేమ ! పుత్రా స్తథా హితాః॥

తా॥ పురుషునిభాగ్యమునఁ బుణ్యాత్మురాలగు భార్యయు స్త్రీ భాగ్యమునఁబుణ్యాత్ముఁడగుభర్తయు నిరువురిభాగ్యమునఁబుణ్యాత్ములగు పుత్రులును లభింతురు.

483 పుత్రసంతులేక పురుషుండు జగతిలోఁ, బుణ్యలోకమెట్లు పొందఁగలఁడు?
పుత్రహీనునకును బుణ్యంబు కలదెట్లు?, విశ్వదాభిరామ వినురవేమ॥

పుమాన్ పుత్రవిహీనస్తు పుణ్యలోకం కథం వ్రజేత్॥
వేమ ! పుత్రవిహీనస్య కథం పుణ్యం ప్రవర్తతే ?॥

తా॥ పితృదేవతల ఋణమునుండి విముక్తుఁడగుటకుఁ బుత్రసంతతిలేని వాఁడు పుణ్యాత్ముఁడు కానేరఁడు. అట్టివానికిఁ బుణ్యలోకములును లభింపవు.

484 పుడమిలోన నరులు పుత్రులఁగనఁగోరి, యడలుచుండు రనుపమాశచేతఁ
గొడుకుఁగలిగినంతఁ గుల ముద్ధరించునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

నరాః పుత్రార్థినో వేమ ! చింతంతి పరమాశయా,
పుత్రే సంజాతమాత్రే కిం ? కుల ముద్ధరతి స్వయమ్॥

తా॥ పుత్రులఁగనుటకు నరులు శ్రమఁజెందుదురు. కొడుకు కలిగినంత మాత్రమునఁ గులము నుద్ధరించునా ? వి॥ అజాతమృతమూర్ఖాణాం వరమాద్యౌ న చాంతిమః । సకృద్దుఃఖకరావాద్యౌ అంతిమస్తు పదేపదే॥

485 పిన్నవాండ్రస్వేచ్ఛ మన్ననఁజెఱచును, ఆడువారిస్వేచ్ఛ గోడొనర్చు
పురుషవరునిస్వేచ్ఛ భూతినిఁగూర్చును, విశ్వదాభిరామ వినురవేమ॥

నిహంతి బాలకస్వేచ్ఛా గౌరవం వేమ ! సర్వశః।
స్త్రీస్వేచ్ఛా తనుతే దుఃఖం పుంసస్స్వేచ్ఛా విభూతిదా॥

తా॥ పిన్నవాండ్రస్వేచ్ఛ గౌరవమును పాడుచేయును. స్త్రీలస్వేచ్ఛ కష్టముఁగల్గించును. ఉత్తమపురుషునిస్వేచ్ఛ సౌఖ్యమును సంతోషమును గూర్చును. వి॥ లాలనాత్ బహవో దోషాః తాడనాత్ బహవో గుణాః, తస్మాత్ పుత్రం చ శిష్యం చ తాడయేత్ న తు లాలయేత్॥

486 దొడ్డివాఁడు పెద్దతోడేలునైనను, పట్టిఁ జూచి దానిమర్మమెఱిఁగి
గొడ్డుగొఱ్ఱెనైనఁ గొనిచననీయండు, విశ్వదాభిరామ వినురవేమ॥

అజాజీవస్తు మర్మజ్ఞో జానన్ వృకగతిం సదా।
వంధ్యాం మేషీం చ నేమాం సు నీత్వా గంతుం చ నేచ్ఛతి॥

తా॥ గొఱ్ఱెలకాపరి పెద్దతోడేలునైనను దానిరహస్యమెఱిఁగి చంపఁ జూచునుకాని పనికిమాలిన గొడ్డుగొఱ్ఱెనునైతము పట్టుకొనిపోనీయఁడు. అట్లే కుటుంబరక్షణకు యజమాని (సంసారి) శ్రద్ధవహించవలెను. కాని యుపేక్షాభావముతోను నుదాసీనభావముతోను నుండుట పనికిరాదు.

487 తల్లి యేడ్పువినక తనయాలువగచిన, జాలిపడెడువాఁడు జడుఁడు సుమ్ము
తారతమ్య మెఱుఁగనేరని పశువగు, విశ్వదాభిరామ వినురవేమ॥

అశృణ్వన్ మాతృరుదితం య స్స్వభార్యా వ్యథాకులః।
దయతే స జడో వేమ ! పశు స్స్యాత్తారతమ్యవిత్॥

తా॥ తల్లియేడుపువినక పెండ్లాముయేడ్పునకు మాత్రము జాలిపడెడు జడుఁడు తారతమ్యమెఱుఁగనేరని పశువు సుమా.

488 ఎంగిలెంతవట్టు హితవుగా నెంచక, యొగ్గియుందు రంత నుర్విజనులు
కన్న నెంగిలెంత? కన్నెంగి లధికమౌ, విశ్వదాభిరామ వినురవేమ॥

ఉచ్ఛిష్టమహితం మత్వా విముంచంతి జనా భువి।
వక్త్రోచ్ఛిష్టం కియద్వేమ ? నేత్రోచ్ఛిష్టమిహాధికమ్॥

తా॥ నోటియెంగిలిని మాత్రమె సర్వులు నిరసింతురు. అంతకన్నను దూష్యమైనది కన్నుయెంగిలిసుమా.

489 చని యడవికి ఋషులు చవులఁగోరుటరోత, నరులు కలిగి తినమి నరయరోత
భార్యలనుచు వారి భరియింపమియు రోత, విశ్వదాభిరామ వినురవేమ॥
ఋషీణాం విపినే వేమ! జుగుప్సా విషయార్థితా।
అభోగో ధనినాం చైవ భార్యాణాం చా ప్యపోషణమ్॥
తా॥ అడవికిఁ బోయియు ఋషులు చవులఁగోరుటరోత. కలిగి యుండియు నరులు లోభత్వమున ననుభవింపకుండుటరోత. భార్యలని పెండ్లిచేసికొనుటతప్ప వారలఁబోషింపకుండుట రోత.

490 ఇంద్రుఁడయ్యుఁ గామి హీనుఁడైపోయెను, మారుఁడయ్యుఁ గామి మఁడిపోయె
బ్రహ్మయయ్యుఁ గామి బైసిపోనాడెను, విశ్వదాభిరామ వినురవేమ॥
ఇంద్రోఽపి వేమ! కామీ సన్ హీనత్వ మగమ త్తథా।
మారోఽపి చాశు దగ్ధోఽభూత్ ప్రథాం బ్రహ్మాపి ముక్తవాన్॥
తా॥ కామగుణమునకులోనై యింద్రుఁడు హీనుఁడాయెను. మన్మథుఁడు మండిపోయెను. బ్రహ్మ యగౌరవముపాలాయెను.

491 రాయిమై యహల్య రాముపాదముసోకి, యాదుదయ్యెనందు రవనిజనులు
చేయునుకృతము లిల శిలలైనఁబొందును, విశ్వదాభిరామ వినుర వేమ॥
వేమాహల్యా శిలా భూత్వా స్పృష్టా రామాంఘ్రిణా సకృత్।
కాంతాభూదితి సంప్రాహుః శిలా ప్యేతి కృతం ఫలమ్॥
తా॥ చేసిన పుణ్యఫలితము శిలలైనఁబొందును. శ్రీరామచంద్రుని పాదరజముఁదాకి శిల యహల్యయై పతివ్రతామతల్లి కాలేదా?

492 కొడుకునువరియింపఁగోరి వచ్చినదానిఁ, దండ్రి పెండ్లియాడ ధర్మమగునె?
తప్పని తెలిసియును దాఁజేయుఁ గర్మంబు, విశ్వదాభిరామ వినురవేమ॥
సుతం వరయితుం వేమ! కన్యకా మాగతాం పితా।
యద్యుద్వహేత్ స కో ధర్మః? దోషజ్ఞోఽప్యఘ మాచరేత్।
తా॥ తప్పని తెలిసియును మానవుఁడు ఇంద్రియములకు వశుఁడై విషయాభిలాషలకులోనై మనము నరికట్టలేక యంతస్సాక్షిప్రతిఘటించుచున్నను దానికి సమాధానమీయలేక చెడుపనులనే చేయుచున్నాఁడు.

కొడుకును వరించివచ్చినదాని నొక పరిబుద్ధుఁడగు రాజరాజేంద్రుఁడు పెండ్లియాడెనందురు. ఇది ధర్మమేనా ?

493 ఇంచుకంతసుఖమె యీరేడుజగములఁ, గంచమునకుఁ బిల్లి కాచినట్లు
పంచబాణుబారిఁబడియు యాసింతురు, విశ్వదాభిరామ వినురవేమ॥

చతుర్దశసు లోకేషు ఈషన్మాత్రసుఖార్థినః।
వర్తంతే వేమ! కామార్తా ఉచ్ఛిష్టార్థిబిడాలవత్॥

తా॥ పదునాలుగులోకములందలి జీవులును నెంగిలికంచముకొఱకు పిల్లి కనిపెట్టుకొనియున్నట్లు అల్పసుఖమగు స్త్రీసుఖమునకే మన్మథుని పంచ బాణములఘాతలకు దట్టుకొనలేక యాసించుచున్నారు. వి॥ వినారామం వినాభీష్మం హనూమంతం వినాశుకమ్, కురంగఖురమాత్రేణ చర్మణా మోహితం జగత్ ॥

494 పెరటఁజెట్టుపెట్టిఁ పరికింపకుండిన, వెలుగుదాటి తీగ వెడలఁబాఱు
నాడుదానిగుణము నటువలెనుండురా, విశ్వదాభిరామ వినురవేమ॥

యదినేత్రే తోష్టలతాం వ్యతిక్రమ్యావహేలికామ్।
నిర్గచ్ఛే ద్వేమ! తచ్ఛాఖా తథా స్యా ద్యోషితో గుణః॥

తా॥ మనదొడ్డియావరణలో మనముపెట్టినపాదైనను మనముచూడక యుపేక్షఁజేసినఁ గంచెదాటి యవతలిదొడ్డిలోఁ గాయలుకాసి ప్రక్కదొడ్డి యజమానికి మేలుచేకూర్పఁగలదు. అట్లే యాడుదానివిషయములోఁ గూడ గుర్తించుకొనుము.

495 ఒడలుశిథిలమైన నోపుగలసతి, గుణము మేల్మిఁబట్టి కోటిసేయు
పాతయెనుముపాలు రోతవచ్చునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

జీర్ణాంగ్యాశ్చ క్షమావత్యాః సత్యా వేమ! గుణోదయైః।
కోటిలాభః కిం జుగుప్స్యం జీర్ణాంగమహిషీపయః ?॥

తా॥ శుష్కించినశరీరముకలదియైనను భూదేవివలె నోర్పుగలభార్య మంచిగుణమునుబట్టియే కోటివరహాల ఖరీదుఁజేయును. గేదెయొక్క పాలు మనకుఁగావలసినదికాని గేదెయెట్టిదైనను మనకేమి ?

496 కడుపునిండఁ దవుడు గంపలోఁబెట్టక, చన్నుముట్టనీక తన్నుగేదె
వారకాంత లెల్లు వలతురో యూరక, విశ్వదాభిరామ వినురవేమ॥
కండోలే వేమ! కంబూక మస్థాప్య మహిషీ పయః।
న దత్తే తాడయే త్వద్వ్యాం వేశ్యా కాంక్షతి కిం వృథా?॥

తా॥ గేదెసైతము గంపనిండఁ దవుడుఁబెట్టకుండ పాలకుఁ జన్ను ముట్టుకొనినఁ దన్నునుగదా. వెలయాలు నిన్నూరక ప్రేమించివచ్చునా?

497 చాడిగానిమాట చావిడిలో నిక్కు, వేటపో శునకము వీటనిక్కు
వేశ్యఁజూచునపుడె విటకాఁడు నిక్కురా, విశ్వదాభిరామ వినురవేమ॥
పురి శ్వా మృగయాగామీ సూచికోక్తి గ్గృహాంతరే।
ఉజ్జృంభతే వేమ! వేశ్యా దర్శనే తు విటస్తథా॥

తా॥ చాడీకోరువానిమాట చావిడిలోనేశోభించును. వేటకుఁదీసికొనిపోవుకుక్క యూరిలోనే మిడిసిపడును. అట్లే వేశ్యనుజూచినప్పుడే విటకాఁడును మిడిసిపడును.

498 కైకపుట్టిచెఱిచెఁగా రాముపట్టంబు, సీతపుట్టి లంకఁ జెఱిచెఁగాదె?
కౌరవులను జెఱిచెఁగద ద్రౌపదీదేవి, విశ్వదాభిరామ వినురవేమ॥
కైకా రామస్యాభిషేకం నాశయామాస వై పురా।
సీతా లంకాపురీం వేమ! కౌరవాన్ ద్రుపదాత్మజా॥

తా॥ కైకపుట్టి శ్రీరామచంద్రుని రాజ్యపట్టాభిషేకముఁ బాడుఁ జేసినది. సీతపుట్టి లంకను నాశనముఁ జేసినది. ద్రౌపదీదేవి కౌరవ నాశనముఁగావించినది. (ఏనాశనముకలిగినను స్త్రీలవలననే కలుగఁగలదు)

499 పతికిమారుఁబల్కు పడఁతియే పందిరా, మీఱినసతితోడ మెలఁగుపంది
పంది పంది కూడి పడిదొర్లవా రొంపి, విశ్వదాభిరామ వినురవేమ॥
పతిధిక్కారిణీ జాయా సూకరీ కేవలం తయా।
చరిష్ణు స్సూకరో వేమ! లుంఠత స్తౌ హి కర్దమే॥

తా॥ పతికెదురాడుభార్య పంది. అట్టియెదురాడుపందితోఁ గాపురము చేయు భర్త మఱియొక పంది. పందులు బురదలోఁబడి దొర్లినట్లు వారి సంసారమును నుండఁగలదు.

500 ప్రస్తుతంపువేళఁ బద్యంబుఁజదివినఁ, దప్పుఁగలిగియున్న నొప్పియుండు
వెలఁదిసురతవేళ బిత్తరై యుండదా?, విశ్వదాభిరామ వినురవేమ॥

ప్రస్తుతే సమయే వేమ ! యది పద్యం పఠే న్నరః।
సదోషమపి నిర్దోషం స కిం ధృష్టా రతేఽంగనా ?॥

తా॥ సమయోచితముగఁ జదివినపద్యము తప్పుఁగలిగియున్నను స్త్రీ సంభోగసమయమున నెంతసిగ్గువిడిచిన నంతగా శోభించునట్లు శోభ కలిగియే యుండఁగలదు. వి॥ అనవసరే యత్పఠితం సుభాషితమపి భవతి హాస్యాయ 2 అన్యథా భూషణం పుంసాం క్షమా లజ్జేవ యోషితామ్। పరాక్రమః పరిభవే వైయాత్యం సురతే ష్వివ॥

# ఆధ్యాత్మిక విభాగము.

501 వేమనఁగ యోగి వెలసె లోకములోనఁ, బూజలిడుఁడు పుణ్యపురుషులార!
పూజలిడినయంత భుక్తిముక్తులనిచ్చు, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమనాఖ్యో మహాయోగీ లోకేఽభూత్ పుణ్యపూరుషాః!॥
పూజాం కురుత వేమాంతో భుక్తిముక్తీ దదాతి సః॥

తా॥ 'వేమన, అను యోగి లోకమం దవతరించెను. పుణ్యపురుషులారా! వాని నాశ్రయించి పూజింపుఁడు. అతఁడు భుక్తి ముక్తి లభించు మార్గ ముపదేశింప సమర్థుఁడు. (వి) చరంతి హ్యవనౌ కామం బ్రాహ్మణా భగవత్ప్రియాః,మాదృశాం గ్రామ్యబుద్ధీనాం బోధాయోన్మత్తలింగినః, కుమారో నారద ఋభు రంగిరా దేవలోఽసితః, ఏతే పరే చ సిద్ధేశా శ్చరంతి జ్ఞానహేతవః (భాగ)

502 పలుకుమన్న నేలపలుకక యున్నావు?, పలుకు నన్నుఁగూర్చి ప్రబలవాక్కు-
పలుకుమయ్య నీమపలుకు నే నెఱిఁగెద, విశ్వదాభిరామ వినురవేమ॥

బ్రూహీత్యుక్తో న కింబ్రూషే? బ్రూహి మాం ప్రబలంవచః।
బ్రూహ్యార్య ! వేమ ! జ్ఞాస్యామి భవదీయ మహం వచః।

తా॥ ప్రభూ! మాట్లాడుము. ఎందుకుమాట్లాడవు ? నీ గొప్పమాటల నేను తెలిసికొనఁగలను. (భగవచ్ఛక్తి చోదనయే ప్రవక్తసూక్తులు)

508 నిన్నుఁజూచెనేనిఁ దన్నుఁదానుఱచును, తన్నుఁజూచెనేని నిన్నుమఱచు
నేవిధమునమనుజుఁ డెఱుఁగు నిన్నునుదన్ను, విశ్వదాభిరామ వినురవేమ॥

త్వద్విస్మృతిస్స్యా త్స్వాలోకే త్వదాలోకే స్వవిస్మృతిః।
కథం వేమ ! విజానాతి ? త్వాం చాత్మానం చ మానవః॥

తా॥ తన్నే చూచుకొనుచున్న ప్రభూ! నీవుకనఁబడవు. నిన్నే చూచుచుండినఁ దాను కనఁబడఁడు. నిన్నుఁదన్నునొకేసారి యెట్లుచూడఁగలఁడో చెప్పుము? (వి) ఏకమేవ. అద్వితీయం బ్రహ్మ॥

504 జీవి పోకముందె జీవవస్తువులిచ్చి, జీవి నిలుపవలయు జీవనముక
జీవి తొలఁగువెనుక జీవవస్తువులేల?, విశ్వదాభిరామ వినురవేమ॥

ప్రాఙ్మృతే ర్జీవవస్తూని దత్వా జీవం తు ధారయేత్।
గతే జీవే తతో వేమ ! కిం ఫలం జీవవస్తుభిః ?॥

తా॥ జీవముపోకముందే తగిన జీవాధారవస్తువులనిచ్చి జీవని నిలుపవలెను. జీవముపోయిన నిఁక జీవాధారవస్తువులతోఁ బనియుండునా ? తరుణము మించకుండ మోక్షసౌఖ్యము నొందుటకుఁ బ్రయత్నింపుము.

505 కల్లనిజము రెండు కంఠుండెఱుఁగును, నీరు పల్లమెఱుఁగు నిజముగాను
తనయుని జననంబు తల్లి తానెఱుఁగును, విశ్వదాభిరామ వినురవేమ॥

సత్యాసత్యే నీలకంఠో వేత్తి వారి చ నిమ్నతామ్।
పుత్రస్య జననం మాతా వేమ ! జానాతి హి స్వయమ్॥

తా॥ నీరుపల్లమును దనయునిపుట్టుక తల్లియు నెఱుఁగునట్లు సత్యాసత్యము లాభగవంతుఁడే యెఱుఁగును.

506 మాటలెల్లఁగల్ల మనసుదొంగతి మిం, కేటిప్రాణ మింక నేటిబ్రతుకు?
మాటసత్యమైన మతి శతాయువ్యంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

మృషావచాంసి సర్వాణి వేమ ! చౌర్యం తథా మనః।
కియాన్ ప్రాణః ? కియాన్ జీవః ? శతాయు ర్వచనే ఋతే॥

తా॥ అబద్ధపుమాటలు దొంగమనస్సు నీచపుబ్రతుకు. ఎందుకట్లు జీవించుట? సత్యవాక్కు ఋజుప్రవర్తనముఁగలిగి యెన్నాళ్ళుజీవించినను నూఱేండ్లునిండిన పరిపూర్ణజీవితముకదా.

507 చమురుగల్గుదివ్వె పరవితో మండును, చమురులేనిదివ్వె సమసిపోవు
తనువుపీక నేని దలపుదోడనె తీరు, విశ్వదాభిరామ వినురవేమ॥

జ్వలేత్ స్నేహాయుతో దీపః గతస్నేహో వినశ్యతి।
వాసనాక్షయతో వేమ! జన్మనాశో భవే ద్ధ్రువమ్॥

తా॥ చమురున్న నే దీపము వెలుఁగును. లేకున్న దీపమారిపోవును. అట్లే కోరికలులేకున్న జన్మలేదు. జన్మలేకున్నఁ గోరికలులేవు.

508 పాపమనఁగ వేఱె పరదేశమున లేదు, తనదుకర్మములను దగిలియుండు
కర్మతంత్రికాక కనుకనియుంటొప్పు, విశ్వదాభిరామ వినురవేమ॥

పాపోనామ పృథఙ్నాస్తి విదేశే వేమ! కశ్చన।
స్వకర్మతంత్రపవాతో న స్యాత్ కర్మవశో నరః॥

తా॥ పాపమనునది పరదేశమునుండి రాదు. తానుచేయు దుష్టకర్మలనుండియే వచ్చును. కాన జాగ్రత్తపడెంచుట మంచిది. (మనము చిందింమబురదకన్న మనకుఁగీడుఁజేయుబురద వేఱేయుండదు.) (వి) అనాత్మనస్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్॥ గీత॥

509 వెళ్ళివచ్చునాఁడు మళ్ళిపోయెడునాఁడు, వెంటరాదు ధనము కొంటుఁబోఁడు
తాను నేడఁబోనో! ధనమేడఁబోవునో!, విశ్వదాభిరామ వినురవేమ॥

సహ నాయాతి జననే న నయేత్ మరణే ధనమ్।
కుత్ర గచ్ఛే త్స్వయం వేమ! కుత్ర గచ్ఛే దహో! ధనమ్॥

తా॥ మనమీలోకమునకు వచ్చునప్పుడు కూడ ధనముఁ దెచ్చుకొనలేదు. పోవునప్పుడు వెంటఁగొని పోవుటయునులేదు. ధనమెక్కడకుఁ బోవునో! తానెక్కడికిఁ బోవునో! (వి) యో మే గర్భగతస్యాపి వృత్తిం కల్పితవాన్ ప్రభుః, శేషవృత్తివిధానాయ సుప్తః కిం ను మృతోఽపివా॥

510 బొంది యెవరిసొమ్ము పోషింపఁ బలుమాఱు, ప్రాణ మెవరిసొమ్ము భక్తిసేయ
ధనమదెవరిసొమ్ము ధర్మమే తనసొమ్ము, విశ్వదాభిరామ వినురవేమ॥

కస్య దేహం పోషయితుం కస్య ప్రాణా స్థాపితుమ్।
కస్య విత్తం గోపయితుం వేమ! ధర్మ స్స్వకం ధనమ్॥

తా॥ ఈబొంది నీవని పోషింతువేకాని నిలుపఁగలుగుచున్నావా ? అట్లే ప్రాణమును గాపాడుకొనఁగలుగుచున్నావా? ధనమును భద్రముగ వెంటఁ గొనిపోఁగలవా? కాన ధర్మమే యనుసరింపఁదగినది (వి)ధర్మమేవ గచ్ఛంత మనుగచ్ఛతి ॥

511 ఉసురులేనితిత్తి యిసుమంత యూదినఁ, బంచలోహములను భస్మమౌను
పెద్ద లుసురుమన్నఁ బెనుమంట లెగయవా?, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమాప్రాణా ఛర్మభస్త్రీ శ్వసేచ్చేత్ లోహపంచకమ్।
భస్మీభవతి నిశ్వాసైః నోద్యంత్యర్చీంషి కిం సతామ్?॥

తా॥ ప్రాణములేని తిత్తి యూదినచే పంచలోహములును భస్మమగు చున్నవి. ప్రాణములున్నతిత్తుల నూది యగ్నిని రగుల్పఁజేసిన (పెద్దల నుసురుఁబెట్టిన) పెనుమంట లెగసి వానిని భస్మమొనరింపలేవా ?

512 చెడ్డవానిమిగులఁ జెఱచును దైవంబు, అడ్డుపడఁడు వానికాపదైనఁ
కెడినచేనుఁజూచి యొడయఁడు మెచ్చునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

భ్రష్టాన్ భృశం భ్రంశయతె విధి ర్విపది నోద్ధరేత్।
నష్టం సస్యం కిముత్కృష్య స్వామీ వేమ ! ప్రశంసతే ?॥

తా॥ పండెడిచేనుకై రైతు శ్రద్ధచేసినట్లు పండనిచేనుకుఁ జేయఁడు. అట్లే భగవంతుఁడును సంస్కారణకుఁబనికిరాని దుష్టుని యాపదనుంచి రక్షించుటకు శ్రద్ధఁదీసికొనఁడు.

513 ఎక్కుడైనయాశ లినుమడియుండఁగాఁ, దిక్కువట్టి నరుఁడు తిరుగుచుండు
కుక్కనువలెనాశ కూర్చుండనీయదు, విశ్వదాభిరామ వినురవేమ॥

అత్యాశాగ్రస్తహృదయో భ్రమతే విమతి ర్నరః।
ఆశా శ్వనఇవ స్వాస్థ్యం పుంసే వేమ ! నయచ్ఛతి॥

తా॥ కుక్కను లోపలజనింమకోరికలు కుదురుగనుండనీక పరుగెత్తింమను. అట్లే మూర్ఖుఁడును దురాశకొలది స్థాయిలేక పరుగులిడుచుండును.

514 తత్త్వ మెఱుఁగువాఁడు దైవంబు నెఱుఁగును, సర్వకామములను జంపఁజేయుఁ
కదళి మ్రింగువాఁడు గరళంబు మ్రింగునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

యస్తత్త్వజ్ఞ స్స దైవజ్ఞః సర్వకామాన్ వ్యదస్యతి।
యోఽత్తి రంభాఫలం వేమ! స తు గ్రసతి కిం విషమ్?॥

తా॥ అరటిపండ్లుతినువానికి విషమిష్టమగునా? తత్త్వము తెలిసినవాఁడే దైవమును దెలిసికొనును. అట్టి కదళీఫలభోక్త (దైవజ్ఞుఁడు) 'కోరిక,లను విషమును ననుభవించుటకును నిచ్చగింపఁడు(వి) యేహి హి సంస్పర్శజాభోగా దుఃఖయోనయ ఏవ తే, ఆద్యంతవంతః కౌంతేయ! న తేషు రమతే బుధః॥

515 నీళ్లమీఁద బుగ్గ నిలిచినయప్పుడు, తళ్కుపేగ వచ్చి తాకుచుండు
విడెడుకండ కింత విభ్రాంతిపడుదురు, విశ్వదాభిరామ వినురవేమ॥

యావ న్నవీచయో ఘ్నంతి తావ త్తోయేషు బుద్బుదః।
ఛిద్యమానే ఘటే మూఢా భ్రమంతే వేమ! సర్వశః॥

తా॥ నీటిమీఁదబుడగలు లేచును. కెరటములు తాకును. బుడగలు చితుకును. మఱల మఱల నట్లే యగుచుండును. అట్లే శరీరములును గాల ప్రవాహమున విడిపోవుచుండును. మానవులిట్టి సహజసంఘటన కేల విభ్రాంతిఁజెందెదరో తెలియకున్నది.

516 హేమకారవిద్య నెఱిఁగినవారెల్ల, వెతలఁబడనియట్లు విద్యచేతఁ
దత్త్వ మెఱుఁగువెనక తనకుఁజింతేలరా?, విశ్వదాభిరామ వినురవేమ॥

యో హేమకారవిద్యాం తు వేత్తి న వ్యథతే హి సః।
జానంతి విద్యయా తత్త్వం యే తేషాం వేమ! కా వ్యథా?॥

తా॥ సువర్ణయోగముఁ దెలిసినవారీలోకమున నార్థికబాధఁ జెంద నట్లు జ్ఞానముచేఁ బరమార్థతత్త్వ మెఱుంగు మహనీయు లెల్లయెడల సౌఖ్యమునే పొందుదురు. చింతనొందరు.

517 జీవభావ మెఱుఁగఁ జెడదెన్నటికి మతి, దైవమును నెఱుంగఁ దనరు బుద్ధి
తేజ ముదయమొందఁ దిమిరంబు నిలువదు, విశ్వదాభిరామ వినురవేమ॥

జీవభావే తు విజ్ఞాతే వేమ! న భ్రంశతే మతిః।
జ్ఞాతే దైవే రమేత్ బుద్ధిః తేజస్యుత్థే గతం తమః॥

తా॥ జీవభావము దైవపద్ధతి నెఱింగిన మహనీయులబుద్ధికి విజ్ఞాన ప్రభాసమే కాని తమస్సు నిలువదు. వెలుగుండినఁ జీకటి నిలచునా? (వి) తమసో మా జ్యోతి ర్గమయ॥

518 పరుస మినుముసోకి బంగారమైనట్లు, కప్పురంబు జ్యోతిఁ గలిసినట్లు
పువ్వునందుఁదావి పొసఁగినట్లగు ముక్తి, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమాయ స్స్వర్ణతామేతి స్పర్శేణ స్పర్శవేధినః।
కర్పూరం జ్యోతిషి సుమే గంధో ముక్తి శ్చ తాదృశీ॥

తా॥ పుష్పమందుఁ బరిమళమున్నట్లు,కర్పూరము జ్యోతిలోఁ గలియునట్లు, ఇనుము పరుసవేదినిదాకి బంగారమైనట్లు, ముక్తిస్వరూపముసుమా.

519 జపము బాహ్యపూజఁ జాలఁజేసిపిదపఁ, గపటమువిడలేక కష్టనరులు
ముక్తినొందలేక మునిగిరి తమమున, విశ్వదాభిరామ వినురవేమ॥

జపం చ బాహ్యపూజాం చ కృత్వాత్యంత మనంతరమ్।
న త్యజంత శ్ఛలం వేమ! మగ్నా స్తమసి బంధితాః॥

తా॥ జపములు బాహ్యపూజలు చేయుదురు. కాని యంతఃకరణమునందలి యసూయాదికల్మషముల విడువలేరు. అందువల్ల ముక్తినొందలేక యజ్ఞానాంధకారమున మునిఁగి భ్రష్టులై నరకబాధల ననుభవింతురు.

520 ఊర్ధ్వలోకమందు నుచితక్రియంబున, రూపమేమిలేక రూఢితోన
పరమయోగి చూచుఁ బరమాత్ముఁ డితఁడని, విశ్వదాభిరామ వినురవేమ॥

యథోచితం చోర్ధ్వలోకే నిరాకారం నిరంజనమ్।
పరమాత్మాఽయ మిత్యేవం వేమ! యోగీ సమీక్షతే॥

తా॥ గ్రద్దయెంతపైకిఁబోయినను గ్రిందఁజూచు నీచపుదృష్టియే. యోగిపుంగవుఁడట్లుఁగాక ఊర్ధ్వదృష్టిచే నూర్ధ్వలోకమునఁ దగినపద్ధతితో నామరూపక్రియాశూన్యమగు పరమాత్మస్వరూపమును గాంచుచు నిత్యానందపరవశుఁడగుచుండును.

521 దానమొసఁగుకన్న దేసంబు వఱిపోచ్చు, దేసనొసమకన్నఁ దెలివి హెచ్చు
తెలివికన్న నాసఁజెఱవేసినది హెచ్చు, విశ్వదాభిరామ వినురవేమ॥

శ్రేయో దానా దిహ ధ్యానం ధ్యానాత్ జ్ఞానం విశిష్యతే।
జ్ఞానా దాశాపరిత్యాగః సర్వథా వేమ! చోత్తమః॥

తా॥ దానముకంటె ధ్యానము, ధ్యానముకంటె జ్ఞానము, జ్ఞానము కంటె నాచరణము నుత్తరోత్తరము బలీయము.

522 గాలిలేనిదీపకళిక చందంబున, నలలు సుళ్ళులేని జలధిరీతి
నిశ్చలాత్మ యుండు నిర్వికారంబున, విశ్వదాభిరామ వినురవేమ॥

యథా దీపో నివాతస్థః యథా నిర్వీచి రంబుధిః।
తథైవాత్మాచలో వేమ! నిర్వికారతయా స్థితః॥

తా॥ నిశ్చలమగు పరమాత్మస్వరూపము నిర్వికారముతో గాలిలేని చోటనుండు దీపకళికవిధమునఁ గెరటములు సుళ్ళు లేని గంభీరసముద్రము రీతిని నుండును. (వి) యథాదీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా॥

523 కలుషమెల్లఁదెలియఁ దలవంపులకుమూల, మరయఁ దత్త్వమెల్ల నాత్మఁబుటు
తెలిసినందుకు మతి ధీరుండు కావలె, విశ్వదాభిరామ వినురవేమ॥

జ్ఞాతే సమస్తే కలుషే మూలం వేమ! శిరోనతేః।
సర్వం తత్త్వం చాత్మజాతం జ్ఞాత్వా ధీరో భవే న్నరః॥

తా॥ మనస్పుట్టుక, బ్రతుకు,ఇట్టికల్మషములఁ దలచుకొన్న తలవంపులకు మూలము. అవమానము. అగౌరవము. ఆత్మయందే(తనయందే)తత్త్వము (యథార్థస్థితి) తెలియఁబడఁగలదు. అట్టిదానిని దెలిసికొని ధీరత్వముతోఁ బొందుటయే చేయఁదగిన ముఖ్యకార్యము. (వి) యోంతః స్సుఖోంతరా రామః తథాంత ర్జ్యోతిరేవ యః, స యోగీ బ్రహ్మనిర్వాణం, బ్రహ్మ భూతోఽధిగచ్ఛతి॥ గీత॥

524 అడవిఁదిరుగ లేదదాకాశమునలేదు, అవనిఁ దీర్థయాత్ర లందులేదు
ఒడలు శుద్ధిఁజేసి యొడయునిఁజూడరా, విశ్వదాభిరామ వినురవేమ॥

నారణ్యే నాంతరిక్షే వా నోర్వ్యాం నో తీర్థభూమిషు।
పశ్య శుద్ధాం తనుం కృత్వా వేమాంతస్థ్సం విభుం శివమ్॥

తా॥ పరమాత్మ (దైవశక్తి) నీలోపలనేకలదు. వేఱే యడవిలోనో,

ఆకాశముననో, యాత్రలలోనో యున్నదని భ్రమఁజెందక నీయుపాధిని (అంతఃకరణమును) బాగుఁజేసికొని యందుఁజూడుము. తెలియఁబడును.

525 కప్పురంపుమనసుఁ గాంక్షించు యోగికి, జ్ఞానదీపశిఖయుఁ దా నటించుఁ
గానవచ్చు నాత్మ కప్రమాణమై నిచ్చ, విశ్వదాభిరామ వినురవేమ॥

కర్పూరసదృశం చిత్తం కాంక్షతో వేమ! యోగినః।
జ్ఞానదీపశిఖా భాతి తయాత్మా పరిదృశ్యతే॥

తా॥ మనశ్శుద్ధిఁగోరు యోగికి జ్ఞానజ్యోతియు వెలుగును. ఆవెలుగునఁ బరమాత్మయు గోచరించును.

526 ఇంద్రియములచేత నెగ్గొందుచుండెడు, వెఱ్ఱిమనుజుఁ డేల వెదకు శివుని?
ఇంద్రియములరోసి యీశునిఁ జూడుఁడీ, విశ్వదాభిరామ వినురవేమ॥

ఇంద్రియై స్స్వవ్యథో మత్తః కిమన్వేష్టి సదాశివమ్?।
ఇంద్రియాణి తిరస్కృత్య పశ్య వేమ! పరాత్పరమ్॥

తా॥ ఇంద్రియచాపల్యమున బాధపడు వెఱ్ఱివాఁడు భగవంతుని దెలిసికొనుటకెట్లు ప్రయత్నించఁగలఁడు? తాత్కాలికములగు విషయాభిలాషలఁ ద్యజించి శాశ్వతానందస్వరూపుఁడగు పరమాత్మఁ గాంచుఁడు. (వి) యస్తువిజ్ఞానవాన్ భవతి యుక్తేన మనసా సదా, తస్యేంద్రియాణి వశ్యాని సదశ్వాఇవ సారథేః (కఠోపనిషత్).

527 కడుపునిండ సుధను గ్రమముతోఁద్రావినఁ, బాలమీద నేలపాఱు మనసు?
తత్త్వమెఱుఁగువెనుక తదితరమేటికి?, విశ్వదాభిరామ వినురవేమ॥

కుక్షిపూర్త్యై సుధాం పీత్వా క్షీరం స్మరతి కిం నరః?।
తథా జ్ఞాతే వేమ! తత్త్వే తదన్యేన తతశ్చ కిమ్?॥

తా॥ అమృతముఁ ద్రాగువానికిఁ బాలమీఁదకు మనస్సుపోనియట్లు తత్త్వము(పరమాత్మయథార్థస్వరూపము)గోచరించినవానికిఁ దదితరమగు దేనిమీఁదకు బుద్ధిప్రసరించును? (వి) వైరాగ్యమస్తి కిమితః పరమర్థనీయమ్? (భర్తృ) యథాఽమృతేన తృప్తస్య పయసా కిం ప్రయోజనమ్?॥

528 ఉత్తమోత్తముఁడగు సుచిత్తుఁడిలమీద, మహిమఁజూపువాఁడు మధ్యముండు
వేషధారి యుదరపోషకుఁ డధముండు, విశ్వదాభిరామ వినురవేమ॥

సర్వోత్తమ స్త్వాచితీజ్ఞః మధ్యమ స్సిద్ధిదర్శకః।
కుటుంభరి ర్వేషధారీ వేమాధమ ఇతీర్యతే॥

తా॥ యుక్తాయుక్త వివేకముకలవాఁ డుత్తముఁడు. ప్రభావములఁ గల్పించువాఁడు మధ్యముఁడు. వేషధారియై పొట్టకూటికి మాత్ర మేడ్చు వాఁ డధముఁడు.

529 మనస్సునందు ముక్తి నలయుచునుండఁగ, మనసు నెఱుఁగలేక మనుజులెల్ల
మనసు నణచలేక మాయనై పోదురు, విశ్వదాభిరామ వినురవేమ॥

ముక్తి ర స్తి మనస్యేవ మజానంతో మనో నరాః।
అశక్తాశ్చ మనో రోద్ధుం వేమ ! నశ్యంతి సర్వశః॥

తా॥ ముక్తి మనస్సునసే కలదు. కాని యట్టి మనో మర్మ మెఱిఁగి దాని దుష్టత్వ మణచలేక మానవులు సర్వనాశనమగుచున్నారు. (వి) కిమితరం చేతస్సమంసాధనమ్? 2 సర్వం వస్తుభయాన్వితం భువి నృణాం వైరాగ్య మేవాభయమ్ (భర్తృ) కస్యాస్తినాశో మనసో హి మోక్షః, క్వ సర్వదా నాస్తి భయం? విముక్తౌ ॥శం॥ మణి॥

530 మనసుముక్తియనుచు మది నెఱుంగఁగలేరు, మనసుచేతఁ దగిలి మాయనైరి
మనసుశుద్ధమైన మర్మజ్ఞుఁడగు యోగి, విశ్వదాభిరామ వినురవేమ॥

స జానాతి మనో ముక్తి రితి తేనైవ మోహితః।
నశ్యే చ్చిత్తం యస్య శుద్ధం యోగీ వేమ ! స మర్మవిత్॥

తా॥ మనస్సే ముక్తికిఁగారణమని గుర్తింపక దానికి వశులై చెడుచున్నారు. మనశ్శుద్ధిలేని యోగి దానిమర్మమెట్లు గుర్తెఱుంగఁగలండు ? (వి) మనో హి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చాశుద్ధమేవ చ, అశుద్ధం కామ సంకల్పం శుద్ధం కామవివర్జితమ్॥ మనపవనమనుష్యాణాం కారణం బంధ మోక్షయోః, బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్॥

531 మది నెఱిఁగినవాని మహిఁ గాన మెందును, మది నెఱుంగు నరుఁడు మహిని నరుదు
వెదకి తనువులోన వేడ్కతో నిసుఁజూచు, విశ్వదాభిరామ వినురవేమ॥

న పశ్యామో మానసజ్ఞం మనోవేత్తేహ దుర్లభః।
వేమాన్విష్య తనౌ సమ్యక్ స త్వాం పశ్యతి నిశ్చలః॥

తా॥ మనస్సు సంగతియెవరికిని బోధపడుటలేదు. అది బోధపడినఁ దన యంచే ప్రభూ! నిన్నుఁజూడఁగలఁడు (వి) కిం భూషణాత్ భూషణమస్తి శీలమ్ 2 తీర్థం పరం కిం? స్వమనో విశుద్ధమ్ 3 జితంజగత్కేన? మనోహి యేన॥ శం॥ మణి॥

532 బ్రహ్మమును నెఱుఁగదు భావ మిందుండెనా, తనువు గుడిగఁజేసి తన్ను నిలిపి
లోకబుద్ధివిడిచి లోఁజూపుఁ జూడరా, విశ్వదాభిరామ వినురవేమ॥

యద్యత్ర తిష్ఠతి మనో వేమ! బ్రహ్మ న వేత్తి హి।
తన్వాలయే నిధాయ స్వ మంతర్దృష్టి ర్భవేద్ధధీః॥

తా॥ తనభావము ప్రాపంచికవిషయముల నిమగ్నమైనఁ బరమాత్మ స్వరూపము నెట్లుఁగాంచఁగలఁడు? శరీరమే దేవాలయ మనుకొని యందుఁ దన్నే ప్రతిష్ఠించుకొని లోకబుద్ధివిడిచి లోఁజూపుఁజూచిన ప్రభూ! నిన్నుఁ గాంచఁగలఁడు.

533 నిన్నుఁజూచుచుండ నిండును దత్త్వంబు, తన్నుఁజూచుచుండఁ దగులు మాయ
నిన్ను నెఱిఁగినపుడె తన్నుఁ దా నెఱుఁగును, విశ్వదాభిరామ వినురవేమ॥

త్వద్దర్శనే పూర్ణ తత్త్వం మాయాబంధ స్స్వదర్శనే।
త్వద్వేత్తై వాత్మవేత్తా స్యాత్ వేమ! నాస్త్యత్ర సంశయః॥

తా॥ ప్రభూ! నిన్నుఁజూచుచున్న "సర్వంఖల్విదంబ్రహ్మ" అన్నట్లు అంతట పరమార్థస్వరూపమే గోచరించును. తన్నుఁజూచుకొనుచున్న మాయాదేవిరూపే యావరించుకొనియుండును. ఇట్టివాఁడు నిన్నెన్నటికిని దెలిసికొనలేఁడు.

534 వెదక వెదకఁ దొరకు వేదాంతవేద్యుండు, వెదకువాని దాను వెదకుచుండు
వెదక నేర్చినట్టి వెరవరుల్ గలరొకో?, విశ్వదాభిరామ వినురవేమ॥

బహుధాన్వేషణేనైవ వేదవేద్యో లభేత హి।
వేమాన్వేష్టార మన్వేష్టి కిం సంత్యన్వేషణే చణాః?॥

తా॥ వేదాంతవేద్యుఁడగు మహనీయుఁ డెంతవెదకినను దొరకఁడు. అతఁడు తన్నువెదకువానిని వెదకుచునే తిరుగుచుండును. కాని యట్టి వానిని వెదకుటకుఁ బ్రయత్నించువారలే యరుదు.

585 **ఉర్విజనులు పరమయోగీశ్వరునిఁజూచి, తెగడువారె కాని తెలియలేరు**
**అమృతమాదిరుచుల హస్త మేమెఱుఁగును, విశ్వదాభిరామ వినురవేమ॥**

జనా యోగీశ్వరం దృష్ట్వా నిందంతే న విదంతి తమ్।
పీయూషాదిరసజ్ఞానం వేమ! పాణేః కథం భవేత్?॥

**తా॥** అమృతమువంటి మంచిరుచులు జిహ్వకుఁ దెలియఁగలవు. కాని జిహ్వ కందించు చేతికిఁ దెలియఁగలవా? అట్లే లోకమందలి సామాన్య జనులు యోగీశ్వరులఁజూచి తిట్టువారలే కాని వారిప్రభావముఁ దెలిసి కొనుటకు సమర్థులుకారు.

536 **మాటలాడఁగల్గు మర్మ మెఱింగిన, జిన్న పెద్దతనము లెన్న నేల?**
**పిన్న చేతిదివ్వె పెద్దగా వెలుగదా?, విశ్వదాభిరామ వినురవేమ॥**

యది వక్తృ్యుక్తిమున్మష్టో బాలవృద్ధాంతరేణ కిమ్?।
బాలహస్తస్థితో దీపో వేమాలం కిం న భాసతే?॥

**తా॥** చిన్నవాని చేతిలోనున్న దివిటీయైనను పెద్దగనే వెలుఁగును. పిన్నవారలలోనే మేధావులుండవచ్చు. మంచివిషయముల మాట్లాడు వారిని పిన్నవారని నిరసించఁగూడదు. (వి) యుక్తియుక్తవచో గ్రాహ్యం బాలాదపి సుభాషితమ్॥

537 **ఆఁబురుచులు వేఱు సారంబ నొక్కటి, సత్యనిష్ఠ వేఱు సత్యమొకటి**
**పరమఋషులు వేఱు భావ్యుఁ డొక్కండగు, విశ్వదాభిరామ వినురవేమ॥**

విసారః పృథక్ పదార్థోహి సార స్సత్యాపతిః పృథక్।
సత్యమేకం తు ఋషయః పృథక్ వేమైక ఈశ్వరః॥

**తా॥** ఆఁబురుచులు వేఱువేఱుకాని సారమొక్కటే. సత్యనిష్ఠలు వేఱు వేఱు కాని సత్యమొక్కటే. అట్లే భావించు ఋషులు వేఱువేఱుకాని భావ్యుఁడగు పరమాత్మయొక్కఁడే. (వి) గవా మనేకవర్ణానాం క్షీరం స్యాదేకవర్ణకమ్, క్షీరవద్భాతిహి జ్ఞానం దేహినాం చ గవాం యథా॥

538 **సజ్జనములచెలిమి చాలింపఁగారాదు, ప్రకృతినెఱుఁగకున్న భక్తిలేదు**
**పలువ లెట్టిరీతి భక్తినిల్పుదురయా?, విశ్వదాభిరామ వినురవేమ॥**

న త్యాజ్యం సాధుసాంగత్యం అజ్ఞాత్వా ప్రకృతిం నృణామ్।
భక్తి ర్నాస్తి కథం మూఢా భజంతే వేమ! తం శివమ్?॥

తా॥ సద్గోష్ఠిమానిన జ్ఞానము తిత్తూడుటమానిన కొలిమివంటిది. కాన సజ్జనులమైత్రి చాలించుకొనఁ గూడదు. దాన ప్రకృతివిధాన మెఱుంగనగు. దాన భక్తికుదురును. సాధుమైత్రిలేక తత్త్వమెఱుంగక దుష్కర్మలఁ జేయుచు భక్తినలవరచుకొనవలెనన్న నెట్లు సాధ్యము? (వి) సత్సంగతిః కథయ కిం న కరోతి పుంసామ్? (భర్తృ)

539 ఇట్టికనుల బ్రహ్మ మెట్టుచూడఁగవచ్చు?, చూచుకనులునేఱు చూపువేఱు
మాపు లోననుంచి చూడఁగవలవదా?, విశ్వదాభిరామ వినురవేమ॥

కథం బ్రహ్మేదృగక్షిభ్యాం సంద్రష్టుం వేమ! శక్యతే?।
పృథక్ తదక్షిదృష్టి స్స్యాత్ అంతర్దృష్ట్యా ప్రదీక్షయేత్॥

తా॥ జ్ఞానచక్షువుల, లోఁజూపుఁజూచినఁగాని పరమాత్మస్వరూపము తెలియఁబడదు. స్థూలప్రపంచమును చూచుకన్నుల నది సాధ్యపడదు. ఆ చూచుకన్నులు, ఆచూపు వేఱె. (వి) న హి మాం శక్యసే ద్రష్టుం అనే నైవ స్వచక్షుషా॥ దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ (గీ) కిం? శివప్రసాదం సుఖబోధరూపమ్ జ్ఞానదృష్టి విదితం జగత్స్రష్టు సర్వాత్మకే బ్రహ్మణి పూర్ణరూపే॥ సం॥ మణి॥

540 మాలములనుబోలు దురవస్థలనునెల్ల, గోసి యాశలన్ని కోసివేసి
వాసనలఁదెలిసిన వాఁడెపో బ్రహ్మంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

దురవస్థా స్థ్సూలతుల్యా హిత్వాశావాసవర్జితః।
వాసనా యో విజానాతి వేమ! బ్రహ్మ స కథ్యతే॥

తా॥ పెద్దపెద్దమాలములవంటి దురవస్థల గడచి యాశలవిడనాడి పూర్వవాసనలఁదెలిసినవాఁడే పరబ్రహ్మస్వరూపుఁడగును. (వి) కే దస్యవ స్సంతి? కువాసనాఖ్యాః॥ సం॥ మణి॥

541 మాటలాడవేఱె మనసుకోలడివేఱె, ఒడలిగుణముపేఱె యోజవేఱె
ఎట్లుకలుగుముక్తి? యేలాగు తనలాగు, విశ్వదాభిరామ వినురవేమ॥

వచోభిన్నం మనోభిన్నం గుణోభిన్న స్తథా స్మృతిః।
కథం వా లభ్యతే ముక్తిః? కథం వేమ! స్వపద్ధతిః?॥

తా॥ మనోవాక్కాయకర్మల (త్రికరణముల) శుద్ధిలేదు. ఏమిటి? తన పద్ధతి? ఎట్లుముక్తిలభించును?

542 **వెలఁదిచక్కఁదనము వెరపైనయాడుదు, విభునికరుణలేక విరగనుండు**
**నీదుకరుణలేక నేర్పులు కొఱగావు, విశ్వదాభిరామ వినురవేమ॥**

అప్రసన్నే విభౌ తన్వ్యాః వృథా రూపం నవం వయః।
నైపుణీ వేమ! మర్త్యస్య నాభాతి త్వత్కృపాం వినా॥

తా॥ స్త్రీకిఁజక్కఁదనము యౌవనము మొదలగు నాకర్షణవిషయము లెన్నియున్నను భర్తయొక్కకరుణలేకపోయిన నవియన్నియు నిష్ప్రయోజనములైనట్లు ప్రభూ! నీకరుణలేక యేవ్యక్తి నేర్పరితనమైనను శోభించదు (వి) దుర్భగాభరణప్రాయం జ్ఞానం భారః క్రియాం వినా॥

543 **ఎంతకష్టముండు నంతపాపపుచింత, చింతచేత మిగులఁ జివుకు మనసు**
**చింతలేకయున్నఁ జెడనిసంపదఁ జూచు, విశ్వదాభిరామ వినురవేమ॥**

యావత్కష్టం పాపచింతా తావతీ వేమ! చింతయా।
మనో జీర్యతి నిశ్చింతః పశ్యేత్ భాతి మనస్వరామ్॥

తా॥ పాపపుపనులఁ జేయుటచేఁ గష్టము లనుభవించును. కష్టము లనుభవించుచుఁ బూర్వపువాసనచే పాపచింతనయే చేయుచుండును. మనస్సునకుఁ గుదురుపాటుండదు. కాన మనస్సునకట్టి యాలోచనలు లేకున్న శాశ్వతానందసంపదను జూడఁగలఁడు. (వి) అదానదోషేణ భవే ద్దరిద్రో దారిద్ర్యదోషేణ కరోతి పాపమ్, పాపా దవశ్యం నరకం ప్రయాతి పున ర్దరిద్రో పునరేవ పాపీ॥

544 **ఎండవేళ చీఁకటేకమైయున్నట్లు, నిండుకుండ నీరు నిలిచినట్లు**
**దండిని బరమాత్మతత్త్వంబుఁ దెలియుఁడీ, విశ్వదాభిరామ వినురవేమ॥**

యథాతపే తమోలీనం యథా కుంభే స్థితం జలమ్।
తథా వ్యాప్తం వేమ! విష్వక్ తత్త్వం తు పరమాత్మనః॥

తా॥ (మిట్టమధ్యాహ్నము నీడనిలబడినట్లు) ఎండవేళ చీకటి నిలచియున్నట్లు నిండుకొండ నీరులోఁగినట్లు పరమాత్మతత్త్వమంతటఁ బూర్ణముగ నిండియున్నది. తెలిసికొనుఁడు.

545 ఇంటిలోనిధనము 'ఇదినాది' యనుచును, మంటిలోన దాచు మంకుజీవి
కొంటుఁబోడు వెంట గుల్లకాసైనను, విశ్వదాభిరామ వినురవేమ॥
'ఇదం మమేతి' యద్గేహే ధనం తత్సర్వ మేవచ।
నిక్షిపే న్మృది వేమాజ్ఞో నాంతే నయతి కాకణీమ్॥

తా॥ తెలివితక్కువమానవుఁడు "నాది" అని దాచును. శరీరము విడిచి పోవునపుడు గ్రుడ్డిగవ్వయైనఁ గొనిపోఁజాలఁడు. (వి) ద్వేపదే బంధమోక్షాభ్యాం నమమేతి మమేతి చ, మమేతి బద్ధ్యతే జంతు ర్నమమేతి విముచ్యతే॥ ఉ॥ గీత॥

546 దేశవేషములను దేటసేయక దేవుఁ, డాత్మలోననుండు ననఁగి పెనఁగి
వేస మరసిచూడ గాసిసంబుకొఱకయా, విశ్వదాభిరామ వినురవేమ॥
దేశవేషై ర్న విజ్ఞేయో హ్యాత్మ న్యంతర్గతో విభుః।
ఆవశ్యకత్వం వేషస్య గ్రాసార్థం వేమ! కేవలమ్॥

తా॥ దేశవేషముల దేవుఁడు తెలియఁబడఁడు. ఆత్మలోనే దేవుఁడు నిండియుండును. ఇఁక వేషభాషలు గాసిసముకొఱకే.

547 పర్వతవనవాసి పరిణామవర్తన, కూపవాసి కట్లుగుఱుతుపడును?
బ్రహ్మనిష్ఠు వెంటఁ బ్రాకృతుఁ డరుగునా?, విశ్వదాభిరామ వినురవేమ॥
పరిణామదశా శైలవాసినః కూపవాసినా।
జ్ఞాయతే కథ? ముజ్ఞః కిం యోగీంద్ర మనుగచ్ఛతి?॥

తా॥ కూపస్థ మండూకమునకు (నూతిలోనుండుకప్పవంటివ్యక్తికి) పర్వతముల, వనముల సంచరించువాని నడపడిక తెలియునా? అట్లే బ్రహ్మనిష్ఠుని విధానము ప్రాకృతునకును దెలియఁబడదు. ప్రకృతి ననుసరించిపోవువాఁడు ప్రాకృతుఁడు ప్రకృతిని కతీతుఁడు బ్రహ్మనిష్ఠుఁడు.

548 అల్పసుఖములెల్ల నాశించి నగుజుండు, బహువిధదుఃఖములను బాధపడును
పరసుఖంబునొంది బ్రతుకంగ నేఁడు, విశ్వదాభిరామ వినురవేమ॥

అభ్యర్థ్యాల్పసుఖా న్యజ్ఞో వ్యథతే బహుదుఃఖభాక్।
పరమం తు సుఖం లబ్ధ్వా జీవితుం వేమ! నార్హతి॥

తా॥ వివేకశూన్యుఁడగు మానవుఁ డల్పసుఖముల కాసపడి యధిక దుఃఖమునొందును. కాని పరమాత్మస్వరూపముఁ దెలిసికొని శాశ్వతానందమునొందుటకుఁ బ్రయత్నింపఁడు. (వి) బద్ధో హి కో? యో విషయానురాగీ, కా వా విముక్తిః? విషయే విరక్తిః, కో వాస్తి ఘోరో? నరక స్స్వదేహః॥ శం॥ మణి॥

549 కడఁగి వట్టియాస కడ తేరనీయదు, ఇడుమలందుఁబెట్టి యేడ్పుఁగాని
పుడమిజనుల భక్తిపొడమంగనీయదు, విశ్వదాభిరామ వినుర వేమ॥

వ్యర్థాశా తరఙ్గోపాయవారిణీ కష్టకారిణీ।
వేమాథ భువి మర్త్యానాం స్యా ద్భక్త్యుదయరోధినీ॥

తా॥ అడియాస కష్టముల ననుభవింపఁజేసి యేడ్పించును. కాని ముక్తిమార్గమును జూపదు. భక్తిపుట్టనీయదు. సౌఖ్యమనుభవింపనీయదు. (వి) తృష్ణా న జీర్ణా వయమేవ జీర్ణాః (భర్తృ)॥

550 ధర్మ మరసిపూని ధర్మరాజాదులు, నిర్మలంపుఁబొగ్గి నిల్చికొనిరి
ధర్మమే నృపులకుఁ దారకయోగంబు, విశ్వదాభిరామ వినుర వేమ॥

ప్రతిపాం ధర్మ మాశ్రిత్య ధర్మరాజాదయో యయుః।
యోగ స్తారక ఇత్యాహుః ధర్మం వేమ! మనీషిణః॥

తా॥ ధర్మరాజుమొదలగు ప్రభువు లెన్నికష్టములువచ్చినను ధర్మమునే యాశ్రయించి నిర్మలమగుకీర్తినార్జించిరి. ధర్మమే ప్రభువుతరించుమార్గము.

551 దానములనుజేయ ధరఁ జేతులాడక, బహుధనంబుఁ గూర్చి పాతిపెట్టి
తుదకు దండుగనిడి మొదలుచెడు నరుఁడు, విశ్వదాభిరామ వినుర వేమ॥

అనిచ్ఛన్ దాతు మర్థిభ్యో సంచిత్య బహుళం ధనమ్।
వేమాంతే నష్టసర్వస్వః పామరో నశ్యతి ధ్రువమ్॥

తా॥ మూర్ఖుఁడు తానుతినక యితరులకుఁబెట్టక సంపాదించుటకే జీవితమంతయు ధారపోసి చచ్చును. నిరుపయోగజన్మనొంది సర్వభ్రష్టుఁడగును.

552 విను వివేకమనెడు వింతగొడ్డలిచేత, నల యవిద్యయనెడు నడవి నఱికి
తెలివియనెడు గొప్పదీపంబు చేపట్టు, విశ్వదాభిరామ వినురవేమ॥

శృణు వేమ! వివేకాఖ్యకుఠారేణాద్భుతేన వై।
అవిద్యాఖ్యాటవీం ఛిత్త్వా గృహాణ జ్ఞానదీపికామ్॥

తా॥ వివేకమను గొడ్డలిచే నవివేకమను ఘోరారణ్యమునఱికి జ్ఞానబుద్ధియను దీపసహాయమున నాపరమాత్మను గాంచుము.

553 పాలనీరుఁ గ్రిసుము పరగ హంసయొకండు, నీరుపాలఁ గ్రిసుము నెఱపికేల?
అజ్ఞుఁడైనమనుజుఁ డలశివు నెఱుఁగునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

క్షీరనీరక్రమం హంసో జానాతి న శిఖావళః।
అజ్ఞః కథం విజానాతి వేమేహ పరమం శివమ్॥

తా॥ పాలను నీటిని వేఱుచేసి పాలనుమాత్రముగ్రాగి నీటినివిడిచి పెట్టువిధానము హంసకుఁదెలియును. కాని గ్రాసపాములఁజేయు నెమలికేమి తెలియఁగలదు? అట్లే ప్రకృతిపరమేశ్వరులఁ బ్రకృతిని విడఁద్రొక్కి పరమేశ్వరుఁబొంది యనుభవించు విధాము పరమహంసలగు యోగిపుంగవులకుఁ దెలియును గాని పామరునకుఁ దెలియఁబడదు.

554 కన్నులందు మదముకప్పి కానరుకాని, నిరుడుముందటేడు నిన్నమొన్న
దగ్ధులైనవారు తమకంటెఁ దక్కువా?, విశ్వదాభిరామ వినురవేమ॥

పశ్యంతోఽపి న పశ్యంతి మదాంధా వేమ! వై మృతాః।
హ్యః పరహ్యో గతేఽబ్దేతత్పూర్వే న్యూనాః కిమాత్మనః?॥

తా॥ కళ్లకు మదముగ్రమ్మి గ్రహించలేరు కాని నిరుడు, ముందటేడు, నిన్న, మొన్నచచ్చి తగులఁబెట్టఁబడ్డవారు తమకంటెఁ దక్కువవారా? తామది తప్పించుకొనుటకు మొనగాళ్లా? (వి) సర్వంవస్తు భయాన్వితం భువి నృణాం వైరాగ్య మేవాభయమ్ (భర్తృ)॥ న హి కల్యాణకృత్కశ్చి ద్దుర్గతిం తాత! గచ్ఛతి॥ గీత॥

555 ఏఱుదాటి మెట్టకేగినపురుషుండు, పుట్టి సరకుఁగొనక పోయినట్లు
యోగపురుషుఁడేల నొడలుఁ బాటించురా?, విశ్వదాభిరామ వినురవేమ॥

నదీం తీర్త్వోన్నతం దేశం ప్రాప్తో నాద్రియతే ప్లవమ్।
యోగారూఢః పుమాన్ వేమ ! కిమర్థం గణయేత్తనుమ్?॥

తా॥ ఏఱు దాటి మెట్టకుఁ జేరినవాఁడు తెప్పను విడుచునట్లు పరమాత్మను దెలిసికొన్న యోగియు దానికిసాధనమగు శరీరమును లెక్కచేయఁడు.(వి) గ్రంథమభ్యస్య మేధావీ జ్ఞానవిజ్ఞానతత్పరః, పలాల మివ ధాన్యార్థీ త్యజే ద్గ్రంథ మశేషతః॥ ఉ॥గీత॥

556 మట్టికుండవంటి మాయశరీరంబు, చచ్చు నెన్నడైనఁ జావదాత్మ
ఘటములెన్నియైన గగనంబదేక మే, విశ్వదాభిరామ వినురవేమ॥

మ్రియతే మృద్ఘటసమా తను రాత్మా న కర్హిచిత్।
పృథగ్రూపా వేమ ! ఘటా ఏకరూపో విహాయసః॥

తా॥ మట్టికుండవంటి శరీర మనిత్యముకాని యాత్మస్వరూపము శాశ్వతమైనదే. ఘటములెన్నియైన నాకాశమొకటే. శరీరములెన్నియైన నాత్మయొకటే. (వి) యం ప్రవ్రజంత మనుపేత మపేతకృత్యాం ద్వైపాయనో విరహకాతర ఆజుహావ, పుత్రేతి తన్మయతయా తరవోఽభినేదు స్తం సర్వభూతహృదయం మునిమానతోఽస్మి॥ భాగ॥ న హన్యతే హన్యమానే శరీరే॥ గీత॥

557 మాయయనుచెఱసాల మనసనుగొలుసును, భేదమనెడు బొండ బిఱిసియుండు
ఇట్టి బద్ధజీవి కెన్నడు మోక్షంబు?, విశ్వదాభిరామ వినురవేమ॥

మాయా కారా మనః పాశః భేదబుద్ధి స్తు శృంఖలా।
ఏతై ర్బద్ధస్య జీవస్య వేమ ! మోక్షః కదా భవేత్॥

తా॥ జీవి భేదమను బొండకును మనస్సనుగొలుసునఁ గట్టఁబడి మాయ యను చెఱసాలలో బంధింపఁబడియున్నాఁడు. అట్లు బద్ధుఁడగు జీవికి విముక్తి యెప్పుడు కలుగును?

558 ఎఱుకకన్నను సుఖ మేలోకమునలేదు, ఎఱుక నెఱుఁగ నెవని కెఱుకలేదు
ఎఱుకసాటి యెఱుక యెఱుకయే తత్త్వంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

జ్ఞానతుల్యం సుఖం నాస్తి జ్ఞానం వేమ ! న వేద్యతే।
జ్ఞానస్య సామ్యం జ్ఞానం హి జ్ఞానం తత్త్వం హి కేవలమ్॥

తా॥ జ్ఞానవికాసమునకన్న సుఖ మేలోకముననులేదు. కాని యది పొందుమార్గము మాత్ర మెవ్వరికిని గోచరించుటలేదు. జ్ఞానమునకు సాటి జ్ఞానమే. జ్ఞానస్వరూపమే పరమాత్మ (వి) శేతే సుఖం కస్తు? సమాధినిష్ఠః, జాగర్తికోవా? సదసద్వివేకీ ।శం। ।మణి। యం లబ్ధ్వా చాపరంలాభం. మన్యతే నాధికం తతః ।గీత।

559 మౌనమునందెలియు నుత్తమయోగంబు, మానసంబునిలిమి మధ్యమంబు
ఆసనాదివిధులె యధమయోగంబురా, విశ్వదాభిరామ వినురవేమ॥

మౌనం స్యా దుత్తమో యోగః మధ్యమో మానసే స్థితిః।
ఆసనాదివిధానై స్తు వేమ ! యోగోఽధమ స్స్మృతః॥

తా॥ అన్నియుఁదెలిసి మౌనమువహించు జ్ఞానపద్ధతి ఉత్తమము, మనస్సును స్వాధీనపరచుకొనుటకుఁజేయు వాయుసాధకములు మధ్యమము. కేవలశారీరక సాధకములగు ఆసనాదివిధు లధమము.

560 మనసుఁబూనినిల్చి మనసులో సుఖియించి, కడప మోక్షపదముఁగనువాఁడు
చెట్టుఁబెట్టిఫలము చేకూరకుండునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

ధృత్వా జిత్వా మన స్తస్మిన్ య స్సుఖీ ముక్తి మేతి సః,
ఉప్తవంత స్తరుం వేమ ! న కిం స్పృష్ణాంలి తత్ఫలమ్?॥

తా॥ చెట్టునుబాతినవాఁడు ఫలితముఁబొందునట్లు, ఏదోయొక విధమున మనస్సును జయించి సుఖమునొంది తరింపఁజూచువాఁ డెన్నటికైన మోక్షమునొందఁగలఁడు. (వి) అసంశయం మహాబాహో! మనో దుర్నిగ్రహం చలమ్, అభ్యాసేన చ కౌంతేయ! వైరాగ్యేణ చ గృహ్యతే॥

561 మాటలాడవచ్చు మనసు నిల్పఁగరాదు, తెలుపవచ్చుఁ దన్నుఁ దెలియరాదు
సురియఁబట్టవచ్చు శూరుఁడుఁగారాదు, విశ్వదాభిరామ వినురవేమ॥

శక్యోఽతి వక్తు మస్యేషా మనసు శ్చిత్తరోధనే।
శక్తః కృపాణగ్రహణే వేమ ! శూరో భవే న్న హి॥

తా॥ ఆయుధముపట్టుకొన్న మాత్రమున శూరుఁడును, తెలియఁజెప్పినంతమాత్రమునఁ దెలిసినవాఁడును, బాగుగమాట్లాడినంతమాత్రమున నిశ్చలమనస్సుకలవాఁడును గాఁజాలఁడు.

562 గురువు చిల్లగింజ కుంభమీ దేహంబు, ఆత్మకలుషపంక మడుగుఁబట్ట
తెలిసివిరిసె నేని దివ్యామృతము తేఁటు, విశ్వదాభిరామ వినుర వేమ॥

గురుః కతకబీజం స్యాత్ అఘః పంక స్తను ర్ఘటః।
తత్పంకాధఃప్రాపణాత్ స్యాత్ వేమ ! జ్ఞానసుధోదయః॥

తా॥ కుండలోని బురదనీటిని పరిశుభ్రపరచుటకుఁ జిల్లగింజ గంధముఁ గలిపిన బురద క్రిందకుఁబోయి తేటఁగా నీరుపైకిఁ దేరునట్లు దేహమను కుండలోని ఆత్మ కలుషమను బురదనీటిలో గురుప్రబోధమను చిల్లగింజ గంధమును గలిపినఁ గలుష మడుగంటి యాత్మజ్ఞానామృతము తేరి యను భవయోగ్యము కాఁగలదు.

563 జీవి లోననుండు స్థిరమును గానక, తిరుగు నస్థిరంబు వరుసనమ్మి
స్థిరము నస్థిరమును దెలియ జీవికి ముక్తి, విశ్వదాభిరామ వినుర వేమ॥

వేమాంతస్థస్థిరం జీవీ నోద్వీక్ష్య బహి రస్థిరమ్।
విస్రభ్యాటతి ముక్తి స్స్యాత్ స్థిరాస్థిరవిదో ధ్రువమ్॥

తా॥ జీవి, నిత్యానిత్య వస్తువివేకము లేక యస్థిర బాహ్యసౌఖ్యముల నమ్మి తనలోనుండు స్థిరపదార్థమును దెలియక తిరుగుచు ముక్తి నొందకున్నది. (వి) ఏమ్ముచ్చలం కిం? ధనయౌవనాయుః ।శం। మ॥

564 గతముఁ [illegible]తమంటె కలఁగన్న యర్థంబు, నడచుకాలమేమి నమ్మరాదు
క్షణములోని బ్రతుకు సంసారవిభ్రాంతి, విశ్వదాభిరామ వినుర వేమ॥

గతం స్వప్నార్థసదృశం వర్తమానం న విశ్వసేత్।
క్షణం హి జీవితం వేమ ! భ్రామ్యతే భవవర్త్మని॥

తా॥ భూతకాలము కలలోఁ గాంచిన పదార్థమువంటిది. వర్తమాన మెంతకాలము నడచునో నమ్మఁదగినదికాదు. క్షణములోని బ్రతుకు, విభ్రాంతిఁ గల్గించు సంసారము. ఇఁక భవిష్యత్ (పరము) ఎట్లుండునో నిర్ణయించుటకు వీలులేనిది. కాన ప్రతిక్షణము నప్రమత్తుఁడవై విధినిర్వహణమునకుఁ బూనుకొనుము. (వి) జ్ఞాతే తత్త్వే కస్సంసారః (భజగోవిందమ్)

565 తానవంగ నెవరు? తనవారనెవరు?, తెలిసి తెలియలేరు తిక్కవరులు
అరయఁ బసిరికాయపురుగుపద్ధతిఁ గాఁగ, విశ్వదాభిరామ వినుర వేమ॥

కో నామాత్మా కే స్వకీయాః విదిత్వా న విదంతి హి।
కుధియో వేమ! నశ్యంతి కార్పాసకృమయో యథా॥

తా॥ తాను సుఖించుటకు గూడునల్లుకొని తుదకు గూటిద్వారమును గూడ మూసివేసికొని యందే మరణించు పసిరికాయపురుగువలె నజ్ఞానులు 'తాను తనవారు' అని దానిమూలముఁ దెలిసికొనక స్వనాశనమున కుపక్రమించు చున్నారు.

566 చచ్చె, చచ్చెననుచుఁ జావుకుతకఁ జెడు, దీననరులవెఱ్ఱిఁ దెలుపఁగాదు
ప్రాణి కరయ మృత్యుబంధంబు లుండునా, విశ్వదాభిరామ వినుర వేమ॥

యే మమార మమారేతి శోచంతే తద్విమూఢతా।
కిం వాచ్యా? ప్రాణినాం వేమ! కుతోఽబంధః? కుతో మృతిః॥

తా॥ దీనులగు మానవులు మరణమునకు భీతిల్లి విచారింతురు. ఈవెఱ్ఱి కంతము చెప్పట్టదు. అనిత్యమగు శరీరము నిత్యముకాఁగలదా? నిత్యుఁడగు జీవుఁడు మరణించునా?

567 జననమరణములకు పరిస్వతంత్రుఁడు కాఁడు, మొదటఁ గర్త కాఁడు తుదను గాఁడు
నడుమఁ గర్తననుట నగుబాటుకాదొకో!, విశ్వదాభిరామ వినుర వేమ॥

జననే మరణే వేమ! న స్వతంత్రో హి మానవః।
ఆదౌ న కర్తా నాంతే చ మధ్యే కర్తేతి దుర్భ్రమః॥

తా॥ ఏదియో మహత్తరశక్తి తీసికొనివచ్చి లోకమునఁ బాఱవేసినది. మఱలఁ గొనిపోవుచున్నది. మధ్యభాగమునఁ గాలముతోఁ బాటు పెరుగుచున్నాఁడు. తఱుగుచున్నాఁడు. ఎక్కడ స్వాతంత్ర్యము? (నీడ పెరుగుటకుఁ దఱుగుటకుఁ గారణభూతుఁడు తాను కాదు. సూర్యుఁడు) (ప్ర) దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా, తథా దేహాంతరప్రాప్తిః॥ (గీత)

568 బ్రహ్మమేదనుచుఁ బలుమాఱు నందురు, వెఱ్ఱిమూర్ఖజనులు విధము మెఱుఁగరు
బ్రహ్మమన్నిటందుఁ బరిపూర్ణమై యుండు, విశ్వదాభిరామ వినుర వేమ॥

క్వేదం బ్రహ్మేతి బహుధా ప్రలపంత్యస్మదా జడాః।
సర్వత్ర పరిపూర్ణం హి బ్రహ్మ వేమ! విరాజతే॥

తా॥ దేహములో జీవునివలె పరబ్రహ్మస్వరూపమంతట నిండియున్నది. కాని యజ్ఞాను లిది తెలియఁజాలక బ్రహ్మ మెక్కడనుండునని పలుకుదురు.

569 పసులవన్నె వేఱు పాలెల్లనొక్కటే, పుష్పజాతి వేఱు పూజయొకటె
దర్శనంబు వేఱు దైవంబదొక్కటే, విశ్వదాభిరామ వినురవేమ॥

పశువర్ణాః పృథక్ క్షీర మేకం వేమ! సుమావళేః।
జాతి ర్భిన్నాపి పూజైకా దైవ మేకం స్మృతిః పృథక్॥

తా॥ పశువులరంగు వేఱుకాని పాలరంగొకటే. పుష్పజాతులు వేఱు కాని పూజాస్వభావమొకటే. దర్శనము వేఱుకాని దైవమొకటే.
(వి) గవా మనేకవర్ణానాం క్షీరం స్యా దేకవర్ణకమ్, క్షీరవద్భాతి హి జ్ఞానం దేహినాం చ గవాం యథా॥ (ఉ॥ గీత)

570 పనితొడవులు వేఱు బంగార మొక్కటే, పరగ ఘటము వేఱు ప్రాణమొకటె
అరయఁ దిండ్లు వేఱు దాకలియొక్కటే, విశ్వదాభిరామ వినురవేమ॥

భూషణాని పృథక్ వేమ! హేమైకం స్యాత్ ఘటాః పృథక్।
ఏకః ప్రాణో భోజనాని పృథ గేకా బుభుక్షుతా॥

తా॥ నగలు వేఱుకాని బంగార మొకటే. శరీరములు వేఱుకాని యాత్మయొకటే. తినుబండారములు వేఱుకాని యాకలిస్వభావమొకటే.

571 కానలేఁడు నుదుట కర్ణముల్ వీపును, నెఱులుఁ గానలేఁడు నెత్తిమీఁద
తన్నుఁ గానలేఁడు తత్త్వ మే మెఱుఁగును?, విశ్వదాభిరామ వినురవేమ॥

నేక్షతే నిటలం కర్ణౌ పృష్ఠం కేశాం శ్చ మూర్ధని।
నాత్మానం వేత్తి కిం వేమ! తత్త్వం జానాతి బాలిశః? ॥

తా॥ తనశరీరమందలి నుదురు, చెవులు, వీపు, తలపై వెండ్రుకలు మొదలైనవే తాను చూడలేఁడు. ఇఁక నంతట నిండియున్న పరమాత్మ స్వరూపుని నీచకువుల నెట్లుఁగాంచఁగలఁడు?

572 తిరిగితిరిగి నరుఁడు సురలుకొనుటెకాక, అందువలన నేమి యాపలేను
అంతరాత్మనిలుపు నతఁడెపో బ్రహ్మంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

మోహజాలే ముహుర్వేమ! సక్తో భవతి దుర్మతిః।
తతః ఫలం న కించి త్స్యాత్ ఆత్మజ్ఞో బ్రహ్మ కేవలమ్॥

తా॥ పరిశుద్ధాంతఃకరణమునఁ బ్రతిఫలించు పరమాత్మ స్వరూపము నిశ్చలముగఁజూచు బ్రహ్మవేత్త కాలేక మానవుఁడు స్వర్గా తిరిగి చెడును.

573 చిత్తమనెడు వేరు శిథిలమై నప్పుడే, ప్రకృతియనెడు చెట్టు పడును గాదె
గోర్కులనెడు పెద్దకొమ్మ లెందునుగదా, విశ్వదాభిరామ వినుర వేమ॥

శిథిలే చిత్తమూలే స్యాత్ పతితః ప్రకృతిద్రుమః ।
శుష్యంతి హి తతో వాంఛాశాఖా వేమ! నిరాశ్రయాః॥

తా॥ ప్రకృతి మహావృక్షమునకుఁ జిత్తము కూకటివేరు. కోరికలు కొమ్మలు. చిత్తము శిథిలమైనఁ బ్రకృతి మహావృక్షము పడును. ఇఁక కోరికలను కొమ్మ లెట్లెదుగఁ గలవు?

574 తిట్టికొట్టిరేని దిరిగి మాటాడక, ఊరకున్నఁజూడ నుర్విమీఁద
వాఁడగుఁబరమాత్మ వర్ణింప శక్యమా?, విశ్వదాభిరామ వినుర వేమ॥

దూషిత స్తాడితో వాపి యత్కించి దపి చా బ్రువన్।
తూష్ణీం భావం గతో వేమ! పరమాత్మేతి వర్ణ్యతే॥

తా॥ మన మెన్ని తిట్టినను భగవంతుఁ డెదురుతిరుగనట్లు, మానాభిమానముల సరకుఁగొనక నిర్లిప్తతతో సంచరించువాఁడే పరమాత్మ రూపుఁడు.

575 కల్మషంబుపోక కన్పించ దెందును, రూప మెవ్వరికిని రూఢితోడ
తామసం బుడిగినఁ దగఁగల్గు జ్ఞానంబు, విశ్వదాభిరామ వినుర వేమ॥

అనిర్గతే హి కాలుష్యే న రూపం ద్యోతతే ధ్రువమ్।
తమ స్యపావృతే వేమ! జ్ఞానం నూనం ప్రకాశతే॥

తా॥ ముఱికితోనున్న యద్దమునఁ బ్రతిబింబరూపము కాన్పించనియట్లు అంతఃకరణమాలిన్యమునఁ బరమాత్మ స్వరూపమును గాన్పించదు. (వి) ధూమేనావ్రియతే వహ్నిః, యథా దర్శో మలేన చ, యథోల్బేనావృతో గర్భః తథా తేనేద మావృతమ్॥ (గీత)

576 నీటిలోనవ్రాసిన నిలుకడయున్నట్లు, పాటిజగతిలేదు పరము లేదు
మాటమాటకెల్ల మనసు కోరుచునుండు, విశ్వదాభిరామ వినుర వేమ॥

జలే రేఖా స్థిరా న స్యాత్ తథేహా చ పరే సుఖమ్।
మనో ముహుర్ముహు ర్వేమ! కామితా న్యభివాంఛతి

తా॥ నీటనుఁ వ్రాసిన వ్రాత నిలువనట్లు కోరికలతో మాలిన్యముఁ జెందిన మనమున నిహపరసౌఖ్యము, న్యాయము నిలువదు. (వి) చంచలం హి మనః కృష్ణ ! ప్రమాథి బలవ ద్దృఢమ్॥ (గీత)

577 దొంగ తెలివిచేత దొరుకునా మోక్షంబు?, చేతఁగానిపనులఁ జేయరాదు
గురుఁ డనంగఁ వలదు గుణహీనుఁ డనవలె, విశ్వదాభిరామ వినురవేమ॥

మిథ్యాజ్ఞానేన కిం ముక్తి ర్లభ్యతే ? వేమ ! దుష్క్రియః ।
న వక్తవ్యో గురు రితి గుణహీన ఇతీర్యతే ॥

తా॥ పరిశుద్ధజ్ఞానముచే లభించు మోక్షము దొంగతెలివిచేఁ జెడ్డపనులఁ జేయువారికి లభించునా ? అట్టి దుష్టుల గుణహీనులనవలెను. కాని గురువు లనవచ్చునా ? (వి) సంసారహృత్కః ? శ్రుతిజాత్మబోధః 2 కో మోక్ష హేతుః ? కథిత స్సఏవ॥ (శం॥మణి)

578 ఆశలఁ దెగఁగోసి యనలంబుఁ జల్లార్చి, గోచి బిగియఁ బెట్టి కోప మడఁచి
గుట్టుమీఱువాఁడు గురువుకు గురువురా?, విశ్వదాభిరామ వినురవేమ॥

కౌపీనవంత శ్ఛిన్నాశాః ప్రశాంతా గతమన్యవః ।
వేమాతీతరహస్యా యే గురూణాం గురవో హి తే ॥

తా॥ ఆశల నణచి ఆగ్రహముఁ జంపి కామము నరికట్టి, క్రోధము రానీక, పరమార్థతత్త్వరహస్యము గుర్తెఱింగిన వాఁడే గురువులకును గురువు. (వి) కోవా గురు ర్యోహి ? హితోపదేష్టా 2 శిష్యస్తు కో? యో గురుభక్త ఏవ॥ బుద్ధ్యా విశుద్ధయా యుక్తో మనోహృది నిరుధ్య చ॥

579 ఆశలనెడుత్రాళ్ళ నమరఁగోయఁగఁ జేసి, పాఱవైవఁగాని పరములేదు
కొక్కుతిండియాశఁ జిక్కి చచ్చినయట్లు, విశ్వదాభిరామ వినురవేమ॥

ఆశాపాశాన్ భృశం ఛిత్వా న విసృజ్య పరం న హి ।
అహోరాశావశో వేమ ! మూషికో మ్రియతే ఖలు ॥

తా॥ పందికొక్కు తిండియాశచే బోనులోఁజిక్కి చచ్చునట్లు ఆశాపాశములచే బద్ధుఁడగువాఁడు సంసారములోఁజిక్కి నశించును. వానికిఁక పరము (భవిష్యత్తులో బాగు) లేదు.

580 సూక్ష్మరూపమెఱిఁగి సుఖమొందఁగాలేక, బహుళముగను జదువుఁ బడుచునరుఁడు
చావుచేతఁజిక్కి చదువేల జదువఁడో!, విశ్వదాభిరామ వినురవేమ॥

సూక్ష్మరూప మభిజ్ఞాయ సుఖ మప్రాప్నువా న్యవా।
బహ్వాధీతే వేమ! విద్యాః మమృతాం న పఠే త్కథమ్?॥

తా॥ శాశ్వతానందము కలుగు చదువుచదివి యానందముఁ గల్గించు నా సూక్ష్మముఁ దెలిసికొనఁ జాలక పనికిమాలిన చదువు రాత్రింబవళ్లు కష్టించి చదివి యజ్ఞాని భ్రిష్టుఁడగుచున్నాఁడు.

581 తను వదెవరిసొమ్ము తనదనిపోషింప, ధన మదెవరిసొమ్ము దాచుకొనఁగ
ప్రాణమెవరిసొమ్ము పాయకుండఁగనిల్ప, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ! భర్తుం స్వీయమితి కస్య స్వం దేహ మీదృశమ్।
కస్య స్వం ద్రవిణం గోప్తుం ప్రాణః కస్యావితుం సదా॥

తా॥ శరీరమును బోషించి నిలుపుకొనుటకు, ధనమును దాచి తనదిగా నుంచుకొనుటకు, ప్రాణము నాపుకొనుటకు నేజీవికైన సమర్థత కలదా?

582 జీవిఁజంపుటెల్ల శివభక్తిఁదప్పుట, జీవి వరసిచూడ శివుఁడుఁగాఁడె?
జీవుఁడె శివుఁడనుచు సిద్ధంబు తెలియుము, విశ్వదాభిరామ వినురవేమ॥

శివాభక్తి ర్జీవవధో జీవోనామ శివః ఖలు।
అభేదం జీవశివయోః వేమ! జానీహి తత్త్వతః॥

తా॥ ప్రతి జీవియుఁ బరమాత్మ స్వరూపము గనుక జీవిని హింసించిన దైవమును హింసించినట్లే యగును. కాన నేజీవిని హింసింపకుండుటయే ముఖ్యధర్మము. (వి) కా స్వర్గదా? ప్రాణభృతా మహింసా॥ (శం॥మణి)

83 కొంకణంబుఁబోవ కుక్క సింగముకాదు, కాశిబోవఁ బందిగజముఁగాదు
వేఱుగుణమువాఁడు విబుధుండుకాఁడయా, విశ్వదాభిరామ వినురవేమ॥

న సింహ శ్శ్వా కోంకణగో కాశీగో న గజః కిటిః।
పృథగ్గుణం గతో మర్త్యః వేమ! యోగీ న కథ్యతే॥

తా॥ కొంకణదేశము వెళ్ళినమాత్రమునఁ గుక్క సింహమును, కాశీ వెళ్ళినమాత్రమునఁ బంది యేనుఁగును గానట్లు దుష్టబుద్ధికలవాఁ డెక్కడ దిరిగినను, నేమిచెప్పినను, నేమిచేసినను దెలిసినవాఁడు కాఁజాలఁడు.

584 ఈతకంటెలోతు సెంచంగఁబనిలేదు, చావుకంటెఁ గీడు జగతిలేదు
గోచిపాతకంటెఁ గొంచెంబు మఱిలేదు, విశ్వదాభిరామ వినురవేమ॥
తరణా న్నా స్త్యగాధత్వం మరణా న్నాస్తి దుర్వ్యథా।
కౌపీనా న్నాస్తి దీనత్వం వేమ! కించిదపి ధ్రువమ్॥

తా॥ ఈతకుమించిన లోతు, చావుకుమించిన కీడు, గోచికిమించిన దరిద్రము లోకమున మఱేదియులేదు. అట్టి దరిద్రిమున నగాధ సంసారముఁ దరించి కీడులేని మోక్ష సామ్రాజ్య మందుము.

585 జాణలైనయట్టి చపలాయతాక్షుల, వలపు లరసి చూచి బ్రిమయనేల?
బయలిరూపులెల్లఁ బరికింపఁగానేల?, విశ్వదాభిరామ వినురవేమ॥
ప్రౌఢానాం చంచలదృశాం విభ్రిమాన్వీక్ష్య కిం భ్రమైః?,
వేమ! బాహ్యాని రూపాణి కిం నిరీక్ష్య వృథాశ్రమైః॥

తా॥ వెలుపలిదృశ్యముల కానందము. ప్రౌఢాంగనల క్రీగంటి ప్రసారముల వలపులకు భ్రమ,యేలఁ జెందెదవు ? అవి కష్టముతోఁగూడిన క్షణిక సౌఖ్యములు. లోఁజూపుఁ జూచి చిదానందమయుఁడవై సొక్కుము. (వెలఁదిపై వలపు-త్రాగుడు కైపు ప్రమాదము 2 అందమైన యింద్ర ధనుస్సు క్షణికము) (వి) త్వఙ్మాంసాస్థిమయం వపు ర్మృగదృశాం మందో జన స్సేవతే॥ (భర్తృ)

586 తలఁచుఁజదువఁజదువఁ దర్కవాదమెకాని, దివ్యజ్ఞాన మచటఁ దేటపడదు
పసిరికాయపురుగు పగిదిని జెడిపోవు, విశ్వదాభిరామ వినురవేమ॥
బహ్వాధీతే స్తర్కవాదః న తత్ర జ్ఞాన మవ్యయమ్।
కోశకారః కృమిరివ వేమ! తాదృ గ్వినశ్యతి॥

తా॥ కలగఁ ద్రొక్కిన నీరు బురదనీరు. మాయచదువులు తర్కవాదమునకుఁ గారణములు. అట్టి కుతర్కముల దివ్యజ్ఞానము తేరదు. కల్మష జ్ఞానమున జీవి పసిరికాయ పురుగువలెఁ జచ్చును.

587 ఎద్దుకన్నదున్న యేలాగుతక్కువ?, ఎఱుపులేకపోయి తఱిగె విలువ
నేర్పెఱుఁగనివాని నెఱయోగియందురా?, విశ్వదాభిరామ వినురవేమ॥

కథం న్స్యానో బలీవర్దా న్మహిషో వేమ! కేవలమ్।
నై ల్యమేవాత్రి హేతు స్స్యా దజ్ఞో యోగీ కి ముచ్యతే?॥

తా॥ ఎద్దువిలువ మడ్డితనముచేతను,మాలిన్యముచేతను దున్నకు వచ్చుట లేదు. అట్లే ప్రభావ విహీనుఁడగు యోగిని ప్రఖ్యాత యోగియని వాడము.

**588 సుతులు సతులు మాయ సుఖదుఃఖములుమాయ,సంసృతియునుమాయ చావుమాయ**
**మాయబ్రతుకుకింత మాయఁగల్పించితి, విశ్వదాభిరామ వినురవేమ॥**

మాయా వేమ! సుతా జాయా స్సుఖం దుఖః భవో మృతిః।
కల్పితై తావతీ మాయా మృ షా జీ వి త సం గ తౌ॥

తా॥ సుతులు, సతులు, సుఖదుఃఖములు, సంసారము, చావు, ఇవన్నియు మాయాకల్పితములే. మాయ బ్రతుకునకే యిన్ని మాయలు కల్పింపఁ బడినవి. (వి) వై రాగ్యమ స్తి కిమితః పరమర్థనీయమ్ (భ ర్తృ) ద్వారం కిమేకం నరకస్య నారీ 2 సంమోహాయత్యేవ సురేవ కా? స్త్రీ. 3 కా శృంఖలా ప్రాణభృతాం హి? నారీ 4 త్యాజ్యం సుఖం కిం? స్త్రియ ఏవ సమ్యక్॥ (శం॥మణి)

**589 సిగ్గువారలమని సృష్టిలోపలివారు, వెఱ్ఱివేమనఁగని వెఱగుపడిరి**
**తనకుఁగలుగుసిగ్గు దైవమెఱుంగురా, విశ్వదాభిరామ వినురవేమ॥**

హ్రీమంతో వయమి త్యేవం పీఢ్యా వేమ మమాయికమ్,
విస్మితాస్స్యు ర్జనా వేమ! దైవం వేత్తి నిజత్రపామ్॥

తా॥ లోకులు తామెంతో సిగ్గుగలవారలమని దిగంబరుఁడగుట వేమన్నను సిగ్గులేనివాఁడని నిందింతురు. వేమన్నకుఁ గల సిగ్గు దైవమునకుఁ దెలియును. (బట్టకట్టి సిగ్గుమాలిన పనులు చేయువానికంటె దిగంబర యోగియే శ్రేష్ఠుఁడు (వి) అపయశో యద్య స్తి కిం మృత్యునా? (భ ర్తృ)

**590 తన్నుఁ దానెఱుఁగఁడు తానెవ్వరికి నేర్పు, ప్రాలుమాలితిరుగు పశువుగాడుకు**
**కానుకొలుకుకాదె? కర్మముల్ గట్టును, విశ్వదాభిరామ వినురవేమ॥**

న వేత్తి స్వయ మాత్మాన మన్యేభ్యో బోధతే కథమ్?।
పశుతుల్యో ఽలసో వేమ! బధ్నా త్యర్థాయ కర్మసు॥

తా॥ తనబాగు తనకుఁదెలియని నరపశువు, పరులకు హితబోధఁ జేయుదునని పైసాకొఱకు బయలుదేరి యేదేదో కర్మకాండ నంటగట్టి యజ్ఞానుల నిహపరంబులకు దూరులఁ జేయును. (వి) పరోపదేశే పాండిత్యం, సర్వేషాం సుకరం నృణామ్ 2 స్వస్యానుష్ఠానసమయే మునయోఽపి న పండితాః, పరప్రబోధవేళాయాం సర్వే వ్యాసమహార్షయః॥

591 ఎంతో చదువుఁజదివి యెన్ని విన్నను గాని, హీనుఁ డవగుణంబు మానలేఁడు
బొగ్గుఁ బాలఁగడుగఁ బోవునా మలినంబు?, విశ్వదాభిరామ వినురవేమ॥

బహ్వాధీత్య బహుశ్రుత్వా నైచ్యం త్యజతి నాధమః ।
క్షీరేణ ధౌత మంగారం నైల్యం కిం వేమ! ముంచతి? ॥

తా॥ నల్లనిబొగ్గును దెల్లనిపాలతోఁగడిగిన మాత్రమున నా నలుపు బొగ్గునకుఁ బోనియట్లు గుణహీనుఁ డెంతఁజదివిన నేమివినిన మంచిగుణము మాత్రముకలుగదు. (వి) అధీత్యశాస్త్రాణ్యపి మూఢఏవ యస్తు క్రియావాన్ పురుష స్స విద్వాన్ ॥

592 ఆలుబిడ్డలు ధన మరయుఁదల్లియుఁదండ్రి,కై మనుజుఁడు మిగులఁగష్టపడును
తనకు నెవరులేరు తాను బ్రహ్మముఁగన్న, విశ్వదాభిరామ వినురవేమ॥

పితృభ్యాం దారపుత్రేభ్యో ధనాయ వ్యథతే నరః ।
వేమ! బ్రహ్మణి సందృష్టే నాత్మన స్సంతి కేచన ॥

తా॥ భార్య బిడ్డలు ధనము తల్లి తండ్రి యిట్టి సంసారపోషణకై భ్రాంతి మునింగి మనుజుఁడు చాలఁగష్టపడును. కాని తాను నిర్మలజ్ఞానమునఁ బరమాత్మను దర్శించిన నెవరైన దృష్టిగోచరులుకాఁగలరా? (వి) సంసారే రే మనుష్యా! వదత యది సుఖం స్వల్పమప్యస్తి కించిత్॥ (భర్తృ)

593 ఆస పాపజాతి యన్నింటికంటెను, ఆసచేత యతులు మోసపోరె?
చూచి విడుచువారు శుద్ధాత్ము లెందును, విశ్వదాభిరామ వినురవేమ॥

సర్వేభ్యః పాతకి న్యాశా మునయో వంచితా స్తయా ।
వేమోద్వీక్ష్య విముంచంతి తాం శుద్ధాత్మాన ఏవ హి ॥

తా॥ పాపిష్ఠిదురాశవలన నియమముగల యతులునైతము మోసపోయిరి. కాన దానిసంగతి దెలిసికొని విడిచినవారే పరిశుద్ధాత్ములు. (వి) కా దుస్త్యజా సర్వజనైర్దురాశా॥ (శం॥మణి)

594 నిజములాడువాని నిందించు జగమెల్ల, నిజములాడరాదు నీచులోడ
నిజమహాత్ముఁగూడి నిజమాడవలయురా, విశ్వదాభిరామ వినురవేమ॥

సత్యవ్రతం జగన్నిందేత్ సత్యం బ్రూయా న్న దుర్జనై ।
మహాత్మనైవ సంగత్య వేమ! సత్యం వదే న్నరః ॥

తా॥ నిజమాడువానిఁగూడ లోకము నిందించును. కాన యెల్లయెడల నిజముఁబలుకరాదు. మహాత్ములతో నిజముఁబల్కవలెను. నీచులతోఁ గూడదు.

595 భూమి నాదియన్న భూమి ఫక్కున నవ్వు, దానహీనుఁజూచి ధనము నవ్వు
కదనభీతుఁజూచి కాలుండు నవ్వును, విశ్వదాభిరామ వినురవేమ॥

మమేయం భూమి రిత్యుక్త్వా వేమాపహసతి క్షితిః ।
ధనం హస త్యదాతారం భీరుం హసతి చాంతకః ॥

తా॥ భూమి నాదియన భూమి ఫక్కున నవ్వును. తా ననుభవింపక దానముఁజేయక దాచువానిఁజూచి ధనము నవ్వును. యుద్ధమునకు జంకి పాఱిపోయినవ్వానిఁజూచి యముఁడు నవ్వును.

596 పంకజాక్షిఁగన్న బంగారుఁబోడగన్న, దిమ్మవట్టు వేగ దెలివికెల్ల
మనుజులకును దత్త్వ మహిమ మెట్లుగలుగురా?, విశ్వదాభిరామ వినురవేమ॥

కాంతాం చ కనకం దృష్ట్వా వివేకో వేమ ! నశ్యతి।
నృణాం గతవివేకానాం తత్త్వస్య మహిమా కుతః?॥

తా॥ కాంతను గనకమును జూచినమాత్రమునఁ దెలివికి దిమ్మపట్టు నజ్ఞానులకుఁ దత్త్వజ్ఞాన మెట్లలవడఁగలదు? (వి) భో స్సాధో! క్షణభంగురే తదితరే భోగే రతిం మాకృథాః (భర్తృ) 1 కిమత్ర హేయం ? కనకం చ కాంతా 2 కిం తద్విషం భాతి సుధోపమం (స్త్రీ)॥ శం॥ మణి॥

597 మొండివానికేల ముంజేతికడియాలు, తొఱ్ఱివానికేల కజ్జపండ్లు
గాడిదలకునేల గడ్డముల్ మీసముల్, విశ్వదాభిరామ వినురవేమ॥

అదతో దారుదంతైః కిం? అపాణే ర్వలయైశ్చ కిమ్?।
వేమ! గార్దభతుల్యానాం శ్మశ్రుభిః కిం జడాత్మనామ్॥

తా॥ మొండిచేతులవానికి మురుగులెందుకు ? తొఱ్ఱిపండ్లవానికిఁ గట్టడపు పండ్లెందుకు? గాడిదలవలె సంచరించు మూర్ఖులకు మహర్షులవలె గెడ్డములు మీసము లెందుకు ?

598 మొదలఁ గ్రియనుదప్పి మోసంబుఁ జేసియుఁ, బొట్టకొఱకె మనసుఁ బొందు పఱచి
బీదకుక్కరీతిఁ బెఱుఁగును మనుజుండు, విశ్వదాభిరామ వినురవేమ॥

విధినోక్తం న కృత్వాదౌ వంచయిత్వోదరంభరిః।
సమాధాయ మనో వేమ! దీనశ్శ్వేవేహ వర్ధతే॥

తా॥ ఒక్కొకఁడు మంచిదారి మొదటనే విడిచిపెట్టి, లోకమును మోసగించి, యాలోచనఁ బొట్టకూటికొఱకే వినియోగించి, బీదకుక్క వలె బీదపొట్టతో నొడలుపెంచి సంచరించుచుండును.

599 ఎట్టివానికైనఁ బుట్టును మోహంబు, పుట్టుమోహమెల్లఁ బూడఁ ద్రొక్కి
గట్టిచేసిచూడఁ గనుపించు బ్రహ్మంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

మహతోఽపి భవే న్మోహః తన్మోహం యతమానసః।
అధఃకృత్య యదీక్షేత వేమ! బ్రహ్మేత దృశ్యతే।

తా॥ మోహ మనునది యెట్టి వానికైనఁ బుట్టును. పుట్టిన మోహమును నణఁగఁద్రొక్కి మనస్సును గట్టిపరచి చూచిన బ్రహ్మ పదార్థము గోచరించును.

600 పట్టుకొమ్మలేక పలుపాట్లఁబడువారు, వెట్టిపోయులేక నెట్టువారు
మట్టి శివునిపూజ మొదలెనేయఁగలేరు, విశ్వదాభిరామ వినురవేమ॥

నిరాశ్రయా స్సంయతాంతో ఒప్యదాతారో నిరోధకాః।
శివస్య పూజా మారభ్య వేమ! కాంచి న్న కుర్వతే॥

తా॥ ఎట్టియాధారమును లేక శ్రమలఁ జెందువారు, దాతృత్వము దయ త్యాగము మొదలగు సద్గుణములు లేనివారు, పరమాత్మఁ బూజించుట కిష్టపడరు. అట్టిబుద్ధియుఁ బుట్టదు. పుట్టినట్లు నటించుట మోసమునకే.

601 ఆత్మలోన శివుని ననువుగా శోధించి, నిశ్చలముగ భక్తి నిలిపెనేని
సర్వముక్తుఁడౌను సర్వంబుఁ దా నౌను, విశ్వదాభిరామ వినురవేమ॥

శోధయిత్వాత్మని శివం స్థిరాం భక్తిం కరోతి యః।
స సర్వముక్త స్సర్వాత్మా భవే ద్వేమ! న సంశయః॥

తా॥ అంతఃకరణమునఁ బరమాత్మను వెదకి తెలిసికొని నిశ్చలభక్తితోఁ జూచుచుండిన సర్వముక్తుఁడు, సర్వముఁ దానైయెనవాఁడు కాఁగలఁడు.

602 ఎఱిఁగినశివపూజ యెన్నఁడుఁ జెడిపోదు, మొదలఁబట్టు పట్టు వదలరాదు
మొదలనిడిచి గోడ దుదిఁబెట్టనిల్చునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

నశ్యేన్నార్హా శివార్చాహి ప్రాగారభ్య న తాం త్యజేత్ ।
విహాయాచౌ నిర్మితాం తే భిత్తిః కిం వేమ! తిష్ఠతి? ॥

తా॥ జ్ఞానముతోఁగూడిన ధ్యానమెన్నటికిఁ జెడదు. ఆదినుండియు విజ్ఞత, విశ్వాసము, పట్టుదల కలిగి ప్రవర్తించవలెను. మధ్య విడువఁ గూడదు. అట్టి ప్రవర్తనము సిద్ధిఁ బొందఁగలదు. పుట్టదిట్టములేని మట్టిగోడ యెన్నటికి నిలువనేరదు.

603 చేటువచ్చెనేనిఁ జెడనాడు దైవమున్, మేలువచ్చెనేని మెచ్చుఁ దన్ను
చేటుమేలుఁదలఁపఁ జేసినకర్మమే, విశ్వదాభిరామ వినురవేమ॥

కష్టే స్యాద్దైవనిందాళుః ఆత్మశ్లాఘాపర స్సుఖే ।
కారణం కష్టసుఖయో ర్వేమ! కర్మ పురాకృతమ్ ॥

తా॥ మంచిచెడ్డలు తన సత్కర్మ దుష్కర్మల ఫలితమని భావింపక మంచికిఁదన్ను మెచ్చుకొనుచుఁ జెడ్డకు దైవమును నిందించుటకూడదనిపని.
(వి) దైవం నిహత్య కురు పౌరుష మాత్మశక్త్యా యత్నే కృతేయది న సిద్ధ్యతి కోఽత్రదోషః (భర్తృ)

604 కడుపుచిచ్చుచేతఁ గామానలముచేతఁ, గోధవహ్నిచేతఁ గుటిలపడక
ఒక్కమనసుతోడ నుండినప్పుడె ముక్తి, విశ్వదాభిరామ వినురవేమ॥

కామానలాత్ క్షుధాగ్నే శ్చ క్రోధవహ్నే రబాధితః ।
వేమైకాగ్రేణ మనసా తిష్ఠేచ్చే న్ముక్తిమా న్నరః ॥

తా॥ యజ్ఞము (సంయమనము) దక్షిణాగ్ని (క్షుధాగ్ని) మఱల మఱలఁ గల్గునది. గార్హపత్యము (కామాగ్ని) గృహస్థున కుండునది. ఆహవనీయము (క్రోధాగ్ని) ఆవేశమునవచ్చునది. ఈత్రేతాగ్నులబారికిఁ దటుకొని నిశ్చలమనమున సంయమనశక్తి కలిగియున్ననే ముక్తి.

605 పాలు పెరుగు వెన్న పాయసాన్నము నెయ్యి, జున్ను నెన్నియైనఁ జూడఁ బాలె
పాలవంటికులము బ్రహ్మంబుఁ గానరు, విశ్వదాభిరామ వినురవేమ॥

దధి తక్రం పాయసాన్నం నవనీతం ఘృతం తథా।
సర్వం క్షీరమయం వేమ! బ్రహ్మ వీక్షస్వ తత్సమమ్॥

తా॥ పాలే, పెరుగు వెన్న నెయ్యి జున్ను మొదలైనవిగఁ బలుకఁ బడును. ఈ యన్నిటికి మూలపదార్థము పాలే యైనట్లు సృష్టికంతకు మూలపదార్థము పరబ్రహ్మమే.

606 చదువులందు రాజ్యపదవులందును బాడి, మొదవులందు స్త్రీల పెదవులందు
నాశ లుడుగునట్టి యయ్యలు ముక్తులు, విశ్వదాభిరామ వినురవేమ॥

క్షుద్రవిద్యాసు రాజ్యేషు స్త్రీణా మోష్ఠేషు ధేనుషు।
ఆశాం ముంచంతి యే మర్త్యాః ముక్తా స్తే వేమ! సర్వశః॥

తా॥ ఈమాయచదువులయందు రాజ్యపదవులందు గోసంపద మొదలగు సంపదలయందు స్త్రీల పెదవులయందు, ఆశపోయిన మహనీయులే ముక్తులు. (వి) కిం మండనం? సాక్షరతాముఖస్య 2 క శ్శోభతే? యస్సదసి ప్రవిద్యః 3 మాతేవ కా? యా సుఖదా, సువిద్యా 4 కిమేధతే దాన వశాత్? సువిద్యా॥ (శం॥ మణి)

607 కడుపుకేల మనస! కళవళపడియెదు?, కడుపుకేడఁదృప్తి కలుగుచుండు?
కడుపు రాతిలోని కప్పకుఁగలుగదా?, విశ్వదాభిరామ వినురవేమ॥

కిం త్వం భ్రమసి కుక్ష్యర్థం కుక్షేః తృప్తి ర్మనః! కుతః?।
శిలాంతస్థస్య భేకస్య కుక్షి ర్వేమ! న చాస్తి కిమ్?॥

తా॥ కడుపులోనియాకలి రాతిలోనికప్పకును గలదు. దానికచ్చటనే యాహారము లభించుచున్నదికదా. ఓమనమా! కడుపు (ఆకలి) కొఱకేలనే యింత కలవరపాటు? (కడుపున కెచ్చటను దృప్తి యుండదు.)

608 శాంతమానసమునఁ జల్లనై శీతాంశు, పగిదినున్నవాఁడు పరమయోగి
అట్టివాఁడు ముక్తి నతివేగఁ గైకొను, విశ్వదాభిరామ వినురవేమ॥

ప్రశాంతే మానసే శీత శ్శీతాంశు రివ యో మునిః।
వర్తతే వేమ! సోఽత్యాశు గృహ్ణాతి పరమం పదమ్॥

తా॥ మనస్సున కధిదేవతయగు చంద్రునివలె ప్రశాంతమనమునఁ బ్రశాంత తేజస్సున నున్నవాఁడే పరమయోగి. అట్టివాఁడే సద్యోముక్తుఁడు.

609 మధురసంబుఁగోరి మక్షికంబులుచేరి, చొచ్చి వెడలలేక సొక్కినట్లు
మునిగి వెడలలేరు మోహాంబురాశిలో, విశ్వదాభిరామ వినురవేమ॥

అకాంక్ష్య మధు వేమాశు ప్రవిశ్య మధుమక్షికాః ।
యథా నిర్గమనాశక్తా మగ్నా మోహాంబుధౌ తథా ॥

తా॥ ఈఁగలు తీపి విడువలేక దానినే యంటిపెట్టుకొని చచ్చునట్లు, అజ్ఞానులు మోహమును విడువలేక యందే మరణింతురు. (వి) జీవే వారితరంగచంచలతరే సౌఖ్యం కుతః ప్రాణినామ్?॥ (భర్తృ)విషా ద్విషం కిం ? విషయా స్సమస్తాః,దుఃఖీ సదా కో ? విషయానురాగీ ॥శం॥మణి॥

610 బ్రహ్మమున్నచోటు పరగంగఁదెలియఁ,యెందొ వెదుక బ్రహ్మ మేలకలుగు?
అంజనంబులేక యసొమ్ముదొరకునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

అజానన్ బ్రహ్మణస్థానం వేమాన్యత్ర గవేషణాత్ ।
కిం బ్రహ్మ దృశ్యతే? విత్తం లభ్యతే కిం వినాంజనమ్? ॥

తా॥ మసకకుఁ గాటుకపెట్టుకొని కండ్లు బాగుచేసికొన్నఁగాని వస్తువు కనఁబడనియట్లు అజ్ఞానమను మసక తొలఁగించుకొని జ్ఞానదృష్టినిజూచినఁ గాని పరమాత్మస్వరూపమును గోచరింపదు. మఱొకవిధమున నెంత వెదకినను లాభ మేముండును ?

611 హీనుఁడెన్నివిద్య లిలనభ్యసించిన, ఘనుఁడుకాఁడు హీనజనుఁడెకాని
పరిమళముల గర్దభము మోయ ఘనమౌనె?, విశ్వదాభిరామ వినురవేమ॥

అభ్యస్తసర్వవిద్యోఽపి వేమ ! స్యా న్నఘనః ఖలః ।
జడఏవ ఘనః కిం స్యాత్? ఖరో గంధా న్వహన్నపి ॥

తా॥ పరిమళవస్తువుల మోయుచున్నను గాడిదకు వానితోఁ బ్రయోజనములేనట్లు గుణహీనుఁడెట్టిచదువుఁ జదివినను వానికి దానితోఁ బ్రయోజనము కన్పట్టదు. ఘనతరాదు.

612 మనసులోననున్న మచుతలన్నియుఁగోసి, దృఢముఁజేసి మనసుఁ దేటఁబఱచి
ఘటము నిల్పువాఁడు ఘనతరయోగిరా, విశ్వదాభిరామ వినురవేమ॥

ఛిత్వా హృత్స్థాని సర్వాణి మమత్వాని దృఢం మనః ।
కృత్వా శుద్ధం రయ స్తు దేహం ధత్తే వేమ! స తాపసః ॥

తా॥ మమకారములఁగోసి మనమును దృఢపఱచి తేటఁజేసి దేహధారి యైనవాఁడే పరమయోగి. (వి) ముముక్షుణా కిం త్వరితం విధేయం? సత్సంగతిః నిర్మమతేశభక్తిః 2 కిం దుఃఖమూలమ్ ? మమతాభిమానమ్॥

613 కాఁగలపనులెల్లఁ గాకెటుఁబోవును?, కానిపనులు కావు కావు భువిని
మహిమ వేఱయుండె మనతోడనున్నదా?, విశ్వదాభిరామ వినురవేమ॥

న భవిష్యం త్యభావ్యాని నాభావో భావికర్మణామ్ ।
మహిమా పృథగస్త్యేవ వేమాస్మాభి స్తు కిం భవేత్? ॥

తా॥ కానివికావు. కావలసినవి కాకపోవు. మహిమ వేఱుగనున్నది. కాని మనతోలేదు. ధైర్యమువహించి విధినిర్వహణకుఁ బూనుకొనుము. (వి) నాభావ్యం భవతీహ భాగ్యవశతో భావ్యస్య నాశః కుతః ? (భర్తృ)

614 పాముకన్నలేదు పాపిష్ఠమగుజీవి, అట్టిపాము చెప్పినట్లు వినును
ఇలను మోహిఁదెల్ప నెవ్వరితరమయా?, విశ్వదాభిరామ వినురవేమ॥

నాహే ర్జీవ్యస్తి పాపీయాన్ యథోక్తం శృణుతే హి సః ।
మోహినం బోధితుం వేమ! శక్నువంతి న కేఽపి చ ॥

తా॥ పాపిష్ఠిదగు పాముకూడ చెప్పినట్టు వినును. కాని మోహిని (మోహసముద్రమున మునిఁగినవాని) ఎవ్వరును జెప్పినట్టు వినులాగునఁ జేయలేరు. (వి) యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున ! జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా॥ (గీత)

615 గతముచేసినట్టి కర్మబంధములన్ని, పరిసిపోవు సత్యగురునివలన
కుమ్మరికొకయేఁడు గుదియకు నొకనాఁడు, విశ్వదాభిరామ వినురవేమ॥

కర్మబంధాని పూర్వాణి ఛిద్యంతే గురుణా సతా ।
వేమైకాబ్దం కులాలస్య దండస్యైకం క్షణం ఘటాః ॥

తా॥ కుమ్మరి సంవత్సరము పొడుగునఁ జేసిన కుండలదొంతరలు కట్టెతోఁ బగులగొట్టుటకొక క్షణమైనఁబట్టదు. అట్లే మహిమాన్వితుఁడగు

గురువుయొక్క ప్రబోధమున గతమునఁ జేసిన కర్మబంధము లన్నియు నశించును. (వి)గుకార స్త్వంధకార స్స్యాత్ రుకార స్తన్నివారకః॥

616 అన్నిజాడలుడిగి యానందకాముఁడై, నిన్నునమ్మఁజాలు నిష్ఠతోడ
నిన్నునమ్మ ముక్తి నిక్కంబు నీయాన, విశ్వదాభిరామ వినురవేమ॥

సుఖార్థీ పద్ధతీ స్సర్వా స్త్యక్త్వా త్వాం విశ్వసే న్నరః।
భవద్విస్రంభణా న్ముక్తి ర్భవే ద్వేమ! న సంశయః॥

తా॥ ప్రభూ! నిన్నేనమ్మి సమస్తమువిడిచి చిదానందమనుభవించు వ్యక్తికి ముక్తి కరతలామలకము. అబద్ధముకాదు. నీతోడు. (వి) అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే, తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహా మ్యహమ్॥ 2 సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణం వ్రజ, అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామిమాశుచః॥

617 చిప్పలోనఁబడ్డ చినుకు ముత్యంబాయె, నీళ్ళఁబడ్డచినుకు నీళ్లఁగలిసె
ప్రాప్తముండుచోట ఫలమేలతప్పురా?, విశ్వదాభిరామ వినురవేమ॥

మౌక్తికం పతిత శ్శుక్తౌ స్యా దప్సు వబ్బిందు రమ్మయః।
ప్రాప్తం యద్యస్తి వేమేహ తత్ర కిం న భవేత్ ఫలమ్?॥

తా॥ ముత్యపుచిప్పలోఁ బడిన వర్షబిందువు ముత్యమైనది.నీటిలోఁబడినది నీరే యయినది. అట్లేప్రాప్తమున్నచోట ఫలితమును లభించును.

618 పప్పులేనికూడు పరుల కసహ్యమా, అప్పులేనివాఁడె యధికబలుఁడు
ముప్పులేనివాఁడు మొదల సుజ్ఞానుండు, విశ్వదాభిరామ వినురవేమ॥

అసహ్యం సూపహీనాన్నం అనృణీ స్యా న్మహాబలః।
భవబంధవిముక్త స్తు సుజ్ఞానీ వేమ! కథ్యతే॥

తా॥ అప్పులేనివాఁడే భాగ్యవంతుఁడు. పప్పుతోఁగూడిన యన్నమే యన్నము. ప్రమాదములకులోనుగానివాఁడే సుజ్ఞాని.

619 మొగముఁజూచినపుడె మోహంబు ఘనమౌను,ధనముఁజూచినపుడె తగులుమనసు
కూలినప్పుడరయఁ గుసులెల్లవిఱుగును, విశ్వదాభిరామ వినురవేమ॥

ముఖే దృష్టే భవే న్మోహః ధనే దృష్టే మనోహృతమ్।
పతితే వేమ! సర్వాంగగ్రంథయస్స్యు ర్విభంజితాః॥

తా॥ పడినప్పుడే గూండ్లు విఱుగును. అందగత్తెను జూచినప్పుడే కాంక్ష కలుగును. కాన కాంతాకనకముల కెంతదూరముగనున్న నంత మంచిది.

620 ధర్మమన్న వినరు తమునమ్మిభూనరుల్, యమునిభటులువచ్చి యడలునించి చొచ్చికొట్టఁ దమరు చొఱఁబాఱఁగలరొకో!, విశ్వదాభిరామ వినురవేమ॥

విశ్వస్య మర్త్యాస్త్వైశ్వర్యం ధర్మే కుర్వంత్యనాదృతిమ్।
వేమైత్య యమభృత్యేషు తాడయత్స్విహ కా గతిః?॥

తా॥ అజ్ఞానులు ధర్మమున్నఁ బెడచెవిని బెట్టి తమయందే నమ్మిక కలిగి యుందురు. యమభటులు గొనిపోవునప్పుడు వెళ్ళకుండ నుండఁగలరా?

621 కన్నపుత్రు నాస కనకంబుమీఁదాస, స్త్రీలమీఁద నాస చిత్తమెడలి భ్రమలువిడువకున్న బ్రహ్మముక్తిగాఁదు, విశ్వదాభిరామ వినురవేమ॥

ఔరసే తనయే హేమ్ని స్త్రీష్వాశావిహ్వలాశయః।
న ముంచేచ్చే ద్భ్రమం వేమ! నరో బ్రహ్మ న పశ్యతి॥

తా॥ కన్నపుత్రులపైన, ఆస్తిపైన, స్త్రీలపైన నాశపోయి భ్రమలు తొలఁగి చిత్తశుద్ధి కలుగకున్నఁ బరమాత్మస్వరూపము గోచరింపదు.
(వి) కే శత్రవో మిత్రవ దాత్మజాద్యాః॥ (శం॥మణి)

622 చెట్టుచేమఁగొట్టి చుట్టుగోడలఁబెట్టి, యిట్టునట్టు పెద్దయిల్లుఁగట్టి మిట్టిపడును నరుఁడు మీఁది చేటెఱుఁగక, విశ్వదాభిరామ వినురవేమ॥

ఛిత్వా తరులతాః భిత్తీః కృత్వా నిర్మాయ మందిరమ్।
వేమాహంకురుతే మర్త్యో న వేత్త్యాగామిదుస్స్థితిమ్॥

తా॥ అజ్ఞాని చెట్టుచేమఁగొట్టి, చుట్టు గోడలఁబెట్టి, యిల్లుకట్టి ఘనకార్యముఁ జేసినట్లు మిట్టిపడును. కాని ముందువచ్చు నాపదఁ గానఁడు.

623 ఒక్కతోలుఁదెచ్చి యొఱపుబొమ్మనుజేసి, ఆడునట్లుఁజేసి యట్టె వేయు తన్నుఁద్రిప్పువానిఁ దానేలగానఁడో!, విశ్వదాభిరామ వినురవేమ॥

చర్మపాంచాలికాం కృత్వా నరో భ్రామయతే భృశమ్।
వేమాత్మానం భ్రామయంతం న పశ్యతి కథం శివమ్?॥

తా॥ బొమ్మలాటవాఁడు తోలుబొమ్మను దెరపైఁ గొంతసే పాడించి పడవేయును. అట్లే తన్నాడించి పడవేయువాఁడు భగవంతుఁడని యజ్ఞాని

యేల గుర్తింపఁడో తెలియదు. (వి) ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున! తిష్ఠతి, భ్రామయన్ సర్వభూతాని, యంత్రారూఢానిమాయయా॥

624 పరబలముఁ జూచి ప్రాణరక్షణమున, కుఱికిపాఱిపోవుఁ బిఱికినరుఁడు
యముఁడు కుపితుఁడైన నడ్డమెవ్వండయా?, విశ్వదాభిరామ వినురవేమ॥

భీరుః పరబలం వీక్ష్య ప్రాణగుప్త్యై పలాయతే।
కృతాంతే కుపితే వేమ! నిరోద్ధుం కేన శక్యతే॥

తా॥ పిఱికిపంద యుద్ధమునకుఁబోయి శత్రుసైన్యమునుజూచి ప్రాణభీతిచే మఱలివచ్చును. యముఁడడ్డుకొనిన నేమిచేయఁగలఁడు?
(వి) యమస్య కరుణానాస్తి, ధర్మస్య త్వరితాగతిః॥

625 తల్లి తండ్రి చావఁ దనయుఁడు తానేడ్చు, మగఁడుచావ నాలు తగచుచుండు
కార్యవశమెకాని కలుగదు మోహంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమేహ మృతయోః పిత్రోః పుత్రో రోదితి దుఃఖితః।
మృతే భర్తరి భార్యా చ కార్యార్థం న హృది వ్యథా॥

తా॥ పెద్దవారలప్రేమ పిన్నలపైఁ జెట్టుపండువలెఁ బడును. కాని పిన్నలభక్తి పెద్దలపైఁ గుదురుట కష్టము. అందువలనఁ దలితండ్రులు మరణించినఁ గుమారుఁ డేడ్చుట, భర్త మరణమునకు భార్య యేడ్చుట, లోకాచారమునకే. ప్రేమచేఁ గాదు. (వి) యావద్విత్తోపార్జనసక్తస్తావన్నిజపరివారోరక్తః, పశ్చాజ్జీవతిజర్జరదేహే వార్తాంకోఽపి నపృచ్ఛతిగేహే॥

626 మనసులోనిముక్తి మఱియొక్కచోటను, వెదకఁబోవువాఁడు వెఱ్ఱివాఁడు
గొఱ్ఱెఁజంకఁబెట్టి గొల్లవెదకురీతి, విశ్వదాభిరామ వినురవేమ॥

స్వచేతసి స్థితాం ముక్తిం యోఽన్యత్రాన్వేష్టుమిచ్ఛతి।
ఉన్మత్తస్స హి కక్షస్థమేషాన్వేషీవ గోపకః॥

తా॥ గొఱ్ఱెను జంకఁబెట్టుకొని యా గొఱ్ఱెకొఱకే గొల్లవెదకునట్లుముక్తి తన మనస్సుననే యుండ మఱొకచోట వెదకఁబూనుట వెఱ్ఱితనమేసుమా

627 ఆశకన్న దుఃఖ మతిశయంబుగలేదు, చూపునిలుపకున్న సుఖములేదు
మనసునిలుపకున్న మఱిముక్తిలేదయా, విశ్వదాభిరామ వినురవేమ॥

నాత్యంతం దుఃఖమాశాతః నాస్థిరాయాం సుఖందృశి।
చేతస్యనాస్థితే వేమ! ముక్తిర్నాస్తి కదాచన॥

తా॥ ఆశకన్న నెక్కువగు దుఃఖము మఱియొకటిలేదు. దృష్టి నిలిచి మనస్సు స్థాయి నెందిన నట్టి ప్రశాంత పరిస్థితికంటె సుఖము (ముక్తి) మఱియొకటిలేదు. (వి) దృగ్వ్యగ్మంలీయతే యత్ర తత్రతత్ర సమాధయః॥

628 తత్త్వహీనులుంద్రు తఱచుగా భువిలోనఁ, దత్త్వమెఱుఁగువారు తఱచులేరు
కలిగిరేనివారు కన్పింప రారయ్య, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ! ప్రాయ స్తత్త్వహీనా వసంతి జగతా తథా।
న తత్త్వజ్ఞా న దృశ్యంతే యది సంత్యపి తత్త్వతః॥

తా॥ అజ్ఞాను లెందరైన దొరకుదురు. కాని తత్త్వవేత్తలగు సుజ్ఞానులు లభించుట యరిది. సుజ్ఞానులున్నను మనతోఁబనిలేదు. కాన కనఁబడరు.

629 తాను నింద్రియములఁ దనర జయించినఁ, దత్త్వ మరసిచూడఁ దానయగును
రాజయోగియిల్లు దేజరిల్లుచు నుండు, విశ్వదాభిరామ వినురవేమ॥

య ఇంద్రియాణి జయతి తత్త్వమాత్మైవ వేమ! సః।
ఏవం నిత్యం రాజయోగీ రాజతే భూరితేజసా॥

తా॥ ఇంద్రియములబెడద తొలఁగిన నంతటను దానే గోచరించును. ఇట్లు రాజయోగి శోభిల్లును. (వి) కే శత్రవ స్సంతి? నిజేంద్రియాణి, తాన్యేవమిత్రాణి జితాని యాని॥ (గం॥పంణి)

630 గురము గూడుఁజేసి గుణము వత్తిగఁజేసి, గురవిఁగర్మఫలమితిఁ చమురుఁజేసి
మూలనొక్కజ్యోతి ముట్టించిచూడరా, విశ్వదాభిరామ వినురవేమ॥

గేహం చ మల్లకం కృత్వా దశాం కృత్వా గుణానపి।
స్నేహం కృత్వా కర్మచయం జ్యోతి ర్వేమ! ప్రదీపయ॥

తా॥ దేహము ప్రమిదగను గుణము వత్తిగను కర్మఫలితము చమురుగను జేసి జ్ఞానజ్యోతి వెలిగించి చూచిన నీకుఁ దత్త్వము గోచరింపఁగలదు. (వి) అజ్ఞానజంతమః,నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥(గీత)

631 ఎన్నియొన్ని పూజ లెన్ని చేసిననేమి?, భక్తిలేనిపూజ ఫలములేదు
భక్తికలుగుపూజ బహుళకారణమురా, విశ్వదాభిరామ వినురవేమ॥

గణయిత్వా ఘనాః పూజాః కృత్వా ప్రాప్నోతి కిం ఫలమ్?
భక్తిం వినా పూజయా కిం? భక్తిర్వేమేహ కారణమ్॥

తా॥ ఎన్ని యెన్ని పూజలనో భక్తికుదురకుండఁజేసిన ఫలితమేమి ? భక్తికుదిరిన పూజయే ఫలితమిచ్చును. (వి) కార్యా ప్రియా కా ? శివ విష్ణుభక్తిః 2 కిం జీవనం ? దోషవివర్జితం యత్॥ (శం॥మణి)

632 అపగాలికెంట నడవులవెంటను, కొండరాళ్లవెంట గొడవదేల?
ఉల్లమందునె శివుఁ డుండుటఁదెలియరు, విశ్వదాభిరామ వినురవేమ॥

కాంతారేషు సరిద్వంతీషు శైలేషు కిము గాథయా ?
చేతస్యేవ స్థితం వేమ ! న విదంతి సదాశివమ్ ॥

తా॥ హృదయమందున్న పరమేశ్వరుఁ దెలియక కొండల నడవుల నదీతీరముల నేమిటకు తిరిగెదవు ? (వి) నిగృహీతేంద్రియగ్రామో యత్ర యత్ర వసేన్నరః, తత్రతత్ర కురుక్షేత్రం నైమిశం పుష్కరాణి చ॥

633 గాడిదేమెఱుంగు గంధంబువాసన?, కుక్కయేమెఱుంగు గొప్ప కొద్ది
అల్పుఁడేమెఱుంగు హరునిగొల్చువిరక్తి, విశ్వదాభిరామ వినుర వేమ॥

శ్వా కిం వేత్త్యుచ్చనీచత్వం ? ఖర శ్చందనసౌరభమ్ ।
తథాల్పో వేత్తి కిం వేమ ! వైరాగ్యా ద్ధరపూజనమ్ ॥

తా॥ గాడిదకు గంధపుఁ బరిమళము, కుక్కకుఁ బెద్దపిన్నల తారతమ్యము, అల్పునకుఁ బరమేశ్వరు విరాగమునఁ గొల్చుట, తెలియదు.

634 మూఁడువేళలందు ముదముతో శివునాత్మఁ, బూజసేయువాఁడు పుణ్యమూర్తి
పూజలేక మోక్షభోగంబు దొరకునా?, విశ్వదాభిరామ వినుర వేమ॥

కాలత్రయే శివం తుష్ట్యా యోఽర్చయేత్ పుణ్యవాన స ః ।
పూజాం వినా జాతు కథం మోక్షభోగ మవాప్నుయాత్ ॥

తా॥ ఎల్లవేళలఁ బరమేశ్వరుఁ బూజించు వాఁడే పుణ్యపురుషుఁడు. సత్కర్మల భక్తియు, భక్తివలన జ్ఞానమును, జ్ఞానమున మోక్షమును లభించును. కర్మ పిందె,భక్తి కాయ, జ్ఞానము పండు, మోక్షమనుభవము.

635 ఒడలు బడలఁజేసి యోగులమనువారు, మనసుకల్మషంబు మాన్పలేరు
పుట్టమీఁదఁగొట్ట భుజగంబుచచ్చునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

శ్రాంతాంగా యోగసంపన్నాః న ప్నుదన్యంతి హృన్మలమ్ ।
వల్మీకాగ్రే హతే వేమ ! మ్రియతే కిం ఫణాధరః? ॥

తా॥ పామును గొట్టినఁ బాము చచ్చును. కాని పుట్టమీఁదఁ గొట్టఁ బాము చావదు. అట్లే మనస్సునందలి కల్మషములు, ఆసన ఉపవాసాది శారీరకశ్రమలఁబోవు. (వి) తాం యోగమితి మన్యంతే స్థిరా మింద్రియ ధారణామ్ (కఠోపనిషత్)

636 కుక్క యేకతంబుఁ గొక్కెరధ్యానంబు, ఖరమురాగ మెన్నఁ గప్పమునుక
ఆత్మనెఱుఁగుభావ మదియేలఁగానరో!, విశ్వదాభిరామ వినురవేమ॥

శ్వైకాంతత్వం బకధ్యానం రాగం వేమ! ఖరస్య చ।
మండూకమజ్జనం చైవ న కుర్వం త్యాత్మభావనామ్॥

తా॥ కుక్కయేకాంతము, బకధ్యానము,గాడిదరాగము, కప్పమునుక వీనికే యజ్ఞాను లెగఁబడెదరు. కాని పరమాత్మను దెలిసికొనుభావ మలవరచుకొనరు. (వి) దీర్ఘకాలాదరనైరంతర్యసత్కారాసేవితో దృఢభూమిః॥

637 సకలశాస్త్రములను జదివియు వ్రాసియుఁ, దెలియఁగలరు చావుఁ దెలియలేరు
చావుఁదెలియలేని చదువులవేలరా?, విశ్వదాభిరామ వినురవేమ॥

అధీత్య సర్వశాస్త్రాణి లిఖిత్వాపి విదంతి హి।
న విదంతి మృతిం వేమ! కిం శాస్త్రై ర్మృత్యవేదిభిః?॥

తా॥ సమస్తశాస్త్రములఁ జదువుచు వ్రాయుచుఁ దెలియుచుందురు. కాని చావు మర్మముఁ దెలిసికొనఁ జాలకున్నారు. అట్టి శాస్త్రాధ్యయనమున లాభమేమి? (వి) విద్యాహి కా? బ్రహ్మగతి ప్రదా యాఽబోధోహి కో? యస్తు విముక్తిహేతుః॥ (శం॥మణి)

638 కొండరాళ్లఁదెచ్చి కోరికఁగట్టిన, గుళ్ళలోనఁదిరిగి కుళ్లనేల?
పాయరానిశివుఁడు ప్రాణినైయుండంగ, విశ్వదాభిరామ వినురవేమ॥

శైలాశ్మభి రుపానీతైః ర్నిర్మితే ష్వాలయే ష్విహ।
భ్రమంతో యాంతి వేమార్తిం శివే ప్రాణి న్యుపస్థితే॥

తా॥ పరమేశ్వరుఁడు తన్ను విడువని ప్రాణిగానుండ భజించి తరించక యజ్ఞాని కొండరాళ్ళ గుళ్ళుకట్టి యందుఁ గ్రుళ్ళి మ్రగ్గు టెందులకో!

639 విశ్వమునకునడిపెడు విశ్వేశ్వరుండుండఁ, బ్రభువు వేనటంచుఁ బలుకనేల?
వనములోనికోఁతి వసుమతి నడుపునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

జగన్నియామకే దేవే స్థితేఽహం ప్రభురిత్యహో !।
వక్తి కిం ? వేమ ! నా శాసే ద్వన్యః కిం మేదినీం కపిః? ॥

తా॥ సమస్తమును నాపరమేశ్వరుఁడు పాలింపుచుండ మానవుఁడు నేను భూపతి ననుట యెంతయవివేకము? అడవిలోని కోతి నేను భూపతి వని యీభూలోక మేలఁగలదా ?

640 బూదిపూతలెన్న భుజములపొంకాలు, జాతులింగములును వరుసమతము
లిక్కడందగుఁగాక యక్కడందగవెప్డు, విశ్వదాభిరామ వినురవేమ॥

చక్రాంకితా భస్మలేపాః లంబలింగాని సర్వశః ।
అత్రైవ మతచిహ్నాని వేమ ! తత్ర న తత్ప్రథా ॥

తా॥ వైష్ణవులభుజములకాల్పులు, శైవులమెడకువ్రేలాడులింగములు ఈమతములు, జాతులు, పూతలు, ఇక్కడ శోభించును. కాని యక్కడ శోభింపవు, అక్కడ శోభించునవి గుణము, మనము, భక్తి జ్ఞానములు.

641 కడకు నింద్రియములఁ గటివేయఁగలేక, చావుదచ్చునపుడు సన్యసించు
ఆత్మజితములేక యందునా మోక్షంబు?, విశ్వదాభిరామ వినురవేమ॥

ఇంద్రియాణి స్వయం రోద్ధు మశక్తో మరణోన్ముఖః ।
ప్రవ్రజే ద్వేమ ! ముక్తి ర్హి వినేంద్రియజయం కథమ్? ॥

తా॥ ఇంద్రియముల స్వాధీనముఁ జేసికొనలేక చచ్చునపుడు సన్యసించిన నెట్లు మనస్సునకుఁ ద్యాగము పుట్టును?అవశుఁడు మోక్షమెట్లు పొందును?

642 అధికసూక్ష్మమైన యానందమెఱుఁగక, మతియులేక చదివి మగ్నుఁడగును
అతిరహస్యమద్ది యల్పుఁడెఱుంగునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

సూక్ష్మాతిసూక్ష్మమానంద మజాన న్మతివర్జితః ।
అధీత్య వేమ! మగ్నస్స్యాత్ వేత్త్యల్పః కిం మహాద్రహః?॥

తా॥ సూక్ష్మతమమగు నానందవిధానముఁ దెలియక మతిపోవులాగున మాయచదువులఁజదివి మాయలో మునిగి చెడుచున్నారు. అతిరహస్యము, సూక్ష్మమునగు నానందవిధాన మల్పుఁడెట్లెఱుంగఁగలఁడు ? (వి) అధీత్య చతురో వేదాన్ ధర్మశాస్త్రాణి మానవః, న వై బ్రహ్మ విజానాతి దర్వీ పాకరసం యథా॥ ఉ॥ గీత॥

643 దేవపూజఁ జేయ దివ్యభోగముఁ గల్గుఁ, దత్త్వమెఱిఁగెనేని దైవసముఁడె
ఏమిలేనినరున కేఁగతిలేదురా, విశ్వదాభిరామ వినురవేమ॥

దేవపూజాకృతో వేమ ! దివ్యభోగో భవే త్ఖలు ।
త త్త్వజ్ఞో దై వసదృశః తద్ధీనస్య న సద్గతిః ॥

తా॥ దేవతలభ క్తితోఁ బూజించిన దివ్యభోగములు కల్గును. త త్త్వ మెఱిఁగిన దై వసముఁడే యగును. భ క్తిజ్ఞానములులేని నరుని కేగతియుఁ గలుగదు (వి) కే హేతవో బ్రహ్మగతే స్తు సంతి? సత్సంగతి ర్దానవిచార తోషాః ॥ (శం॥మణి)

644 చెవిని నిల్లుఁ గట్టి చెప్పెను వేమన, బట్టబయలనుండు బ్రహ్మమనుచు
బుద్ధి కలిగి దానిఁ బొంది సుఖింపుఁడీ, విశ్వదాభిరామ వినురవేమ॥

నిర్మాయ సదనం కర్ణే వేమ ! వేమో మహాధియః! ।
చిదాకాశో ము క్తిధామేత్యాహ తత్ప్రాప్య మోదత ॥

తా॥ చిదాకాశమను బట్టబయల పరబ్రహ్మస్వరూపము గోచరించునని వేమన చెవిని నిల్లుఁగట్టి నొక్కి వక్కాణింపుచుండ బుద్ధికలిగి దానిని బొందుట కేలఁ బ్రయత్నింపరు ?

645 పొంకముగను మనసు పోనీక సర్వేశు, వంకనిల్పువాఁడు వంశకరుఁడు
వంకనిల్పకున్న వచ్చునాపదవులు?, విశ్వదాభిరామ వినురవేమ॥

నిరుద్ధ్యోత్పథగం చి త్తం య శ్శివే కురుతే సదా ।
స వంశకృద్భవే ద్వేమ ! నోచేత్ బ్రహ్మపదం కుతః? ॥

తా॥ మనస్సును జిక్కఁబట్టి పరమేశ్వరునివంకకు మరల్చువాఁడే చరితార్థజీవి. అట్టివాఁడు కాకున్న మోక్షాదిపదవు లెట్లులభ్యముకాఁగలవు? (వి) యతోయతో నిస్సరతి మనశ్చంచల మస్థిరమ్, తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్॥ (గీత)

646 ఉండియుండి జ్ఞాని యుగములుచనిపోక, ప్రాణహానిలేదు ప్రళయమునను
ప్రాణహానియైనఁ బరమాత్మఁ గలియును, విశ్వదాభిరామ వినురవేమ॥

జ్ఞానీ యుగేషు యాతేషు తిష్ఠే న్న ప్రాణవిప్లవః ।
ప్రాణహానౌ చ వేమాసౌ లీయతే పరమాత్మని ॥

తా॥ జ్ఞాని కనేక యుగములుగడచి ప్రళయకాల మాసన్నమైనను మరణములేదు.ఒకవేళయున్నను నాపరమాత్మలోఁగలిసి శాశ్వతుఁడగును.

347 గురువు తానయినను హరునిదాఁజూపును, బ్రహ్మలోకముఁదగఁ బాఱఁజూపు
శిష్యునరసిపట్టి చీఁకటిఁబాపురా, విశ్వదాభిరామ వినురవేమ॥

యది స్వయం సద్గురుస్స్యాత్ హరం బ్రహ్మజగత్తథా।
దర్శయే ద్వేమ! శిష్యం స్వం స్వీకృత్య చ హరే త్తమః॥

తా॥ సద్గురువు శిష్యునిఁజేరఁదీసి యజ్ఞానాంధకారముఁ దొలఁగించి బ్రహ్మలోకముఁజూపి పరమేశ్వరు గోచరింపఁజేయును.

348 నీళ్ళుపోసికడిగి నిత్యంబుశోధించి, కూడుఁబెట్టి మీఁదఁ గోకఁగట్టి
ఏమిపాట్లుఁబడుదు రీదేహమునకిల, విశ్వదాభిరామ వినురవేమ॥

స్నపయిత్వా చ సంశోధ్య భిస్సాం దత్వాంబరాన్వితమ్।
కృత్వా చాస్మై శరీరాయ వేమ! యాంతి కియచ్ఛ్రమమ్?॥

తా॥ ఈ పాడుదేహమునకే నిత్యము నీళ్లుపోసి తోమి కడిగి కూడుపెట్టి గుడ్డచుట్టి యవివేకపు మానవులు పలుపాట్లుపడుచున్నారు.

349 లేఁడులేఁడనినను లేఁడులేనేలేఁడు, కాఁడుకాఁడటన్నఁ గానెకాఁడు
తోడుతోడనినను తోడనేతోడౌను, విశ్వదాభిరామ వినురవేమ॥

నాస్తినాస్తీతి యో బ్రూతే తస్య నాస్త్యేవ వేమ! సః।
అస్త్యస్తీతి సవిస్రంభం వదతోఽస్తి సహాయవాన్॥

తా॥ దేవుఁడులేఁడనినవారికి లేఁడు. ఉండెననువారికే యుండును. అతఁడే నాకుతోడనువారినే చేఁబట్టి రక్షించును.

350 లోభమోహములను ప్రాభవంబులు తప్పుఁ, దలఁచినపనులెల్లఁ దప్పిచనును
తామొకటితలఁచిన దైవమొండుఁదలంచు, విశ్వదాభిరామ వినురవేమ॥

ప్రాభవం లోభమోహాభ్యాం నశ్యే త్కర్మఫలం తథా।
వేమాత్మచింతితం కార్యం దైవ మన్యత్ర చింతయేత్॥

తా॥ లోభమోహముల శక్తిసామర్థ్యములు తగ్గును. తలచినపనులు నెఱవేరవు. తానొకవిధముసఁదలఁచిన దైవము మఱియొకవిధమునఁ దలంచును. (వి) అన్యథా చింతితం కార్యం దైవ మన్యత్ర చింతయేత్॥

651 **తాముఁదినక యటులె ధర్మంబుఁజేయక, కొడుకులకని ధనముఁ గూడబెట్టి**
**తెలియఁజెప్పలేక తీరిపోవును దాను, విశ్వదాభిరామ వినురవేమ॥**

స్వయం న భుఙ్క్తేఽన్యేభ్యశ్చ న దత్తే స్వార్జితం ధనమ్ ।
పుత్రార్థమితి సంచిత్య మ్రియతే వేమ! న బ్రువన్ ॥

తా॥ లుబ్ధుఁడు తానుదినక ధర్మముఁజేయక కొడుకులకని ధనముఁగూడఁబెట్టి పాతిపెట్టి తుదకావిషయమైనను జెప్పలేనిస్థితిలో మరణించును.

652 **దాచినధనమునకు దారయుఁ గొడుకును, వాంఛఁబడుటెకాని వట్టిభ్రమలు**
**భాగ్యహీనులకును ఫలము లభించునా?, విశ్వదాభిరామ వినురవేమ॥**

గుప్తమర్థం సతీపుత్రా వాంఛంతి భ్రమపవ సః ।
వేమ! భాగ్యవిహీనానాం లభతే కిం ఫలం మనాక్?॥

తా॥ దాచినధనమునకు భార్య, పుత్రులు, నాశపడుటయేకాని యది వట్టిభ్రమ. వారలు దురదృష్టవంతులగునెడల నట్టిఫలిత మెట్లుచేకూరఁగలదు? (వి) హతవిధిపరిపాకః కేన వా లంఘనీయః?॥

653 భాగ్యహీనునకును బరుసవేది[illegible]యక, నదియు నిలువదపుడె వదలుఁగాని
వానతోడవచ్చు వడగండ్లునిల్చునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

[illegible]వేధ[illegible] లభేత యది న స్థిరః ।
[illegible]హీనానాం వేమ! [illegible]ంతి కరకాశ్చ కిమ్? ॥

తా॥ [illegible]డు వడ[illegible]మునకున్నైన నిలువనట్లు భాగ్యహీనున[illegible] బంగా[illegible]ము పరుసవేది దొరకినను నిలువదు.

654 ధనవిహీ[illegible] భాగ్యపురుషుఁడొకఁడు పరగఁబుట్టి
[illegible], విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ! [illegible] సంజాతో భాగ్యవాన్ పుమాన్ ।
[illegible]యుపకృతిం సదా ॥

తా॥ దరిద్రునికడుపున నొకఁడు జనించి ధనవంతుఁడై పరోపకారపారీణుఁడును నగును. (వి) సంతః స్వయం పరహితే విహితాభియోగాః॥

655 **ఇహమునందు బాధలెన్నైనఁబడవచ్చు, యమునిబాధలేక యమరవలెను**
**పరమున వ్యథలేక బ్రతుకుఁడీ నరులార!, విశ్వదాభిరామ వినురవేమ॥**

వేమేహ బాధా వివిధా స్సోఢుం శక్యాః కథంచన ।
యమబాధాతు న తథా జీవతాముత్రితాం వినా ॥

తా॥ ఇహమున (వర్తమానమున) బాధ లెన్నైనఁ బడవచ్చును. కాని పరమున (భవిష్యత్తులో) ఇంతకంటెను సహించరాని యమయాతన లవశతతో ననుభవించుట చాలఁ గష్టము. కాన జాగ్రత్త వహింపుఁడు.

656 ధర్మకంటకుండు ధనముచే గర్వించి, సకలసంపదలను చాలబోరలి
కడను దాను మేలుఁ గానక చెడిపోవు, విశ్వదాభిరామ వినురవేమ॥

సర్వసంపత్సమన్వితో గర్వితో ధర్మకంటకః ।
అప్రాప్యాంతే స్వయం శ్రేయో వేమ ! ప్రాప్నోతి నాశనమ్ ॥

తా॥ అజ్ఞాని ధనమదమున గర్వించి ధర్మమును నిరసించి సంపదల ననుభవింపలేక వానిపై దోర్లి తుద కెందుకును బనికిమాలినవాఁడై నశించును.

657 మత్సరంబు మదము మమకారమునియెడు, వ్యసనములను దవిలి నుసలబోక
పరుల కుపకరించి పరమె నమ్మును యోగి, విశ్వదాభిరామ వినురవేమ॥

మమతా మదమాత్సర్యరూపవ్యసనవర్జితః ।
యోగీ పరం విశ్వసితి వేమేహాన్యహితే రతః ॥

తా॥ "మదమాత్సర్యములు మమకారము" అను దుర్వ్యసనముల బాధనొందక యోగి పరుల కుపకరించుచుఁ బరమునే నమ్మి సంచరించును.
(వి) కావ్యశాస్త్రవినోదేన కాలో గచ్ఛతి ధీమతాం, వ్యసనేన చ మూర్ఖాణాం నిద్రయా కలహేన వా॥

658 దానధర్మములును దయయు సత్యము నీతి, వినయధైర్యధుర్యవితరణములు
రాజుపాలిటి కివి రాజయోగంబులు, విశ్వదాభిరామ వినురవేమ॥

దానం ధర్మో దయా సత్యం నీతి ర్ధైర్యం వదాన్యతా ॥
రాజయోగా ఇమే వేమ ! భవేయు ర్మేదినీపతేః ॥

తా॥ దానము, ధర్మము, దయ, సత్యము, నీతి, వినయము, ధైర్యము, వితరణము ప్రభువుల కుండవలసిన రాజయోగములు.

659 పగలు రేయి మఱచి భావంబును మఱచి, తాను నేననియెడి తలఁపుమఱచి
యుండువాని నెంచు ముత్తమయోగిఁగా, విశ్వదాభిరామ వినురవేమ॥

వేమ ! రాత్రిందివం భావ మాత్మాహ మితి సంస్మృతిమ్ ।
విస్మృత్య వర్తతే య స్తం త్వం విద్ధ్యుత్తమయోగినమ్ ॥

తా॥ పగలు, రాత్రి, భావము, తాను, నేను, ఇట్టి యాత్మ కాలభేదములు మఱచి పరమాత్మధ్యానమున నుండువాఁడే యుత్తమయోగి.

660 మంటలోహమందు మ్రాఁకుల శిలలందుఁ, బటము గోడలందుఁ బ్రతిమలందుఁ
దన్నుఁదెలుపుకొనఁగ దగులదా పరమాత్మ, విశ్వదాభిరామ వినురవేమ॥

మృది దారుషు లోహేషు శిలాకుడ్యపటేషు చ ।
ప్రతిమాసు తథాత్మానం బోధితుం వేమ ! న ప్రభుః ॥

తా॥ మన్ను, లోహము, మ్రాను, శిల, గోడపటములు, ప్రతిమ వీనియందే తన్నుఁదెలుపుకొనుట కాపరమాత్మ యుండఁడు.

661 పుట్టినదియు మొదలు పురుషుఁడే కాలంబు, పాపమెఱిఁగి శుద్ధపశువుఁ గాక
ముదిసి యోగికరణి ముదమొప్పఁగావలె, విశ్వదాభిరామ వినురవేమ॥

ఆరభ్య జన్మనో వేమ ! పాపం జ్ఞాత్వా సదా పుమాన్ ।
అపశు ర్జరయాగ్రస్తో వేమ ! యోగీవ సంచరేత్ ॥

తా॥ పుట్టినదిమొదలు మానవుఁడు శుద్ధపశువువలె సంచరింపక పాపపుణ్యములెఱింగి సత్ప్రవర్తనతో మెలఁగుచు వార్ధకమున యోగివలె సంచరింపవలెను. (వి) మృత్యుశ్చ కో? వాపయశ స్స్వకీయమ్. 2 మూర్ఖోస్తి కో? యస్తు వివేకహీనః. 3 విద్యావిహీనః పశురస్తి కో వా॥

662 జనుఁడు తెలివినొందఁ జంచలింపదు మది, దైవమును దెలిసినఁ దగులుబుద్ధి
తిపురుభానుఁజూచి తిమిరంబునిల్చునా?, విశ్వదాభిరామ వినురవేమ॥

జ్ఞానే ప్రాప్తే స్థిరంచిత్తం జ్ఞాతే దైవే వశా మతిః ।
ఉదితం భాస్కరం వీక్ష్య వేమ! తిష్ఠతి కిం తమః ? ॥

తా॥ సూర్యోదయమునఁజీకటి తొలంగునట్లు అజ్ఞానము తొలఁగిన మనస్సు చలింపదు. దైవమును దెలిసికొనిన నంగుండి బుద్ధియు మఱలదు. (వి) మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే, స గుణాన్ సమతీ తైంతాన్ ।బహ్మభూయాయ కల్పతే॥